# ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు

(1980 అక్టోబర్ నుంచి, 1981 సెప్టెంబరు వరకు జరిగిన 'సారస్వత వేదిక' ఉపన్యాస వ్యాసాల సంకలనం)





సంపాదకుడు

కె. కె. [illegible]

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్, హైదరాబాద్

ప్రథమ ముద్రణ 1982
ప్రతులు 2000

వెల: రు. 10-00

ముఖపత్ర రచన
శీలా వీర్రాజు

ముద్రణ
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాద్-500 001

Paper used for the printing of this book was made available
by the Government of India at concessional rate

# మా మాట

ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహించే ప్రధాన సాహిత్య కార్యక్రమాలలో ఒకటైన 'సారస్వత వేదిక' అయిదు సంవత్సరాలు పూర్తి చేసుకుంది ప్రతినెలా మొదటి ఆదివారం ఉదయం క్రమం తప్పకుండా 'సారస్వత వేదిక సమావేశాలు జరుగుతున్నాయి హైదరాబాదు నగరంలోని పండితులు, రచయితలు, యువకులు, పరిశోధక విద్యార్థులు ఈ సమావేశాలలో పాల్గొంటున్నారు ప్రతి సంవత్సరం ఒక ప్రధాన శీర్షిక కింద పన్నెండు అంశాలను ఎన్నుకొని సంవత్సర కార్యక్రమాలను ఏర్పాటు చేయటం జరుగుతుంది ముఖ్య వక్త ప్రసంగానంతరం వక్తవ్యాంశంపైన చర్చ జరుగుతుంది 1980 అక్టోబరులో మొదలై 1981 సెప్టెంబరుతో పూర్తయిన అయిదవ సంవత్సర కార్యక్రమాన్ని 'ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్నధోరణులు' అన్న ప్రధాన శీర్షిక కింద రూపొందించడం జరిగింది ఆధునిక సాహిత్యంలో ప్రధానంగా వచ్చిన భిన్న వాదాలను, ధోరణులను వక్తవ్యాంశాలుగా నిర్ణయించటం జరిగింది ఆ ప్రసంగ వ్యాసాల సంకలనమే ఇది ఈ ప్రణాళిక 'సారస్వత వేదిక'ది; ఇందులోని అభిప్రాయాలు వక్తలవి

ఈ కార్యక్రమాన్ని రూపొందించడంలో, వక్తవ్యాంశాలను నిర్ణయించడంలో చాలామంది పెద్దలు, మిత్రులు తోడ్పడ్డారు ప్రతి నెల జరిగే సమావేశాలు మార్పులు, చేర్పులు లేకుండా కొనసాగటానికి ముఖ్య వక్తలందరూ వేదిక తమదిగా భావించుకొని సహకరించారు సాహితీ మిత్రులు వేదికలో భాగస్వాములుగా చర్చలలో పాల్గొని ప్రోత్సాహపరుస్తున్నారు తెలుగు సాహిత్యరంగంలో కొ వడిన సౌభ్రాతృత్వానికి, సౌహార్దానికి, పరస్పర అవగాహనకు ప్రాతిపదిక వే. స్నారు అందరికీ కృతజ్ఞతలు చెప్పటం తమకు తాము చెప్పుకోవటంవంటిద భావిస్తున్నాను ముద్రణ సందర్భంగా తోడ్పడిన మిత్రుడు శ్రీ డి చంద్రశేఖరరెడ్డికి, కొన్ని వ్యాసాలను ఫేరుచేసి ఇచ్చిన విద్యార్థి మిత్రులకు అభినందనలు ముఖపత్ర రచన చేసిన శ్రీ శీలావీర్రాజుగారికి, ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌వారికి కృతజ్ఞతలు

31-12-1931

హైదరాబాద్

కె కె రంగనాథాచార్యులు
సంచాలకుడు
సారస్వత వేదిక

# ఇందులో

ఆధునిక తెలుగు సాహిత్యంలో.

## సంపాదకీయం

# ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు

సాహిత్యంలో ఆధునికతను రెండు విధాలుగా నిర్వచించవచ్చు. మొదటిది సమకాలీనతనే ఆధునికతగా నిర్వచించటం. ఈ దృష్టిలో సమకాలంలో వచ్చిన ఏ సాహిత్యమైనా-సాంప్రదాయికంగాని, నవీనంగాని - ఆధునికం అవుతుంది. రెండవది మారిన ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితులు పునాదిగా ఏర్పడిన కొత్త దృక్పథాన్ని, స్వరూపాన్ని సంతరించుకోవటమే ఆధునికత అని నిర్వచించటం. ఈ విధమైన సాహిత్యానికి అంతకు ముందులేని ప్రత్యేక లక్షణాలు, కొత్తవిలువలు ఉంటాయి. ఇక్కడ ఆధునికత అనేది కాలాన్ని సూచించేదికాదు. అది ఒక తత్వం. ఒక తత్వంగా ఆధునికతలో రెండు భిన్నధోరణులు కనిపిస్తాయి. సామాజిక ప్రయోజనం, హేతుబద్ధమైన శాస్త్రీయదృష్టి, వాస్తవికతలపైన ఆధారపడిన సాహిత్య దృక్పథాలు తాత్వికభూమికగా కలిగిన ఆధునికత ఒకటి. అభ్యుదయవాద, విప్లవవాద, వాస్తవికతా వాదాలు, కొంతవరకు హేతువాదం ఈ కోవలోకి వస్తాయి. పైన చెప్పిన విలువలులేకుండా వ్యక్తివాద, అరాచకవాదాలు తాత్వికభూమికగా కనిపించే ఆధునికత రెండవది. ఆధునికత (Modernism) పేరుతో పాశ్చాత్య దేశాలలో సాహిత్యంలోను, ఇతర కళలలోను 19, 20 శతాబ్దాలలో కొన్ని ధోరణులు వచ్చాయి. మొదటి ప్రపంచ యుద్ధానికి కొంచెం ముందు, తరువాత ఈ ఆధునికత పరాకాష్ఠ నందుకుంది. సింబాలిజం, ఇమేజిజం, ఇంప్రెషనిజం, ఫ్యూచరిజం, డాడాయిజం, సర్రియలిజం, నేచురలిజం మొదలైన ధోరణుల సముదాయానికే ఆధునికత అనిపేరు. 'కళ కళ కోసమే' అన్నది ఈ ధోరణుల నినాదం. ఈ విధమైన సాహిత్యం తెలుగు దేశంలో పాశ్చాత్య దేశాలనుంచి దిగుమతిగా చెదురు మదురుగా కనిపిస్తుంది. ఈ ధోరణులలో కాల్పనిక వాదం కొంచెం బలంగాను, సర్రియలిజం వంటివి తక్కువగాను

తెలుగు సాహిత్యంలో ప్రవేశించాయి ఆధునిక కాలంలో వచ్చిన ఈ అన్నిరకాల ధోరణులను పరిశీలించటమే ప్రస్తుతాంశం

అంతర్జాతీయంగా ఆర్థిక సామాజిక పరిస్థితుల కారణంగా ప్రపంచ దేశాల్లో, ముఖ్యంగా పారిశ్రామికంగా ముందంజవేసిన పాశ్చాత్య దేశాల్లో 17,18 శతాబ్దులనుంచే అనేక విధాలైన ధోరణులు సాహిత్యంలో తలఎత్తాయి ముఖ్యంగా పెట్టుబడిదారీ ఆర్థిక విధానం ఫలితమైన ఆధునిక నాగరికత నుంచి విభిన్న ధోరణులు, పోకడలు యూరప్‌దేశాల్లోని తాత్విక, కళారంగాల్లో ప్రవేశించాయి వైజ్ఞానికమైన పారిశ్రామిక విప్లవం (1748), రాజకీయమైన ఫ్రెంచి విప్లవం(1789), మొదటి ప్రపంచ మహాయుద్ధం (1914-18), పెట్టుబడిదారి నాగరికత అక్కడి సమాజాల్లోని ఆలోచనావిధానాన్ని సమూలంగా మార్చివేశాయి కొత్తనాగిరికతలో, మారిన పరిస్థితులలో మేధావులలో, కళాకారులలో పెరిగిన నిస్పృహ, నైరాశ్యాలు తత్ఫలితమైన వ్యక్తివాద, అరాచక ధోరణులు సాహిత్యంలో ప్రతిఫలించాయి ఈ విభిన్న ధోరణులు తలఎత్తటానికి కావలసిన పునాదులు భారతదేశంలో, తెలుగు దేశంలో లేవు అందుకే యూరప్‌లో 17వ శతాబ్దిలో వచ్చిన హేతువాదం, 18, 19 శతాబ్దాలలోని కాల్పనికవాదం, 20 వ శతాబ్దంలో ఆధునికత పేరిట వచ్చినకొన్ని ధోరణులు కలసి కట్టుగా ఒక చారిత్రక క్రమంలో కాకుండా 1910 నుండి తెలుగు సాహిత్యంలో కనిపిస్తాయి

భారత దేశంలోని పరిస్థితులు అభివృద్ధి చెందిన పాశ్చాత్యదేశాల పరిస్థితులకంటే భిన్నమైనవి పారిశ్రామికంగా, రాజకీయంగా యూరప్ దేశాలు ముందుకు పోతున్నదశలో భారతదేశం వలసదేశంగా ఉంది పారిశ్రామిక విప్లవం, రాజకీయ విప్లవంవంటి ఉద్యమాలు ఇక్కడ లేవు 19 వ శతాబ్దం చివర, 20 వ శతాబ్దం మొదట కనిపించే జాతీయోద్యమమే భారతదేశంలో ముఖ్యమైన మొదటి రాజకీయోద్యమం పాశ్చాత్య దేశాల్లో పెట్టుబడిదారీ నాగరికత ఉన్నతదశలో ఉండగా ఇక్కడ భూస్వామ్య విధానాలే ఏదో ఒక రూపంలో కొనసాగుతున్నాయి ఆంగ్ల విద్యావ్యాప్తివల్ల పుస్తకాల ద్వారా పాశ్చాత్య దేశాల్లోని ఆర్థిక ప్రగతిని,

అభివృద్ధి చెందుతున్న నాగరికతను, సాహిత్యాన్ని అర్థం చేసుకొన్న తరువాత 19 వ శతాబ్దం చివరి భాగంలోగాని భారతీయులలో కొత్త చైతన్యం పుంజు కోలేదు పాశ్చాత్య దేశాల్లోని పెట్టుబడిదారీ ఆర్థిక విధానం ఫలితమైన ఆధునిక నాగరికతతో, దానినుంచి ఉత్పన్నమైన ప్రజాస్వామ్య భావనలతో భారతీయ మేధావులు, రచయితలు ప్రభావితులయ్యారు దీని పరిణామమే సంస్కరణ వాదం కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు మొదలైన వారితో తెలుగు దేశంలో పునరుజ్జీవనం జరిగింది నిరక్షరాస్యతా నిర్మూలన, మూఢ విశ్వా సాల తిరస్కరణ, వైజ్ఞానికవ్యాప్తి, చారిత్రక దృష్టి, వ్యావహారిక భాషా ప్రయోగం ఇవన్నీ చారిత్రక క్రమంలో స్వతస్సిద్ధంగా కాక ఉద్యమాలుగా వచ్చాయి తెలుగు దేశంలో పాశ్చాత్య దేశాల్లో ఆర్థిక సంబంధాల పునాదిపైన ఉపరితలంపైన ఏర్పడిన భావాలకు, ఆలోచనలకు, భావనలకు ప్రతిస్పందనగా ఈ ఉద్యమాలు వచ్చాయి కాని దేశఆర్థిక రంగంలో ఆశించిన మార్పులు రాలేదు భారతీయ మేధావులకు ఉత్తేజం కలిగించిన పెట్టుబడిదారీ నాగరికత రూపొందే పద్ధతిలో దేశఆర్థిక జీవితం పెంపొందలేదు స్థానికంగా కొందరు ప్రారంభించిన పరిశ్రమలు సామ్రాజ్యవాదుల పెట్టుబడిదారీ విధానంముందు నిలబడలేక పోయాయి దీనివల్ల గ్రామీణ ఆర్థికవ్యవస్థ కూడా దెబ్బతినే అవకాశం ఏర్పడింది దీనికి తోడు మొదటి ప్రపంచ యుద్ధం కారణంగా ఏర్పడిన ఆర్థిక సంక్షోభ ఫలితాలు భారతదేశాన్ని కూడా ఆవరించాయి దిని ఫలితంగా పెట్టుదారీ ఆర్థిక విధానం, నాగరికత విదేశీయమైనదనే భావం కొంతమందిలో వ్యాపిం చింది జాతీయోద్యమ ప్రేరితమైన దేశభక్తి కవిత్వాన్ని ఈ భావం ప్రభావితం చేసింది జాతీయోద్యమం స్వభావరీత్యా అభ్యుదయకరమైన ఉద్యమం కాని ఆ ఉద్యమానికి ప్రేరణ ప్రాచీన చరిత్రనుంచి, భూస్వామ్య సంస్కృతి నుంచి, సంప్రదాయం నుంచి లభించింది సమకాలంలో అభివృద్ధి చెందిన చరిత్ర దేశానికి లేకపోవటమే దీనికి కారణం దీని ఫలితమే సాహిత్యంలోని పునరుద్ధరణ వాద ధోరణులు కందుకూరి, గురజాడ, కొమర్రాజు మొదలైనవారు ఆలోచనలో, ఆచరణలో ఆధునికతను జీర్ణించుకొని నడిపిన ఉద్యమాలు పురోగమించడానికి కొంతకాలం పట్టింది పునరుద్ధరణవాదంతోపాటు భాషలో, రూపంలో అన్నింటిలో సంప్రదాయాన్ని అనుసరించిన ఆత్మాశ్రయ ప్రధానమైన భావకవితా ధోరణులు

దృక్పథం ప్రధానంగా గల సాహిత్యాన్ని కొంచెం వెనక్కునెట్టాయి అంతర్జాతీయ ప్రేరణతో పాటు దేశ ఆర్థిక, సామాజిక పరిస్థితులు కూడా పునాదిగా గల అభ్యుదయ ధోరణులు తెలుగు సాహిత్యంలో ప్రారంభమైన తరువాత మాత్రమే దృక్పథం ప్రధానంగాగల సాహిత్యం పురోగమించింది

తెలుగుదేశంలో ఆర్థిక, సామాజిక పునాదులు లేకుండా వచ్చిన ప్రధానమైన సాహిత్య ధోరణి భావకవిత్వం పేరిట వచ్చిన కాల్పనిక వాదం (Romanticism) ఐరోపాలో 18వ శతాబ్ది చివర, 19 వ శతాబ్ది మొదట నవ్య సాంప్రదాయికత (Neo-Classicism)కు, హేతువాదా (Rationalism) నికి వ్యతిరేకంగా వచ్చింది కాల్పనిక వాదం సామాజికమైన నియమాలపైన లాంఛనాల (Formalities) పైన తిరుగుబాటుగా, మానవుడికీ, ప్రకృతికీ గల అవయవ అవయవి సంబంధమే నాడిగా, ఊహలు కల్పనలు ప్రాణంగా ఈ ధోరణి పాశ్చాత్య దేశాల్లో వచ్చింది 1748 లో ఇంగ్లండులో వచ్చిన పారిశ్రామిక విప్లవం, 1789 లో ఫ్రాన్స్‌లో వచ్చిన ఫ్రెంచి విప్లవం ఫలితంగా మేధావుల, కళాకారుల ఆలోచనల్లో సమాజ నిర్మాణంలో వచ్చిన స్థానచ్యుతి (dis-location) కారణంగా, విచ్ఛిన్నమౌతున్న పాత విలువలను, సంస్కృతిని వదలుకోలేక, కొత్త విలువలతో, సంస్కృతితో పొత్తు కుదరక సమాజం నుండి దూరమై, ఏకాకితనాన్ని అనుభూతి చెందిన ఫలితంగా పాశ్చాత్య దేశాల్లో కాల్పనిక వాదం వచ్చింది తనకుమించి ప్రపంచంలో ఏదీ లేదనే వైయక్తిక దృష్టి ఈ వాదంలో ప్రధానాంశం కాల్పనిక వాదం సుమారుగా అంతర్జాతీయ ధోరణి అయినా భిన్న దేశాలలో భిన్న రూపాలలో ఇది వచ్చింది వ్యక్తివాదం నుంచి విప్లవకరమైన సమిష్టి ఉద్యమాల వరకూ రకరకాల రూపాంతరాల్లో ఇది కనిపిస్తుంది ఫ్రాన్సులో స్వేచ్ఛావాదం (Freedom) గా, జర్మనీలో ఆదర్శ వాదం (Idealism)గా, ఇంగ్లాండులో సౌందర్యవాదం (Aestheticism)గా (చూ పే 7) ప్రధానంగా కనిపించే కాల్పనిక వాద ధోరణులో భాగంగా మిథ్యా వాదం (Nihilism)కూడా కనిపిస్తుంది కాబట్టి కాల్పనిక వాదానికి నిర్వచనం చాలా విశాలమైందిగా ఉంటుంది ఒకదశలో ఈ కాల్పనిక వాదం కొత్త ఆర్థిక

వ్యవస్థలోంచి పుట్టుకొని వచ్చిన బూర్జువాలకు వ్యతిరేకోద్యమంగా కూడా కన్పిస్తుంది బూర్జువాలకువ్యతిరేకతను సాహిత్యంలోనేగాక వేషధారణలో కూడ వారు చూపించేవారట విచిత్రమైన వస్త్రధారణ, పొడుగాటి గిరజాలు, పాలి పోయినముఖం మొదలైనవి కాల్పనిక వాద రచయితలు నిరసన తెలియజేయటానికి అవలంబించిన మార్గాలు

తెలుగుదేశంలో కాల్పనిక వాదానికి తగిన ఆర్థిక పునాదులు లేవు ఈ రోజుకీ అర్థ ధనస్వామ్య, అర్థ భూస్వామ్య విధానమే భారతదేశంలో కొనసాగుతున్నదని భావిస్తున్న దశలో భావ కవిత్వోద్యమంనాడు పెట్టుబడిదారీ ఆర్థిక విధానం ఏమాత్రం ముందంజ వేయలేదని వేరే చెప్పనవసరంలేదు పాశ్చాత్య దేశాల్లోని ఆర్థిక సంబంధాల పునాదిపైన ఉపరితలంలోని అంశంగా మాత్రమే కాల్పనిక వాదం ఇక్కడ దిగుమతి అయింది రొమాంటిక్ ఉద్యమంలో ముఖ్యులైన ఫ్రెంచి, జర్మన్ కవులు మనవారెవరికీ తెలియదు అందుకే ఇంగ్లీషు కవుల అనువాద ధోరణులు, అనుసరణలు భావ కవిత్వంలో ఎక్కువగా కనిపిస్తాయి(చూ పే 10) తామే కల్పించుకున్న బంధాలనుంచి విముక్తి, అమలిన శృంగారం, కృత్రిమ విషాదం, నిరాశ, పునరుద్ధరణ వాదం, జాతీయోద్యమ భావాలు మొదలైన భిన్నధోరణుల సంగమమే తెలుగులో భావ కవితా ధోరణి దేశభక్తితోపాటు, దైవభక్తి కూడా భావ కవితాధోరణిలో భాగమయింది పెట్టుబడిదారీ నాగరికతకు వ్యతిరేకత పునరుద్ధరణ వాదానికి దారితీసింది కాల్పనిక ధోరణులు కవిత్వంలోనే ఎక్కువగా కిన్పించినా వచన సాహిత్యంలో కూడా కొంతవరకు కన్పిస్తాయి గుడిపాటి వెంకటచలం వంటివారు సాంప్రదాయిక వివాహ వ్యవస్థమీద తిరుగుబాటు చేసినా ఈ సమస్యను చారిత్రక దృష్టితో అవగాహన చేసుకోక పోవడంవల్ల ఫలితంలో కాల్పనికతకు దారితీసింది భావకవులకూ, వెంకటచలానికి ఒక భేదం ఉందని, భావకవులు స్వేచ్ఛను ఆకాంక్షించారేగాని, దానికొరకు పోరాడలేదని, చలం పోరాడాడని విమర్శకుల అభిప్రాయం విశ్వనాథ సత్యనారాయణ 'ఏకవీర' వంటి నవలలు కూడా కాల్పనిక సాహిత్యంలో భాగంగా చెప్పవచ్చు ఈ ఉద్యమంలో భాగంగా నాటకాలు కూడా వచ్చాయి. కాల్పనిక వాదం ఒక భిన్నమైన ధోరణే అయినా

తక్కిన ధోరణులలో కూడా కాల్పనికతకు కొంత స్థానం ఉంది సామ్యవాద వాస్తవికతకు కాల్పనికతను జోడించినప్పుడే సాహిత్యం ప్రజలదగ్గరకు వెళ్లగలుగుతుందని విప్లవ వాదులంటారు కాల్పనికవాదం, భావ కవిత్వోద్యమం తెలుగు సాహిత్యంలో నవ్యధోరణే అయినా ఖండకావ్యాలు, అమలిన శృంగారం, శబ్ద మాధుర్యం, సారళ్యం మొదలైన అంశాల్లో తప్ప, తక్కిన అన్ని అంశాల్లోనూ సాంప్రదాయరీతుల్నే అవలంబించిన, సాంప్రదాయకులు ఆదరించిన సాహిత్యంగా సంప్రదాయ సాహిత్యంలో భాగమైపోయింది

తాత్వికంగా ఆధునికతలో భాగంగా తెలుగు సాహిత్యంలో కన్పిస్తున్న ధోరణి వాస్తవికతావాదం పాశ్చాత్య దేశాల్లో ఇది కాల్పనిక వాదానికి తరువాత వచ్చిన ధోరణి తెలుగుదేశంలో ఇది భావకవిత్వోద్యమంలాగా ఒక ఉద్యమంగా రాలేదు కందుకూరితో ప్రారంభమై గురజాడతో పరాకాష్ఠ చెందిన వాస్తవికత తరువాత తెలుగులో కాల్పనికవాద ధోరణులు వచ్చాయి భావ వాదానికి భిన్నమైనది, భౌతిక వాస్తవికతమీద ఆధారపడింది వాస్తవికతావాదం వాస్తవికతావాదం అంటే కేవల స్వభావవాదం కానీ, సహజవాదం గానీ కాదు సహజవాదం నేచురలిజం పేరిట అమెరికా, రష్యాల్లో 19 వ శతాబ్ది ఉత్తరార్థంలో కనిపిస్తుంది తాను చూస్తున్నదాన్ని నిశితంగా పరిశీలించి, ఏ నియమాలూ లేకుండా సూక్ష్మాతి సూక్ష్మమైన వివరాలతోపాటు ఉన్నదున్నట్లుగా ఛాయాచిత్రంలో లాగా చిత్రించటమె నేచురలిజమ్ వాస్తవికత దీనికి పూర్తిగా భిన్నం ఉన్నది ఉన్నట్టుగా చెప్పటమేకాదు-సమాజం, జీవితం ఆ విధంగా ఉండటానికి గల ఆర్థిక సామాజిక కారణాలు అవగాహన అయ్యేట్లు హేతుబద్ధంగా చెప్పటమే వాస్తవికత వ్యక్తిగత దృష్టితో కాకుండా వస్తుగత దృష్టితో చెప్పడం వాస్తవిక చిత్రణలో ప్రధానమైంది నిజానికిది కాల్పనిక వాదంలోని వ్యక్తి వాదానికీ, ఊహా కల్పనలకూ తిరుగుబాటుగా వచ్చిన ధోరణి కాని తెలుగు సాహిత్యంలో వాస్తవికత ప్రారంభమైన తర్వాత కాల్పనికవాదం కనిపిస్తున్నది

వాస్తవికతలో రెండు ప్రధానమైన అంశాలున్నాయి సవిమర్శక వాస్తవికత (critical realism) సామ్యవాద వాస్తవికత (Socialist real-

ism) వాస్తవికతను ప్రతిబింబించడంతో పాటు సామాజిక జీవిత సమస్యలకి పరిష్కారాన్ని సూచించడం కూడా వాస్తవికతలో భాగమని వాస్తవికతా వాదులంటారు సమాజాన్ని చారిత్రక దృష్టితో అవగాహన చేసికొని ప్రయోగ దృష్టితో చిత్రించడం కూడా వాస్తవికతలో భాగమే సమాజంలోని అన్యాయాలను, అసమానతలను, ఆర్థిక సామాజిక వ్యత్యాసాలను సవిమర్శకంగా ఖండిస్తూ చేసిన రచనే సవిమర్శక వాస్తవిక రచన "కమ్యూనిస్టు అన్వీక్షకి విషయంలో అచంచల నిష్ఠ, ప్రజాసేవా నిరతి, పాక్షికత, శ్రామికజన సమరాలతో సన్నిహిత సంబంధం, సోషలిస్టు మానవత, అంతర్జాతీయత, చారిత్రక ఆశాభావం, రూప వాద, వ్యష్టివాద, సహజ వాదాల తిరస్కృతి" (చూ పే 68) ఈ లక్షణాలతో కూడిన వాస్తవికత సామ్యవాద వాస్తవికత "సామ్యవాద వాస్తవికత అన్నది ఒక సిద్ధాంత దృక్పథం దీనిలో వాస్తవికతా వాదం, సవిమర్శక వాస్తవికతా వాదం అంతర్నిహితంగా ఉన్నాయి సామాజిక చైతన్య ప్రేరితమైన భౌతిక పరిస్థితులలో తిరుగుబాటు ధోరణులన్నీ సోషలిస్టు వాస్తవికతలోని అంతర్భాగాలే సోషలిజం వచ్చాకనే సామ్యవాద వాస్తవికతకు చోటుందనడం కూడ సత్యం కాదు 1917 నాటి సామ్యవాద విప్లవానికి పూర్వమే గోర్కీ ఇత్యాదులు సామ్యవాద వాస్తవిక రచనలు చేశారు" అని అభ్యుదయ వాదులు భావిస్తున్నారు విప్లవ కవులు సవిమర్శక వాస్తవికతకు, సామాజిక వాస్తవికతకు స్పష్టమైన భేదాన్ని సూచిస్తున్నారు "సామాన్య ప్రజాస్వామ్య వైఖరి మీద విమర్శనాత్మక వాస్తవికత ఆధారపడి ఉంటుంది శాస్త్రీయ ప్రజాస్వామ్యం మీద సామ్యవాద వాస్తవికత ఆధారపడి ఉంటుంది" అని వీరంటారు వర్గ సమాజంలో విమర్శను చేపట్టేదే సవిమర్శక వాస్తవికత అని, ఇది భవిష్యత్తును సూచించదని, బహుముఖమైన వర్తమాన సమాజాన్ని వర్ణించడమే దీని ప్రయోజనమని, చారిత్రక పరిణామాలను విశ్లేషిస్తూ జన జీవితంలో చొచ్చుకొనిపోయి స్పష్టమైన భావిని చిత్రించటమే సామ్యవాద వాస్తవికత అనీ, సమూహ అనుభవాలే సామ్యవాద వాస్తవికతకు వస్తువులని విప్లవవాదులంటారు సవిమర్శక వాస్తవికత విషయంలో పరిణామను అందుకోగలిగిన రచయిత తరువాత రాసే

దనీ అలాంటి పరిస్థితుల్లో సామ్యవాద వాస్తవికతను, ప్రతిఫలించే రచనలను ఊహించలేమనీ అభ్యుదయవాదులు అభిప్రాయపడుతున్నారు పాక్షికత, శ్రామిక జన సమూహాలతో సాన్నిహిత్యం, చారిత్రక ఆశావాదం సామ్యవాద వాస్తవికత ప్రధాన లక్షణాలుగా భావిస్తే విప్లవ రచయితలు చాలా మంది సామ్యవాద వాస్తవికతను సాధించగలిగారని విప్లవ వాదులంటారు తెలుగులో గురజాడ 'కన్యాశుల్కం', ఉన్నవ లక్ష్మీనారాయణ గారి 'మాలపల్లి', కొడవటిగంటి కుటుంబరావు 'చదువు', రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం మొదలైన వారి రచనలు సవిమర్శక వాస్తవికతను ప్రతిబింబించే రచనలుగా చెప్పవచ్చు సామ్యవాద వాస్తవికత, కళాత్మకత జోడైన సాహిత్యాన్ని గురించి ప్రస్తుతం స్పష్టంగా చెప్పటానికి లేదు

తెలుగు సాహిత్యంలో పురాణాలను, వర్ణధర్మాలను, కల్పిత కథలను, మూఢ విశ్వాసాలను ప్రశ్నిస్తూ వచ్చిన సాహిత్యాన్ని హేతువాద సాహిత్యం అని వ్యవహరించటం జరుగుతున్నది తమిళ దేశంలోని ఇ వి రామస్వామి నాయకర్, తెలుగు దేశంలో త్రిపురనేని రామస్వామి చౌదరిలతో ప్రారంభమైన బ్రాహ్మణ మత వ్యతిరేకోద్యమ ఫలితంగా ఈ సాహిత్యం వచ్చింది పాశ్చాత్య దేశాలలో హేతువాదం (Rationalism) 17 వ శతాబ్దిలోనే ప్రారంభమైనా తెలుగు దేశంలో 20 వ శతాబ్ది పూర్వార్ధంలోనే కనిపిస్తుంది పాశ్చాత్యదేశాలలో హేతువాదానికి వ్యతిరేకంగా కాల్పనిక వాదం వచ్చింది. కాని తెలుగులో కాల్పనిక వాదానికి సమాంతరంగా హేతువాదం కూడా వచ్చింది ఇతర దేశాలలో లేనివి, భారతదేశ సమాజానికే ప్రత్యేకమైనవి వర్ణాశ్రమ ధర్మాలు, కులాలు వీటి మీద తిరుగుబాటుగా హేతువాద సాహిత్యం వచ్చింది పాశ్చాత్య హేతువాదానికున్న విశాల ప్రాతిపదిక తెలుగు హేతువాద సాహిత్యానికి లేదు. ధనస్వామ్య వ్యవస్థకు, భూస్వామ్య వ్యవస్థకు మధ్య వైరుధ్యాల సంఘర్షణ కారణంగా తెలుగుదేశంలో హేతువాదం వచ్చింది ఆర్థికమైన దృక్పథం ఈ ఉద్యమానికి లేదు ప్రధానమైన ఆర్థిక వర్గంపైన తిరుగుబాటుగా కాక ఒక కులంపైన తిరుగుబాటుగా ఈ ఉద్యమం పెడదారి పట్టిందని, చివరికది స్వకుల పౌరోహిత్యా

నికి దారి తీసిందని అభ్యుదయ వాదులు అభిప్రాయపడుతున్నారు పైగా ఈ ఉద్యమం భూస్వామ్య కులాల ఆధిక్యతను, పెత్తనాన్ని, పలుకుబడిని పెంచి, జమీందారీ నాయకత్వాన్ని, బలపరచిందని కూడా వారు భావిస్తున్నారు అందుకే ఆర్థికంగా బడుగు వర్గాల వారిని ఏకత్రితం చేసే సమగ్ర ఉద్యమంగా అది పెంపొందలేదు తెలుగుదేశంలో రాయిస్టులు చాలా మందికి హేతువాదో ద్యమంతో సంబంధం ఉంది

హేతువు ద్వారా తప్ప ఇతర విధాలుగా దేని అస్తిత్వాన్ని అంగీకరించక పోవటమే హేతువాదం అయితే ఆధునిక కాలంలో దృక్పథ ప్రాధాన్యం గల తత్వాలన్నీ హేతువాదం నుంచి ఉద్భవించాయనే చెప్పవలసి ఉంటుంది కందుకూరి, గురజాడ మొదలైన రచయితలందరూ ఈ కోవలోకి వస్తారు పురాణాలను ప్రశ్నించటం, తిరగరాయటం మాత్రమే హేతువాదం అయితే త్రిపురనేని సాహిత్యంతోపాటు ముద్దుకృష్ణ 'అశోకం', చలం 'సావిత్రి', జాషువా వారి రచనలు, పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి 'మహాభారత విమర్శనం' నార్ల వెంకటేశ్వరరావు 'జాబాలి' మొదలైన రచనలు ఈ విభాగంలోకి వస్తాయి పాశ్చాత్య దేశాలలోని హేతువాదులు పురాణాలలోని కథలను, పాత్రలను మార్చి రాయటమే కాకుండా, కొత్త వస్తువుతో, పాత్రలతో రచనలు కూడా చేశారు ఆ పద్ధతి తెలుగు దేశపు హేతువాదులలో చాలా తక్కువగా కన్పిస్తుంది

తెలుగులో అభ్యుదయ సాహిత్యంతో దృక్పథానికి, సామాజిక అవగాహనకు ప్రాధాన్యం వచ్చింది భావ కవితోద్యమ కాలం నాటి వ్యష్టివాదం, పునరుద్ధరణ ధోరణులు, వ్యక్తిగత అనుభూతుల స్థానాన్ని దృక్పథం ఆక్రమించింది పాశ్చాత్య దేశాలలో డాడాయిజం మొదలైన వ్యక్తివాద, అరాచక ధోరణులపైన తిరుగుబాటుగా 1932లో 'న్యూ సిగ్నేచర్స్' కావ్య సంపుటి, లండన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ మానిఫెస్టో వచ్చాయి తెలుగు సాహిత్యంలో అభ్యుదయ వాదం ఒక గుణాత్మకమైన మార్పు (చూ పే 89) అభ్యుదయ వాదానికి పునాది అయిన ఆర్థిక, సామాజిక సమస్యలు ప్రపంచ దేశాలన్నిటికి సమానమే, అందువల్ల ఇతర

ధోరణుల లాగా కాకుండా అభ్యుదయ వాదానికి వేళ్లు అన్ని దేశాల లాగే భారత దేశంలో, తెలుగు దేశంలో కూడా ఉన్నాయి అభ్యుదయోద్యమం అంతవరకు వచ్చిన అన్ని రకాల ధోరణులలోని అభ్యుదయకరమైన అంశాలను గుర్తించి ప్రచారం చేసింది జాతీయోద్యమంలో భాగంగా పోరాడింది కాని సామ్యవాద సమాజ నిర్మాణమే దాని ముఖ్య ఆశయం ఆధార భూతమైన దృక్పథం మార్క్సిస్టు దృక్పథం మార్క్సిజం ప్రధాన లక్షణాలు భౌతికవాదం, గతి తార్కిక భౌతిక వాదం, చారిత్రక భౌతిక వాదం దానికి వర్గ పోరాటం సాధనం ఆకలి, అజ్ఞానం, దారిద్ర్యం-వీటికి ఉత్పత్తి, పంపిణీల్లోను, ఆర్థిక పరిస్థితుల్లోను ఉన్న అసమానతలు కారణం అన్న అవగాహన అభ్యుదయ వాదానికి ముఖ్యం

అభ్యుదయ వాదం లాగే విప్లవ వాదానికి మార్క్సిస్టు దృక్పథమే ప్రాతిపదిక, సామ్యవాద సమాజ నిర్మాణమే ధ్యేయం. అయితే అభ్యుదయ వాదానికి, విప్లవ వాదానికి ఉన్న ప్రధానమైన భేదం అవి రెండూ భిన్న చారిత్రక దశలకు సంబంధించినవి కావటమే అభ్యుదయ ఉద్యమం స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా ఆరంభమైంది భిన్న ధోరణులకు సంబంధించిన వారితో విశాల ప్రాతిపదికపైన ఈ ఉద్యమం సాగింది సామ్యవాద సమాజం అంతిమ లక్ష్యంగా ప్రకటించుకున్నా ఆనాటి తక్షణ లక్ష్యం స్వాతంత్ర్య సాధన అభ్యుదయ వాదానికి మార్క్సిజం ప్రధాన ప్రాతిపదిక అయినా మార్క్సిజంతో సంబంధం లేకుండా ఏ మాత్రం పురోగామి భావాలున్నా, వారందరినీ ఉద్యమంలో చేర్చుకుంది స్వాతంత్ర్యానికి పూర్వం అభ్యుదయవాదులకు సామ్రాజ్యవాదం ప్రథమ శత్రువు కాని స్వాతంత్ర్యానంతరం లక్ష్య నిర్దేశంలేక అభ్యుదయోద్యమం స్తబ్ధతను పొందింది (చూ పే 67-88) విప్లవవాదం స్వాతంత్ర్యానంతరం 20 ఏళ్ళ స్వదేశీయుల పాలన తరువాత తల ఎత్తింది అది విశాల ప్రాతిపదికమీద ఏర్పడిందికాదు విప్లవ వాదులు భారత దేశానికింకా నిజమైన స్వాతంత్ర్యం రాలేదని భావిస్తారు మార్క్సిజానికి నిబద్ధమైందే విప్లవవాదం మార్క్సిజంపైన విశ్వాసం లేనివారికి అందులో స్థానంలేదు మార్క్సిజం వారికి శాస్త్రం, శస్త్రం 'తిరోగామి భావాల, సంస్కృతుల ఛాయలు రేఖా మాత్రంగా కూడా లేకుండా నిర్మూలించటమే విప్లవ సాహిత్యం

ధ్యేయం' సంస్కరణ వాదానికి ఇందులో తావులేదు విప్లవవాదం ప్రధాన శత్రువు ప్రస్తుత పాలకులు సాయుధ పోరాటం ద్వారానే సామ్యవాద వ్యవస్థ సాధ్యమని వారి విశ్వాసం శ్రామిక వర్గ విముక్తి కోసం వారి పోరాటం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాలలో వచ్చిన మార్పులు కూడా అభ్యుదయ, విప్లవ వాదాల మధ్య గల భేదానికి ప్రధాన కారణాలలో ఒకటి

మొదటి ప్రపంచయుద్ధం తరువాత ఆర్థిక సంక్షోభం, దుర్భర జీవన పరిస్థితులలో పాశ్చాత్య దేశాలలోని మేధావులలో, కళాకారులలో, ఏర్పడిన నిరాశా, నిస్పృహలు కారణంగా సాహిత్య, కళారంగాలలో అనేక ధోరణులు తలఎత్తాయి తిరుగుబాటు, అరాచకవాదం, వ్యక్తివాదం, మానసిక రుగ్మతలు భూమికగా గల ఈ ధోరణులనే ఆధునికత పేరిట వ్యవహరిస్తున్నారు డాడా యిజం, సర్రియలిజం, క్యూబిజం, సింబాలిజం, ఇమేజిజం మొదలైన ఈ ధోరణులలో చాలా వాటికి ఫ్రాన్స్ జన్మస్థానం వీటిల్లో చాలా ధోరణులు మొదట చిత్రకళ మొదలైన కళారంగంలో ప్రారంభమై సాహిత్యంలోకి వ్యాపించాయి ఈధోరణులలో అధివాస్తవికత ( Surrealism ) ప్రభావం మాత్రమే తెలుగు దేశంలో కొంతవరకు కనిపిస్తుంది అధివాస్తవికతావాదం వాస్తవికతా వాదానికి వ్యతిరేకంగా వచ్చిన ఉద్యమం డాడాయిజం ఫ్రాయిడ్ మనస్తత్వ సిద్ధాంతాల కలయికతో పుట్టిన వింత శిశువు అధివాస్తవికత ఇది ఫ్రాంసులో 1924 లో ప్రారంభమైంది తమకు తోచిన భావాలను ఒక క్రమంలో ఉంచక పోవటమే అధివాస్తవికత మనసులోని ఆలోచలను క్రమబద్ధంగా కాక ఏ విధంగావస్తే ఆ విధంగా ఎదలటం ఇందులోని ప్రధానాంశం సుప్తచేతనలోంచి స్వచ్ఛందంగా బయలువెడలిన శబ్దాల ప్రవాహాన్నే అధివాస్తవికత అనవచ్చు వ్యక్తి తనకు అపారమైన స్వేచ్ఛను కోరుకోవటం వ్యక్తిచైతన్యం పెత్తనాన్ని అంగీకరించక పోవటం అధివాస్తవికతలోని ప్రధాన లక్షణాలు ఇది ఒక శిల్పంగా, ప్రయోగంగా తెలుగులో వచ్చింది శ్రీశ్రీ వంటి అభ్యుదయ కవి కలం నుంచి అధివాస్తవిక కవిత్వం వచ్చినందువల్ల దీనికి కొంత ప్రచారం, ప్రాచుర్యం లభించింది ఒక తాత్విక సిద్ధాంతంగా కాక ఒక శిల్పంగా, రచనావిధానంగా తెలుగు

సాహిత్యంలో, ముఖ్యంగా వచన ప్రక్రియలైన నవల, కథానికలలో ప్రయోగ రూపంలో కనిపిస్తున్న ధోరణి చైతన్య స్రవంతి. అతి క్లిష్టమైన మానవ మన స్సంచారాన్ని చిత్రించటమే చైతన్యస్రవంతి. బాహ్యప్రపంచం తాకిడికి అంత రంగ ప్రపంచం పొందే వివిధ ప్రకంపనలను, ప్రేరణలను, అందులోనే అంతర్భాగమైన జ్ఞాపకాలను, ఊహలను, ఆలోచనలను, అనుభవాలను చిత్రించే విధానమే చైతన్యస్రవంతి అని చెప్పవచ్చు. ఇది ఒక విధంగా అధివాస్తవికతకు విస్తరింపు. పాశ్చాత్య సాహిత్యంలో జేమ్స్ జాయిస్, వర్జీనియా వుల్ఫ్ మొదలైన వారితో ప్రచారంలోకి వచ్చిన Stream of consciousness కి తెలుగులో చైతన్యస్రవంతి అనే పేరును వాడినవాడు, చైతన్యస్రవంతి శిల్పధోరణిలో తెలుగులో మొదటి రచనలు చేసినవాడు శ్రీశ్రీయే (చూ. పే. 186). బుచ్చిబాబు, రాచకొండ రచనలలో కూడా ఈ ధోరణులు కనిపిస్తాయి. పూర్తిగా చైతన్య స్రవంతి ధోరణిలో ప్రయోగాత్మకంగా చేసిన రచన నవీన్ 'అంపశయ్య'. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాల ప్రభావంలో వచ్చిన ఈ ధోరణి తెలుగులో స్వతస్సిద్ధంగా వచ్చిన రచనా విధానంగా రూపొందలేదు.

ఏ సాహిత్యంలోనైనా సామాజిక ఉద్యమాల తీవ్రత తగ్గినప్పుడు, స్తబ్ధత ఏర్పడినప్పుడు ప్రధానంగా మూడు రకాల ధోరణులు పెడదారులుగా తలఎత్తుతాయి. అవి తిరుగుబాటు ధోరణులు, వ్యక్తివాద ధోరణులు, రూపవాద ధోరణులు. స్వాతంత్ర్యానంతరం అభ్యుదయ సాహిత్యోద్యమం మందగించి నప్పుడు తెలుగు సాహిత్యంలో ఈ మూడు రకాల ధోరణులు తలఎత్తాయి. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన 17–18 సంవత్సరాల తరువాత కూడా ఆర్థిక స్థితిగతులు, సామాన్యుల జీవితాలు బాగుపడక పోవటంతో సమాజంలోని నిరాశా, నిస్పృహల ఆధారంగా, నగరనాగరికత పెరుగుతున్న ఫలితంగా తెలుగులోతిరుగు బాటు ధోరణులు కొన్ని తలఎత్తాయి. పాశ్చాత్య దేశాలలో మొదటి ప్రపంచ యుద్ధ సందర్భంగా ఆధునికత పేరిట తలఎత్తిన ధోరణుల్లాంటివి కొన్ని తెలుగు దేశంలో స్వాతంత్ర్యం తరువాత ఇక్కడి ఆర్థిక, సామాజిక పరిస్థితుల పునాదిపైన బయలుదేరాయి, దిగంబర కవులు మొదటి సంపుటంలో ఇలాంటి

ధోరణులు కొన్ని కనిపిస్తాయి ఉదాహరణకు "ప్రపంచంలో ఏదేశం పైబడ్డ
వారంతా చస్తే శాంతి పూస్తుందనే ఆశ", నగ్నముని జీనా అనే కింద చీమను
పెంచుతున్నట్టు పరిచయం చేసుకోవటం, మహాస్వప్న బ్రేకుల్లేని పుకార్లలో
షికార్లు చేయటం వంటి ధోరణులు ఇలాంటి వ్యక్తివాద ధోరణులను
ప్రతిబింబిస్తాయి అయితే పాశ్చాత్య దేశాల్లోని ఆధునికతా ధోరణులకు చెందిన
వారిలాగా కాక క్రమంగా సామాజిక దృక్పథం వైపు వీరు దృష్టి మరల్చారు
సాహిత్య రంగంలో స్తబ్ధతను చీల్చి సంచలనాన్ని కలుగజేశారు భావకవితా
రూపంపైన, అభివ్యక్తిపైన పరాభి తెలుగుబాలు చేస్తే, దిగంబరకవులు అభ్యు
దయకవుల నిర్లిప్తతపైన, మేధావుల అనాసక్తతపైన తిరుగుబాటు చేశారు

తెలుగులో భావకవిత్వం తరువాత వ్యక్తివాదాన్ని ప్రతిఫలించే ధోరణులుగా
అస్తిత్వవాద (Existentialism), అనుభూతి వాద ధోరణులు వచ్చాయి
అస్తిత్వవాద ధోరణి పాశ్చాత్యదేశాల నుంచి దిగుమతి అయితే, అనుభూతివాదం
మధ్య తరగతి అసామాజికత నుంచి, అనాసక్తత నుంచి వచ్చింది అస్తిత్వ
వాదం ఒక ఆలోచనా విధానం, తాత్త్విక సిద్ధాంతం వ్యక్తిస్వాతంత్ర్యం అస్తిత్వ వాదా
నికి పునాది మనిషికి తన మనుగడ ముఖ్యం, మనిషికి అనియతమైన స్వేచ్ఛ
ఉంది, మనిషి తన ఇచ్ఛకే బాధ్యుడు వంటి వ్యష్టి భావాలపైన అస్తిత్వవాదం
ఆధారపడి ఉంది చదువుకున్న మధ్య తరగతి వారు, మేధావులు అయిన
రచయితలు ఈ ధోరణికి ప్రభావితులయ్యారు ఆధునిక ధోరణులు చాలావాటి
లాగే అస్తిత్వవాదం కూడా ఫ్రాంసులో ప్రారంభమైంది జ్యాంపాల్‌సార్త్ర్ దీనికి
మూలపురుషుడు తెలుగు సాహిత్యంలో ఈ ధోరణి ప్రయోగాత్మకంగా
కొందరు రచయితలు చేపట్టారు దిగంబర కవులు రెండవ సంపుటం పీఠికలోని
భావాలు అస్తిత్వవాదం, మార్క్సిజం కలగాపులగమై కనిపిస్తాయి అభ్యుదయ
కవిత్వం స్తబ్ధతలో ఉన్న దశలో భావకవిత్వానికి అంతగా భేదం లేకుండా
అవతరించిన ధోరణి అనుభూతివాదం భావకవిత్వంలో లాగే అనేక రకాల
ధోరణులు–మానవకారుణ్య వాదం, ఉద్యమాల వ్యతిరేకత, మార్మికత, 'నేను'
ప్రాధాన్యం మొదలైన ధోరణుల సమాహారమే అనుభూతి వాదం అనుభూతి
వాద కవులుగా పేర్కొన్నవారి రచనల్లో సమానమైన తాత్విక ప్రాతిపదిక
లేదు ఒకేరకమైన దృక్పథం లేదు ఒక రకంగా అభ్యుదయ కవిత్వానికి పూర్వ

రంగం భావకవిత్వం అయితే విప్లవ కవిత్వానికి పూర్వరంగం అనుభూతి కవిత్వం. విప్లవోద్యమావిర్భావం తరువాత కూడా అనుభూతి వాద ధోరణి కొనసాగింది. ఇటీవలనే అనుభూతివాదాన్ని ఒక వాదంగా నిలబెట్టే ప్రయత్నం జరుగుతున్నది. బాహ్య ప్రపంచ దృశ్యాలు అంతరంగ ప్రపంచంలో దృశ్యత్వాన్ని కోల్పోయి కేవల అనుభూతిగా మిగలటమే అనుభూతి వాదమని ఈ ఉద్యమానికి సంబంధించినవారు నిర్వచిస్తున్నారు (చూ.పే. 156). అస్తిత్వవాదం ఎక్కువగా వచనరచనలోను, అనుభూతివాదం కవిత్వంలోను కనిపిస్తుంది.

రూపవాదం (Formalism) పేరిట ప్రత్యేకమైన ఉద్యమం తెలుగులో కనిపించకపోయినా రూప ప్రధాన ధోరణులు బలంగానే కనిపిస్తాయి. అభ్యుదయోద్యమ ఉత్తరకాలంలోని వచన కవితోద్యమం, ఇటీవలి మినీ కవితా ఉద్యమం ఇలాంటివే. శైలీ లక్షణాల్ని, రూపనిర్మాణాన్ని విశ్లేషించే ఒక ప్రత్యేక ధోరణిగా రష్యాలో విప్లవం వచ్చిన కొత్తలో రూపవాదం కనిపిస్తుంది. సామ్యవాద వాస్తవికత ఒక ధోరణిగా వ్యాప్తి చెందుతున్న దశలో సోవియట్ రచయితలు రూపవాదాన్ని వస్తువుకి కాక రూపానికి అధిక ప్రాధాన్యం ఇచ్చే ధోరణిగా ఖండించారు. మార్క్సిస్టు రచయితల దృష్టిలో ఇది కించపరచటానికి వాడే పదం (pejorative term). పెట్టుబడిదారీ విధానపు విషపుత్రికగా రూపవాద ధోరణిని వారు ఖండించారు. రోమన్ యాకొబ్‌సన్ (Roman Jacobson) వంటి భాషాశాస్త్రజ్ఞులు, విక్టర్ ష్క్లోవ్‌స్కీ (Victor Shklovsky) ఈ ధోరణులకు నేతృత్వాన్ని వహించారు. కొత్త రూపంతో కొత్త వస్తువు పుట్టుకొస్తుంది; రూపం వస్తువుని నిర్ణయిస్తుంది (With a new form comes a new content. Form thus determines content) అన్నంతవరకు వెళ్లారు రూపవాదులు. రూపనవ్యతే ఆధునికత అని వీరి సిద్ధాంతం. ఇది నగర సంస్కృతిని ప్రతిఫలిస్తూ వచ్చిన ధోరణి. అక్షరాలు, గణాలు, మాత్రలు మొదలైన రూప నిర్మాణానికి సంబంధించిన చర్చ సాహిత్య విమర్శకు కొంతవరకు తోడ్పడవచ్చు కాని అదే సాహిత్యంలో సర్వస్వం కాదని, సాహిత్యంలో వస్తువే ప్రధానమని మార్క్సిస్టు సాహిత్య సిద్ధాంతం చెప్తుంది.

పాశ్చాత్య దేశాలలో ఆధునికతా ధోరణులలో భాగంగా వచ్చిన Blank verse తెలుగులో వచన కవితగా అభ్యుదయ సాహిత్యోద్యమంలో భాగంగా

అవతరించింది అభ్యుదయ సాహిత్యోద్యమం స్తబ్ధతను చేరినప్పుడు మధ్య తరగతి రచయితల ఉద్యమంగా వచన కవితోద్యమం వ్యాపించింది ఒక రూపంగా వచ్చిన వచన కవితను ఒక తత్వంగా నిరూపించే ప్రయత్నం జరిగింది సమకాలీన జీవిత చిత్రణ, తెనుగుదనం, ప్రగతిశీలమైన దృక్పథం, వ్యవహార భాషా ప్రయోగపరత్వం, ఛందో గ్రాంథిక బంధవిచ్ఛేదనం, అస్పష్టతాదోషబహిష్కారం వగైరాలు వచన కవితా తత్వంగా పేర్కొన్నా, విషయం ఏదైనా సరే వచన కవిత్వం రాస్తేచాలు అన్న అభిప్రాయాన్ని బలపరిచింది ఈ ఉద్యమం ప్రగతిశీల భావాలకు వ్యతిరేకమైన ధోరణులు వచన కవితలో ప్రతిఫలించాయి. తెనుగుదనాన్ని ప్రతిఫలించటం అట్లా ఉంచి సుదీర్ఘ సమాసాలను, సంస్కృతాన్ని ఎక్కువగా వచనకవితలో వాడిన వారున్నారు అస్పష్టతా దోష బహిష్కారం లేకపోగా మార్మిక ధోరణులు, అయోమయ భావాలు వచన కవిత పేరుతో వచ్చిన రచనలలో కనిపిస్తాయి. ఛందో గ్రాంథిక బంధవిచ్ఛేదనం జరక్కపోగా వచన పద్యాన్ని ఒక ఆధునిక ఛందంగా ఆవిష్కరించే ప్రయత్నం జరిగింది వచన పద్య లక్షణాన్ని గురించిన చర్చలనేకం ఈ పద్ధతిలో సాగాయి అభ్యుదయోద్యమం నుంచి వచ్చి వచన కవితోద్యమాన్ని చేపట్టినవారే వచన కవిత ప్రజల దృష్టికి రావాలంటే పండిత విమర్శకులు కూడా అంగీకరించాలనీ, ఆంగ్ల భాషా సంస్కారం లేకుండా కేవలం సంప్రదాయ అలంకార శాస్త్ర ప్రోక్తమైన కవితా సిద్ధాంతాలు మాత్రమే తెలిసిన పండితుల మెప్పును పొంది, వారి ప్రమాణాలకు నిలబడగల సత్తా వచన కవితా ప్రక్రియ సాధించాలనీ ఆశించారు ఇలాంటి భావాలు రూపవాద ధోరణికి పరాకాష్ఠగా చెప్పవచ్చు "నీకు నీవైనా మిగిలి వున్నావో లేవో ప్రతిక్షణం చూసుకో అని వచన కవిత చెప్తుంది" అని చెప్పటం వ్యక్తివాద ధోరణులకు ప్రతీకగా వచన కవిత నిలచిందని నిరూపిస్తుంది దేన్నైనా స్వేచ్ఛగా, ధారాళంగా రాయడానికి వచన కవిత ఉపయోగిస్తుందనటం కూడా వస్తువుకు ప్రాధాన్యం ఇవ్వని రూపవాదంగా వచన కవితోద్యమం సాగిందనటాన్ని నిరూపిస్తుంది ఇదే పద్ధతిలో సాగుతున్న ఇటీవలి కాలపు రూపవాద ధోరణి మినీ కవిత

ముద్రణా సౌకర్యాలు పెరిగి, అక్షరాస్యత పెరిగి, ఎక్కువ మంది జనం దగ్గరికి సాహిత్యాన్ని తీసుకొని వెళ్లటానికి అవకాశం కలిగిన ఆధునిక కాలంలో పెరుగుతున్న ధోరణి జనామోద ధోరణి (popular trend) పెట్టుబడి ఆర్థిక వ్యవస్థలో తమ వ్యాపారాన్ని పెంచుకోవడానికి జనం ఏ సాహిత్యాన్ని

ఆమోదిస్తారో గుర్తించి అలాంటి సాహిత్యాన్ని అందజేయటానికే ప్రయత్నించటం జరుగుతుంది. ఇక్కడ జనం అంటే చదువుకున్న మధ్య తరగతి జనం. సమస్యల చిక్కుటడవుల్లో దిక్కుతోచని బలహీన మనస్కులకి వాళ్ల బలహీనతలను సంతృప్తిపరచే సాహిత్యాన్ని సృష్టిస్తూ, ప్రచురిస్తూ ప్రతిగా పాఠకులు కోరే సాహిత్యాన్నే అందజేస్తాం అనే నినాదాన్నిస్తాయి వ్యాపార పత్రికలు. 'కళ కళ కోసం, ఆనందం కోసం' అన్న సిద్ధాంతం పెట్టుబడిదారీ ఆర్థిక విధానం నుంచి పుట్టి పెరుగుతుంది. నిజానికి సామాజిక పరివర్తనకు మధ్య తరగతి వారిని ఆలోచింపజేసే, తమ సమస్యలను గుర్తించి అవగాహన కలిగించే సాహిత్యం వారిలో ప్రచారంలో ఉన్న నవల, కథానిక మొదలైన ప్రక్రియలలో వారు ఆమోదించే పద్ధతిలో రూపొందవలసి ఉంది. దేశంలో ఎక్కువ శాతంలో ఉన్న సామాన్య జనానికి అవగాహన కలిగించటానికి వారిలో ప్రచారంలో ఉన్న సాహిత్య, కళారూపాలనే గ్రహించాలి, వారి భాషలో చెప్పాలి. ఆమోదం అంటే కేవలం మోదం, తాత్కాలిక ఉపశమనం మాత్రమే కాదు, తమ సమస్యలను పరిష్కరించుకొని శాశ్వత ఉపశమనం పొందటానికి కావలసిన అవగాహనను జనానికి నచ్చిన పద్ధతిలో అందజేయటం. 'హితం మనోహారిచ దుర్లభం వచః' అన్న మాటను అసత్యం చేసే సాహిత్యమే జనామోదకర సాహిత్యం.

## సహాయక గ్రంథాలు, పత్రికలు, వ్యాసాలు


కుందుర్తి&గోపాల చక్రవర్తి(సం.) 1967. వచన కవిత. హైదరాబాదు : ఫ్రీవర్స్ ఫ్రంట్.

చంద్రశేఖరరావు, మద్దుకూరి. 1974. చంద్రం వ్యాసావళి. విజయవాడ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్.

నారాయణరావు, వేల్చేరు. 1978. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. విజయవాడ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్.

నారాయణ రెడ్డి, సి. 1967. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయము-ప్రయోగము సికిందరాబాదు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్.

మధుసూదనరావు, త్రిపురనేని, 1972. కవిత్వం-చైతన్యం. తిరుపతి : బాలాజీ పబ్లిషర్స్.

రమణారెడ్డి. కె. వి. 1977. చలం. అరుణతార 1–1, నవంబర్, 77

వెంకటరామయ్య, తుమ్మల (సం.)1930.అభ్యుదయ. విమర్శ విశేష సంచిక.

David Craig (Ed.) 1975. Marxists on Literature. Penguin Books.

# కాల్పనిక వాదం

—జె వి రాఘవేంద్రరావు

రొమాంటిక్ శబ్దం ఇంగ్లీషు భాష ఐరోపా భావసరళి (thought pattern)కి అందించిన విశిష్టమైనకానుక ధైర్య సాహసాలు, ప్రణయం, విపరీతమైన రసాభినివేశం, అతిశయోక్తి మొదలైన లక్షణాలు కలిగిన కథలను, కథాకావ్యాలను రొమాంటిక్ కథలు (Romantic tales) గా వర్ణిస్తూ ఉండేవారు చాలాకాలం అసహజమైన, కల్పితమైన, వాస్తవాతీత దృగ్విషయాలను సూచించే ప్రతీకగా కాల్పనిక శబ్దం వాడబడింది హేతువాదయుగమైన పదిహేడవ శతాబ్దంలో ఈ శబ్దం ఎక్కువగా ప్రచారంలో లేదు 1711 నాటికి ఇంగ్లండ్‌లో రొమాంటిక్ శబ్దానికి శిష్ట వ్యవహారం (refined Conduct) లేక శిష్ట సంస్కృతి (refined culture) అనే అర్థం వాడుకలోకి వచ్చింది క్రమంగా ఊహాశక్తిని సమ్మోహనం చేసే (captivating the imagination) శక్తి అనే అర్థం సంతరించుకొంది పద్దెనిమిదవ శతాబ్దం మధ్యకాలం నాటికి దీని అర్థం ఇంకా కొంత మారి కల్పన (Imagination), అనుభూతులు (feelings) మొదలైన వాటికి సమానార్థకంగా ఈ పదాన్ని ఉపయోగించడం జరిగింది రొమాంటిక్ పదం ఇంగ్లీషు నుంచి ఫ్రెంచి భాషలోకి దిగుమతి అయింది ఏదైనా ప్రకృతి దృశ్యాన్ని చూచినప్పుడు దర్శకులకు రసోద్వేగం కలిగితే దాని romantic scene గా వర్ణించేవారు రూసో తన Musings of the Solitary Stroller లో బియాన్ (Biene) తటాకం జనీవా తటాకం కంటె చాలా ఉద్రిక్తంగా (wild) గాను, రొమాంటిక్‌గాను ఉందని వర్ణించాడు.

ఫ్రాన్స్‌లో లాగే జర్మనీలో కూడా రొమాంటిక్ పదం ఇంగ్లీషు రచయిత Thomson రాసిన ఋతువులు (Seasons) గ్రంథం అనువాదంతో బాగా ప్రచారంలోకి వచ్చింది జర్మన్‌లో కూడా రొమాంటిష్ పదం రసోద్వేగాన్ని, భావోద్రేకాన్ని కలిగించే ప్రకృతి దృశ్యాలను వర్ణించినప్పుడే కనిపిస్తుంది 1797 లో Frederick Schlegel రాసిన నూట ఇరవై అయిదు పేజీల Cogitations తరువాత రొమాంటిష్ అన్న శబ్దానికి కల్పన (Imagi-nation), రసోద్వేగం (Emotion) అన్న అర్థాలు స్థిరపడ్డాయి ఈ విధంగా రొమాంటిక్ శబ్దం అర్థవికాసాన్ని పరిశీలించినప్పుడు సాహిత్యప్రపంచంలో దీని అర్థం మొదట చాలా పరిమితంగా ఉండేదని, పద్దెనిమిదవ శతాబ్దంలో మారుతున్న అభిప్రాయాలు (attitudes) ల, విలువల మూలంగా సృజనాత్మకత (originality), సృష్టి (creation), ప్రతిభ (genius) మొదలైన అర్థాలను సంతరించుకుందని తెలుస్తుంది రొమాంటిక్ ఉద్యమ రచనలతో ఈ పదానికి కొంత అర్థస్థిరీకరణ స్పష్టత చేకూరినట్టు మనం చెప్పవచ్చు

రొమాంటిష్ పదాన్ని సాహిత్యలోకంలో 1797 లో తాను మొదటిసారిగా వాడినట్టు Frederick Schlegel సగర్వంగా చెప్పుకున్నాడు కాని దీనికి ఖచ్చితమైన అర్థం ఆయన వాడుకలో కనిపించదు ఆయన సోదరుడు విల్హెల్మ్ (August Wilhelm) రొమాంటిష్ శబ్దాన్ని ఆధునిక కళాత్మ (spirit of the modern art) గా వాడాడు ఫ్రాన్స్‌లో కూడా రొమాంటిక్ శబ్దం రచయితల రచనలలో అనేకార్థాలలో కనిపిస్తుంది మాడమ్ డిస్టేల్ (Madame Destael) రచనలలో మధ్యయుగ క్రైస్తవ సంస్కృతికి సంకేతంగా ఈ శబ్దాన్ని వాడటం కనిపిస్తుంది కొందరి రచనలలో రొమాంటిక్ అంటే సాంప్రదాయికతకు వ్యతిరేకమైన కళ లేక సాహిత్యమనే అర్థం భాసించింది మరికొందరు రొమాంటిక్ పదాన్ని స్వతంత్ర, సుందర, బీభత్స సాహిత్యానికి సమానార్థకంగా వాడారు ఆధునిక లేక సమకాలీన అనే అర్థంలో కూడా చాలామంది ఈ పదాన్ని వాడారు మొత్తంమీద సాంప్రదాయికతకు వ్యతిరేకంగా

వచ్చిన నూతన సాహిత్యం అన్న అర్థంలో 'రొమాంటిసిజమ్' అనే పదం ఫ్రాన్సులో కొన్నాళ్ళు వాడుకలో ఉంది ఫ్రెంచి నాటకి సాహిత్యంలో రొమాంటి సిజమ్ అంటే గంభీర, విదూషక, విషాద, వినోద భావాల సమ్మేళనం అని అర్థం ఉన్నట్టు తెలుస్తుంది చారిత్రక కళారూప (Lejenre intime) మనే దృష్టితో కూడా కొందరు ఈ పదాన్ని వాడారు రొమాంటిసిజమ్ అనేకార్థాలను భాసించే సమన్వయ శబ్దంగా చివరికి ఫ్రెంచి సాహిత్య విమర్శకులు నిర్ణ యించారు ఇంగ్లిషు సాహిత్యంలో ఈ పదానికి సంబంధించిన అర్థ మీమాంస ఎక్కువగా జరిగినట్టు కనిపించదు వర్డ్స్‌వర్త్ లిరికల్ బ్యాలెడ్స్ (Lyrical Ballads) కు రాసిన ఉపోద్ఘాతంలో రొమాంటిక్ పదాన్ని వాడలేదు షెల్లీ, కాలరిడ్జ్‌లు తమ వ్యాసాలలో, విమర్శలో తాము రాస్తున్న, వాంఛిస్తున్న కవిత్వం గురించి చర్చించారేగాని రొమాంటిక్ పదప్రయోగంజోలికి వెళ్ళినట్టుకనిపించదు కీట్స్ కూడా రొమాంటిక్ పదాన్ని ప్రయోగించలేదు రొమాంటిక్ శబ్దం ఇంగ్లీషువాళ్లు ప్రవేశపెట్టిందే అయినా దీనికి సంబంధించిన అర్థమీమాంస ఇంగ్లీషు సాహిత్యకులలో ఎక్కువ జరగలేదు

రొమాంటిసిజాన్ని విభిన్న రచయితలు, తత్వవేత్తలు భిన్న భిన్నంగా నిర్వచించారు దీనికి ఒక ప్రామాణిక నిర్వచనం అందించటం చాలా కష్టమే కాదు అసాధ్యం కూడా "ప్రకృతివైపు తిరిగి వెళ్లటమే (return to the nature)" అన్నాడు రూసో గెథే నిర్వచనం దీనికి పూర్తిగా భిన్నంగా కని పిస్తుంది "రొమాంటిసిజం వ్యాధి, సాంప్రదాయికత-స్వస్థత" అన్నాడాయన హైన్ (Heine) మధ్యయుగాల జీవితాన్ని, చింతనను పునరుజ్జీవింప చేసేది రొమాంటిసిజమని అన్నాడు "వాస్తవికత నుండి పలాయనమే రొమాంటిసిజమ్" అని వాల్టర్ హౌజ్ (Walter House)అన్నాడు "రొమాంటిసిజమ్ ఈనాటి కళ, సాంప్రదాయికత మొన్నటి కళ" అని స్టెండాల్ (Stendahl) అన్నాడు "వాస్తవికత హేతువుకు భిన్నంగా కల్పనా ప్రాధాన్యం కలిగిందే రొమాంటిసిజమ్" అన్నాడు నీల్సన్ (Neilson) "అపూర్వత (strangeness), సౌందర్యా (beauty) ల సమ్మేళనమే రొమాంటిసిజమ్" అని పీటర్ (Peter) చెప్పాడు

ఎడ్వర్డ్ హ్యూగో ప్రకారం "సాహిత్యంలో ఉదార,ఉదాత్త (sublime) భావనల సమ్మేళనమే రొమాంటిసిజమ్"

ఈ విధంగా రొమాంటిక్, రొమాంటిసిజమ్ నిర్వచనాలు పరిశీలిస్తే ఈ భావనలోని విశాల వైవిధ్యంతో పాటు, వైరుధ్యాలు కూడా కనిపిస్తాయి అందుకే ఆర్థర్ లవ్ జాయ్ (Arthar Lovejoy) ఇలా అంటాడు "రొమాంటిక్ శబ్దం అనేక అర్థాలను సంతరించుకోవటం వల్ల దానికి విశిష్టమైన అర్థం లేకుండా పోయింది అందుకే ఇది శబ్దసంకేతం (verbal sign) గా పనిచేయటం మానేసింది" "రొమాంటిజాన్ని నిర్వచించే ప్రయత్నం తనకూ తృప్తి నివ్వదు, ఇతరులకూ తృప్తినివ్వదు" అంటాడు గ్రియర్ సన్ (Grierson) తన Back ground of English Literature అనే పుస్తకంలో కాబట్టి రొమాంటిక్, రొమాంటిసిజమ్ పదాల నిర్వచనాలను పక్కకు పెట్టి వాటి ప్రధాన లక్షణాలను అధ్యయనం చేయడం ఉపయోగకరమని లిలియన్ ఫర్స్ట్ (Lilian Furst) అభిప్రాయపడటం జరిగింది లిలియన్ ఫర్స్ట్ దృష్టిలో రొమాంటిసిజం ప్రధాన లక్షణాలు ఆరు (1) వ్యక్తివాదం (Individualism), (2) ఆదర్శవాదం (Idealism), (3) సృజనాత్మక కల్పన (creative imagination), (4) వ్యక్తిగత ప్రకృతి అవలోకన (subjective Perception of nature), (5) స్పందనకు ప్రాముఖ్యం (Importance of feeling), (6) ప్రతీక చిత్రాల వాడకం (use of symbolic imagery)

యూరోపాలో కాల్పనిక ఉద్యమం (Romantic movement) ఆవిర్భవించడానికి రెండు చారిత్రక సంఘటనలు ముఖ్య కారణాలు 1 ఉత్పత్తి శక్తుల విధానాలను మార్చివేసిన పారిశ్రామికవిప్లవం 2 మానసిక, తాత్విక [illegible] పొంగిపొర్లిస్తు, తార్కికంగా కొత్త సిద్ధాంతాలను ప్రచారం చేసిన ఫ్రెంచి విప్లవం ఈ రెండు సంఘటనలు ఫ్రెంచి కాల్పనికతపైన అపారమైన ప్రభావాన్ని చూపాయి

పారిశ్రామిక విప్లవ (1748) ఫలితంగా ఉత్పత్తి శక్తులలో, సంబంధాలలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి భూస్వామ్య ఉత్పత్తి, గిల్డ్ విధానం (guild system) మారి, యాంత్రిక ఉత్పత్తి (machine production) మొదలయింది దీనివల్ల బూర్జువా వర్గమనే కొత్త వర్గం బయలుదేరింది వీరే ఉత్పత్తి శక్తుల యాజమానులు ఫ్యాక్టరీలలో శ్రమదానం చేసి పనిచేసే ప్రత్యర్థి వర్గమే కార్మికవర్గం (Proletariat) ఈ నూతన ఉత్పత్తి విధానం, ఈ రెండు ప్రత్యర్థి వర్గాల అవతరణ ప్రభావం ఐరోపా సమాజం పైన బాగా కనిపిస్తుంది పారిశ్రామిక విప్లవ ఫలితంగా పునాది అయిన ఆర్థిక సంబంధాలలో వచ్చిన మార్పులు ఉపరితలం (Superstructure) లో కూడా ప్రతిఫలించ సాగింది అది సాహిత్యంలో కూడా ప్రతిబింబించింది సాహిత్యంలో కొత్త శైలి, రూపాలు, భావాలు అవతరించాయి ఈ సందర్భంగా అవతరించి వికసించిందే నవలా రచన విశిష్ట కథాసంవిధానంతో కూడుకున్న గద్య రచనే నవల

పారిశ్రామిక విప్లవానికి పూర్వం సాహిత్యంలో వస్తువు ఉన్నత వర్గ జన జీవితాల వర్ణనలకు, వారి జీవిత విలాసాలను చిత్రించటానికి మాత్రమే పరిమితమై ఉండేది కాని కాల్పనిక యుగ ఆవిష్కరణతో సామాన్యుడి జీవితం, మానసిక ప్రవృత్తులు కూడ రచనా వస్తువులైనాయి పారిశ్రామిక విప్లవానికి పూర్వం రాజులు, భూస్వాములు సాహిత్యాన్ని పోషించేవారు పారిశ్రామిక విప్లవం తరువాత ముద్రణాయంత్రాల అవతరణతో రచయితలు కొంత స్వతంత్రులయ్యారు రచనలను ముద్రించటానికి పత్రికలు ముందుకు వచ్చాయి చదువగలిగిన సామాన్యుడి దగ్గరికి సాహిత్యం వెళ్ళగలిగింది విద్యావ్యాప్తికూడా దీనికి తోడ్పడింది వస్తువులో నవ్యతే కాకుండా భాషలో, శైలిలో సారళ్యాన్ని సంతరించుకుంది సాహిత్యం

పారిశ్రామిక విప్లవంతో పాటు రాజకీయ విప్లవం - ఫ్రెంచి రెవల్యూషన్ (1789) ప్రభావం కూడా కాల్పనిక సాహిత్యోద్యమం పైన ఉంది ఈ విప్లవంలో రూసో, వోల్టైర్ల పాత్ర చాలా ఉంది తత్వవేత్తగా, సాహిత్యకుడిగా

రూసో ఆలోచనలు, భావాలు కాల్పనిక సాహిత్య యుగ ప్రారంభ కాలం నాటికి ఫ్రాన్సులో పునాదులు వేశాయి రూసో భావత్రయం స్వేచ్ఛ (Liberty), సమానత (Equality), సౌభ్రాతృత్వం (Fraternity) ఫ్రెంచి సామాజిక సంస్కృతిని సమూలంగా కదలించి వేసింది వీటి ప్రభావం రాజకీయ విప్లవ దిశపైనే కాకుండా సాహితీ గమనంపై, గమ్యంపై నిశితంగా ఉంది నవ్య సాంప్రదాయికతా విలువల (Neo classical values) కు వ్యతిరేకంగా స్వేచ్ఛను కోరుతూ, శిష్టజనం అంతస్తుల, విలువల (Aristocratic norms and values) లో సమానతను కాంక్షిస్తూ, భిన్న వర్గాల మధ్య సౌభ్రాతృత్వాన్ని ప్రతిపాదిస్తూ రొమాంటిక్ రచయితలు, తత్వవేత్తలు తమ వ్యూహాన్ని నడిపారు రూసో భావత్రయ సిద్ధాంత ప్రభావం ఫ్రాన్సులోని అనేక యువ రచయితల ఆలోచనల, అభివ్యక్తులపైన ప్రగాఢమైన ముద్ర వేసింది

సాహిత్యపరంగా చూసినప్పుడు ఆవేశం, అనుభూతి, తీవ్రవాంఛ మొదలైన విలువల్ని ప్రతిపాదించింది కాల్పనిక వాదం జీవితంలోని అనుభూతుల ద్వారానే, సత్యాన్వేషణ-స్పందన ద్వారానే వాస్తవికత అవగాహన సాధ్యమని కాల్పనికుల వాదం ఈ అనుభూతులు, సత్యావగాహన వ్యక్తి వ్యక్తికీ భిన్న భిన్నంగా ఉంటాయి కాబట్టి విశ్వజనీనమైన సత్యమేమీ లేదని, అన్ని విలువలు ప్రపంచంలో సాపేక్షమని వారి అభిప్రాయం కాల్పనిక వాదం ప్రచారం చేసిన విలువలలో వ్యక్తివాదం చాలా ప్రముఖమైంది పారిశ్రామికీకరణ నగరీకరణ వేగాన్ని పుంజుకోవటంతో ఉమ్మడి కుటుంబ వ్యవస్థ బలహీన మవటంతో, పాత సాంస్కృతిక విలువలు విచ్ఛిన్నం కావటంతో వ్యక్తివాదం క్రమేపి అతిశయించింది ఈ వ్యక్తి వాదం ఆర్థిక సంబంధాల ఫలితమైనా సాంస్కృతిక స్థాయిలో ఇది కారణంగా పని చేసింది పెట్టుబడిదారీ వ్యవస్థ నుంచి జనించిన వ్యక్తివాదం రొమాంటిక్ సాహిత్య వికాసంలో కీలక పాత్ర వహించింది కాల్పనికోద్యమం ముఖ్యంగా మధ్యతరగతి ఉద్యమంగా కనిపిస్తుంది ఈ ఉద్యమానికి సంబంధించిన రచయితలలో, మేధావులలో మధ్యతరగతి వారే గణనీయంగా కనిపిస్తారు

కాల్పనిక వాదం ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లండు దేశాలలో భిన్న భిన్న రూపాలలో ప్రత్యక్షమవుతుంది ఫ్రాన్సు, జర్మనీ దేశాలలో కళాకారుల, రచయితల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలపై అనేక నిబంధనలుండేవి అంతేకాక సాంప్రదాయికత, నవ్య సాంప్రదాయికతల ఇనుప పిడికిలో చాలా కాలం నడచింది ఈ దేశాలలో సాంస్కృతిక వ్యవస్థ దీనివల్ల రూపవాదం, తాత్విక ఛాందసత్వం, మానసిక జడత్వం నిష్క్రియత బాగా పెరిగిపోయాయి స్వకీయ ఆలోచన, స్పందన కరువయ్యాయి అందుకే కాల్పనిక వాదం స్వేచ్ఛా తత్వాన్ని ఆలంబనం చేసుకొని విజృంభించింది కొత్త విలువల, ప్రతీకల, భావచిత్రాల నిర్మాణంతో ఇది ప్రయోగవాదంగా రూపొందింది ఆలంకారికమైన, ఆడంబరమైన భాషా, శైలులకు బదులు సారళ్యానికి ప్రాముఖ్యం వచ్చింది ఇంగ్లండులో కాల్పనిక వాదం పారిశ్రామిక విప్లవం పట్ల లిబరల్ మేధావుల ప్రతిక్రియ (reaction)గా కనిపిస్తుంది గోల్డ్‌స్మిత్ Deserted Village, బ్లేక్ Satanic Mills, షెల్లీ Age of Despair ఒకే రకమైన భావ సంచయాన్ని ప్రకటిస్తాయి షెల్లీ మానవతావాదం (Humanism), కీట్స్ సౌందర్యవాదం (Aestheticism), బైరన్ స్వేచ్ఛా వాదం (doctrine of freedom), వీరందరిలో ఉమ్మడిగా కనిపించే నిరీశ్వర వాదం (Atheism) ఈ క్రమంలో వచ్చిన భావజాలమే మొత్తం మీద జర్మనీలో ఆదర్శవాదం (Idealism)గా, ఇంగ్లండులో సౌందర్య వాదం (Aesthaticism) గా, ఫ్రాన్సులో స్వేచ్ఛా వాదంగా ప్రకటితమైంది కల్పనిక వాదం ఇది ఆక్కడి సమాజాలలో కొంత చైతన్యాన్ని కలిగించినా సమాజ నిర్మాణ పునాదులను కదిలించలేకపోయింది కారణం దీనికి వ్యక్తి వాదం, వ్యక్తి స్వేచ్ఛ మాత్రమే ప్రధాన ధ్యేయం కావటం అందుకే తదనంతర కాలంలో Impressionism, Dadaism లాంటి అరాచక ఉద్యమాలకిది దారి తీసింది వీటి పర్యవసానమే సాంప్రదాయికతా విధానంలో రావలసినన్ని మార్పులు రాకపోగా, ఈ ఉద్యమంలో భాగంగా పునరుద్ధరణ (Revivalist) ధోరణులు కూడా తలెత్తాయి

అంతేకాదు, చారిత్రకంగా చూస్తే కాల్పనికవాదులు కాలవిషయా (temporal aspect)న్ని సరిగ్గా అవగాహన చేసుకోలేదని, గతాన్ని, భవిష్యత్తును వారు తులనాత్మకంగా పరిశీలించలేదని, దీనివల్ల జీవిత దృక్పథంలో యాదృచ్ఛికత (Adhocism) ఏర్పడిందని, పాతకాలపు విలువలను ఫ్రెంచి మేధావులు పూర్తిగా విడనాడలేక, కొత్త విలువలను పూర్తిగా అనుసరించలేక సతమతమయి జీవనం విషాదంగా, అమధురంగా తయారయ్యేసరికి కాల్పనిక కవులు వాస్తవికత నుండి పారిపోయి ఊహాలోకంలో తల దాచుకున్నారని అందుకే రొమాంటిక్ సాహిత్యంలో పలాయన వాదం (Flight from Reality) కొట్టవచ్చినట్లు కనిపిస్తుందని అర్నాల్డ్ హౌజర్ అన్నాడు

ఐరోపాలో వివిధ దేశాలలో కాల్పనిక వాదం పేరిట వికసించిన భావ ధోరణులను సమన్వయిస్తే కల్పన ( Imagination ) ప్రధానమైన ప్రేరణగా కలిగి వ్యక్తిగతమైన స్పందన అనుభూతులద్వారా వాస్తవికతను కాల్పనిక వాస్తవికతగా మార్చిన సృజనాత్మక రచనా సముదాయమే కాల్పనిక సాహిత్యమని పేర్కొనవచ్చు ఇది కథారూపంలో గాని, నవలా రూపంలోగాని, కావ్యరూపంలో గాని అభివ్యక్తం కావచ్చు

తెలుగు సాహిత్య చరిత్రలో, సామాజిక జీవితంలో కాల్పనిక కవిత్వం దాదాపు కాల్పనిక సాహిత్యానికి సమానార్థకంగా వాడుకలో ఉంది కాల్పనిక సాహిత్యంలో అనేక ప్రక్రియలున్నా తెలుగు సాహిత్యానికి సంబంధించినంత వరకు భావ కవిత్వం, ఆత్మాశ్రయ కవిత్వం అనేవి కాల్పనిక సాహిత్యానికి లేక కవిత్వానికి పర్యాయ పదాలుగా ఉన్నాయి నిజానికి కాల్పనిక కవిత్వం విశాల తెలుగు కాల్పనిక సాహిత్యానికి ఒక అంగం మాత్రమే అయితే అది ప్రధానాంగం కావచ్చు

కాల్పనిక సాహిత్యం, కాల్పనిక కవిత్వం తెలుగు దేశంలో 1910 నుండి 1940 వరకు భావకవితోద్యమం పేరుతో అవిచ్ఛిన్నంగా సాగింది 1909 లో 'లలిత' కావ్యరచనతో ఈ కొత్త ఉద్యమాన్ని ఆవిష్కరించాడు రాయప్రోలు

సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, విశ్వనాధ సత్యనారాయణ, తల్లావఝల శివశంకరశాస్త్రి, నాయని సుబ్బారావు, బసవరాజు అప్పారావు, మల్లవరపు విశ్వేశ్వరరావు మొదలైన కవులు భావోద్రేకంతో, రసోద్వేగంతో రచనలు చేసి భావకవులుగా ప్రసిద్ధిపొందారు కాల్పనిక సాహిత్యంలో భాగంగా తెలుగులో నవల, కథానిక మొదలైన ప్రక్రియలుకూడా వచ్చాయని ఆర్. ఎస్ సుదర్శనం వంటి విమర్శకులు పేర్కొంటున్నారు గుడిపాటి వెంకటచలం రచనలను కాల్పనిక రచనలుగా, ఆయనను కాల్పనిక వాదుల్లో అతివాదిగా ఆయన పేర్కొన్నాడు ప్రేమ, శృంగారంతో పాటు సంఘ సంస్కరణ, స్వాతంత్ర్య సమర సందేశాలు, వినూత్న సమాజ స్వప్నం, సృజనాత్మకత, పురోగామి తత్వం మొదలైన అనేక భావలహరులు ఈ కాల్పనిక సాహిత్య సముద్రంలో ఇమిడి ఉన్నట్లు సుదర్శనం తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు ఆయన కాల్పనిక ఉద్యమంలోని రచనలను రెండు రకాలుగా విభజించాడు (1) గతపునరుద్ధరణ (revivalism of past) రచనలు రాచరికాన్ని, జమీందారీని, బ్రాహ్మణికాన్ని పునరుద్ధరించటానికి చేసిన విశ్వనాథ సత్యనారాయణ రచనలు ఇందుకు తార్కాణాలు ఒకపత్రికలో ''ఏ 'ఇజం' నిలుస్తుంది?'' అన్న ప్రశ్నకు 'ఏ ఇజం నిలవదు. ఒక్క వేదిజం (Vedism) తప్ప''- అని విశ్వనాథ సమాధానం చెప్పటం దీన్ని మరింత బలపరుస్తుంది రాయప్రోలులో కూడా గతకాల వైభవాన్ని స్మరించే రచనలు కనిపిస్తాయి (2) పురోగమన రచనలు-ఉన్నవ లక్ష్మీనారాయణ, అడవి బాపిరాజు, తుమ్మల సీతారామమూర్తి, వేదుల సత్యనారాయణశాస్త్రి మొదలైన రచయితలు జాతీయ భావాలు గలిగిన రచనలు చేశారని, జాతి ప్రజలు పురోగమించడానికి కావలసిన సంస్కరణలు ఆవిష్కరించే రచనలు చేశారని సుదర్శనం అభిప్రాయం

ఉద్దేశ్యాన్ని వదలివేసి ఆలోచనాగ్రంథి (thought complex) ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు తెలుగులో కాల్పనిక కవిత్వంలోని రచనలను అనేక శాఖలుగా వర్గీకరించవచ్చు ప్రణయ కవిత్వం, దేశభక్తి కవిత్వం, సంఘ

సంస్కారణ కవిత్వం, స్మృతికావ్య రచన మొదలైనవి ప్రధానంగా పేర్కొనవలసిన శాఖలు ఈ వర్గీకరణ స్థూలంగా సూచిస్తున్నట్లు తెలుగు దేశంలోని కాల్పనిక ఉద్యమానికి సాహిత్యానికి ఒక ప్రత్యేకత ఉన్నది ఈ ప్రత్యేకత తెలుగు జాతి జీవితంలోని ప్రత్యేక అంశాలవల్లగాని, తెలుగు ప్రజలు జీవించే సామాజిక సందర్భం వల్లగాని, బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా జరిగిన స్వతంత్ర సమరం, రాజకీయ చారిత్రక ప్రభావం తెలుగు దేశంలోని ప్రజలపైన ప్రసరించటంవల్ల గాని కావచ్చు బెంగాల్‌లో ప్రేమతత్వాన్ని బోధించిన చైతన్యుడి వైష్ణవమతం, పందొమ్మిదవ శతాబ్దం చివరి భాగంలో బెంగాల్‌లోని బ్రహ్మసమాజం, మైకేల్ మధుసూదనదత్, బంకించంద్రుల విశిష్ట రచనలు, 1905లో కర్జన్ కాలంలో జరిగిన బెంగాల్ విభజన, 1920లో ఉప్పెనలా దేశమంతా వ్యాపించిన సహాయ నిరాకరణోద్యమం-వీటన్నిటి ప్రభావం కొద్దిగానో, ఎక్కువగానో, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తెలుగు కాల్పనిక వాదంపై కనిపిస్తున్నది వీటన్నింటి ప్రభావంవల్ల తెలుగు కాల్పనికతకు ఒక ప్రత్యేకత, వైశిష్ట్యం చేకూరింది అయితే తెలుగు కాల్పనిక వాదంపై దాని ఉత్పత్తి వికాసాల మౌలిక ముద్రలు ప్రభావాలు ఐరోపాలోని కాల్పనికోద్యమానివే ఐరోపాలోని జర్మన్, ఫ్రెంచ్ కాల్పనిక వాదాల ప్రభావం తెలుగు సాహిత్యంపై చాలా తక్కువని చెప్పడం సమంజసమే ఇది ముఖ్యంగా భాషా పరిజ్ఞాన సమస్యగా కనిపిస్తున్నది తెలుగు వారు సహజంగా, సులువుగా ఇంగ్లీషు నేర్చుకొని హైస్కూలు దశలోనె ఇంగ్లీషు రాజకీయ తాత్విక సాహిత్య రచనలను కొంత మేరకు తెలుసుకోవడంవల్ల ఆంగ్ల కాల్పనిక వాదం ప్రభావమే ఎక్కువగా కనిపిస్తున్నది ఫ్రెంచ్, జర్మన్ భాషలు నేర్చుకోవడానికి బ్రిటిష్‌వాళ్ళ పాలనలో ఎక్కువ వసతులు ఉండేవికావు అంతేకాకుండా ఫ్రెంచి, జర్మన్ సాహిత్య రచనలు ఇంగ్లీషులోకి అనువదింపబడినవికూడా చాలా స్వల్పం ఈ కారణాల వల్లనే ష్లేగల్, గెటే, టీక్, నోవాలిస్ రూసో, లామార్టిన్, గాటియర్, విక్టర్ హ్యూగో, బాల్జాక్‌ల కంటె వర్డ్స్‌వర్త్ కాలరిడ్జ్, కీట్స్ బైరన్, షెల్లీ, స్కాట్ మొదలైనవారి భావాల ప్రభావం తెలుగు కాల్పనిక వాదంపై లోతుగా కనిపిస్తుంది

ఐరోపాలోని కాల్పనిక వాదం బహుముఖమైంది 1748లో ప్రారంభమైన ఇంగ్లీషు పారిశ్రామిక విప్లవం, 1789లో సంభవించిన ఫ్రెంచి రివల్యూషన్‌లతో ఐరోపా కాల్పనిక వాదం రాజకీయంగా, మతపరంగా, సామాజికంగా, సాహిత్యకంగా కొత్త సిద్ధాంతాలను, విశ్వాసాలను, విలువలను సృష్టించింది రూసో సమాజంలో వ్యక్తులకి స్వేచ్ఛ, సమానత సౌభ్రాతృత్వం ఉండాలని ప్రతిపాదించడంతో రాజకీయ తత్వభూమికలో ఒక కొత్త విప్లవం బయలు దేరింది వ్యక్తి పునాదిగా ఏర్పడి ప్రజాస్వామ్య సిద్ధాంతం బలీయమై పరివ్యాప్తి చెందింది వోల్టైర్ రచనలు కూడా ఇందుకు తోడ్పడ్డాయి మతపరంగా చూస్తే వోల్టైర్, కీట్స్, షెల్లీ మొదలైనవారు చర్చి ఆధిపత్యంలో ఉన్న భగవంతుడికి వ్యతిరేకంగా నిరీశ్వర వాదా (Atheism)న్ని ప్రచారం చేశారు సామాజికంగా చూచినప్పుడు సాంఘిక సౌధానికి మూల స్థంభం వ్యక్తి అని, వ్యక్తి భావాలు, అనుభూతులు నిబిడీకృత వాంఛలు సామాజిక ప్రగతికి దోహదం చేస్తాయనే వాదం- వ్యక్తి వాదం- ప్రత్యక్షమైంది చారిత్రకంగా చూస్తే బూర్జువా, పెట్టుబడిదారీ విధాన అభివృద్ధికి అనేక విధాలుగా ఇది తోడ్పడిందని చెప్పవచ్చు సామాజికంగా చూస్తే సాంప్రదాయకతా సూత్రాలకు, నియమాలకు, 'లక్షణసారాలకు' బంధీకృతమైన సాహితీఘకాన్ని సంపూర్ణంగా విముక్తిచేసింది కాల్పనికసాహిత్యం స్వేచ్ఛ, రసానుభూతి, అంతఃస్పందన, భావోద్రేకం, కల్పన, ఆకాంక్ష, సృజనాత్మకత, ప్రతిభ మొదలైన అంశాలతో కూడిన సిద్ధాంతాలు, ఆలోచనా నిర్మాణాలు (thought constructs) సృష్టించబడ్డాయి తాత్వికంగా చూస్తే కాల్పనిక కళాకారులు, తత్వవేత్తలు ఆర్థిక వ్యత్యాసాలకు, రాజకీయ అసమానతలకు అతీతమైన మానవతా వాదాన్ని ప్రతిపాదించారు వీటిని పరిశీలించిన తరువాత యూరప్‌లోని కాల్పనిక ఉద్యమం బహుముఖంగా శాఖోపశాఖలుగా వికసించిన ఉద్యమమని, దీనికి ఏకోన్ముఖ గమ్యమున్నదని చెప్పవచ్చు కాని తెలుగు కాల్పనిక వాదం ఇందుకు పూర్తిగా భిన్నంగా ఉన్నది ఇది కేవలం సాహిత్యానికి మాత్రమే పరిమితమై సాహిత్యంలో కూడా కవిత్వానికే ఎక్కువగా పరిమితమైన ఉద్యమంగా భాసిస్తున్నది కాబట్టి తెలుగులో కాల్పనికోద్యమ అధ్యయన, విశ్లేషణలు కాల్పనికకవి

త్వానికి లేక భావకవిత్వ ఉద్యమానికి మాత్రమే నిర్ణీతమై ఉన్నదని చెప్పవచ్చు అందుకే భావకవిత్వ ఉద్యమం ఉత్పత్తి వికాసాలు దాని పర్యవసానాలను ముందు పరిశీలిద్దాం

ఇంతకు పూర్వమే ఉల్లేఖించినట్లు తెలుగు దేశంలో భావకవిత్వ ఉద్యమం (1909-10)లో ప్రారంభమయింది యూరప్‌లో ఫ్రెంచి విప్లవం, పారిశ్రామిక విప్లవాలు కాల్పనిక వాదం ఉద్భవించడంలో ప్రధాన కారణాలుగా పనిచేశాయి అక్కడ కాల్పనికోద్యమ నిర్మాణంలో ఆర్థిక శక్తుల, రాజకీయ సిద్ధాంతాల, భావాల ప్రభావం ముమ్మరంగా ఉంది తెలుగు కాల్పనికోద్యమానికి ఇలాంటి వస్తుగత, సామాజిక పునాదులున్నట్లులేవు 1748 లో ప్రారంభమైన పారిశ్రామిక విప్లవం బ్రిటన్‌నుండి క్రమంగా 1780 నాటికి యూరప్‌లోని చాలా దేశాలకు ముఖ్యంగా - ఫ్రాన్సు, జర్మనీలకు వ్యాపించింది ఫ్యాక్టరీ నిర్మాణంవల్ల, యాంత్రిక ఉత్పత్తి వల్ల భూస్వామ్య ఉత్పత్తి విధానం తగ్గిపోయి యాంత్రిక ఉత్పత్తి విధానం పెరిగింది ఉత్పత్తి శక్తుల్లో మార్పు వచ్చినట్లే ఉత్పత్తి సంబంధాలలో కూడా మార్పు వచ్చింది భూస్వామ్య దశలోని శిష్ట వర్గాలు (Noble Classes) బలహీనమై, స్వతంత్ర రైతుల (free farmers)సంఖ్యఎక్కువైంది యూరప్‌లోని మధ్యతరగతివర్గాలు పెట్టుబడి సాహసాలతో యాంత్రిక నాగరితను వాడి, క్రమేపీ పెట్టుబడిదారీ వర్గంగా తయారైనారు మధ్యమ వర్గంలోని కొంతశాతం మంది ప్రజలే బూర్జువా వర్గంగా మారారు మిగిలిన మధ్యతరగతివాళ్లు తమ ఆశా నిరాశలను, ఆమోదఅధిక్షేపాలను రొమాంటిక్ ఉద్యమంద్వారా అభివ్యక్తీకరించారు కాని దీనికి భిన్నంగా అటు భారత దేశంలో కాని, ఇటు, తెలుగు దేశంలోగాని కాల్పనిక వాదానికి ఇలాంటి పునాది లేదు

భారత దేశంలో పారిశ్రామికీకరణ 1861 లో నాగపూర్‌లోని Empress Cotton Mills స్థాపనతో ఆరంభమైంది ఆ తర్వాత బొంబాయిలో కొన్ని నూలు మిల్లులు, 1880 లో బెంగాల్‌లో జనుపనార మిల్లులు స్థాపించబడ్డాయి

అలాగే 1910 నాటికి జెమ్షెడ్జీ టాటా నిర్మించిన చిన్న ఉక్కుకర్మాగారం ఉత్తర ప్రదేశ్, మహారాష్ట్రలలో ఖండసారీ చక్కెర ఉత్పత్తిని చేసే మిల్లులు కొన్ని మొదలైనాయి రైల్వేలు, రక్షణ ఆర్డినెన్సు కర్మాగారాలు కొన్ని నిర్మింపబడ్డాయి అలాగే దేశంలోని ఇతర ప్రాంతాలలో బొగ్గు గనుల ఉత్పత్తి, థర్మల్ విద్యుచ్ఛక్తి కార్యక్రమాలు చెపట్టడం జరిగింది ఏమైనా దేశంలో బ్రిటిష్ వాళ్ళ అనాసక్తి నిర్లక్ష్యంవల్ల పారిశ్రామికీకరణం మందకొడిగా సాగింది అంటేకాదు-దేశమంతటా ఉత్పత్తి విధానం భూస్వామ్యం చేతులో ఉంటటం, ఉత్పత్తిలో యంత్రాలను గణనీయ స్థాయిలో వాడకపోవటం, వ్యవసాయం ప్రధాన జీవిత వ్యాపసాయంగా ఉండిపోవటం గమనార్హమైన విషయం స్వాతంత్ర్యం వచ్చిన 36 సంవత్సరాల తర్వాత కూడా పెట్టుబడిదారీ విధానం ఆశించినంత స్థాయిలో అభివృద్ధి చెందలేదని, ఆర్థిక విధానం అర్ధ భూస్వామ్య వ్యవస్థగా, అర్ధ ధనస్వామ్య వ్యవస్థగా సాగుతున్నదని చాలా మంది అభిప్రాయ పడుతున్నారు భారతదేశంలో లాగే తెలుగు నాడులో కూడా సామాజిక ఉత్పత్తి సంబంధాలు భూస్వామ్య చట్రంలో సాగినవి వ్యవసాయం ప్రధాన జీవనాధారంగా ఉన్నా శ్రమఫల సాయం - కొద్దిమంది జమీందారుల, జాగీర్దారుల, ఇనామ్‌దారుల బోషాణాల్లోకి వెళ్ళిపోయేది హెచ్చుమంది, భూమి లేని రైతు కూలీలుగా ఉండేవాళ్లు గ్రామాలల్లో, పట్టణాల్లో వేరే వినియోగ వస్తువుల ఉత్పత్తి చేతి పరిశ్రమల (Handicrafts) ద్వారా కుటీర పరిశ్రమల (Cottage Industries) ద్వారా జరుగుతుండేది ఇలాంటి వ్యవస్థ 1910 వరకుదాదాపు సాగుతూనే ఉంది అయితే 1912-1918 లో మధ్య ఆంధ్రదేశంలో కొన్ని పరిశ్రమలు ప్రారంభమయ్యాయి బందరులో పంచదార ఫ్యాక్టరీ, రాజమండ్రిలో పేపరు మిల్లు, తాడేపల్లిగూడెంలో బట్టల మిల్లు ఇట్లా ఇంకా కొన్ని పరిశ్రమలున్నట్లు మద్దుకూరి చంద్రశేఖరరావుగారు రాశారు దీనివల్ల తెలుగుదేశంలో పారిశ్రామికీకరణ ఎక్కువగా జరగలేదని, భూస్వామ్య వ్యవస్థ ఆధిపత్యమే ఎక్కువగా ఉన్నదని మనకు విదితమవుతున్నది అంటే ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాలలో మౌలిక పరివర్తన లేకుండానే ఐరోపాలో అవతరించి

నట్లు ప్రధాన శ్రామిక వర్గం అవతరణ జరుగకుండానే, ఆర్థిక కారణాల వల్ల కాకుండా వ్యక్తుల విలువలు, మనోభివృత్తులనుండి ఆవిర్భవించింది కాల్పనిక ఉద్యమం. ఐరోపాలోని కాల్పనిక వాదానికి తెలుగు దేశంలోని కాల్పనిక వాదానికి రాజకీయంగా పెద్ద సామ్యమేమీ కనిపించదు. 1789 లో వచ్చిన ఫ్రెంచి రివల్యూషన్ లాంటి రాజకీయ భూకంపం భారతదేశంలోగాని, తెలుగు దేశంలోగానీ సంభవించలేదు. పందొమ్మిదవ శతాబ్దంలో భారతదేశంలో విశేషంగా పేర్కొనదగిన రాజకీయ సంఘటన 1857 లో జరిగిన సిపాయిలు తిరుగుబాటు. దీన్నే చరిత్రకారులు ప్రథమస్వాతంత్ర్యసంగ్రామం(First war of Indian Independance)గా పేర్కొన్నారు. ఝాన్సీరాణి, తాంతియాతోపే మొదలైన జాతీయవీరుల సాహస పోరాటాలు అనుశ్రుతంగా దేశంలో నలుమూలలు ప్రాకాయి. 1885 లో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపనతో జాతీయ వాదం మెల్లగా బలాన్ని పుంజుకొంది. సురేంద్రనాథ్ బెనర్జి, గోపాలకృష్ణ గోఖలే, యం. జి. రానడే, బిపిన్‌చంద్రపాల్, బాలగంగాధర తిలక్ మొదలైన జాతీయ నాయకుల జీవితాలు, సందేశాలు ఆనాటి విద్యావంతులైన మధ్య తరగతి ప్రజలపై, కళాశాలల్లో చదువుకునే విద్యార్థులపై ప్రగాఢ ముద్ర వేశాయి. జాతీయత వైపు వీరిని చైతన్యవంతులను చేసి ముందుకు నడిపించింది. 1905 లో జరిగిన బెంగాల్ విభజన 1920 లో జరిగిన సహాయ నిరాకరణోద్యమం మేధావులను, విద్యార్థులను, రచయితలను కదలించాయి. జాతీయ పోరాటాల ప్రభావం తెలుగు భావ కవిత్వంలోని ఒక శాఖ వారిపై-జాతీయ కవిత్వంపై స్థూలంగా ఉన్నదనేది నిర్వివాదాంశం.

ఇవికాకుండా కాల్పనికోద్యమంపైన సాంఘిక శక్తుల ప్రభావం కూడా ఉంది. పందొమ్మిదవ శతాబ్దంలో బ్రహ్మసమాజం లాంటి సంస్కరణ ఉద్యమ ప్రభావం భావకవుల ఆలోచనలలో, రచనలలో స్పష్టంగా గోచరిస్తుంది. బాల్య వివాహ బహిష్కరణ, వితంతు వివాహాల పునరుద్ధరణ, స్త్రీ విద్య, నిరాకార దేవతారాధన మొదలైన సంఘసంస్కరణలు బెంగాల్‌లో

బ్రహ్మ సమాజ ఉద్యమం నుండి వీరేశలింగం పంతులు ద్వారా ఆంధ్ర దేశంలో వ్యాపించాయి పతాకీభూతులైన వీరేశలింగం పంతులుతో పాటు చిలకమర్తి లక్ష్మీనరసింహం, రఘుపతి వెంకటరత్నంనాయుడు ప్రభావం భావ కవుల కావ్యాలపై కనిపిస్తున్నది అలాగే బెంగాలీ సాహిత్యం, బంకించంద్ర, రవీంద్రనాథ్‌ఠాకూర్‌ల రచనల ప్రభావం- అద్వైతం- వైష్ణవ భక్తివాదం యొక్క ప్రభావం కూడా భావకవులలోని ఒక శాఖకు చెందిన కవులపై, మార్మిక కవులపై చెక్కినట్లు కనిపిస్తున్నది

ఇవికాకుండా వ్యక్తిగతంగా రచయితలు కవులు తాము స్వకీయ చైతన్య ప్రపంచంలో అనుభవించిన మార్పుల ఫలితంగా, మిత్రుల సాంగత్యంవల్ల, పుస్తక స్నేహంవల్ల, నిజజీవిత అనుభవంవల్ల-భావ రసోద్రిక్తులై భావ కవిత్వం రాసినట్లు కానిపిస్తుంది భావ కవిత్వానికి ఆద్యులైన రాయప్రోలు సుబ్బరావు ''లలిత'' (1909) మిత్రుల ప్రోత్సాహం వలన రాసిందె రాయప్రోలు రాజమహేంద్రవరం కళాశాలలో విద్యాభ్యాసం చేస్తుంతగా చిలుకూరి వీరభద్రరావు, అత్తిలి సూర్యనారాయణ, గంట లక్ష్మన్న పంతులు మొదలైనవారు గోల్డ్‌స్మిత్ Hermit గీతాన్ని అనువాదం చేయమని బాగా ప్రోత్సాహించారు ఆయన భావ కవిత్వ ప్రతిభా లతకు నీరుపోసి దోహదం చేశారు అలాగే దువ్వూరి రామిరెడ్డి లక్షణ బద్ధమైన కవితా రచనను మానివేసి ఆత్మాశ్రయరీతి కవితా రచనకు ఎందుకు పూనుకున్నారో, కె వి రమణారెడ్డి ''కవి కోకిల'' గ్రంథంలో ప్రస్తావించారు ''దువ్వూరి మొదట రాసిన ఒకటి రెండు రచనలకు సరియైన సమీక్షలు రాలేదు లాక్షణికులు, పండితులు వీటిని చిన్న చూపు చూడటం జరిగింది కవిగా తాను పొందిన సన్మానావమానాలు ప్రారంభ కాలంలో అతనిని బలంగా తాకి, పండిత వ్యవస్థపట్ల, లాక్షణికులపట్ల నిర్బంధాలపట్ల తీవ్రప్రాకూల్యంగా ప్రతిఫలించాయి తత్పూర్వ సాహిత్య ధోరణులను నిరసించడం కొత్త రీతికి, సర్వసాధారణమైన ఆత్మాశ్రయ కవిత్వానికి లక్షణమైంది తన ఖండకావ్య సంపుటికి రామిరెడ్డి రాసిన ఉపోద్ఘాతం ఈ సత్యాన్ని ధ్రువీకరిస్తుంది'' అని రమణారెడ్డి ఉల్లేఖించాడు పైవిషయాన్ని ఒకె అంశాన్ని బలపరుస్తున్నాయి

తెలుగు కాల్పనిక ఉద్యమం, ముఖ్యంగా భావ కవిత్వం వస్తుగత సంస్కృతిలోని మార్పుల వల్ల కాకుండా, సాంఘిక ఉత్పత్తి శక్తులలో సంబంధాలలో వచ్చిన మార్పుల వల్లకాకుండా, సామాజిక పునాదిలోని ఆర్థిక రాజకీయ కారకాలవల్ల కాకుండా, పైకట్టడంలోని సంస్కృతి- చైతన్యం (consciousness) కారకాలవల్ల, రచయితల మానసిక జగత్తులో సంభవించిన ఆనంద,విషాద, సంయోగ, వియోగ, సంక్షోభ, ప్రశాంత, సుందర, వికార, (ugly) భావ తరంగాలు, వాస్తవికతను ఢీకొన్నప్పుడు దానివల్ల జనించిన భావచిత్ర సముచ్చయంగా మాత్రమే కనిపిస్తుంది తార్కికంగా దీని ఫలిత మేమిటంటె ఇలాంటి సాహిత్యం వాస్తవికతను ప్రతిబింబించకుండా, వాస్తవానికి దూరంగా రచయితల అంతర్లోకాన్ని, అనుభూతిని, అభివృత్తుల్ని ఈహను, ఊహను, స్వాప్నికతను, సౌందర్యాన్ని సంకేతిస్తుంది

1797 తో కాల్పనిక ఉద్యమం ఐరోపాలో ప్రారంభమైతే 110 సంవత్సరాల కాలవ్యత్యాసంతో 1909 లో రాయప్రోలు సుబ్బరావు గారి **లలిత కావ్యం** ప్రచురణతో తెలుగులో ప్రారంభమైంది లలిత కావ్యానికి మొదట్లో పెద్ద ప్రజాదరణ లభించలేదు అలాగే 1910 లో రాయప్రోలు టెన్నిసన్ 'డోరా' కావ్యాన్ని 'అనుమతి' అనే కథా కావ్యంగా తెలుగులో రాశాడు కాని ఇది ఎవరి దృష్టిని ఆకర్షించలేదు 1912 లో భావుకత, స్వంత ఆలోచన, సృజనాత్మకత కలిగిన తృణకంకణ కావ్యాన్ని ప్రచురించాడు దీనితో నవ్య సాహితీ స్రష్టగా ఈయనకు స్థానం లభించింది తృణ కంకణంలోని కథా సంవిధానం, కథా ఎత్తువు, భాష, శైలి, లలిత మధుర పదబంధాలు మనసుకు చాల ఇంపుగా ఉంటాయి ఇందుతో కవి వియోగ మాధుర్యాన్ని అమలిన శృంగారాన్ని ప్రతిపాదిస్తాడు ప్రేమబంధాలు తెగదెంపినా తెగవని, కలిసిన యంతనే చెలికారం కాదని, అంతరంబుల నతుకంగ జాలిన అపూర్వపు లంకెయే స్నేహమని ప్రేయసి నాయకుణ్ణి ఓదారుస్తుంది యువకుడు తన ప్రేయసికి మును పెన్నడో కట్టిన పట్టుబట్ట విడదీసి గడ్డిపోచలతో కట్టిన తృణ కంకణాన్ని తమ ప్రేమకు లాంఛనంగా కట్టి 'సోదరీ' అని పిలుస్తాడు ఈ కథలో సంభాషణలు చాలా

తాత్త్వికస్థాయిలో జరగడం అసహజంగాను, అశారీరక ప్రేమ అపరిష్కృతంగాను కనిపిస్తుంది ప్రేయసిని సోదరీ అని సంబోధించటం సామాన్య పాఠకుడికి చాలా ఇబ్బందిగా, అసహ్యంగా కనిపిస్తుంది ఈ కృత్రిమ భావుకతకి ఆదర్శ విధానానికీ కారణం ప్రేయసి సౌందర్యాన్ని ఆమె శరీరం నుండి వేరు చేయటం, సంయోగానికి బదులు వియోగం ద్వారా మానవుడికి అతిశయ ఆనందం లభిస్తుందని సందేశ మివ్వడం, సిద్ధాంతీకరించడం

కవితా వస్తువులో రాయప్రోలు కొత్త పుంతలు తొక్కారని చెప్పడానికి "తృణ కంకణా"న్ని, 'కష్టకమల'ను పేర్కొనవచ్చు అలాగే స్మృతి గీతా (Elegies) లకు వీరే మార్గదర్శకులని తెలుస్తుంది గోఖలే నిర్యాణం తర్వాత ఈయన రాసిన పద్యాలు ఆనాటి సమాజాన్ని కదిలించి వేసింది అలాగే రాధాకృష్ణుడు, రవీంద్రుడు, రామలింగారెడ్డి, గిడుగు సీతాపతి మొదలైన వారి గురించి ప్రశంసా గీతాలు, స్మృతిగీతాలు రాశాడు పులి ఆకుపై పద్యాలు రాయడం కూడ వీరి వస్తు నవ్యతలోని విశిష్టతకు తార్కాణం వస్తువే కాకుండా భావంలో కూడ కొత్తదనం తీసుకవచ్చాడు 'పూలపాలు, సుమములు బాలెంత రాండ్ర పోల్కి' అనే భావన, పున్నమ రాత్రులను 'పండు వెన్నెలజున్ను బాలు చేసినరేయి' అనటం నవ్య ప్రయోగాలకు ఉదాహరణలు వస్తు భావాలతో పాటు ఈయన రచనలో కూడ ప్రసాద మాధుర్యాలు కనిపిస్తాయి పదాల అల్లికతో భావాలను నడిపించడం నిజంగా వీరిలోని ప్రత్యేక కళ రాయప్రోలు 'కష్టకమల' 'స్వప్నకుమారము' 'స్నేహలత' మొదలైన చిన్నకావ్యాలనురాసి భావకవిత్వావిర్భావానికి కృషి చేశాడు భావకవిత్వం ఒక కొత్త ఉద్యమం కావడంవల్ల తాను ప్రతిపాదించిన కొత్త భావసిద్ధాంతాలను సనాతనులు, సాంప్రదాయికులు వ్యతిరేకించకుండా వీటికి ప్రాచీన సాహిత్యంలో ఆధారాలు ఆలంబనలు కల్పించాడు ఇలా కల్పించటంవలన భావకవిత్వానికి, ప్రాచీన లక్షణ శాస్త్రానికి వైరుధ్యమేమీ లేదని, భావకవిత్వం పాత కొత్తల మేలు కలయిక అని, అది గతాన్ని భవిష్యత్తును కలిపే రసవారధి అని

ఒక అభిప్రాయాన్ని కల్పించాడు రాయప్రోలు ఇందుకోసం 'రమ్యాలోకము' మాధురీ దర్శనము'' మొదలైన సిద్ధాంత గ్రంథాలు రచించాడు కొన్నాళ్ల భావ కవిత్వానికి వ్యతిరేకంగా పాతకాలపు కవులు పండితులువిమర్శపు దుమారాలులేపినా కాలక్రమేపి భావకవిత్వ ఉద్యమం సాంప్రదాయికతను సమూలంగా విధ్వంసం చేయదనే విశ్వాసం కలిగిన తర్వాత చాలమంది ప్రాచీనులు భావకవిత్వాన్ని ఒక సంస్కరణ ఉద్యమంగా భావించి, సాహిత్యకులు నియమాల్ని కొన్నాళ్ళు తప్పినా తుదకు భావ కవి అస్తిత్వాన్ని, దాని తుంబనలనే స్వీకరిస్తున్నాడని భావించి కలహ విమర్శ్కరణ మానివేసి తమలో కలుపుకొన్నారు నిజంగా ఇది జరుగ వలసిన మాటకాదు ఎందుకంటె రాయప్రోలు అమలిన శృంగారం, విషాద మాధుర్యం, సౌందర్య ఆనందరిస సిద్ధాంతాలు ప్రాచీనతా నియమాలను సంపూర్ణంగా వ్యతిరేకించేవే కాని రాజీ కుదరని వైరుధ్యాల మధ్య సంప్రదాయ మౌలిక అస్తిత్వానికి, అభివ్యక్తీకరణకు చేటు తగలనంతవరకు సాంప్రదాయికులు ఎటువంటి ధోరణులు సహిస్తున్న విషయం మనకు చరిత్ర చెబుతూనే ఉంది బుద్ధుని మన దశావతారాలలో ఒకనిగా మార్చుకొన్నాం కదా! రాయప్రోలు ఈ ప్రయత్నం వల్ల సాహిత్య ఔన్నత్యం ఆయిన కవిత్వానికి కల్పించబడింది అటు తరువాయి తరం వారికి భావకవిత్వాన్ని కవిత్వంగా సమర్థించుకోవలసిన దుర వస్థ తప్పింది అందుకె చాలమంది కవులు రాయప్రోలు భావాలతో, సిద్ధాంతాలతో ప్రభావితమై నిరాటంకంగ రచన సాగించారు వీరిలో ప్రతిభావ్యుత్పత్తులున్న కవుల రచనలు తెలుగు సాహిత్యంలో అలంకారయోగ్యమైన స్థానాన్ని అందు కున్నాయి రాయప్రోలు గురించి కొంత విపులంగా రాయడానికి కారణం ఆయన ఈ ఉద్యమానికి ఆద్యుడు కావటమే ఆయన తరువాత వచ్చిన అనేక మంది కవుల రచయితల కృతులను ఇక్కడ పరిశీలించటం కుదరదు ఈ వ్యాసం యొక్క ఉద్దేశ్యం కూడా అది కాదు అందుకే ముందు భావకవిత్వ లక్షణాలను పరిశీలించి దెబ్బతో వ్యాప్తికోద్యమం వల్ల కలిగిన ఫలితాలను తులనాత్మకంగా పరిశీలించటమే ఇక్కడ ప్రధాన ఉద్దేశ్యం

కవిగా భావకవి స్వేచ్ఛాపరుడు అతడు అనంత స్వేచ్ఛావాది లేశమాత్రం సామాజిక నియంత్రణను సాహిత్య నియమాలను ఇష్టపడడు అందుకే తన

మానసిక జగత్తులోని ఆనంద గవేషణకే ప్రాధాన్యత నిస్తాడు ఒకటి స్ఫీతమైన ఆవేశాలను, రసోద్వేగాన్ని భావచిత్రాలుగా కాల్పనిక ప్రతీకలుగా ఒప్పు రస ప్లావిత శబ్ద జాలంతో అభివ్యక్తీకరించి ఆనందిస్తాడు ఆత్మానందమే పరమ ధ్యేయం విశ్వశ్రేయస్సు సామాజిక అభ్యుదయింతో అతనికి పనిలేదు తన పాట తనలోనే పాడుకొంటాడు సామాజిక ఆమోద, అసమ్మతులతో కవికి పని లేదు ఈ భావాన్ని ''నవ్వి పోదురుగాక నాకేమి సిగ్గు, నా ఇచ్ఛయే గాక నాకేటి వెరపు అని కృష్ణశాస్త్రి వివరించారు ఇలా చెప్పినటువంటి తీరు భావ కవితా సంప్రదాయానికి ఆటు తర్వాత గర్వించదగ్గ వారసత్వంగా తయారయింది దీని వల్ల కవిత్వం కవి యొక్క ఆనందం కొరకె కాని వేరే కాదని, కళా వితరణ కళ కొరకేనని, కళ పరమావధి కళాంతరసీమల్లో దాగి ఉందని, దీనికి బయటి శ్రోతలతో అభిమానులతో సంబంధం మృగ్యమని తెలుతుంది ఇలాంటి స్వేచ్ఛా వాదం 'నేను' అనె రచయిత 'నువ్వు' అనే సమాజం లేని వ్యక్తి వాదానికి దారి తీస్తుంది ఇది కొద్దిగా పట్టాయి తప్పితే సాహిత్యంలో, కళతో తాత్విక అరాచ కానికి (Philasophical Anarchy) దారి తీస్తుందంటే ఆశ్చర్యమేమీ లేదు

ఆత్మాశ్రయ రీతిగా కవిత్వాన్ని రాయటం అభివ్యక్తీకరించటం భావ కవిత్వపు లక్షణాల్లో ఒకటి కావ్యంలో, ఖండ కావ్యంలో, గీతంలో అన్నిటిలో కర్త (Actor), నాయకుడు (Hero) కవే ఈ కవి అహం (Ego or Iness) అన్ని సందర్భాలలో, విషయాలలో ప్రబలమైన నేను (Dominent 'I') గా, మిగిలిన లోకం-సమాజం అందులోని వస్తువులు (objects) ఇత రాలు (The other)గా వ్యవహరించబడుతుంటాయి కవి ప్రేయసి, ఊహా ప్రేయసి కూడా ఇతరుల (The other)లో లెక్కింపబడుతుంది అయితే తన ప్రేయసిపట్ల అపారమైన అనురాగాన్ని, ప్రేమని, పూజ్యభావాన్ని, కృతజ్ఞతా భావాన్ని ప్రదర్శించడం కద్దు కాని ఈ ఊహా ప్రేయసి కూడా కవి తన కలం బలం ద్వారా ఇంద్రజాలం ద్వారా నిర్మించిన కాల్పనిక వస్తువే (Imaginative object) అంటే కవిత్వంలో కన్పించే 'నువ్వు' కూడ 'నేను'చే సృష్టించ

బడిందే కవి. భావ కవిత్వంలో తానే కర్త (Pet-Actor) గా, తానే కర్మ (object)గా కూడా రెండు రూపాలలో కనిపిస్తాడు. అసలు ఇందులోనే ఉంది భావ కవిత్వ వైఖరి. భావ కవిత్వంలో కవి సామాన్య లౌకికుడు కాదు. అతడు తనకు తాను ఊహించుకొన్న ఒక అసాధారణ వ్యక్తి. తన అంతరంగానికి, తన అనుభూతికి అమితమైన ప్రాముఖ్యాన్నిస్తూ తనకు తాను మామూలు సమాజపు హద్దులను అతీతుడుగా ప్రత్యక్షమౌతుంటాడు.

''ఎవ్వరని ఎంతురో నన్ను ?
ఏ ననంత శోక భీకర తిమిర లోకైక పతిని''

అని భావిస్తాడు.

ఆత్మాశ్రయ రీతిలోని ఇంకొక్క అంశం కవి తాను పొందే అనుభూతులను, ప్రణయ భావోద్రేకాలను సహజమైనవిగా చిత్రించడం. కవి మానసిక జగత్తు అంతరాంతరాల నుండి వెల్లువికే స్రోతస్విని ప్రణయమైనట్టు, ప్రేమించే వస్తువుకు ప్రేమికుడికి మధ్య కార్య కారణ సంబంధం లేనట్టు, ఎలాగైతే ప్రకృతి సమస్తం ప్రేమమయమైందో అలాగే కవికూడ ప్రేమమయుడై తన అంతరంగంలోని భావాలను ప్రేయసి పట్ల అభివ్యక్తీకరిస్తాడు. కృష్ణశాస్త్రి కృష్ణపక్షంలో ఇలా అన్నాడు.

''సౌరభము లేల చిమ్ము పుష్పవ్రజంబు
చంద్రికల నేల వెదజల్లు చందమామ
ఏల సలిలంబు పారు గాడ్పేల విసరు
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను''

కృష్ణశాస్త్రి యొక్క ఇలాంటి ఆత్మాశ్రయ కవితకు షెల్లీ ప్రేరణ ఉంది. షెల్లీ Loves philosophy లో కొన్ని పాదాలను పైన పేర్కొన్న గీతంలో పోల్చి చూస్తే ఈ ప్రభావం కృష్ణశాస్త్రిపై ఉన్నట్టు విమర్శకులు పేర్కొంటారు. ప్రకృతిని ప్రేమించడం, ప్రకృతి సౌందర్యాన్ని కన్నుల పండుగగా చిత్రించడం, ఆనందించడం, ప్రకృతిని అనంత శక్తిగా ఆరాధించడం, ప్రకృ

తితో కవి తాదాత్మ్యాన్ని ప్రగాఢంగా వాంఛించడం - ఇవన్నీ భావ కవిత్వంలో కనిపించే విశిష్టమైన అంశాలు కృష్ణశాస్త్రి "ఆకులో ఆకునై పువ్వులో పువ్వునై" గీతంలో కవికి ప్రకృతి పట్ల గల ప్రేమ, ఆరాధన, తాదాత్మ్యం మొదలైన భావాలన్నీ ప్రకటించబడ్డాయి అంతేకాకుండా ప్రకృతి కాల్పనిక సౌందర్యం కూడ మనోహరంగా చిత్రించబడింది ఉదాహరణకు -

- "గల గలా వీచు చిరుగాలిలో కెరటమై
జలా జలా పారు సెలయేటి పాటలో తేటనై"

అనే పంక్తిలో కవి ప్రకృతి పట్ల తనకున్న ఆరాధానా భావాన్ని, కృతజ్ఞతా భావాన్ని ప్రకటిస్తున్నాడు

"ఆకలా దాహమా చింతలా వంతలా ఈ కరణి వెర్రినై ఏకతమ తిరుగాడ" అనే చరణంలో కవి ప్రకృతి ఆనందదాయినిగా భావిస్తూ దానితో తాదాత్మ్యాన్ని కోరుతున్నాడు

భావ కవిత్వంలో ఇంకొక ప్రధాన అంశం ప్రణయం ఈ ప్రణయం స్త్రీ పురుషుల మధ్య ఉండే ఆకర్షణ ద్వారా, సాంగత్య సాన్నిహిత్యాల ద్వారా కాకుండా అశరీర స్థాయిలో, ఆత్మ స్థాయిలో జరిగే క్రియా విశేషంగా వర్ణించబడింది ప్రేమ వాంఛా పూర్తి ద్వారా పొందే శృంగారం, అనుభవం, ఆనందం తుచ్ఛమైనదిగా, హీనమైనదిగా భావ కవులు చిత్రించారు వీరు ప్రణయాన్ని ఒక అమూర్తతత్వంగా, మార్మిక వేదాంతంగా రూపొందించారు దువ్వూరి రామిరెడ్డి కడపటి వీడ్కోలులో—

"ఎంత పుణ్యంబు చేసెనో ఈ స్రవంతి
ప్రేమ వాంఛల రెంటి జీర్ణించుకొనగ" అని తమ కావ్యాన్ని అంతం చేస్తాడు ఇలా కవి వారిద్దరి ప్రేమ వాంఛారిక్తతను ఋజుపరుస్తూ మానసిక, తాత్విక (Intellectual & Philosoph cal) శృంగారాన్ని ప్రతిపాదిస్తూ

న్నాడు అలాగే రాయప్రోలు సుబ్బారావు కూడా తృణ కంకణములో తన శృంగార భావనను ఇలా చెప్పాడు

''సరస సాంగత్య సుఖవికాసముల కన్న
దుస్సహ వియోగ భరమే మధురము సకియ''

ప్రణయం గురించి ఇలా వ్రాయడంలో భావ కవులు కృతకమైన కాల్పనికమైన ప్రణయాన్ని సృష్టించ గలిగారు ఈ ప్రణయం ఆదర్శవంతమే కాకుండా, అవాస్తవికం కూడా మామూలు జీవితంలో స్త్రీ పురుషులు ఒకరి నొకరు ప్రేమించు కొన్నప్పుడు వారి మనోభావాలతో పాటు శరీరం కూడ అవిభాజ్య వస్తువుగా ఉంటుంది శరీర హృదయ ద్వైవిధ్యాన్ని ఆలంబన చేసుకొని ప్రణయ ప్రక్రియలోని ఒక పాక్షిక సత్యాన్ని సంపూర్ణ సత్యంగా చూపించే కవి ప్రయత్నం అనామోద యోగ్యమే కాదు, అవాంఛనీయం కూడా

భావ కవిత్వంలోని కాల్పనిక శృంగారంలో భాగంగా ప్రతి కవీ తనకు ఒక ఊహా ప్రేయసిని సృష్టించుకొన్నాడు ఒక కవికి ప్రేయసి స్వప్నలోక రాజ్ఞిగా కనిపిస్తే మరికొందరికి 'సుధా బాల'గా, 'మధుర ప్రమీలగా' 'శశికళ'గా, 'ఊర్వశి'గా భాసిస్తుంది. భావ కావ్యాలలో ఈ పాత్రల వర్ణన, ప్రవర్తన నేల విడిచిన సాములాగ అసహజంగా అర్థరహితంగా ఉంటుంది ఎందుకంటే, ఈ పాత్రలు ఊహా కల్పిత కథనాల ద్వారా, ఇతరుల అనుభవాల ద్వారా తాము చదివిన పుస్తకాల్లోంచి సృష్టించబడ్డాయి కాని నిజ జీవితం నుండి వ్యక్తులతో సమాజంలో జరుగుతున్న సహకార సంఘర్షణల ద్వారా జనించిన సజీవ పాత్రలు కావు వీటికి కండ రక్త మాంసాలు లేవు కావ్యాల్లో ఈ పాత్రల సంభాషణ నడవడి కవి విశ్వసించిన భావాలకు అధీనంగా నడుస్తుంటాయి నడిపించబడుతుంటాయి భావ కవిత్వంలోని నాయుడు బావలు, రాధా కృష్ణులు మొదలైన పాత్రలు ఊహాజనితాలై ఉండడం వల్ల వీరు మాట్లాడే భాష, వాడే శబ్దాలు వాస్తవానికి దూరంగా, అలక్ష్యవంతంగా ఉంటాయి

సెలయేరులు, మలయానిలాలు, పాల వెన్నెలలు, నిశ్వాస తాళవృంతాలు, దుఃఖపు నిధులు, మధుకీలలు, వియోగ మధురిలు ఇవే ఈ సాహిత్యమంతా పునరావృతమవుతుంటాయి కొంతమంది భావకవులు జానపద బాణీలను ఉపయోగించి, జానపద భాషను అనుకరించి అది ప్రజలకు చాల దగ్గర కవిత్వమని భావించారు నండూరి సుబ్బారావు వాడిన నుడికారాలను, పద బంధాలను, జానపదులు సామాన్యంగా వాడరు వాళ్ళు తిన్నగా సరళంగా ఆలోచిస్తారు కాబట్టి క్లిష్టమైన ప్రతీకలు, మార్మికభావాలు వాడలసిన అవసరముండదు కాని నాయుడుబావ చెప్ప దల్చుకొన్న భావాలు దాని కనుబంధంగా వాడిన భాష జానపద ప్రజానీకానికి చాల దూరమైందని చెప్పడంలో సందేహం లేదు

''ఆరిపేయవే దీపము'' అనే గీతంలో గీతం సమాప్తి చరణంలో సుబ్బారావు ఇలా అంటాడు ''సూపులే ఆపేసి రూపు ఊసెమరిసి ఒకరెరుగ కింకొరు ఒరిగి నిదురోదాము '' దీనిలో కవి తన ప్రేమ తాదాత్మ్యాన్ని, శృంగారాన్ని జానపద భాషలాంటి భాషలో చెబుతున్నాడు- విషయం ఉదాత్తమైంది దానికి వాడిన భాషాసాధనం శిష్టజన భాష పల్లీయుల జానపదుల భాషలాగ భ్రమింపజేస్తుంది అలాగే ఇంకో గీతంలో సుబ్బారావు ఎంకితో "తెలివి రానియ్యకే కల కరిగిపోతాది ఒక్క నేనే నీకు పెక్కునీవులు నాకు' అంటాడు దీనిలో చెప్పబడిన భావం జానపదుల భాషకి, భావనకి చేరువలో ఉండే విషయం కాదు ''ఒక్కనేనే నీకు పెక్కునీవులునాకు'' అనేది తాత్వికమైన, మార్మికమైన భావన ఇది చాల పరిణత మనస్సు (Mystic) ఆలోచనలను సూచిస్తున్నది ఈ రకం తత్వగీతాలు మనకు జానపదుల్లో కనిపించవు

భావ కవిత్వంలోని ప్రణయంలో విరహం, వియోగం, విషాదం మొదలైనవి ప్రబలంగా కనిపిస్తాయి ఈ feelings వల్ల కలిగే బాధను, తపనను వీరు పరాకాష్ఠకు తీసుకెళ్ళి దాన్నొక యోగకళగా, అద్వైత సంజ్ఞగా మార్చివేశారు శోకతప్తమైన బాధ బాధగా ఉండకుండా ఒక అపూర్వ ఆనందానుభూతిగా తయారు చేశారు భావకవులు భావుకత అనే అల్కెమీ (Alchemy)

ద్వారా విషాదా (tragedy)న్ని వాంఛనీయమైన కళగా ఆనందంగా చూపించారు వారు "కంటి రెప్పలు మింటికప్పుల నంటిపోయె నిరీక్షణంబున ఫాలతలమున రక్తనాడులు భగ్గు భగ్గన మండుతున్నవి'' అని మల్లవరపు విశ్వేశ్వరరావు మధుకీలలో విరహ బాధను గానంచేస్తే, కృష్ణశాస్త్రి తన విషాదస్థితిని ''దుర్భర శోక విషమగీతం ఏడ్చిపైతు ఎలుగెత్తి ఏడ్చిపైతు" అని పాడుకొన్నాడు విషాదాన్ని కవిత్వంలో ఇంత ధారాళంగా విశృంఖలంగా ప్రయోగించటం భావ కవులలోనే జరిగింది పీటి వెనుక కీట్స్, షెల్లీం ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది మొత్తంమీద భావకవులు దుఃఖానికి ఒక కమనీయ స్థితిని, విషాదానికి మాధుర్యాన్ని కల్పించి దుఃఖంలో ఉండడంలో, విషాదంలో బ్రతుకటంలో, బాధల్లో ఉచ్ఛ్వాస నిశ్వాసాలు పీలుస్తూ తేలటంలో, సోలటంలో ఒక అపూర్వమైన ఆనందం ఉన్నట్టు ప్రకటించారు వీళ్ళు Malancholy tragedy ని కళాకారుడు అందుకో వలసిన చరమ దశగా, దుఃఖాన్ని ఉత్కృష్ట రసంగా చిత్రించడానికి ప్రయత్నించారు ఈ అంశాన్నే కృష్ణశాస్త్రి ''నాకు నిశ్వాస తాళవృంతాలు కలవు, నాకమూల్యమపూర్వ మానందమొసగు నిరుపమ నితాంత దుఃఖపు నిధులు కలవు" అని ప్రకటించాడు.

భావకవుల బాధలోని తీపిని, ఏడ్పులోని ఊరటను ఎక్కువకాలం ఆనందించ లేరని వారికృతుల ద్వారానే మనకు విశదమౌతుంది బాధ శోకం ఎక్కువై నప్పుడు వాటిని మనిషి భరించలేక శక్తివిహీనుడైనప్పుడు తనలో నిరాశా నిస్సహాయస్థితుల ప్రకోపిస్తాయి జీవితం చీకటి కూపంలా జగత్తు అంధకార బంధుర గోళంలా కనిపించి వీటన్నిటికీ కవి తనే మూర్తీభవిస్తున్నట్లు వ్యాకులంగా గానం చేస్తూంటాడు దీనికి ఉదాహరణ 'ప్రవాసం'లో కృష్ణశాస్త్రి అన్న ''నాకుగామలు లేవు, నాకుషస్సులు లేవు, నేను హేమంత కృష్ణా నంత శర్వరిని'' అన్న మాటలు తన చీకటి బ్రతుకు ఆశాలతలు పుష్పించని జీవితం మరింత దుర్భరమైనప్పుడు "నామరణశయ్య పరచుకొన్నాను నేనే'' అని విపరీత నిరాశా వాదాన్ని (Extinct Pessimism) ప్రకటిస్తాడు కవి ఈ చరణంలో నిరాశే కాకుండా మృత్యు ఆకాంక్ష (Death wish) కూడా కనిపిస్తుంది

మనోవిజ్ఞాన విశ్లేషణ శాస్త్ర (Psycho-analysis) దృష్ట్యా ఒక కవి ఈ విధంగా చేసిన అభివ్యక్తీకరణ అతని రుజాగ్రస్తమైన మానసిక స్థితిని తెలుపుతుంది

భావకవిత్వంలో కనిపించే ఇంకొక విశేషమైనఅంశం స్వేచ్ఛాప్రియత్వం కవి రచనలలో విశృంఖలమైన స్వేచ్ఛా వాదిగా కనిపిస్తాడు స్వేచ్ఛ సహజసిద్ధమైన భావనగా సృష్టిలోని ప్రాణులు,అప్రాణులులాగా కవికి ఈ స్వేచ్ఛ అనేది ఆజన్మ సిద్ధంగా ప్రాప్తించే లక్షణంగా మానవుడి అవిభాజ్య ప్రకృతిగా గోచరిస్తుంది అందుకే కృష్ణశాస్త్రి ఇలా అంటాడు-

"పక్షినయ్యెద జిన్ని ఋక్షమయ్యెదను
మధుపమయ్యెద చందమామ నయ్యెదను
మేఘయ్యెద వింత మెరుపునయ్యెదను
పవన మయ్యెద వార్ధిభంగమయ్యెదను"

కాని కవి తన స్వేచ్ఛను ప్రణయ స్వేచ్ఛను నిరంకుశంగా అనుభవించ లేదు ఎందుకంటే భావకవి నిర్మించుకున్న స్వేచ్ఛా భావన సమాజ వ్యవస్థ నిర్మాణానికి పూర్వం ఉన్న ప్రాకృతిక దశ (State of nature) లోనిది నాగరికతా సమాజంలోని వ్యక్తిస్వేచ్ఛ సాంఘిక నియమాలకు, కట్టుబాట్లకు లోనై ఉంటుంది ఇలాంటి నియంత్రిత స్వేచ్ఛ భావకవులకు గిట్టదు వీరిస్వేచ్ఛా భావన "Man is born free but he is found in chains every very where" అన్న రూసో స్వేచ్ఛాభావానికి దగ్గరగా ఉంది ఈ శృంఖలాలు నాగరిక సమాజం సృష్టించినవే అందుకే భావకవిత్వంలో కవి సమాజానికి, లోకానికి వ్యతిరేకంగా తన అసమ్మతిని బాధను వ్యక్తం చేస్తాడు ఈ బాధనే-

"పక్షినని పాడగలనని ప్రణయవీధి
పక్షముల దూల్చి బంధించి పంజరాన
గానముసు ప్రాణముసు హరింపబూనినారు"

అని కృష్ణశాస్త్రి వ్యక్తం చేశాడు అంతేకాదు ఈ లోకపు నియమాల నుండి కవి పారిపోవటానికి ప్రయత్నిస్తాడు అలాంటి పలాయనం వల్లనే కవి సంపూర్ణ స్వేచ్ఛ లభిస్తుందని అతని విశ్వాసం, ఆశ దాన్నే అర్నాల్డ్ హాజర్ పలాయన వాదం (Flight frcm Reality) అన్నాడు అంటే భావకవుల స్వేచ్ఛావాదం ఒకరకంగా పలాయన వాదం అన్నమాట

భావకవిత్వంలోని ఆవేదన, రోదన, నిరసన సామాజిక నిర్మితిలో మార్పులు ప్రేరేపించడానికి బదులు వ్యక్తిలో ఆత్మగ్లానిని, నిర్లిప్తతను సృష్టి స్తాయి ఎందుకంటే, భావకవుల స్వేచ్ఛ-స్వేచ్ఛా కాముకత్వం కేవల కల్పన మాత్రమే

వస్తు విషయంలో భావ కవిత్వం వైవిధ్యాన్ని సృష్టించింది ప్రబంధ యుగంలో అటు తరువాత హీన ప్రబంధ యుగంలో మామూలు జీవితాన్ని కావ్యవస్తువుగా తీసుకోకుండా సోమయాజుల,రాజుల, జమీందారుల ఇతివృత్తాలనే కథా వస్తువులుగా తీసుకొన్నారు దీనికి భిన్నంగా భావ కవిత్వ యుగంలో దువ్వూరి రామిరెడ్డి 'కృషీవలుడు'-పింగళి-కాటూరి,'పొన్నచేను''తొలకరి' మొదలైన కావ్యాలు పల్లెటూరి జీవితాన్ని ప్రకృతిని చిత్రించటం జరిగింది పల్లెటూరి జీవితం చాలా సుఖవంతంగా, అక్కడి ప్రజలు అమాయకంగా, కలహాలు, వైషమ్యాలు, కక్షలు లేని ఆదర్శ జీవులుగా, అక్కడి ప్రకృతి మనోహరంగా, రామణీయకంగా చిత్రించబడినాయి నిజానికి కొందరు సామాజిక శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం ఆ నాటి గ్రామాలలో జమీందారీ నిరంకుశత్వం, ఉమ్మడి కుటుంబ సామ్రాజ్య ఆధిపత్యం, కులతత్వ కక్షలు, మురా రాజకీయాలు మొదలైన అనేక అవాంఛనీయ సామాజికధోరణులు ఉండేవని తెలుస్తున్నది వాస్తవికతలోని ఈ నలుపు రంగు చిత్రాన్ని వెన్నక్కినెట్టి, పై భాగంలో ఉన్న తేజోవంతమైన పల్లెటూరి జీవితాన్ని ప్రకృతిని ప్రజలను అభివర్ణించారు భావకవులు ఆదర్శవంతమైన పంథాలలో ఈ విధంగా రచనలు చేసి వాస్తవికతను గుర్తుపట్ట రానంతగా చెరిచారంటే అతిశయోక్తికాదు

ఆదిలో భావకవిత్వం సాంప్రదాయికత (Classicism)కు వ్యతిరేకంగా వచ్చిన ఉద్యమం వస్తుపరమైన, భావపరమైన నిగళాలను త్రెంచివేసి, పాఠకులకు అందుబాటులో ఉండే శైలిలో భాషలో కళాసృష్టి చేసి, తన ప్రేరణను అనుభూతిని కవితా రూపంలో పాఠకులకు నేరుగా అందించడమే భావకవితా ఉద్యమం యొక్క ముఖ్య లక్ష్యం కాని దీన్ని సాంప్రదాయిక పండితులు, కవులు తీవ్రంగా వ్యతిరేకించటంతో రాయప్రోలు సుబ్బారావు పండితుల అభిమానాన్ని, పాత ఫక్కీ కవుల ఆదరాన్ని సంపాదించడానికి 'రమ్యాలోకం'', ''మాధురీదర్శనం'' మొదలైన సిద్ధాంత గ్రంథాలు రాశారు వెల్చేరు నారాయణ రావు చెప్పినట్టు ''మౌలికంగా ప్రాచీన కావ్య సంప్రదాయానికి భిన్నమైన ఈ ఉద్యమం, తత్వతః సంఘం మీద తిరుగుబాటుగా నడిచిన ఈ ఉద్యమం'' కొన్నాళ్ళ తరువాత మామూలుగా వస్తున్న కవితా సంప్రదాయాల్లో ఒకటి అయిపోయింది

1910 నుండి ప్రారంభమై సుమారు 4 దశాబ్దాల దాకా తెలుగుదేశమంతటా విజృంభించిన భావ కవిత్వం యొక్క ప్రభావం ఆనాటి సమకాలీన సాహిత్యంపై, సమాజంపై ప్రగాఢంగా ఉన్నది దీనికి పూర్వం తెలుగు సాహిత్యం సాంప్రదాయికతకు నిబద్ధమై పాండిత్య భేషజాలతో శుష్కమైన రచనా ప్రక్రియలతో విలసిల్లేది కాని భావకవిత్వం ఉదయించిన తరువాత వస్తువులో, పదచిత్రాలలో, భావచిత్రాలలో, ఊహచిత్రాలలో, శైలిలో మౌలికమైన మార్పులు వచ్చాయి మధ్య తరగతి జన జీవితం ఇతర సామాన్యుడి జీవితం కావ్యవస్తువుగా వాడుకోవటం జరిగింది దీనితో వస్తువులో నవ్యత వచ్చింది

ఊహా చిత్రాలలో కూడ భావకవులు కొత్త పుంతలను తొక్కారు వాళ్ళు చూసిన వస్తువులను, పొందిన అనుభూతులను, కొత్త ఊహలతో పోల్చడం కనిపిస్తుంది తాళవృక్షాలు బొగ్గు కంబాలలాగా ఉన్న వన్నది భావకవి ఊహా చిత్రాలకు మచ్చుతునకగా చెప్పుకోవచ్చు ఊహాచిత్రాలతో పాటు శైలిలో

సుకుమారమైన పదాలు, లాలిత్యం మాధుర్యం చిలికే పదబంధాలు ఎక్కువగా కనిపిస్తాయి అంతకు ముందున్న సాంప్రదాయిక కవిత్వంలోని జటిల సమాసాల, ఇనుప గుగ్గిళ్లలాంటి పదబంధాల వారసత్వాన్ని ధిక్కరించి భావ కవిత్వం ఒక కొత్త సాహితీ సంప్రదాయాన్ని ఆవిష్కరించింది అందుకే సాహితీ చరిత్ర కారులు 1910 నుండి 1940 దాకా జరిగిన సాహిత్య నిర్మాణ దశను భావ కవిత్వ యుగంగా పేరొన్నారు

సామాజికంగా భావకవిత్వోద్యమం ఉన్నత కులాల, మధ్యమ, ఉన్నత వర్గాల అభిరుచులను విలువలను అండగా తీసికొని తెలుగు దేశంలో వ్యాపించింది ఈ ఉద్యమం వల్ల సాంప్రదాయికతపట్ల ఉన్న మూఢ భక్తి, విశ్వాసాలు తగ్గి పోయాయి దేశభక్తి గీతాల ద్వారా స్మృతి గీతాల ద్వారా ప్రజలలో కొంత చైతన్యాన్ని కలిగించడానికి దోహదం చేసింది భావకవిత్వం శృంగారం, ప్రకృతి ఆరాధన, స్వేచ్ఛ విలువలు భావనాత్మక స్థాయిలో ప్రచారం చేయబడ్డాయి దీనికి అట్టడుగున దాగి ఉన్న సంఘర్షణలను—ప్రకృతికీ—మనిషికీ మధ్య ఉన్న సంఘర్షణలను—చాపకిందకు నెట్టివేయడం జరిగింది

**ముగింపు**

ఐరోపాలోని కాల్పనిక వాదం 1797 లో ఆరంభమై 1830 లో వ్యవస్థీకృతమై 19 వ శతాబ్దం చివరి దశ వరకు ఉధృతంగా సాగిపోయింది సుమారు 140 సంవత్సరాల తరువాత కాల్పనికోద్యమం తెలుగుదేశంలో ఆవిర్భవించింది ఈ విపరీతమైన సామాజిక కాలవ్యత్యాసం తెలుగు కాల్పనికొద్యమానికి సరియైన పునాదులు లేవనే విషయాన్ని సంకేతిస్తున్నది ఐరోపా కాల్పనిక వాదానికి 1748లో ప్రారంభమైన పారిశ్రామిక విప్లవం, 1789లో పెల్లుబికిన ఫ్రెంచి రెవల్యూషన్ ప్రేరకాలుగా పనిచేసాయి అలాంటి ఆర్థిక, రాజకీయ ప్రేరకాలు తెలుగు కాల్పనిక వాదం వెనక కన్పించవు బ్రహ్మసమాజం, బెంగాల్‌లోని వైష్ణవ గీతాలు, బంకిం, టాగూరుల రచనలు, వీరేశలింగం సంస్కరణ వాదం ప్రభావాలు భావకవిత్వ ఉద్యమ ఆవిష్కరణకు దోహదం చేసిన కారకాలు అంతే, ఈ ఉద్యమం

వాస్తవికత పునాదుల్లో జనించకుండా పై కట్టడం (Super structre) లోనీ సాంస్కృతిక స్థాయిలో ఉద్భవించింది అనేది స్పష్టం

ఐరోపాలోని కాల్పనికోద్యమం రాజకీయంగా, ఆర్థికంగా, తాత్వికంగా, సాహిత్యకంగా ఒక వినూత్న శకాన్ని ఆరంభించింది స్వేచ్ఛ, సృజనాత్మక అనుభూతి మొదలైనవి ఇందులోని ప్రధానాంశాలు కాని తెలుగు కాల్పనికవాదం ప్రధానంగా సాహిత్యానికి, కవిత్వానికి పరిమితమై ఉన్నది దేశభక్తి కావ్యాలు, గీతాలు రాసినా ఇది సమన్విత ఉద్యమం (Integrated movement) కాదు

అదనంగా తెలుగు కాల్పనిక వాదం ఉన్నత కులాల భావాలకు వాదాలకు ప్రతీకగా గోచరిస్తున్నది ఐరోపాలోని కాల్పనిక వాదం వల్ల నవీన సాంప్రదాయికత (Neo classism) పూర్తిగా కృశించి బలహీనమైపోయింది దానికి బదులుగా కళాకారులలో మేధావులలో ఉదార దృక్పథం, ప్రయోజనాత్మకమైన భావాలు అభివృద్ధి చెందాయి వాస్తవికవాదం ( Realism ) ఆధారంగా కార్మిక కర్షక జీవిత ఇతివృత్తాలతో నవలలు, నాటకాలు, కావ్యాలు అవతరించాయి తెలుగు కాల్పనికతలో కన్పించే వాస్తవికత కృత్రిమంగానూ, ఆదర్శవంతంగానూ కనిపిస్తున్నది కావ్యాలు, గీతాలు ఇతర రచనలు సంకుచితత్వాన్ని, కాల్పనిక వాస్తవికతను, ఆదర్శవాదాన్ని స్ఫురింప జేస్తున్నాయి

ఐరోపా కాల్పనిక సాహిత్యం వస్తువులో, భాషలో, శైలిలో ఒక కొత్త సంచలనాన్ని సృష్టించింది తెలుగు కాల్పనిక వాదంలో కూడ ఈ అంశాలు ఒక వినూత్న సాహిత్య సృష్టికి తోడ్పడ్డాయి

ఐరోపా కాల్పనికం [illegible] కాల్పనికతకు ఉమ్మడిగా ఉన్న విలువలు స్వాతంత్ర్యం, వ్యక్తి వాదం ఈ విలువలు పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధికి సహాయక కారకాలుగా పనిచేసాయి తెలుగు కాల్పనికతలోని ఈ విలువ,

భూస్వామ్య వ్యవస్థకు, సమాజానికి వ్యతిరేకంగా నిరసన తెలుపడానికి ఉపయో గించినవి

ఐరోపాలోని కాల్పనిక రచయితలలో కొందరు మాత్రమే విషాద మాధుర్యాన్ని శోక ఉమిరాల్ని గురించి గానం చేశారు బావలేర్, ఫ్లాబర్ట్ రచనలలో మాత్రమే నిరాశా వాదం, శోకవాదం కనిపిస్తాయి కాని తెలుగు కాల్పనిక కవుల్లో నిరాశావాదం, శోకవాదం కనిపిస్తాయి కాని తెలుగు కాల్పనిక కవుల్లో శోకనిరాశవాదాలు, వాస్తవికత నుండి పారిపోయే పలాయనవాదం మామూలు స్థాయికంటె చాలా ఎక్కువగా కనిపిస్తుంది దీనికి కారణం తెలుగు కాల్పనికత అవతరణలోనే కనిపిస్తుంది ఉత్పత్తి శక్తుల, సంబంధాల సంఘర్షణ ద్వారా కాకుండా, రాజకీయ పోరాటాంద్వారా కాకుండా భావనాత్మక ఊహాత్మక స్థాయిలో ఏదైనా సాంస్కృతిక పరివర్తన వస్తే అది అవాస్తవికంగా అనుదిన జీవిత అనుభవాలకు అతీతంగా, సామాన్యుడి కష్టసుఖాలకు దూరంగా, పలాయన వాదంగా అంతం అవడం తథ్యం జీవిత వాస్తవికతకు వెనకల ఉన్న ఆర్థిక భూమికలు, ఉత్పత్తి శక్తులు 1934 లో ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఆర్థిక మాంద్యం (Economic depression) కాలంలో మొదలై 1940 లో ద్వితీయ ప్రపంచ సంగ్రామంతో సాహితీ నభోంతరాళంలోకి అగ్ని పర్వతంలాగ బ్రద్దలైన కొత్త సాహిత్య ప్రస్థానానికి-మహా ప్రస్థానానికి-అభ్యుదయ కవిత్వానికి దారి తీసింది

# గ్రంథసూచిక

1 John B Halstead Romanticism D C Heath & Co Boston, 1965

2 Lilian R Furst Romanticism Methuen & Co, London, 1973

3 దువ్వూరి రామిరెడ్డి కడపటి వీడ్కోలు కవికోకిల గ్రంథమాల, పెమ్మారెడ్డిపాలెం, 1957

4 దేవులపల్లి కృష్ణశాస్త్రి కృష్ణశాస్త్రి కృతులు రౌతు బుక్ డిపో, రాజమండ్రి, 1958

5 నండూరి సుబ్బారావు ఎంకి పాటలు ఉదయభాస్కర్ పబ్లికేషన్స్, విజయవాడ, 1965

6 మద్దుకూరి చంద్రశేఖరరావు చంద్ర వ్యాసావళి విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1974

7 మల్లవరపు విశ్వేశ్వరరావు మధుకీలం నవ్యసాహిత్య పరిషత్, గుంటూరు, 1927

8 రాయప్రోలు సుబ్బారావు కష్టకమల నవ్యసాహిత్య ప రి ష త్, గుంటూరు 1913

రాయప్రోలు సుబ్బారావు తృణ కంకణము నవ్యసాహిత్య పరిషత్, గుంటూరు, 1938

రాయప్రోలు సుబ్బారావు రమ్యాలోకము నవ్యసాహిత్య పరిషత్, గుంటూరు, 1938

9 వెల్చేరు నారాయణరావు తెలుగులో కవితా విప్లవాల స్వరూపము, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1978

10 సి నారాయణరెడ్డి ఆధునికాంధ్ర కవిత్వం సంప్రదాయములు - ప్రయోగములు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు 1967

ఆధునిక తెలుగు సాహిత్యంలో

# వాస్తవికత

—రాంభట్ల కృష్ణమూర్తి

## ఏకంసత్

ఒకటే సత్యం దాన్ని మేధావులు బహువిధాలుగా చెబుతారు ఇది ఉపనిషత్ సూక్తి సత్ అంటే పదార్థ నిష్ఠమైన వస్తు సత్యం అని అర్థం చెప్పవచ్చు వ్యక్తి నిష్ఠమైన 'చేతన' సత్యం అనీ వ్యాఖ్యానించవచ్చు ఈ వ్యాఖ్యానాలు చిరకాలంగా సాగుతున్నాయి కనక పదార్థ చైతన్యాల సంబంధం తత్వశాస్త్ర మౌలిక ప్రశ్న అయింది పదార్థం-చైతన్యం, ఈ రెండింట్లిలో ఏది ముందు? ఏది వెనక ? ఏది అగ్రిమం ? ఏది అనగ్రిమం? ఏది ప్రయిమరీ? ఏది సెకండరీ? ఈ ప్రశ్నకు యిచ్చే జవాబును బట్టి తత్వశాస్త్రం రెండుగా చీలింది పదార్థం అగ్రిమం ఆ పదార్థంనుంచి పుట్టింది చేతనం అని చెప్పేవారు పాదార్థిక వాదులు, భౌతవాదులు, మెటీరియలిస్టులు చేతనం అగ్రిమం ఆ చేతనం నుంచే పుట్టింది, లేదా పుట్టినట్లు కన్పిస్తుంది పదార్థం కనక పదార్థం అనగ్రిమం అని వాదించే వారు చేతనవాదులు, భావవాదులు, ఐడియలిస్టులు

"పరమాత్మ ఇచ్ఛనుంచీ, భావంనుంచీ ఐంద్రియ భౌతిక ప్రపంచం పుట్టిందని చెప్పడానికి సిగ్గుపడని వాళ్ళు, వస్తువులున్నాయి కనక వాటికి సంబంధించిన భావన పుట్టిందని కాక, భావన ఉంది కనక వస్తువులున్నాయని వాదించడానికి సిగ్గుపడనివాళ్ళు, వస్తువులు మాటలనుంచి పుట్టాయని వాదించడానిక్కూడా సిగ్గుపడకూడదు వస్తువులున్నాయి కనక మాటలు పుట్టాయని కాక మాటల నుంచే వస్తువులు పుట్టాయని సిద్ధాంతీకరించడానిక్కూడా సిగ్గుపడకూడదు ''

3)

ఇవి లెనిన్ మాటలు. ఈ ఇరవయ్యో శతాబ్దపు 'అర్థవాద' సౌందర్య తత్వజ్ఞులు (సెమాంటిక్ థియరిటీషియన్స్ ఆఫ్ ఆర్ట్) అచ్చంగా ఈ సీగ్గు మాలిన పనే చేస్తున్నారు. వీరు ద్వైతవాది అయిన కాంట్ ప్రవచించిన సౌందర్యానుభూతిని కూడా సంస్కరిస్తున్నారు. కనీసం అంతః ప్రేరణనీ, తర్కాన్నీ, హేతువునీ కూడా వీళ్ళు ఒప్పుకోలేకపోతున్నారు. వీటన్నింటికీ భాషనీ, సంజ్ఞల్నీ అధిష్ఠాన దేవతల్ని చేసి కూర్చోపెడుతున్నారు. కనక సౌందర్య శాస్త్రానికి సంబంధించిన ఏ సమస్యని చర్చించాలన్నా ముందు తత్వశాస్త్ర మౌలిక ప్రశ్నని పరిష్కరించుకోవలసి ఉంటుంది. ఇలా పరిష్కరించుకోడానికి ముందు ఒక వాస్తవాన్ని తెలుసుకుందాం. సంఘటన ఒకటే. దాన్ని పలువురు పలురకాలుగా అర్థం చేసుకుంటారు. దీన్ని వివరించడం కోసం హోవర్డ్ ఫాస్ట్ మన నిత్య జీవితంలోంచి ఒక ఉదాహరణ నిచ్చాడు.

## బహుధా వదంతి.

ఒక సమ్మె జరుగుతోంది. దాన్ని అందరూ చూస్తారు. చూసిన వారిలో ఎవరికీ దానిమీద్ద తక్షణాభిప్రాయం కలగద్దు. అలా కలిగిందని ఎవరేనా అంటే వారు లోకాతీతులైన 'మహానుభావులై' ఉండాలి. సమ్మె అన్న మాటకు అర్థం తెలియకపోయినా అలాంటివారు తెల్లవారేసరికి నూరు పేజీల నవల రాసి పారేస్తారు. దాన్ని మెచ్చుకునే సరసులూ ఉంటారు. మెచ్చి రాయకవాలయిక పోయే మహాత్ములూ ఉంటారు. అలాంటి వారికి చేయెత్తి ఓ దండం పెట్టాలి. సమ్మె నంతటినీ మనిషి కన్నేకాదు- కెమేరా కన్ను కూడా చూడజాలదు. 'వాస్తవికతావాదులు' ఆ సమ్మె నంతటినీ ఫిల్ము తీయవచ్చు. అయినా అందులో ఆవగింజంత వాస్తవం ఉండదు. కాస్తంత కళ కానరాదు. సమ్మెను ఒక్కొక్కరు ఒక్కొక్క కోణంనుంచి ఒక్కొక్క రూపంలో చూడగల్గుతారు.

రాజ్యాంగ దత్తమైన తన ప్రాథమిక హక్కు పైన సమ్మె దాడిలా కనిపిస్తుంది యజమానికి. లేదా ప్రైవేట్ ఆస్తిమీదా లాభార్జనమీదా దురాక్ర

మణగా అవుతుంది కార్మికునికి అది జీవన్మరణ సమస్యగా తోస్తుంది తానూ తన కుటుంబం బతకాలంటే ఇంతకన్న వేరు దారి లేదనిపిస్తుంది సమ్మె చేస్తున్న సంస్థవల్ల సరుకు కరువైనా, రవాణా రద్దైనా అధిక లాభాపేక్షకల వారికి అది దైవదత్తమైన వరంలా గోచరిస్తుంది నలుగుర్ని కాల్చి పారేసి వందమందిని జైల్లో కుక్కితే తప్ప కూలివాళ్ళకి భయ భక్తులు కుదరవు అని అధికార రాజ పురుషుల కనిపిస్తుంది నాలుగు డబ్బులు నొల్లుకోడానికి మంచి చాన్స్ వచ్చిందని మరో రాజకీయునికి పగటి కలలు కనిపిస్తాయి సామాన్యుడు వీరికేం పొయ్యే కాలం వొచ్చిందని తిట్టుకుంటాడు తన జన్మనూ కర్మనూ నిందించుకుంటాడు "ఒక సూర్యుండు సమస్తజీవులకు " అని బమ్మెర పోతన చెప్పినట్లు ఎవరి భావన కనువుగా వారికన్పిస్తుంది ఇందులో ఏది సత్యం ? ఏది వాస్తవం ?

జగత్తులో అనంత సత్యాలూ అపార వాస్తవాలూ ఉండవు సత్యం ఎప్పుడూ ఒకటే వాస్తవంకూడా ఒకటే అయినా ఇన్ని రకాల భావాలెందుకు పుడుతున్నాయి? ఇలా పుట్టడానికి కారణం ఏమిటి ? చూసేవారి జ్ఞానాన్ని బట్టి వారలవర్చుకున్న ప్రపంచ దృక్పథాన్ని బట్టి అని ఈ ప్రశ్నకు జవాబు చెప్పుకోవల్సివస్తుంది అలాగే రచయిత కూడా తానలవర్చుకున్న ప్రపంచ దృక్పథాన్ని అనుసరించి ఒక అంశాన్ని సత్యంగా భావిస్తాడు తను సత్యమని భావించిన దాన్ని వాస్తవికతగా చిత్రిస్తాడు అయినా ఇది పాక్షికమే నని కాస్త తెలిసిన వారంటారు అంటారే కానీ రచయితకు తెలిసిన వాస్తవికతను కాదనలేరు దీన్నిబట్టి సత్యానికి ''నిష్పాక్షికత'' ఉండదనీ, ''వాస్తవికత'' ''తాటస్థ్యం'' ఉండబోవనీ తేలుతుంది తెలిసినా తెలియకపోయినా ఒక రచనలో రచయిత ''పక్షపాతం'' వ్యక్తమయి తీరుతుంది సమకాలీన ప్రభుత్వం మనుగడకు అవసరమైనదాన్ని పూర్వులు ''ధర్మం'' అని పిలిచేవారు కనక నాటి కవులు తాము ధర్మపక్షపాతం వహిస్తున్నట్లు గుర్తించి అలాచెప్పి రచనలు వేసే వారు రామునిహితం వాల్మీకిధర్మం పాండవులమేలు వ్యాసునిధర్మం అలా

కాక రావణ సుయోధనుల హితవే ధర్మంగా ఎంచి అలాంటి ధర్మపక్షపాతంతో ఎవరైనా రచనలు చేసి ఉంటే రామాయణ, మహాభారతాలు మరోలా ఉండేవి. ఆ రోజుల్లోనే ధర్మానికి విశేషణాన్ని తగిలించి తెలివైనవారు ఆత్మ సమర్థన చేసుకుంటూండేవారు యుగధర్మం, ఆపద్ధర్మం లాంటి మాటలు అలాగే పుట్టాయి ఇప్పటి మన రాజకీయుల అవకాశ వాదాన్ని పూర్వరుషులు ఆపద్ధర్మ పక్షపాతంగా వర్ణించి ఉండేవారు

## పక్షపాతం

వర్గపూర్వ సమాజంలో సమాజహితానికీ, వ్యక్తిహితానికీ తేడా ఉండేది కాదు నిజానికి నాటి మానవ సంఘానికి సమాజం అని పేరు పెట్టడం కూడా మంచిది కాదు నాటికి ఉండేవి గణాలూ తండాలూ మాత్రమే గణానికీ, వ్యక్తికీ భేదంలేదు రెండు గణాల మధ్య యుద్ధం వచ్చినప్పుడు మాత్రమే పక్షపాతం తలెత్తింది వర్గసమాజంలో అలాకాదు- పరస్పర శత్రువర్గాలలో ఉండేవారి ప్రయోజనాలు వేరు ఒకే వర్గంలో ఉండేవారిలో కూడా ప్రయోజన భేదం ఉంటుంది కనుక ఈ సమాజంలో పుట్టిన సాహిత్యానికి పక్షపాతం తప్పదు పాలక వర్గం లెంకలు కొందరు పాలితుల్ని ప్రలోభ పెట్టడం కోసం శుద్ధకళావాదాన్ని, నిష్పాక్షిక కళావాదాన్ని లేవనెత్తుతున్నారు సృజనా స్వాతంత్ర్యం పేరుతో తమ వర్గపాక్షికతను మారురూపంతో ప్రవేశపెడుతున్నారు ఇలాంటి వారంతా దొడ్డి దారిన పాలకవర్గం పల్లకీమోసే బోయీలు

మరో వర్గంవారు మార్క్సిస్టు పడికట్టు పదాన్ని వదలించుకోలేరు విప్లవ వేషాన్ని కడుక్కోనూలేరు అలాంటివారి మార్క్సిస్టు సూత్రాలకు ద్వైతభాష్యం చేస్తూ ఉంటారు తాత్వికంగా మార్క్సిజం భౌతికవాదం అందునా అద్వైతం పా[illegible]కత [illegible] ద్వైత [illegible] (కేటగిరీ) పాక్షికత (పార్టిజాన్‌షిప్) అన్న మాటకి ప్రత్యామ్నాయంగా "సంబద్ధత (కమిట్‌మెంట్) అన్న మరో పదాన్ని చెలామణీలోకి తెచ్చారు ఎవరూ ప్రశ్నించనంత కాలం ఈ ఒక్కమాటే రాజ్య

మేలింది కాని నిబద్ధత ఉదాసీనం క్రియాసీలురకు ఈ మాటవల్ల ప్రయోజనం లేక పోయింది అప్పుడు వారిమీద వల విసరడం కోసం "నిమగ్నత" (ఇన్వాల్వ్ మెంటు) అన్న మరో మాటను పీరం ఎక్కించాల్సి వచ్చింది అప్పటికీ ఆ రెండు మాటలూ కలిసికూడా పార్టిజన్‌షిప్ అన్న పదాన్ని మించిన అర్థాన్ని ఇవ్వలేక పోయాయి ఒకే అర్థాన్ని రెండు మౌలిక పదాలతో చెప్పడానికి చేసే ఈ కసరతు ద్వైతసిద్ధాంతానికి దారి తీస్తుంది పశ్చిమ తాత్వికుల్లో ఇమాన్యుయల్ కాంట్ ద్వైతవాది భారతదేశం సంగతి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు పశ్చిమాన పుట్టిన మతాలకు్కూడా ఓరకంగా ద్వైత తత్వమే మూలం

సౌందర్యం అనే సామాజిక చైతన్య రూపానికి సంబంధించినది సాహిత్యం. సౌందర్య శాస్త్రానికి తత్వం పునాది కనక సాహిత్య వ్యవసాయికి పక్షపాతం పతాకంగా ఉండి తీరాలి "రాజకీయమైన రాజీలు సాధ్యం ఒకప్పుడు అవసరం కూడా. కానీ తాత్విక అయిడయాలాజికల్ రాజీలు నకదాచన!" అని హెచ్చరిస్తాడు లెనిన్. కనకనే ఆయన ఒక సందర్భంలో "పక్షపాతరహిత రచయితలకు ధిక్కారం! సాహిత్య మహాపురుషులకు ధిక్కారం!!" అని హుంక రించవలసి వచ్చింది అయినప్పుడు నిమగ్నత- నిబద్ధత జోడెడ్లబండిలో సవారీ చేసే సాహిత్యకుల్ని లెనిన్ అనుయాయులు చీదరించుకున్నా చీత్కరించుకున్నా తప్పేమిటి ?!

## అస్తిత్వ చైతన్యాలు :

మనిషి ప్రకృతినుంచి వచ్చాడు ప్రకృతిమీదే బతుకుతాడు ప్రకృతిలోనే కరిగిపోతాడు తన కర్మ (లేబర్) ద్వారా ప్రకృతిని తనను అనువుగా మలుచు కుంటాడు, మార్చుకుంటాడు ఆ మార్పుతో తానూ మారుతాడు మానవజాతి పరిణామ చరిత్ర ఏకొద్దిపాటి తెలిసిన వారికైనా ఈ సత్యం స్పష్టం ఈ మార్పు ఏ ఒక్కరివల్లా అయ్యేదికాదు ఏ ఒక్కని జీవిత కాలంలో అయ్యేది అంతకన్నా కాదు కనక ప్రతివాడూ తోటివాడితో సంబంధం పెట్టుకోవాలి తన సంతానాన్ని

నిరంతరంగా పెంచుకుంటూ పోవాలి ఈ పనులకోసం మనిషి పెట్టుకునే సంబం ధాలు చాలాఉన్నాయి అందులో ముఖ్యమైనవి మూడు ఒకటి మనిషి మను గడకు సాధనాలు ప్రకృతి నుంచే సేకరిస్తాడు ఆ సాధనాలను ప్రయోగించేది కూడా ప్రకృతిమీదే సాధనసాధ్యాల ద్వారా సిద్ధికూడా ప్రకృతి నుంచే వస్తుంది ఇది ప్రకృతితో మనిషికున్న ప్రధాన సంబంధం ఇదికాక సౌందర్య, మత, నైతికాది ఉప సంబంధాలు చాలా ఉంటాయి రెండు ఉత్పత్తి సంబంధం మనిషి తన ఒక్కడి శ్రమతోనే మనజాలడు అందుకోసం తోటివారితో సంబంధాలు పెట్టుకోవాలి ఒకడు సాధనాలు తయారుచేస్తే మరొకరు వాటిని సాధ్యాలమీద ప్రయోగిస్తారు ఫలితంగా వచ్చిన సిద్ధుల్ని ఇంకొకరు అందరికీ అందిస్తారు ఇది కాక సమితి, సహకార, సహచర, ఉదార, స్నేహ, వైర, ప్రభూత, కార్పణ్య, క్షమాది ఉపసంబంధాలు చాలా ఉంటాయి మూడు పునరుత్పత్తి సంబంధం ఇది ప్రధానంగా సంతానోత్పత్తి సంబంధమే అయినా దీనిక్కూడా ఎన్నో ఉప సంబంధాలున్నాయి శృంగార, కరుణ, వాత్సల్య, బంధు, జ్ఞాత, మొ॥వి ఆ సంబంధాలు ఈ మూడు ప్రధాన సంబంధాల సముచ్చయానికి సామాజిక అస్తి త్వం అనిపేరు

ఆధునికులు చాలామంది ఇక్కడే పప్పులో కాలేస్తూంటారు సమాజం అంటే, 'మనుషుల సమాహారం'' అన్న పాలకవర్గ నిర్వచనాన్ని వారితాత్విక ద్రవ్యం అనుపానంగా పుచ్చుకుంటూ ఉంటారు మనుషుల సమాహారమే సమాజ మైతే దాన్నెమని పిలవాలి? ఇప్పుడున్నవాళ్ళు వందేళ్ళకింద లేరు- మరోవందేళ్ళ తర్వాత ఉండరు పైగా ప్రతిక్షణం కొందరు పోతున్నారు- కొందరుపుట్టుకొస్తు న్నారు అలాంటప్పుడు ప్రవాహశీలమైన సమాజానికి పేరు పెట్టడం ఎవరితరమూ కాదు అయినా ఈ నిర్వచనాన్ని నమ్మేవారు కూడా తమకు తెలియకుండానే బానిస సమాజం, ఫ్యూడల్ సమాజంలాంటి పేర్లు వాడుతుంటారు ఇలా వాడడానికి కారణమేమిటో వారికే తెలియదు మనిషి భూపతన మయ్యేనాటికే ఈ సంబంధ బంధాలు అతడికున్నాయి వాటిని ఎవరో కానీ తెంచుకోలేరు కనక సమాజం

మూడు ప్రధాన సంబంధాల సమాహారమనేది ఎప్పటికైనా ఒప్పుకోక తీరదు ఈ మూడు సంబంధాల్లోనూ ఉత్పత్తి సంబంధం ప్రధానం ఇదే మిగతా రెండింటి మీదా అంతిమ వాల్లభ్యం వహిస్తుంది కనక దీనికి సమాజ ఆర్థికాధారం అని పేరు ఆధార భూతమైన ఈ సంబంధం మారనిదే సమాజం మారదు సమాజ స్వరూప స్వభావాలు మారవు కనక ఉత్పత్తి సంబంధం అగ్రిమం, శ్రేయం, ప్రయిమరీ; ఈ సంగతి ఆత్మానుభవం ద్వారా ఆదిమానవుడు కూడా తెలుసుకున్నాడు "పున రుత్పత్తి సంబంధ కల్పన- అంటే వివాహ సమయంలో- ఇప్పటికీ మనవాళ్ళు "రయింటే పుత్రాంశ్చాదాదాష్మిర్మహ్మ మధాఇమాం" అనే వేదమంత్రం చదువు తారు పెళ్ళి ప్రధానంగా పునరుత్పత్తి సంబంధం అయినా అందుక్కూడా ఆర్థిక సంబంధమే అగ్రిమంగా ఉంది 'రయిం' అంటే ధనం, అర్థం, ఎకనమిక్స్- పెళ్ళిలో ఆలుమగలు ముందు ఉత్పత్తిలోనూ, ఆ తర్వాత మాత్రమే పునరుత్పత్తి లోనూ భాగస్వాములు కావాలని ఆదికాలపు వేదపురుషుల అభిమతం.

ప్రకృతి, ఉత్పత్తి, పునరుత్పత్తి సంబంధాత్మకమైన సామాజిక అస్తిత్వం మనిషి చేతనలో ప్రతిఫలిస్తుంది అలా ప్రతిఫలించిన అస్తిత్వానికి సమ్యగ్ వైఖరీ రూపమే వాఙ్మయం ఇదెన్నో రూపాల్లో ఉంటుంది వీటికే సామాజిక చైతన్య రూపాలని పేరు పెద్దలు వీటిని ఆరుగా విభజించారు అవి ఒకటి ధర్మశాస్త్రాలు, రాజనీతి రెండు - ఋతం ( ఎథిక్స్ ); మూడు సౌందర్యం (అంటే ఈస్తటిక్స్), నాలుగు తత్వశాస్త్రాలు, అయిదు సామాజిక శాస్త్రాలు (సోషల్ సైన్సెస్), ఆరు ఋతం ఈ రూపాలన్నీ ఏకకాలంలో పుట్టలేదు, పెరగలేదు ఆయా కాలాల సామాజిక అస్తిత్వ అవసరాలను బట్టి పుడుతూ పెరుగుతూ వచ్చాయి ఒక్కొక్క సామాజిక దశలో ఆ దశావిర్భావానికి మూలమైన ఒకో రూపం నేయ పాత్ర వహిస్తూ వచ్చింది తక్కిన రూపాలు ఎంత గొప్పవైనా ఎంత ప్రాచీనమైనా అనుయాయులుగానే ఉంటూ వచ్చాయి నేయ రూపానికి లోబడి మాత్రమే 'వ్యక్తమయ్యాయి' సాహిత్యం, సంగీతం, నాట్యం, శిల్పం, చిత్రం లాంటి కళలన్నీ సౌందర్య రూపానికి చెందుతాయి ఈ అన్ని

రూపాల మీదా ఏర్పడ్డ నిర్దిష్ట సమ్యగ్ దృష్టికి సోషల్ అయిడియాలజీ అని పేరు. తత్క్షణాభిప్రాయానికి సోషల్ సైకాలజీ అని పేరు సోషల్ సైకాలజీ అంటే సామాజిక మనస్తత్వం అయిడియాలజీని "అన్వీక్షకి' అని నేను అనువదిస్తున్నాను సామాజిక చైతన్య రూపాల ద్వారా వ్యక్తిలో ఏర్పడ్డ సమ్యగ్ దృష్టి మాపు వెనుక చూపులాంటిది అన్వీక్షకి అన్న మాటకి కూడా అదే అర్థం దానికి కౌటిల్యుడిచ్చిన నిర్వచనం కూడా ఆ సంగతినే నిరూపిస్తోంది. రచయితకు సామాజిక అన్వీక్షకి మీద వాల్లభ్యం అవసరం అలాగే సామాజిక మనస్తత్వ అవగాహన కూడా ముఖ్యం. రచన ఎంత ఉదాత్తమైనా చదువరుల సామాజిక మనస్తత్వానికి మరీ ఎగుడుగానూ మరీ దిగుడుగానూ ఉండరాదు. సామాజిక మనస్తత్వంలో తరతరాలుగా సంచితమైన "వాసన" లుంటాయి వీటినే ఇంగ్లీషులో సెంటిమెంట్స్ అంటారు

## ప్రతిఫల సిద్ధాంతం

సామాజిక అస్తిత్వం చైతన్యంలో ఎలా ప్రతిఫలిస్తుంది, అది చైతన్య రూపాలుగా ఎలా వ్యక్తమవుతుంది- ఈ ప్రశ్నలకు జవాబులు తెలుసుకోవడానికి ముందు జ్ఞాన సిద్ధాంతాన్ని తెలుసుకోవడం ముఖ్యం జగదవగాహనకు జ్ఞాన సిద్ధాంతమని పేరు ఇంగ్లీషులో ఈ మాటకు థియరీ ఆఫ్ నాలెడ్జ్, థియరీ ఆఫ్ కాగ్నిషన్ ఎపిస్టమోలజి, గాన్సియోలజీ అన్న పేర్లున్నాయి లెనిన్‌కి ఈ పేర్లేవీ నచ్చలేదు జ్ఞాన గ్రాహకమైన మెదడును "ఉదాత్తవ్యవస్థిత పదార్థం" (హైలీ ఆర్గనైజ్‌డ్ మేటర్) అని ఆయన వర్ణించాడు ఆలోచన పదార్థ జన్యమైనా అది పదార్థం మాత్రం కాదని నిర్ద్వంద్వంగా చెప్పాడు పాదార్థికమైన మెదడు నుంచి ఈ ఆలోచన పుట్టే తీరును స్పష్టంగా నిర్వచించడం కోసం జ్ఞాన సిద్ధాంతానికి ఆయన థియరీ ఆఫ్ రిఫ్లెక్షన్ అని కొత్త పేరు పెట్టాడు ఈ పేరుతోనే చాలా దంత తెలివిడి ఉంది ఏక కణ జీవిలోని ప్రాథమిక రిఫ్లెక్స్ చర్య నుంచి సెంట్రల్ నెర్వస్ సిస్టమ్ నుంచి మానవుని చైతన్యం వరకు జ్ఞాన పరిణామం

మనకు సుబోధక మవుతుంది థియరీ ఆఫ్ రిఫ్లెక్షన్‌కి నేను ''ప్రతిఫల సిద్ధాంతం''
అని అనువదించుకుంటున్నాను పద్నాల్గో శతాబ్దపు తాంత్రికతత్వవేత్త పుణ్యా
నందుడు తన ''కామకళా'' సూత్రాల్లో ఈ మాటనే వాడాడు ''పరశివ రవి
కరని కతే ప్రతిఫలంతి విమర్శదర్పణే విశదే ప్రతిరుచిరుచిరే కుడ్యే చిత్తమయే
నివిశతే మహాబిందుః'' ఈ సూత్రంలో ప్రతిఫల, ప్రతిరుచి అన్న రెండు
మాటలున్నాయి జగద్వాస్తవికత మన చేతనలో ప్రతిఫలిస్తుంది. అలా ప్రతి
ఫలించింది తిరిగి వైఖరీ రూపంలో వ్యక్తమయితే దానికి ప్రతిరుచి అని పేరు.
సామాజిక అస్తిత్వం మన చేతనలో ప్రతిఫలించగా అన్వీక్షకితో మిశితమై వెలు
వడ్డ ప్రతిరుచి సాహిత్యం - మాటల కర్థాలు తెలీని మహానుభావులు "నా
కవిత్వంతో, నా రచనలతో సామాజిక చైతన్యం సృష్టిస్తాను'' అని అలంగం
తొక్కుతూ ఉంటారు అలాంటి వారి నెవరేం చెయ్యగలరు ? !

## రెండు ప్రతిరుచులు

ఈ ప్రతిరుచి రెండు రకాలు ఒకటి శాస్త్రం మరొకటి సౌందర్యం
మనిషి శాస్త్ర ద్వారాన ప్రకృతిలోకి వెళతాడు ప్రకృతి సౌందర్య ద్వారాన
మనిషిలో ప్రవేశిస్తుంది జగద్వాస్తవికతలోని అవసరం, సారవంతం, స్థిరం పున
రావృతం అయ్యే లక్షణాలను సామాన్యీకరిస్తుంది శాస్త్రం విశిష్టీకరిస్తుంది
సౌందర్యం మనిషి యిష్టాయిష్టాలతో నిమిత్తంలేని వస్తుగత న్యాయాలనూ అభి
వర్గాలనూ నిర్ధారిస్తుంది శాస్త్రం విశిష్ట మూర్తులనూ అచ్చులను (టైప్స్) చిత్రి
స్తుంది సౌందర్యం జగద్వాస్తవానికి వస్తు నిష్టమైన ప్రతిరుచి శాస్త్రం వ్యక్తి
నిష్ఠమైన సుందర ప్రతి రుచి కళ, సాహిత్యం కనక ఒకసారి చెప్పిన శాస్త్రాన్ని
మరోసారి చెప్పవలసిన అవసరం లేదు ఒకవేళ చెప్పినా అందులో తేడారాదు
సాహిత్యానికి సాధనం వ్యక్తి చేతనం కనక ఒకే వాస్తవాన్ని ఎవరెన్ని సార్లు
చెప్పినా ఎందరు చెప్పినా అందులో ఓ కొత్తదనం కొత్త అందం కనిపిస్తూ
ఉంటుంది ఒక సుందర కావ్యాన్ని చదివినప్పుడు కూడా కొత్త అందాలు గోచ

రిస్తాయి, వాల్మీకి, కాళిదాసు, గురజాడ రచనల విషయంలో ఇది చాలా మందికి ఆత్మానుభవం అలాంటి వారికి తత్వం బోధపడి ఉంటుంది

## విశిష్ట జ్ఞానం

సౌందర్యం ఒక విశిష్ట ప్రతిఫల సిద్ధాంతం అంటాడు లెనిన్ ఇది సామాన్య ప్రతిఫలనానికి అతీతమైనది సౌందర్య దృష్టితో జగత్తును తెలుసుకోవడం వల్ల మాత్రమే అబ్బుతుంది కనక అందరూ సాహిత్య వేత్తలు కాలేరు ఆలంకారికులు చెప్పినట్లు ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాస్యాలు అవసరం జ్ఞానానికి మన తార్కికులు మూడు దశలు చెప్పారు ప్రత్యక్షం, అనుమానం, శబ్దం అని లెనిన్ కూడా మూడు దశలు చెప్పాడు అది ఇంద్రియం (పెర్సెప్చువల్), తార్కికం (లాజికల్), సాధకం (ప్రాక్టికల్) సాధన అంటే స్వసాధన, స్వానుభవం అని అర్థం కాదు దీన్ని మళ్ళీ మూడుగా విభజించాడు లెనిన్ ఒకటి సామాజిక, చారిత్రక సాధన రెండు శాస్త్రీయ సాధన మూడు స్వసాధన ఇందులో పూర్వాపూర్వాలు ఉత్తమోత్తమాలు కవికి స్వానుభవం కన్న ఎక్కువ శాస్త్రీయానుభవం, అంతకన్నా ఎక్కువ సామాజిక చారిత్రకానుభవం అవసరం. సామాజిక చారిత్రకానుభవం సాహిత్య అధ్యయనం ద్వారా కలుగుతుంది మానవ జాతి సంచయించిన సకల సౌందర్యాన్ని ఆకళించుకుని తార్కికంగా విశ్లేషించుకుని సమకాలీన స్వానుభవంతో బేరీజు వేసుకున్నప్పుడు మాత్రమే మనకు 'వాస్తవికత' స్వరూప స్వభావాలు అవగతమవుతాయి

## త్రివేణి సంగమం

సాహిత్యం విశిష్ట సుందర ప్రతిఫల సిద్ధాంతం కనక దానికి సౌందర్యం జీవగర్ర ఏ సాహిత్య కళాప్రక్రియకైనా అదే అగ్రిమం నేయం మన చేతనలో ప్రతిఫలించేది జగద్వాస్తవికత, సామాజిక అస్తిత్వం కనక సాహిత్యానికి వాస్తవికత రెండో అంగం అది అనగ్రిమం, అనుయాయి సాహిత్యం జగన్నిష -

వాస్తవానికి ఆత్మనిష్ఠ ప్రతిరుచి సాహిత్యకారుని దృక్పథం, అంటే అన్వీక్షకి అంతర్లీనంగా వుండి తీరుతుంది సాహిత్యం సౌందర్య వాస్తవ అన్వీక్షకిల త్రివేణీ సంగమం ఇందులో సౌందర్యాన్ని గంగ అనుకుంటే వాస్తవికత యమున అవుతుంది అన్వీక్షకి సరస్వతి అది ఎప్పుడూ అంతర్వాహినిగానే వుంటుంది, ఉండి తీరాలి కూడా అలాకాక కవి తాత్వికత అగ్రిమం అయితే అది గద్య పద్యాత్మకమైన తత్వశాస్త్రమవుతుందేమో కాని సుందర కావ్యం కాజాలదు ఇంగ్లీషు సామెత ప్రకారం చెప్పాలంటే గుర్రానికి బండిని పూన్చినట్లవుతుంది కాని బండికి గుర్రాన్ని పూన్చినట్లు అవదు.

సాహిత్యంలో ఈ మూడు అంగాలూ ఆదినుంచీ ఉన్నాయి వాటి ఎరుక మాత్రం దశలవారీగా అబ్బింది మన తొలి ఆలంకారికులకు సాహిత్యంలో సౌందర్య అంశ ఒక్కటే స్పష్టంగా తెలుసు దాన్నే వారు విపులంగా విశదీకరించారు సౌందర్య ప్రయోజనం ఆనందం నాడే కాదు నేడు కూడా అంతే కనక వారు కావ్యప్రయోజనం ఆనందం అనుకున్నారు అలా అనుకున్నందుకు వారిని తప్పుపట్టి ప్రయోజనం లేదు మిగతా రెండు అంగాల్ని గురించి తర్వాతి ఆలంకారికులు ఊహించారు వాటి మీద ఎవరికీ స్పష్టత ఏర్పడలేదు క్షేమేంద్రుడు జగద్వాస్తవికతకు అంటే సాదృశ్యానికి ఔచిత్యం అని పేరు పెట్టాడు కాని దాన్ని నిరూపించలేకపోయాడు అభినవ గుప్తుని ప్రత్యభిజ్ఞావాదం నుంచి పండితరాయల అద్వైతవాదం వరకూ తాత్వికతను చర్చించారు- కాని ఆ తత్వాల్ని సాహిత్యానికి పూర్తిగా అన్వయించలేకపోయారు

ధనార్జన కోసం కొల్లగొట్టడం కోసం ఐరోపావాసులు సాహస యాత్రలకు బయలుదేరినప్పుడు వారికెన్నో కొత్త సంగతులు తెలిశాయి అనేక పరిణామ దశల్లో మానవ సంఘాలు ఆచారాలు కనిపించాయి ఇందులో కొన్నిటికి ప్రాచీన గ్రీకు రోమన్ కావ్యాల్లో పోలికలు పొడసూపాయి గ్రీకు రోమన్ కావ్యాలు రచించే నాటికి యూరపు సమాజం కూడా ఇలాంటి దశలో వుండేదేమోనన్న జిజ్ఞాస పుట్టింది. అంతవరకూ గ్రంథాల్లోని గూఢంగా వున్న సామాజిక వాస్త

వికత ప్రయోజనం విజ్ఞానం ఈ సంగతి తెలిసినప్పటి నుంచీ వాస్తవికతను గ్రంథస్థం చేయడానికి సచేతన యత్నాలు జరిగాయి దాంతో కొత్త ఆలంకారిక శాస్త్రాలూ, విమర్శనా పద్ధతులూ పుట్టుకుని వచ్చాయి అయితే అన్వీక్షకి సంగతి అప్పటికి కూడా తెలీదు సౌందర్య వాస్తవికతలను ప్రతిబింబించేదే కావ్యం అనుకున్నారు వాస్తవికతను చిత్రించడంకోసం అప్పటికి తమకు తెలిసిన చరిత్ర, భూగోళం, ఇతర శాస్త్ర అంశాలను కావ్యాల్లో వర్ణిస్తూ వచ్చారు పాదార్థికమైన మెదడునుంచే భావాలు పుడతాయి అయినా అలా పుట్టిన భావాలకు పదార్థత్వం ఉండదు కాగా ఆ భావాలు మానవ సంఘం మనసుల్ని ఆకళించుకొని వారిని కార్యాచరణకు పురికొల్ప గలిగినప్పుడు ఆ భావాలు పాదార్థిక శక్తిగా రూపొందుతాయి అంటాడు లెనిన్. యూరపు దేశాలు ముఖ్యంగా ఫ్రాన్సు జర్మనీ దేశాల్లో జరిగిన ప్రచండ భావ సాగర మథనం నుంచి మార్క్సిజం అన్న అమృతం పుట్టింది అది లెనిన్ నేతృత్వాన పాదార్థిక శక్తిగా పరిణమించి అక్టోబరు మహా విప్లవం వచ్చింది ఈ భావమథనంలో ప్రాచీనతత్వ శాస్త్రాలూ కావ్యాలు కూడా అస్త్ర శస్త్రాలుగా ఉపకరించాయి ఆనాడే సాహిత్యంలో అన్వీక్షకి అంతర్వాహినిగా వుందన్న ఎరుక కలిగింది అన్వీక్షకి ప్రయోజనం వివేకం పాఠకుల్లో నిర్దిష్ట సౌందర్య, నైతిక, రాజకీయ నిర్ధారణలను కలిగిస్తుంది వివేకం ఇన్ని దశలు దాటిన తరవాత ఇప్పుడు మనకు త్రివేణిలా అల్లుకున్న సాహిత్య సమగ్ర లక్షణం సాక్షాత్కరించే అవకాశం దొరికింది

## తలకిందులు చైతన్యం

మన జ్ఞానేంద్రియాలకు కొన్ని పరిమితులున్నాయి మన కన్ను కెమేరా కటకం లాంటిది ప్రతి వస్తువూ తలకిందులుగా ప్రతిబింబిస్తుంది దీన్ని సహజావుగా తిప్పుకునే శక్తి జంతువులకూడా అలవడింది అయినా మన కంటికింకా కొన్ని భ్రాంతులు పోలేదు చెవులకు సమాన దూరంనుంచి రెండు శబ్దాలు వినిపిస్తే ఆ శబ్దమూలాన్ని మనం గుర్తించలేము నాలుకమీద వేర్వేరు రుచులు ప్రత్యేక

స్థానాలున్నాయి కొన తీపినీ, జిహ్వామూలం చేదుని, అంచులు పులుపునీ, నడి నాలుకక్షారాన్నీ గుర్తిస్తాయి చూపుడువేలూ, నడిమివేలూ కత్తెరలా పెట్టి ఒక గోలీ కాయను పట్టుకుంటే అది ఒకటికి బదులు రెండులా అనిపిస్తుందని అరిస్టాటిలు చూపించాడు జ్ఞాన మూలమైన ఇంద్రియజ్ఞానానికే ఇన్ని పరిమితులున్నప్పుడు దీనిమీద ఆధారపడిన తార్కికసాధన జ్ఞానాలు మనిషికి అంత సులువుగా అల వడవని గ్రహించడం కష్టం కాదు వాస్తవాన్ని సజావుగా తిప్పుకొనగల శక్తి అల వడే వరకూ జగద్వాస్తవికతలో చాలా భాగం మన చేతనలో తలకిందులుగా ప్రతిఫలిస్తూ ఉంటుంది ఈ ప్రతిఫలనం నుంచి వచ్చే ప్రతిరుచి కూడా తల కిందులుగానే వుంటుంది క్రమంగా ఈ తలకిందులు ప్రపంచ చైతన్యానికి అవ సరం అయిన తర్కం, ధర్మం, తత్వం, విజ్ఞానం అన్నీ తలకిందులు రూపంలో అవతరిస్తూ వుంటాయి అలా తలకిందులు చైతన్యం నుంచి ఉత్పన్నమైన సర్వ స్వమె మతం అంటాడు మార్క్సు ఈ సమాజవాస్తవికత అంటే సామాజిక సంబంధాలు తలకిందులుగా ఉన్నంతకాలం ఈ తలకిందులు చైతన్యం ఉంటుంది ఆ చైతన్యాన్ని సమర్థించడానికి కావలసిన సాహిత్యం, నీతిశాస్త్రం, మోక్ష శాస్త్రం అన్నీ ఉంటాయి మతం ఒకప్పుడు పీడిత ప్రజల నిట్టూర్పుగా, గుండె లేని ప్రపంచపు గుండె కాయగా, చైతన్యంలేని పరిస్థితుల చైతన్యం బాధలు మరిచి ఆదమరిచి నిద్రపోయేందుకు వేసుకునే నల్లమందుగా పనిచేస్తూ ఉంటుం దంటాడు మార్క్సు ఈ తలకిందులు చైతన్యం ఈ ఆధునిక యుగంలో మత రూపంలో వ్యక్తం కావలసిన అవసరం లేదు అనేక తత్వాలనుంచి ఆవిర్భ విస్తూన్న ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో కూడా కనిపిస్తుంది

## సప్తపథ

సౌందర్య, వాస్తవిక, అన్వేషకి త్రివేణీ సంగమం సాహిత్యం అయి నప్పుడు కావ్య ప్రయోజనం కేవలం రసానందమే కాదు విజ్ఞానానందం వివే కానందం కూడా ఇందులో వాస్తవికత మనకు ప్రస్తుత చర్చనీయాంశం

కంటికి కటకంలోంచి చేతనలో పడిన ఎస్తు బింబాన్ని సవ్యంగా తిప్పుకోగల శక్తి ప్రతి మానవుడికీ వుంది కాని కంటికి కనిపించని అనేక ఘటనలు, సంఘటనలు, ద్రవ్య గుణరూప సామాన్య విరోధ సమవాయాది సంబంధాలు సవ్యంగా తిప్పుకో గల శక్తి ఆదిమానవుల్లో కొందరికి ఒక మేరకే వుండేది అలాంటివారు కవులుగా రాణించేవారు సమకాలీన వాస్తవాన్ని ఒకమాదిరిగా ఆకళించుకున్న కవుల ప్రతిరుచి వైఖరీ రూపాలు మహా కావ్యాలుగా మనకు మిగిలాయి వాటిలో వాస్తవికత కొంత సవ్యం, కొంత అపసవ్యం కొంత వ్యక్తం, కొంత అవ్యక్తం కొంత సూచ్యం, కొంత వాచ్యం ఇలాగ ఆదికాలం నుంచి ఆధునిక కాలం వరకూ పెరుగుతూ వస్తోంది దీన్ని అవగాహన చెసుకొనడానికి కొన్ని దశా విభజనలు అవసరం ఆదినుంచీ నేటివరకూ వచ్చిన వాస్తవికతను 'సప్త పథ'గా విభజించుకుందాం వర్గ పూర్వ సమాజంలో పుట్టింది ఆదిమ వాస్తవికత దీన్నే భ్రాంతి వాస్తవికత అని కూడా పిలవ వచ్చు అదే దశలో పుట్టి వర్గ సమాజావతరణతో పుష్టి నొంది పెంపొందింది పురాణ వాస్తవికత పురాణ యుగాంతం నాటిది ప్రబంధ వాస్తవికత అక్కడక్కడ అంకుర ప్రాయంగా ఉన్నప్పటికీ పారిశ్రామిక విప్లవంలో భాగంగా అవతరించింది కాల్పనిక వాస్తవి కత ఇది విదేశాలనుంచే మనకు దిగుమతి అయింది 'పరిపణ' సమాజం (పెట్టుబడిదారీ సమాజం) వేళ్లూనుకునేటప్పుడు దాని లోపాలను క్రాంత దర్శులు కనిపెట్టి నిర్మించినది సవిమర్శక వాస్తవికత వర్గ సమాజం పుట్టిన నాటి నుంచీ నేటివరకూ పాలితవర్గం బతుకు లాగే తిరగబడుతూ విరిగిపడుతూ ఈసురోమంటూ ఈడ్చుకొస్తున్నది జానపద వాస్తవికత ఈ అన్ని వాస్తవికత లనూ ఆకళించుకుని అక్టోబరు విప్లవానికి ముందే గోర్కీ కలం నుంచి ఆకాశ గంగలా దూకి మన దేశంలో పరమ శివుని జటాజూటం కోసం ఎదురు చూస్తున్నది సోషలిస్టు వాస్తవికత ఇప్పుడొకొక్క వాస్తవికతనే పరిశీలిద్దాం "ప్రొలిటేరియన్ సంస్కృతి ఆకాశం మీంచి హఠాత్తుగా ఊడిపడదు - తర లాలుగా మానవుడు కూడబెట్టిన జ్ఞానరాశిని సంగ్రహించి దాన్ని తార్కి కంగా అభివృద్ధి చెసినప్పుడే ప్రొలిటేరియన్ సంస్కృతి పుడుతుంది" అంటాడు

లెనిన్ అలాగే ఆదిమ వాస్తవికతనుంచి పరిణామ క్రమ వికాసమే ఆధునిక తెలుగు సాహిత్యంలో వాస్తవికత క్రమ వికాసాన్ని కొంత తెలుసుకుంటే తప్ప ఆధునిక సాహిత్య వాస్తవికత స్వరూప స్వభావాలు అర్థంకావు కనక సాహిత్యంలో వాస్తవికత పరిణామాన్ని స్థూలంగా పరిశీలిద్దాం.

## ఆదిమ వాస్తవికత

ఆది మానవుడు అప్పటికింకా ప్రకృతితో బొడ్డుతాడు తెంచుకోలేదు ఉండి ఉండి మిన్ను విరిగి మీదపడుతుంది కాలికింది భూమి కదిలిపోతుంది పక్కనున్న పర్వతం బద్దలై నిప్పులు గుప్పుతుంది ఎదుటనున్న అడివి సెగలూ పొగలూ చిమ్ముతుంది సాగరాలు ఘోషిస్తాయి నదీనదాలు రోషిస్తాయి చేతికందిన అన్నం చెంగున దూకి పారిపోతుంది - మండుతున్న జఠరం మరో జఠరాగ్నిలో పడి మగ్గిపోతుంది ఇవన్నీ ఎప్పుడు ఎక్కడ ఎలా జరుగుతాయో తెలీదు బలంగలవాడిదే బతుకు ఇతర జంతువులతో పోల్చి చూస్తే మనిషి కాయికంగా దుర్బలుడు జంతువుల్లా అతడికి సహజకవచాల్లేవు - ఖరనఖర కరాళదంష్ట్రాద్యాయుధాల్లేవు కాని జంతువులకు లేని చేతులున్నాయి ఆ చేతులకు 'కర్మ' (లేబరు) చేయగల ఒడుపు వచ్చింది ఆయుధాలు చేసుకో గల నేర్పు అలవడింది కర్మతో చైతన్యం పుట్టింది వాక్కు ఆవిర్భవించింది పదిమందీ కలిసి పనిచెయవలసిన అవసరం వచ్చింది. అందరి తలపుల కలబోతతో ఊహ పెరిగింది. ఆలోచన అంకురించింది భావాలు పదు నెక్కాయి దీంతో మనిషికి మహాబలవంతుడననే ఆత్మ విశ్వాసం కలిగింది ధైర్యం వచ్చింది. తనచుట్టూ వున్న సకల చరాచరాలమీదా వాల్లభ్యం సంపాదించగలననుకున్నాడు - సకల చరాచరాలూ తనలాగే హర్షామర్షాలూ రాగ ద్వేషాలు చూపుతాయనుకున్నాడు తనకున్న భావాలను చరాచరాలకు ఆరోపించాడు దానితో ఒక కొత్త కళ అవతరించింది దాన్నే మనం కవిత అంటున్నాం అదే 'పురుష భావారోపణ' ఇంగ్లీషులో దీన్నే 'ఎంత్రో

పోమోర్ఫిజం' అంటారు ఆదిమానవుడు తన పురుష భావారోపణను వాస్తవం అని నమ్మాడు పరిసర ప్రకృతిలోని ప్రతి వస్తువూ అతడి ఊహలో ఒక పురుషుడు తన తండాకూడా ఒక పురుషుడే ఈ తండా పురుషుడు 'ప్రకృతి పురుషుల' మీద వాల్లభ్యం సంపాదించాడు అలా సంపాదించినట్లు భ్రాంతి కల్పించుకున్నాడు - ఆ భ్రాంతి అతడికీ అతడి తండాకీ మరింత మనో బలాన్నిచ్చింది

జంతువుల్లా సహజాయుధాలులేని మనిషి కర్మద్వారా సకలాయుధ పాణి అయ్యాడు పురుష భావారోపణ ద్వారా గణమంతా ఒకే మనిషి అయి, విరాడ్రూపం ఎత్తాడు అతడిప్పుడు సహస్ర శీర్షుడు సహస్రాక్షుడు - సహస్ర పాదుడు సహస్ర బాహువు సహస్రాయుధ ధారి-ధరిత్రి అతడి పీఠం-ఆకాశం అతడి శిరస్సు-ఇలాంటి విరాడ్రూపం ఎత్తిన తరవాత ప్రకృతిని శాసించడానికి సమ కట్టాడు

## త్రివిక్రముడు

నిజానికి ప్రకృతి బీభత్సం ముందు మనిషి వామనుడు-నిర్వీర్యుడు కాని పురుష భావారోపణతో కల్పించుకున్న 'భ్రాంతి' వల్ల అతడు త్రివిక్రము డయ్యాడు తన బలానికి సంఘ బలాన్ని జోడించుకున్నాడు తన శరీర చేతనలను సంఘ శరీర చేతనల్లో సంలీనం చేసుకున్నాడు - ఆనాడు అతడి కవితల్లో మాటల్లో ఈ భ్రాంతి వాస్తవికతే ప్రతిబింబించింది నాడు సంగీత సాహిత్యాలు వాగర్థాల్లా కలిసి వుండేవి పురుష భావారోపణ చేయగల ఊహాశాలి, భ్రాంతి వాస్తవికతను సృష్టించగల ప్రజ్ఞాశాలి నాటి సమాజానికి నాయకుడు గణాలకు గణపతి కవుల్లో కవి రాజుల్లో పెద్దరాజు మేధావుల్లో మేధావి అతడి మాటే మంత్రం. అతడి చేతే తంత్రం ఆ మంత్రానికి 'మహిమ' ఉండేది, తంత్రానికి 'ఉత్పాదక' శక్తి వుండేది వాటికి జగత్తంతా లొంగి వుండేది-

గణాలు పెరిగిన కొలదీ సౌభాగ్య తంత్రాలు ( ఫెర్టిలిటీకల్ట్స్ ) పెరిగాయి గృత్స తంత్రాలు, (బ్లాక్ మేజిక్) పెరిగాయి నామె వాగ్రూపంలో పాటలు ఆనోటా ఆనోటా అనేక వేల సంవత్సరాలపాటు పాకి, పాత భావాలతో పాటు సమకాలీన వాస్తవికతను ప్రతిఫలించే చరణాలను జోడించుకుంటూ వచ్చాయి అలా వచ్చినవే మన వేదాలు గ్రీకులకు శోక గీతాలు (డీల్సిన్) సోమగీతాలు (డితీరాంబ్స్) వుండేవి అవి మనదాకా మిగల్లేదు ఆనాటి సమాజ వాస్తవికతను ముందు అర్థం చేసుకుంటే నాటి సాహిత్యంలో వాలఖిల్యుల్లా వేలాడే వాస్తవికతను కిందికి దింపి కాళ్లమీద నిలబెట్టడానికి వీలవుతుంది గ్రీకు ట్రాజెడీ నాటకాలు, ఇతర ఆదిమ సాహిత్యాన్ని పరిశీలించిన జార్జి థాంప్సన్ వాటిని కాళ్లమీద నిలబెట్టాడు మన దేశంలో ఇంతవరకూ అలాంటి యత్నం ఎవరూ చేయలేదు జగద్వాస్తవికత మనిషి చేతనలో తల కిందులుగా ప్రతిఫలించడం వల్ల భ్రాంతి వాస్తవికత పుడుతుంది ఆది మానవుడు ఆత్మ విశ్వాసం పుంజుకొనడానికి అది అవసరం అయింది ఇప్పటికీ ఈ భ్రాంతి వాస్తవికత ఉంది అయితే అది మనిషి ఆత్మ విశ్వాసాన్నీ, నిబ్బరాన్నీ చంపడానికి ఆయుధంగా పాలక వర్గానికి పనికివస్తోంది భ్రాంతి వాస్తవికతకు ఆధునిక యుగంలో రకరకాల అలంకార శాస్త్రాలూ, తత్వాలూ తయారవుతున్నాయి అలాంటి వాటిలో "సెమాంటిక్ ఫిలాసఫీ ఆఫ్ ఈస్తటిక్స్" ది అగ్రపీఠం దీన్ని మనం అర్థవాద అలంకార శాస్త్రం అని పిలుచుకోవచ్చు ఇక పురుష భావారోపణ క్రమంగా సౌందర్యంలో కలిసిపోయి అలంకార శాస్త్రాలకెక్కింది నేటికీ పురుష భావారోపణగల కవితకే విమర్శకులు పట్టం కడుతున్నారు ఇది అలంకారంగానే కాక కావ్య ఇతివృత్తంగా కూడా ప్రబంధ కాలంలోనూ, ఆధునిక యుగంలోనూ రూపొందింది

---

వేదాలు ఆదికవితలు - మానవ జాతి శైశవావస్థలో పుట్టాయి శిశువుల అందం, అమాయకత, స్వచ్ఛత, నిర్వృతి, అన్నీ అందులో కనిపిస్తాయి ఈ

దశ మానవజాతికి మళ్లీ తిరిగిరాదు-కనక మన చిన్ననాటి ఫోటోలాగ మాటల చేపులాగ అవి మనకు సదా ఆనందాన్నిస్తాయి ఆదికవిత ఏకపురుష కర్తృకం కాదు అది అపౌరుషేయం అంటే పురుషభావారోపణతో పుట్టిన విరాట్పురుష కర్తృకం అదీ ఏకకాలంలో పుట్టిందికాదు అనెక వేల సంవత్సరాలు పురుషులు పుట్టించింది కనుకనే వేదకవితలకు ద్రష్టలేకాని స్రష్టలు లేరు వేదాల్లో ఇంద్రియ జ్ఞానం కుంప బద్దలు కొట్టినట్టు కనిపిస్తుంది తక్కిందీ భ్రాంతి వాస్తవికతగా గోచరిస్తుంది గణసంగ్రామ సమయాల్లో వేదర్షులు పచ్చి పార్టిజాన్లు "యో అస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః' అంటారు ఆధునిక యుగంలో పార్టిజాన్షిప్ తత్వోపదేష్ట లెనిన్ కూడా 'శత్రువును నిర్మూలించాలంటే ముందు తడిని ద్వేషించడం నేర్చుకో' అని వేదరుషుల్లాగే చెబుతాడు

వేదకవిత భ్రాంతి వాస్తవికత నుంచి సమకాలీన గాథలూ ప్రగాఢం వరకూ వుంది ఈ గాథలు తరువాత పురాణాల్లో కావ్యాల్లో చాలా విస్తరించాయి ఉత్తరధ్రువప్రాంత పరిసరాల నుంచి వైఖానస సరస్సు (లేక్ బైకాల్), కాశ్యపీ సముద్రం ( కాస్పియన్ సీ ), మధ్యాసియా, పారసీకం, సప్తసింధు, సరస్వతీ తీరాల వరకూ తిరిగినవారి జ్ఞాపకాలూ అనుభవాలూ కనిపిస్తాయి మానవుని శావేటదశనుంచి బర్బరదశవరకూగల సంస్కృతి పరిణామం కనిపిస్తుంది ఏకోదరవివాహాల నుంచి జంపతీవివాహాల వరకూ ప్రగతి గోచరిస్తుంది వెండి బంగారాలకు విలువేలేని దశనుంచి 'ద్రేక్కాణ' నాణెం వరకు ప్రస్తావనలు కానవస్తాయి పశుపాలక గణాల సంస్కృతి వ్యవసాయిక గణాల సంస్కృతి ఈ రెండు సంస్కృతుల వైరుధ్యాలూ, సంగ్రామాలూ కనిపిస్తాయి ఆదిమ కమ్యూనిజం సూత్రాలూ, నీతులూ, ఆస్తిబీజాలూ, ఆస్తి మీద దండయాత్రలూ కనిపిస్తాయి నాటి పని విభజన కనిపిస్తుంది ఈనాడు మనం చెప్పుకునే 'శ్రమ మూలమిదం జగత్" సూత్రం కనిపిస్తుంది పునరుత్పత్తి సంబంధాలను కూడ ఉత్పత్తి సంబంధమే శాసిస్తుండన్న సత్యం స్పష్టంగా కనిపిస్తుంది ఇలాగ తరువాత కాలంనాటి నాగరికతకు, సాహిత్యానికీ, సంస్కృతికీ కావలసినదంతా బీజరూపంలో ఈ ఆదికవితలు ప్రతిబింబిస్తున్నాయి

# పురాణ వాస్తవికత

వర్గ సమాజంలో పురాణాలకు గ్రంథరూపం వచ్చింది కాని పురాణగాథలకు ఆదిమానవుడే బీజాలు వేశాడు అవి పెరిగి ఆయాకాలాల సమాజ అవసరాలకు అనుగుణంగా మారుతూ వచ్చాయి పురాణ గాథలు చిరకాలం వాగ్రూపంగా పెరిగాయి వర్గసమాజంలో గ్రంథస్థం అవడం మొదలుపెట్టాయి వర్గసమాజంలో జనాన్ని శాసించడం కోసం పాలకులకు రెండు ఆయుధాలు అవసరం అందులో ఒకటి మిథ్యాగాథల రచన అందే పురాణ సాహిత్యం రెండు మూఢ విశ్వాసాల సృష్టి మిథ్యాగాథలను పశ్చిమదేశాల వారు మైథాలజీ అంటారు ఇందులో మిథ్—మిథ్య అన్నమాటను మనం గుర్తుంచుకున్నప్పుడే పురాణ వాస్తవికత అర్థం అవుతుంది ఇక మూఢ విశ్వాసం అంటె సూపర్‌స్టిషన్ దీనికి అహేతుక విశ్వాసం అని నైఘంటుకార్థం దీన్ని మనం గుడ్డి నమ్మకం అంటున్నాం ఈ నమ్మకం నిజంగా గుడ్డిది కాదు భ్రాంతి వాస్తవికత కాలంలో పుట్టిన నమ్మకం వాస్తవికత మారినా నమ్మకం మారనందున దీన్ని గుడ్డి నమ్మకం అని పిలుస్తున్నాం పురాణాలకు బీజాలు ఎప్పుడు ఎలా పడ్డయో మార్క్స్ ముక్తసరిగా వివరించాడు ఆ వివరణ ఇది

> "మానవజాతి మనుగడలో అయిదింట నాలుగువంతులు శావేజి మహర్దశ, బర్బరదశ ప్రథమాంతరంలో గడిచిపోయింది శావేజిదశలోనే మనిషిలోని ఉత్తమ గుణాలు పెంపొందాయి వ్యక్తిగౌరవం, వాచాపటిమ, ఓరకమైన మతాభినివేశం, సచ్ఛీలం, మగటిమి, ధైర్యం లాంటివి పుట్టాయి నేటికీ యివి సత్పురుష లక్షణాలుగానే లెక్కకు వస్తున్నాయి వీటితోపాటు హింసాపరిరంస, వంచన, అత్యుద్రేకం కూడా అవతరించాయి భూతారాధన పుట్టింది లీలగా దేవుడన్న భావం కూడా అంకురించింది పరమాత్మ ఒకటున్నదన్న ఆలోచన పుట్టింది ఆదికవిత అవతరించింది సాముదాయక గృహాలుండేవి గింజధాన్యాలు తినడం నేర్చారు దీనితో

పాటు అవిభాజ్య కుటుంబాయీ గణసమాఖ్యలు కూడా పుట్టాయి ఈ గిణాల్లో మండలాలూ వ్రాతాలు వుండేవి మానవ జాతి ప్రగతికి తోడ్ప డిన భావశబలత వాగ్రూప పురాణగాథ నిర్మాణానికి దోహదం చేసింది వీటితో పాటే కథలు, గాథలు, సంప్రదాయాలు వచ్చాయి ఇవన్నీ అప్ప టికే జాతికెంతో ఉత్తేజాన్నిచ్చేవి ”

మార్క్స్ మాటల్ని బట్టి మన పురాణ వాఙ్మయానికి శావేజి మహాదశలోనూ, బర్బరి మహాదశ ప్రథమాంతరంలోనూ పునాదులు పడ్డాయని తెలుతుంది మనకు వేదాల్లో మిగిలిన ఆదిమకవితకు కూడా ఆ దశలోనే అంకురారోపణ అయింది కనక మానవ పరిణామంలో ఆ దశాంతర్దశల ప్రధాన లక్షణాలను తెలుసుకున్నప్పుడే నాటి వాస్తవాలు మనకు సుబోధకమవుతాయి లెవిల్ మోర్గాన్ రాసిన ‘ఆదిమసమాజం’ అన్న గ్రంథాన్ని సమీక్షిస్తూ చెప్పిన మాటలవి ఆపుస్తకం ఆధారంగానే ఎంగెల్సు కుటుంబం - ఆస్తి-రాజ్యంపుట్టుక అన్న పుస్తకం రాశాడు

శావేజి మహర్దశ ఇందులో మూడంతరాలున్నాయి ఆ కాలాల్లో మను షుల మనుగడను గురించి తెలుసుకుందాం శావేజిప్రథమాంతరం మనిషి యింకా ప్రకృతితో పోట్లాడు తెంచుకోలేదు నాటి వారి ప్రధానాయుధం పాషాణం మన పురాణాల్లో రాళ్లూ, రప్పలూ విసిరేరాక్షసులూ, వానరులూ ఈ దశలోపుట్టిన కథానాయకులు అయి ఉండాలి కాలక్రమాన కథ పెరిగి అతిశయోక్తి ఉత్ప్రేక్ష ఆయుధాలచుట్టూ అల్లుకుని వుండాలి నాటి వారి ఆహారం కందమూలఫలాలు భాష కంర్యాలతో వుండేది కనక ఎక్కువసేపు మూగసైగలతోనే కాలం గడిపే వారు ఈ దశలో పుట్టిన కథానాయకులు ‘‘కందమూల ఫలభక్షకులైన మునులు’’గా పురాణాల్లో రూపొందారు

ద్వితీయాంతరం సమాజం కొయ్యల్ని మథించి నిప్పుచేయడం నేర్చు ...ంది దాంతో ఆహారం మారింది మాంసాన్ని కాల్చుకుని తినడం నేర్చారు

దీన్తో బుద్ధి గొప్పగా వికసించింది ఇది పురాణాల్లో రుషి పత్నిలకు వారు చేసే యజ్ఞాలకు ఆస్కారం కలిగించింది నాటి వారి ఆయుధం గద అది రాతిది కావచ్చు, కొయ్యది కావచ్చు పురాణాల్లోని భీముడు సుయోధనుడు రాక్షస రాజులూ గదాయుధులైన పురాణ పురుషులందరూ ఈ దశలో పుట్టారు ఆ రోజుల్లో వొడ్డున గుల్లచేపల్ని ఏరుకుని కాల్చితింటూ వుండేవారు గుండెలదిరేలా ధ్వనినిచ్చే శంఖాన్ని కనిపెట్టారు జంతువులను వేటాడ్డం కోసం కొన్ని తండాల వారు తిరిగివచ్చే ఆయుధాన్ని కనిపెట్టారు అదే చక్రం ఆస్ట్రేలియా ఆదిమ వాసుల బూమరాంగ్ గుల్లచేపలు తర్వాతి కాలంలో 'కచ్ఛప' మన్న పేరు తెచ్చుకున్నాయి ఇదే తరవాత 'కశ్యప' అయింది గుల్లచేపలు తినేవారికి పురుష సంతానం ఎక్కువ అని ఇటీవల కొందరు శాస్త్రవేత్తలు కనిపెట్టారు పురాణాల్లో కశ్యపులకు పురుష సంతానం ఎక్కువ ఉండడానికి ఇదే కారణం అయివుండవచ్చు

అప్పటికి వాక్కు స్ఫుటం అయింది ఆదిమకవిత అవతరించింది మునులు రుషులయ్యారు యజ్ఞాల్లో ఛందః కవితని సామాన్ని ప్రవేశపెట్టారు "మనిషి రుషి అయినప్పుడే కవి అవుతాడు" అన్న నేటి సామెతకు ఆ రోజుల్లోనే బీజం పడింది

తృతీయాంతరం విల్లమ్ములు కనిపెట్టగానే మనిషి శావేజి మహర్దశతో తృతీయాంతరానికి చేరుకున్నాడు విల్లు అమ్ము చాలా సంక్లిష్టమైన యంత్రం కాల్చిన మాంసభోజనంతో మెదడును పెంచుకున్న మానవుడు ఈ యంత్రాన్ని కనిపెట్ట గలిగాడు అతడికి రాగి తెలుసు తగరం కలిపి కంచు చేయడం నేర్చాడు కంచుతో మొదట చేసిన ఆయుధం పరశువు, గండ్రగొడ్డలి తరవాత ఖడ్గం అప్పటికి పశుపాలన బాగా పెరిగింది కలపకొట్టి ఇళ్లు కట్టడం నేర్చుకున్నాడు కృషి పెరిగింది జాతికి కావలసినంత వాఙ్మయం పెరిగింది వ్యవసాయం పశుపాలనలో సౌభాగ్యతంత్రాలు పెరిగాయి యజ్ఞాలకు సౌభాగ్యమహత్తు వచ్చింది యజ్ఞకవితకు మంత్ర ప్రతిపత్తి అబ్బింది సమాజంలో పని విభజన

వచ్చింది పరశురాముడు, రాముడు, అర్జునుడు లాంటి వాళ్లు ఆ కాలంలో పుట్టిన పురాణపాత్రలు అనేకాలు మండలాలుగా, మండలాలు గణాలుగా, గణాలు జనాలు ఐక్యం అవుతున్నదశ అది ఆ రోజుల్లోనే పంచజనులు అవతరించారు పంచజనులూ యుద్ధ ఝాంకారం కోసం ఊదే శంఖం పాంచజన్యం అయింది యుద్ధ ఆయుధాలన్నీ కలిసి పురుష భావారోపణతో యుద్ధదేవుడు అవతరించాడు అతడికి శంఖం, చక్రం, గద, శార్ఙ్గం ఆయుధాలయ్యాయి ఖడ్గం కూడా అప్పుడప్పుడు అతడి చేతికి వచ్చేది అతడే శ్రీ మహావిష్ణువు అలాగే ప్రపంచ సౌభాగ్య తంత్రాలన్నీ క్రోడీకృతం అయ్యాయి పశుపాలక గణాల సౌభాగ్యమూర్తి ''బోచేస్'' ఇది గ్రీకు మాట బోచేస్ అంటేఆంబోతు నెక్కిన దిగంబరుడు అతడు మన భూతేశుడుగా మారాడు అతడి సౌభాగ్యచిహ్నం ఆరాధ్యమైపోయింది వ్యవసాయ సౌభాగ్య తంత్రాల్లో పుట్టిన చంద్రుడు, పునుకలు, గంగ, చితాభస్మం, పాములు, స్త్రీ సౌభాగ్యచిహ్నం అన్నీ భూతేశునితో కలిసి అర్థనారీశ్వరుడూ, లింగం, పానవట్టం అవతరించాయి చేపలు పట్టేవారి అయుధం త్రిశూలం, తొలి కవితల్లోనూ, సామాల్లోనూ వాడే ఘన వాద్యం డమరుకం నాటి ప్రధాన ఆహారం జింక, నాడు కనిపెట్టిన అగ్ని, ఆనాడు నేర్చిన తాండవం అన్నీ ఈ అర్ధనారీశ్వరుని ఆశ్రయించాయి విష్ణువు యుద్ధదేవుడైతే శివుడు సౌభాగ్యదేవుడు భోళాశంకరుడు

## బర్బర మహర్దశ ప్రథమాంతరం

మనిషి చువ్వలతో బుట్టలూ, పెణకలూ అల్లడం నేర్చుకున్నాడు బుట్టలకు మట్టిపూసి కుండలు కాల్చేవాడు ఇనుము కనిపెట్టాడు దాంతో అతడి ఉత్పత్తి, నాగరికతా, యుద్ధతంత్రం పెరిగాయి ఈ రోజుల్లోనే పశ్చిమాసియాలో అసీరియన్లు (అసురులు), వారికి గురువులైన ఫ్రిగియన్లు (భృగువులు) నేలను తవ్వి నేలకింద గుహలను తొలిచి పట్టాలు కట్టారు దానికో బిలం మార్గంగా వుండేది మన పురాణాల్లో అసురులు పాతాళవాసులు అవడానికీ, వారికి విద్యలు నేర్పిన భృగువులు అసుర గురువులు అవడానికి ఇవి నేటికీ దాఖలా యిస్తాయి ఈ దశ

పోనే వేదాలూ వేదశాఖల సంకలనాలు జరిగాయి సాహిత్యం ఇతర కళలూ విస్తరించాయి మన పురాణాల్లో ఎక్కువ భాగం శివకేశవగాథలే నన్న సంగతి మరవరాదు ఆయా దశల్లో బీజప్రాయంగా పుట్టిన కథలు వేద వాఙ్మయంలో అంకురాలెత్తి పురాణాల్లో సమకాలిక సమాజానికి అనువుగా శాఖోపశాఖలు వేసి విస్తరిల్లాయి ఇంకా నేటికీకూడా సమకాలీన వాస్తవానుగుణంగా మారుతూనే వున్నాయి

పురాణ దేవతలైన శివకేశవులు ఎలా పుట్టారో తెలుసుకున్నాం ఆది మానవుడు కనిపెట్టిన 'పురుష భావారోపణ' చారిత్రక సామాజిక పరిణామానికి అన్వయించి శివకేశవులను సృజించిన భారతీయ సాముదాయక ఊహాకల్పనకు నివాళులర్పించవలసి వుంటుంది

## ప్రబంధ వాస్తవికత

తెలుగులో భారతానువాదంతో లిఖిత సాహిత్యానికి పునాది పడింది భారతాన్ని పెద్దలు ఇతిహాసం అని పిలిచారు కాని ఆధునిక దృక్పథంతో చూస్తే దాన్ని సకల పురాణసారసంగ్రహం అని చెప్పాలి పురాణ వాఙ్మయానికి మతం నేయం ఆ యుగాన్నంతటినీ అదే శాసించింది సాంఖ్యం న్యాయవైశేషికాలూ, పూర్వమీమాంసా, బౌద్ధ జైన లోకాయత తత్వాలూ కూడా కర్మకు కర్తా కారయితా, ఫలభోక్తా ఒక్కరేనని చెప్పాయి ఇది రిక్థాధారమైన సమాజానికి పనికిరాదు రిక్థ అంటే ప్రయివేటు ఆస్తి కనక కర్మను మనిషికి విడిచి, కర్మఫలితాన్ని అధీశ్వరునికి అప్పగించవలసిన అవసరం వచ్చింది దాంతో పరమేశ్వరుని సృష్టించారు "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" అన్న కొత్త సూత్రాన్ని తయారు చేశారు ఈ సూత్రాన్ని, ఇందుకవసరం అయిన నైతిక, తాత్విక, సామాజిక శాస్త్రాలను పురాణాల్లో పొందుపరిచారు ఉత్తరాదిన భారత మతానికి [illegible] అయిన కులవ్యవస్థ ఆరో శతాబ్దంలో గట్టిపడింది అప్పటికి సకల పురాణసారం మహాభారతం కూడా తయారయింది తెలుగునాట తొమ్మిదో శతాబ్దానికి కాని

కుల వ్యవస్థ గట్టిపడలేదు కనక మహాభారత రచనకు నన్నయ పదకొండో శతాబ్దంలో మునుము పెట్టాడు భారతం ఎలాంటిదో దాని ప్రయోజనం ఏమిటో నన్నయభట్టు స్పష్టంగా వివరించాడు

సీ ధర్మతత్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
కవి వృషభులు మహా కావ్యమనియు
లాక్షణికులు సర్వ లక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్ఛ
యంబని మహిఁగొనియాడుచుండ

గీ వివిధ వేదతత్వవాది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు

ఈ పద్యాన్ని చూసిన తరవాత మార్క్స్ మతానికిచ్చిన నిర్వచనాన్ని తెలుసుకోవడం ఉచితం ''మనిషి ప్రపంచానికి అతీతుడైన నామ రూపరహిత పదార్థం కాదు మనిషే మనిషి ప్రపంచం అతడి ప్రభుత్వం, అతడి సమాజం ఈ ప్రభుత్వమూ ఈ ఒక తలకిందులు ప్రపంచ చైతన్యంగా మతాన్ని సృజిస్తాయి ఈ ప్రభుత్వమూ, సమాజమూ కూడా తలకిందులుగానే ఉన్నాయి అలాంటి తలకిందులు ప్రభుత్వానికి సంబంధించిన సామాన్య సిద్ధాంతం మతం దాని విజ్ఞాన సర్వస్వం మతం సామాన్య ప్రజలకు అవగాహన కాగం దాని తర్కం మతం దాని ఉదాత్త మానసిక ఔన్నత్యం మతం దాని ఉత్సాహంమతం దాని నైతిక శాసనం మతం దాని సంపూర్ణత, దాని ఊరడింపు దాని సమర్థ

నకు మూలం మతం పీడిత ప్రజల నిట్టూర్పు మతం, గుండెలేని ప్రపంచపు గుండెకాయ మతం చైతన్యం లేని పరిస్థితుల చైతన్యం మతం ప్రజలకు నల్ల మందు మతం ప్రజల మిధ్యానందం మతం '' ఇలాంటి మతసమర్థనే ధ్యేయంగా మన ప్రబంధ సాహిత్యం పుట్టినప్పటికీ అందులో సమకాలీన వాస్తవికత సకల రూపాల్లోనూ సాక్షాత్కరిస్తుంది మహాభారత పాత్రలన్నింటికీ తెలుగుతనం ఆపాదించాడు తిక్కన తరువాతి ప్రబంధకవులందరికీ వరవడి పెట్టాడు తిక్కన తిక్కన సృష్టించిన తెలుగు పాత్ర ఉత్తరకుమారుడు

పురాణ పాత్రలు తెలుగు తనాన్ని ఎలా పుంజుకున్నాయో తెలుసు కొన డానికి ఒక్క కథను పరిశీలిద్దాం హరిశ్చంద్రుని కథ ఐతరేయ బ్రాహ్మణంలో వుంది సంస్కృత పురాణాల్లో వుంది గౌరన ద్విపదకావ్యం హరిశ్చంద్రోపాఖ్యానంలో వుంది వేద హరిశ్చంద్రుడు అచ్చంగా అయిదుసార్లు మాత్రమే అబద్ధం ఆడుతాడు పురాణ హరిశ్చంద్రుడు రాజ్యం ఇస్తానని మాట జారినందుకు ఆ మాట మీద నిలవడం కోసం ఆలుబిడ్డల్నమ్ముకుని, సత్యహరిశ్చంద్రుడైపోతాడు తెలుగు హరిశ్చంద్రుడు కులసాంకర్యాన్నీ వర్ణసంకరపు పెండ్లినీ ప్రతిఘటించడం కోసం సత్యహరిశ్చంద్రు డవుతాడు అసలుకన్న వడ్డీమిన్న అని చూపిస్తాడు షావుకారుకన్న అప్పు వసూలుచేసేవాడు అతిముఖ్యుడు అని ఆ కథ చిత్రిస్తుంది తెలుగు సాహిత్యంలో స్వతంత్రంగా పుట్టిన మొదటి పాత్ర నక్షత్రకుడు ఇక తెలుగు ప్రబంధాల ఇతివృత్తం పురాణాలకన్న భిన్నం కాకపోయినప్పటికీ వారిలో తెలుగు తనం కనిపిస్తుంది సమకాలీన వేషభాషలే గోచరిస్తాయి మనువుకొడుకైనా ''షిరాజీకరాచుర కత్తి'' పడతాడు త్రేతాయుగనాయిక అయినా కుఱుముంజి ముత్యాల ముక్కెర పెట్టుకుంటుంది పైరిపీ రవిక తొడుక్కుంటుంది పచ్చల హారాలు వేసుకుంటుంది

ప్రబంధ యుగం చివరి రోజుల్లో కావ్య కన్యకు దొమ్మరసాన్ని చేశారు కావ్యకన్యల్ని తార్చి సంపాదించిన దానికి "పడుపు కూడు'' అన్న పేరు వచ్చింది అది ప్రబంధ యుగ చరమ దశలో కవుల 'కుల వృత్తి' గా మారింది

నాటి సాహిత్యంలో ఈ వాస్తవికత ఏదో ఒక రూపంలో గోచరిస్తుంది ఇప్పటి ప్రచురణ కర్తలు ప్రబంధ జన్మలో 'కృతి భర్తలు'గా వుండేవారు వారి యిష్టమే కవుల యిష్టం అంతకన్న కవులకు గత్యంతరం ఉండేది కాదు కాగా కావ్యాన్ని అమ్ముకోవలసిన అవసరం లేనివారు మాత్రం సమాజంలో వున్న లొసుగుల్ని దేవుళ్ళ చేతకానితనాన్ని రాజుల గండ దర్పాన్ని నిశితంగా విమర్శించగలిగారు అదే శతక వాఙ్మయం గోగులపాటి కూర్మనాథుడు, భల్లా పేరయ్య, శేషప్ప, పుల్లకవిలాంటి ఎందరో శతక కర్తలు నాటి సమాజ శైథిల్యానికి అద్దం పట్టారు నాటి నుంచీ నేటి వరకూ కూడా కావ్యాన్ని అమ్ముకోవలసిన అవసరం లేనివాడికి మాత్రమే రచనా స్వాతంత్ర్యం వుంది ఈ వాస్తవాన్ని మనం మరవరాదు

## కాల్పనిక వాస్తవికత

ఇక్కడితో మన దేశంలో వాస్తవికతా పరిణామం ఆగిపోతుంది ఫ్యూడల్ సమాజానికి భరత వాక్యంగానూ పరిపణ సమాజానికి నాందీవాచకం గానూ గల సంధ్యాసమయంలో అవతరించింది కాల్పనిక వాస్తవికత యూరపులో లాగే మన దేశంలో కూడా పదహారో శతాబ్దారంభంలోనే 'సరుకు' (కమోడిటీ) ఉత్పత్తి మొదలయింది పరిపణ బీజాలు అంకురించాయి కాని రాజ రాజన్యుల కాడి కింద నలిగి తలెత్తలేక పోయాయి ఆ దశలో మన దేశంలో భక్తి ఉద్యమం జానపద తాత్వికోద్యమం పేర కాల్పనిక సాహిత్యం అంకురించింది ఈ ఉద్య మాలన్నింటా పరిపణ సమాజానికి మూలమైన వ్యక్తితత్వం'' ప్రధానంగా కని పిస్తుంది మన మతానికి గుండెకాయ అయిన కులం మీద దాడి, వ్యష్టి తత్వం అయిన మోక్షసాధన, ముస్లిం సూఫీల ''అనల్‌హక్'' (అహం బ్రహ్మ) తత్వాలు ఆ రోజుల్లోనే పుట్టాయి అందుకు అనువుగా పముఖం వెంకట కృష్ణప్పనాయని జైమినీ భారత వచనానువాదం ఆ రోజుల్లోనే పుట్టింది రానున్న కాల్పనిక సాహి తానికి అన్ని హంగులూగల చంద్రహాస గాథకు ఆదరణ లభించింది

కాల్పనిక వాస్తవికత యూరపులో పందొమ్మిదో శతాబ్దం రెండు మూడు దశకాల్లో ఒక సాహిత్య ప్రక్రియగా అవతరించింది బ్రిటిష విద్యా విధానంతో

పాటు మన దేశానికి వచ్చింది అది పుట్టుకలోనే రెండుగా చీలి పుట్టింది ఒకటి 1789 నాటి ఫ్రెంచి విప్లవంవల్ల కలిగిన నవచైతన్య ఫలితం రెండు ఆ విప్లవం వల్ల కలిగిన నిరాశ ఫలితం ఇందులో మొదటి దానికి క్రియాశీల కాల్పనికత అనీ, రెండో దానికి ఉదాసీన కాల్పనికత అనీ పేరు పెట్టాడు గోర్కీ పరిపణ సమాజ సంబంధాలవల్ల యూరపులో లాగే మన దేశంలో కూడా మార్పులు వచ్చాయి స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ విచ్ఛిన్నం అయింది కుల వ్యవస్థ నాశనం కాలేదు కాని వ్యక్తి కులవృత్తికి మాత్రమే కట్టుబడాలన్న నిర్బంధం పోయింది కులశాసకుల పట్టు సడలింది కొత్త నాగరికత వల్ల 'నిషిద్ధ కులాల' వారుకూడా చదువుకొనడానికి అవకాశం దొరికింది ఈ అవకాశంతో కొత్త చైతన్యం పుట్టింది దాంతోపాటే మరో వర్గంలో నిరాశ కూడా అంకురించింది భయం పెరిగింది ఈ ఉప్పెలాయికి మూలం పరిపణ సమాజ ఆవిర్భావం వేయి పడగలుగా విస్తరిల్లిన రాజన్య సమాజ విచ్ఛిత్తి పరిపణ సమాజానికి స్వాగతంగా సులభ వచన సాహిత్యం అంకురిస్తే, శవప్రాయం అయిన రాజన్య సమాజం కోసం భాషను అందరాని పండుగా చేశారు పండితులు

ఈ సాహిత్యంలో వాస్తవికత చాలా స్పష్టంగా కనిపిస్తుంది ఎక్కువ భాగం ఊహా కల్పనే అయినప్పటికీ దానికి రచయితలు ఆధునికతా భ్రాంతిని కల్పించారు ఉదాసీన క్రియాశీల కాల్పనికతలు రెండింటిలోనూ ఈ భ్రాంతి వాస్తవికత పోగారింపులు కనిపిస్తాయి ఇందులో ఉదాసీన కాల్పనికతకు చిలకమర్తి వారి నవలలు దాఖలా విశ్వనాథ వారు వాస్తవికతను సాధనంగా తీసుకొనడం వల్ల పాత్రలు అతని తత్వానికి ఎదురు తిరిగాయి వేయి పడగలుగా విస్తరిల్లిన ఫ్యూడల్ సమాజ సంరక్షణకు ఆయన పడ్డ శ్రమ ఫలించలేదు ఒకటొకటిగా పడగలు రాలిపోయిన కథ ఆయన తత్వానికే ఎదురు తిరిగింది దాన్తో ఆయన వాస్తవికతకు ఓ దండం పెట్టి పూర్తి కాల్పనికతకు దిగిపోయారు ఇప్పటికీ తెలుగు దేశంలో ఆయన అనుయాయులదే మెజారిటి అందే ఉదాసీన కాల్పనిక వాదానిదే పైచెయ్యి

క్రియాశీల కాల్పనిక వాదులు ఫ్యూడల్ సమాజానికి పుట్టిన క్షయను చూస్తారు పరిపణ సమాజంలో పున్నమిని చూస్తారు ఆ మాపుతో కథలల్లుతారు వారి కలంపోటు ఫూడ్యల్ అవశేషాలకు గునపం పోటు ఇందుకు చిలకమర్తి వారి గణపతి మొక్కపాటి వారి బారిస్టరు పార్వతీశం ఉదాహరణ కాల్పనిక సాహిత్యం తెలుగులో సృష్టించిన స్వతంత్ర పాత్రలు కూడా ఈ రెండే ఉదాసీన కాల్పనికతకు పుట్టిన ముద్దు బిడ్డ ధర్మారావు ఇంగ్లీషు కవితలో బైరన్, షెల్లీలు క్రియాశీల కాల్పనిక వాదులు వారిని అనుసరించిన మన భావ కవులు ఒకే ఒక్క విషయాన్ని స్పష్టంగా చెప్పగలిగారు అది పరిపణ సమాజానికి మూల కందమైన ''వ్యక్తిస్వేచ్ఛ'' ఫ్యూడల్ సమాజంలో ఇది లేదు కులాల ఇనప గోడల్ని కూలగొట్టగల సాహసం మన కాల్పనిక కవులకు లేదు కనక ఊహా ప్రేయసితో స్వప్నలోక విహారం చేశారు గురజాడ వారి లవణరాజు కల, పూర్ణమ్మ, కన్యక ఇవి విప్లవ కాల్పనిక కథలు ఇందులో వ్యక్తి స్వేచ్ఛ కన్న వర్గ స్వేచ్ఛకు బీజాలున్నాయి శ్రీశ్రీ కవిత ఒకప్పుడు విప్లవ కాల్పనికతగానూ, మరొకప్పుడు కాల్పనిక విప్లవంగానూ వుంటుంది పరుగెడుతున్న కొత్త బండి ఎక్కాలన్న ఉబలాటమే అందుక్కారణం ఆ బండి ఎక్కడికి వెళుతుందో ఆలోచించే అవసరాన్ని ఆయన ఏనాడూ గుర్తించినట్లు కనిపించదు కనకనే అనేక ఆధునిక క్షీణ వాదాలకు ఆయన తెలుగులో పరపడి పెట్టిన ఆద్యుడు కూడా అయ్యాడు ఇరవయ్యో శతాబ్దపు యూరపు విప్లవ కాల్పనిక వాదుల అనుకృతు లెన్నో ఆయన చేశాడు ఆయన రచయిత కాడు కవి కవితలో పురుష భావా రోపణ అవసరం వాస్తవికత ఆ దశను దాటిపోతే కవిత్వం పాలు సన్నగిల్లు తుంది కనక శ్రీశ్రీకి ఈ పరిమితు లున్నాయి

## సవిమర్శక వాస్తవికత

సవిమర్శక వాస్తవికతను కూడా మనం పైనుంచే దిగుమతి చేసుకున్నాం పరిపణ సమాజం వికసించిన వాస్తవికత యిది ప్రజా స్వామ్యం పేరుతో ఈ

సమాజం ఆవిర్భవించింది స్వాతంత్ర్యం, సౌభ్రాత్వం, సమానత్వం అన్నవి దీని నినాదాలు ఈ సమాజావిర్భావానికి పూర్వం ఫ్యూడల్ శక్తులతో సకల రంగాల్లోనూ యుద్ధం చేయవలసి వుంటుంది మన దేశంలో మత ఫ్యూడలిజంతో కందుకూరి వీరేశలింగం, భాషా ఫ్యూడలిజంతో గిడుగు వెంకటరామ్మూర్తి, సాహిత్య ఫ్యూడలిజంతో గురజాడ అప్పారావూ యుద్ధాలు చేశారు రాజకీయ ఫ్యూడలిజంతో తెలంగాణా సాయుధ పోరాటం జరిగింది అంతే, ఆ తరవాత ఫ్యూడల్ వ్యతిరేక యుద్ధం మందగించింది ఫ్యూడల్ వ్యతిరేక యుద్ధం చేసిన బూర్జువా వర్గం ఒకసారి అధికారంలోకి వచ్చిన తరవాత ఆ యుద్ధాన్ని నిరోధిస్తుంది తెలుగు దేశంలో అదే జరిగింది జరుగుతోంది దేవునిముందు అందరూ సమానులు అన్నది ఫ్యూడల్ నీతి న్యాయం ముందు అందరు సమానులనేది బూర్జువా నీతి ఆ దేవుడినీ ఈ న్యాయాన్ని పాలించె వారు మాత్రం ఆయా కాలాల పాలకులు న్యాయపాలన వల్ల ప్రజాస్వామ్యం అన్ని రంగాలకూ విస్తరిస్తే తమ బతుకు భగ్గంపాడు అవుతుందని పరిపణ సమాజనేతలకు తెలుసు ప్రజాస్వామ్యం బూర్జువా వర్గం లాభాలను కావలి కాచే కుక్కలాంటిది అది వారికి మాత్రమే తోకూపాలి అలాకాక ఇతరులతో చనువు పెంచుకున్ననాడు ఆ కుక్కతో వారికి పని తీరిపోతుంది అప్పుడు వారు దాన్ని కాల్చి పారేస్తారు అలాంటి సమయంలో పరిపణ సమాజ నాయకులు ఫాసిస్టులుగా మారుతారు వారి మొదటి దెబ్బ మేధాస్థపతులైన రచయితల మీదా, మేధావుల మీదా పడుతుంది గత సమాజ క్షీణ లక్షణాలను, పరిపణ సమాజ కృష్ణ పక్షాన్ని కూడా సవిమర్శకంగా పరిశీలించి చెసే రచనల్లో ప్రతిఫలించే వాస్తవికతను సవిమర్శక వాస్తవికత అంటారు ఫ్యూడల్ సమాజంలో పున్నమి అంతరించి అమావాస్య మాత్రమే మిగిలిన భూస్వాముల కర్కశత్వం, బూర్జువా ప్రభువుల రక్తపిపాస, పురోహిత వర్గ ముష్కరత్వం, రాజోద్యోగుల అవినీతి, ప్రజల నిస్సహాయత, తిరుగుబాటు-ఈ జీవిత వాస్తవాన్ని, ఈ సామాజిక అస్తిత్వాన్ని ప్రతిబింబించేది సవిమర్శక వాస్తవికత ఈ సమాజంలో ధిక్కారస్వరాలు రానీయతి అనే సామాజిక చైతన్యం అగ్రిమం నేయం కనక సాహిత్యం ఈ రూపానికి అనుయాయిగా

[illegible] రాజకీయాలతో నిమిత్తం లేనివాడు రచయిత కాలేడు అతడికి తెలిసినా తెలియకపోయినా రచనల్లో రాజకీయాలు ప్రతిబింబించి తీరుతాయి

ఫాసిజం పుంజుకొంటున్న రాబోయే ప్రమాదాన్ని కవులు, కళాకారులు, శాస్త్రవేత్తలు గమనించారు 1935లో పారిస్‌లో మహాసభ జరిపి ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం తాము పోరాటం సాగించాలని నిశ్చయించారు స్పెయిన్‌లో ప్రజాస్వామ్య పద్ధతిలో అధికారానికి వచ్చిన అభ్యుదయ ప్రభుత్వాన్ని హత్య చేయడానికి ఫాసిజం కంకణం కట్టుకుంది మేధావులకు ప్రజాస్వామ్య పాక్షికత తప్పనిసరి అని ఆనాటి మేధావులు గుర్తించారు ఆ సభకు హాజరైన భారతీయరచయితలు కొందరు కొన్ని నెలల తరువాత లండన్‌లో సమావేశం అయి అభ్యుదయ రచయితల సంఘం పెట్టుకున్నారు 1936లో నెహ్రూ అధ్యక్షతను జరిగిన లక్నో కాంగ్రెసులో భారత అభ్యుదయ రచయితల సంఘం అవతరించింది దాని అధ్యక్షుడు మున్షీ ప్రేంచంద్ ఆనాడె అభ్యుదయోద్యమం పుట్టింది ప్రేంచందు సవిమర్శక వాస్తవికతను సృజించగలిగాడు కాని అభ్యుదయానుయాయులు మాత్రం దాన్ని సరిగా అందుకోలేకపోయారు కవితలో కాల్పనిక వాస్తవికతను దాటలేకపోయారు కాగా అభ్యుదయ భావకవితను మాత్రం తెలుగు దేశానికి అందించగలిగారు అందులోంచే ఆఖరికి కాల్పనిక విప్లవం లేదా విప్లవ భావకవిత్వం పుట్టింది ఇందులో ఒక శాఖ విశ్వనాథ వారికన్న వేయి సంవత్సరాలు వెనక్కి వెళ్ళాలన్న అచింతిత తాత్వికతను సంతరించుకుంది

విశ్వాసం పిట్టలాంటిది సూర్యోదయానికి చాలా ముందే వెలుగు రేకల రాకను పసికడుతుంది అంటాడు టాగోరు ఆ మాట ఏమోకాని కవులు మాత్రం పిట్టల్లాగే వెలుగు రేకల రాకను ముందే పసిగట్ట గలుగుతారు బహుశా అందుకే కాబోలు పిట్టల్లో మధుర కంఠం గల కోకిలతో కవులను పోలుస్తారు అలాంటి కోకిల్లాంటివారు గురజాడ అప్పారావు ఆయన కన్యాశుల్క నాటకం, మీ పేరేమిటి, దిద్దుబాటు ఆధునిక వాస్తవికతకు మూలస్తంభాలు కన్యాశుల్కం ఈనాటి సమాజాన్ని చిత్రించింది కాదు కాని ఆ నాటకం నేటికి నిత్యనూతనంగా కనబడు

తుంది వరశుల్కం నేటి సమాజంలో మహామ్మారిగా వుంది అయినా 'వర విక్రయం' నాటకం పూజా పురస్కారాలు లేక బూజుపట్టింది ఇందుకు కారణం కన్యాశుల్కంలో గల సవిమర్శక వాస్తవికత వరవిక్రయంలో గల కాల్పనిక వాస్తవికత గురజాడ క్రాంతదర్శిత్వానికి ఒకటి రెండు ఉదాహరణలు చాలు

"పల్లెటూరి పీపిల్ లెక్చర్లకి అన్‌ఫిట్ మొన్న మనం వచ్చిన బండి వానికి నేషనల్ కాంగ్రెసు విషయంపై రెండు గంటలు లెక్చర్ యిచ్చేసరికి ఆ గాడిద కొడుకు వాళ్ళ వూరి హెడ్ కానిస్టేబుల్‌ని కాంగ్రెసు వారు యెప్పుడు బదిలీ చేస్తారని అడిగాడు విలెజస్‌లో లెక్చర్లు యెంత మాత్రం కార్యం లేదు'' ఈ మాట నేటికీ అక్షరాలా నిజం- ఎనభై అయిదు ఏళ్ళ కిందటే ఆయన గిరీశం చేత ''ది ఎలెవన్ కాజెస్ ఫర్ ది డీజెనరేషన్ ఆఫ్ ఇండియన్ నాషనల్ కాంగ్రెస్'' అన్న లెక్చరిప్పించాడు కాంగ్రెసంటే దివాన్గిరి చెలాయించడం అని వెంకటేశం చేత బుచ్చెమ్మకు చెప్పించాడు స్త్రీ, శూద్రులు వెదం వింటే వారి చెవుల్లో సీసం కరిగించి పొయ్యాలనే వారు యిప్పటికీ లేకపోలేదు ఎనభై రెండు పన్నాలూ చదువుకున్న కొండుభట్టు లబ్బీసాయెబు తంతాననేసరికి చేతులు జోడించి ''కరకస్తురకశ్చైవ ద్వావేతేమంమోచకౌ'' అని సస్వరంగా చదువు తాడు పురోహితుల ముష్కరత్వానికీ దంభానికీ ఇంతకన్న నిదర్శనమేం కావాలి? ఇప్పటి మన ప్రభుత్వ ప్రతిపక్షాలు మీ పేరేమిటి కథలోని చాత్తాదిజంగమ దేవర వాదాన్ని గుర్తుకు తెస్తున్నాయి తెలుగునాట గురజాడ సవిమర్శక వాస్త వికతకు అద్వితుడు ఆయన సాంప్రాశువు ఆయన్నెవరూ తాకలేకపోతున్నారు

సవిమర్శక వాస్తవికతా దృష్టి తాత్త్వికంగా కందుకూరికి కూడా వుంది కాని ఆయనకు సౌందర్య దృష్టి లేదు వాస్తవచిత్రణ నైపుణ్యం లేదు సాహిత్యం ఆయనకు సాధనం మాత్రమే అది సాధ్యం కాదు ఆయన రచనలో తత్వం నెయింగా వుంటుంది వాస్తవం ఆ తత్వాభివ్యక్తానికి అనుబంధంగా మాత్రమే వుంటుంది సౌందర్యం ఆఖరిదిగా వుంటుంది కనుక సాహిత్యరీత్యా అది

తలకిందులుగా కనిపిస్తుంది తత్వం నేయమైనది, సాహిత్యం కాజాలదని ఇదివరకే తెలుసుకున్నాం గదా

## అచ్చులు

నిజానికి కాల్పనిక వాస్తవికత తర్వాత పరిణామం సవిమర్శక వాస్తవికత కాని తెలుగులో గురజాడ అప్పారావుగారి సవిమర్శక వాస్తవికత పుట్టిన తరవాత సాహిత్యం కాల్పనిక యుగానికి తిరోగమించింది అదే చిత్రం అందుకు కారణం ఒకటే ముందు మన దేశంలో ఇంగ్లీషు విద్యావ్యాప్తికోసం పాఠ్యగ్రంథాలలో వున్న పశ్చిమ సాహిత్యం అంతా కాల్పనికం అది భావకవితా యుగానికి దారి తీసింది ఆ తరవాత ఇంగ్లీషు నవలల అనువాదాలు వచ్చాయి ఆ పైన సెక్సు, క్రైంసాహిత్యాలను అందుకుంది అదే అత్యంతాధునిక సాహిత్యంగా చెలామణీ అయింది పరిపణ అర్థిక విధానం పెరక్కపోయినా సంబంధాలు పెరిగి భావాలు గుత్తార్థిక విధాన స్థాయికి చేరాయి ప్రచురణ సంస్థలు ఆ భావాలను ఆకట్టుకుని తదనుగుణమైన క్షీణసాహిత్య విధానాన్ని ప్రోత్సహించాయి ఈలోగా సోషలిస్టు భావాలు రచయితలను ఆవేశించాయి అదీ రాజకీయరంగంలో మాత్రమే కొత్త భావాలను సాహిత్యానికీ, సౌందర్య శాస్త్రానికీ వర్తించే విధానం తెలియకపోవడంతో తత్వం నేయమూ, సౌందర్యం మృగ్యమూ అయిన మరోరకం సాహిత్యం అవతరించింది బూర్జువా ప్రోలిటేరియట్ అనే మార్క్సిస్టు అభి వర్గాలకు బదులుగా కలవారు లేనివారు ధనికులు దరిద్రులు అనే పాత అభివర్గాలు ఆధారంగా కొత్త తత్వం తప్పుడుదారిపట్టింది ఆ తత్వానికి అనువుగా లంపెన్ వర్గాలు సాహిత్య నాయకులయ్యారు లెనిన్ సిద్ధాంతం ప్రకారం చారిత్రక సామాజిక అనుభవం అగ్రిమం స్వానుభవం అధమం రచయితల్లో అది తలకిందులై స్వానుభవం అగ్రిమమే కాదు అదే సర్వస్వంగా కావ్యరచన సాగింది ఈ రకంగా మరోరకం క్షైణ్యం తెలుగు సాహిత్యంలో ప్రవేశించింది

పరిశీలించదగిన వ్యక్తుల్లో విశ్వసనీయత ఉన్నప్పుడు అది టైప్ అవుతుంది దాన్నే 'అచ్చు' అని పిలుచుకుందాం ఆదిమానవుడు పురుషభావారోపణ కని

పెడితే సవిమర్శకవాదులు అచ్చులు కసిపెట్టారు గుమాస్తా, బడిపంతులు, కార్మికుడు, చెట్టు, పట్నం అనేవి విశ్వజనీనాలు వందమంది గుమాస్తాల్లో, బడి పంతుళ్లలో వుండే సామాన్యులను విశిష్టీకరించినప్పుడు అది ఒక అచ్చు అవుతుంది సామాన్యాలను విశిష్టీకరించడమే కళల లక్షణం కదా అలా అచ్చు పోసిన సవిమర్శక పాత్ర గురజాడ వారి గిరీశం వెయ్యేళ్ల తెలుగు సాహిత్య చరిత్రలో ఒక నక్షత్రకుడు, ఒక గిరీశం ఈ యిద్దరే అచ్చుయిగా పుట్టారు ఇలా అంటే చాలా మందికి నచ్చకపోవచ్చు అయినా యిది నిజం-చేదు నిజం సత్యం ప్రియంగా హితంగా వుంటుందనేది ఫ్యూడల్‌నీతి సత్యం నగ్నంగా వుంటుందని బూర్జువా రచయిత రుడ్యార్డ్ కిప్లింగ్ అంటాడు నిజానికి సత్యం చెదుగా వుంటుందని గోర్కీమతం దాన్ని శత్రువులేకాదు, మిత్రులు కూడా మింగలేరు అందుకే ఆయన తనకు గోర్కీ అని పేరు పెట్టుకున్నాడు గోర్కీ అంటే చేదు సోషలిస్టు నిజం చేదుగా వుంటుంది మరి

## జానపద వాస్తవికత

పురుషభావారోపణ నుంచి అన్యాపదేశం నుంచి ఇంతవరకు పుట్టినవన్నీ జానపద వాస్తవికతలో కనిపిస్తాయి పురాణాలు ఒక జాతి కలలు జానపద కథలు బడుగు జనం కన్న కలలు అని ఒక ప్రముఖ ఇంగ్లీషు విమర్శకుని మతం జానపదంలో వున్నది అన్యాపదేశ వాస్తవికత ఇంగ్లీషులో ఎలిగొరీ పల్లెటూరి బడుగు హింసకుల్నీ, పీడకుల్నీ ఎదిరించలేని అశక్తుడు అందుకని ఆదిమానవుని లాగే భ్రాంతి వాస్తవికతను సృష్టించుకుంటాడు తన ఊహాలోకంలో పీడకుల్ని నిర్జిస్తాడు అందుకు ప్రకృతిలోని సకలాన్నీ సాధనంగా తీసుకుంటాడు తన దొర భూస్వామి ఏడు కోటల్లో వుండే రాక్షసుడో, మాంత్రికుడో అయినట్లు ఊహిస్తాడు తన వూరి దారుశిల్పివేసిన కీలుగుర్రం ఎక్కి, రాక్షసుడిని చంపి, వాడి చెరలో వున్న వక్కని మక్కను పెళ్లాడినట్లు కల కంటాడు ఆ కల సాయంతో

నిరాశను నిర్మూలించి ఆశాభావాన్ని పెంచుకుంటాడు నిరాశా నిర్మూలనం, ఆశోన్మీలనం ఇదే కదా సాహిత్య ప్రయోజనం జానపద కథల్లోని నాయికా నాయకులంతా పేదలు దుర్బలులు సవతి తల్లి హింసలకో, పేదరికం బాధలకో గురైనవారు ఏ జానపదకథని ఏ ఫెయిరీటేల్‌ని పరిశీలించినా మనకీ సత్యమే సాక్షాత్కరిస్తుంది జానపద కవితల్లో ఎక్కువ వీరగాథలు కరుణగాథలు ఇవి వాగ్రూపంలో వున్నందువల్ల ఆనోటి నుంచి ఆనోటికి పాకుతూ సమకాలీన వాస్తవికతను సంతరించుకుంటూ వుంటాయి కనక ఇవి కూడా వేదాల్లాగే అపౌరుషేయాలు ఇప్పటికీ ఎక్కువ కవితలు వాగ్రూపంలోనే వున్నాయి ఆదిమ వాస్తవికత, పురాణవాస్తవికతలే ఆ కవితకు ఆధారం అయినా ఆధునిక వాస్తవికతను కూడా ఈనాడు సంతరించుకుంటున్నాయి గ్రంథస్థం అయ్యే వరకూ ఇలా పెరుగుతూనే వుంటాయి

నిజానికి కవితా లక్షణం ఇదే కవిత సాముదాయకం సామాజిక చైతన్య రూపం వ్యష్టి చైతన్యం సమాజ చైతన్యంకన్న భిన్నం కాదు కవితకు కవి ఆద్యుడు మాత్రమే తరువాత పాఠకులు ఆ కవితకు మెరుగులు దిద్దుతూ పోతూ వుంటారు కళాకారుని కృషిని గురించి 1920 లో ఒక శాస్త్రవేత్త కొన్ని సూత్రాలు చెప్పాడు ఆ సూత్రాలు సామాజిక చైతన్యరూపం అయిన సౌందర్యానికంతకూ వర్తిస్తాయి అంటే సకల లలిత కళలకూ వర్తిస్తాయన్న మాట అతడు నిర్వచించిన సూత్రాలివి

ఉత్తమ కృతిని గుర్తించడానికి నాలుగు లక్షణాలున్నాయి

ఒకటి ఏ కృతి అయినా కళాకారుని భావాలను సంవేదలను వ్యక్తం చేయాలి అంటే అందులో ఏదో ఒక సందేశం వుండాలి

రెండు కళాకారుడు తన భావాలను సంవేదనలను ఏ రూపంలో అయినా ప్రకటించవచ్చు అయితే ఇంతకు ముందే ఎవ్వరో చెప్పి చెప్పి అరిగ్గొట్టిన రీతిలో కాక తన సొంత రీతిలో ప్రకటించాలి ఆ పని చిత్తశుద్ధితో చేయాలి

మూడు ఇలా చేసిన ప్రకటన ద్రష్టల్లోనూ, శ్రోతల్లోనూ సొంత భావాలను సంవేదనలను ప్రేరేపించేదిగా వుండాలి అంటే అది ద్రష్టలకు శ్రోతలకు అర్థం అయేదిగా వుండాలి కావ్యం అయితే చదువడానికి వీలయ్యేదిగా వుండాలి

నాలుగు కృతివల్ల ప్రేరేపితమైన భావాలూ, సంవేదనలూ జనానికి అవసరం అయినవిగా వుండాలి అంటే వాటికి అభ్యుదయశీలం వుండాలి

కవి-పాఠకుల సాముదాయిక కృషి కావ్యం కవి తన భావి పాఠకులతో కలిసి కావ్య రచన చేస్తాడు ప్రతి పాఠకుడూ కవి కృషిని కొనసాగిస్తూ వుంటాడు ఆ కావ్యానికి తన భావాలను అనుభవాలను కలుపుతూ వుంటాడు

ఈ నిర్వచనం వాగ్రూప సాహిత్యానికి వ్యక్తంగానూ, ప్రత్యక్షంగానూ ఇప్పటికీ వర్తిస్తోంది జనం తమకు అనవసరం అనుకున్న భాగాలను విసర్జిస్తున్నారు అవసరం అనుకున్నవాటిని జోడిస్తున్నారు లిఖిత సాహిత్యానికి కూడా ఇది వర్తిస్తుంది అందుకు వాల్మీకి నుంచి గురజాడ వరకు మహాకవుల రచనలే సాక్ష్యం వారి మాటలకు మన భావాలను, అనుభవాలను నేటికీ జోడిస్తూనె వున్నాం ఇలా సాముదాయక కృషి సాగుతున్నంతకాలం కావ్యం ప్రవర్థమానం అవుతూనే వుంటుంది ఆ కృషి ఆగిపోగానే అది కన్ను మూస్తుంది లైబ్రరీల్లో సమాధి అవుతుంది

## సోషలిస్టు వాస్తవికత

సోవియట్ రాజ్యం ఏర్పడిన కొత్తలో ప్రొలిటేరియన్ కల్చర్ - కార్మిక వర్గ సంస్కృతిని సృష్టించాలన్న తపన పుట్టింది దానికి సరైన దారి చూపక పోతే అది అడ్డ వుంతలు తొక్కే ప్రమాదం ఉందని లెనిన్ గ్రహించాడు అప్పటికే ప్రొలిటెరియన్ కల్చరు వాదం పెర్రి తలలు తలపడింది గతాన్ని

తుడిచిపెట్టి కొత్త సంస్కృతిని పుట్టించాలన్న వాదాలు తలెత్తాయి. కనక ప్రొలిటేరియన్ కల్చర్ మీద లెనిన్ మాట్లాడవలసి వచ్చింది. ప్రొలిటేరియన్ కల్చర్ ఆకాశంమీద నుంచి ఊడి పడదు అని ఆయన హెచ్చరించారు. తర తరాలుగా భూస్వామ్య బ్యూరోక్రెటిక్ కాడి కిందపడి నలిగిపోతున్న సంస్కృతిని తార్కికంగా అభివృద్ధి పరిచిననాడే అది ప్రొలిటేరియట్ కల్చరు అవుతుందని ఆయన నిర్వచించాడు. దాన్తో పరిశోధనలు మొదలయ్యాయి. తరతరాల సంస్కృతి పరిణామాన్ని అధ్యయనం చేయడానికి పండితులు ఉపక్రమించారు. ఆదికాలం నుంచి ఆధునిక యుగం వరకు పుట్టిన సకల సౌందర్యాలను వాస్తవి కతలను ఆకళించుకుని అందులో అవసరం, స్థిరం, సారవంతం, పునరావృతం కాగల లక్షణాలను సంతరించుకుని సాగించే రచన సోషలిస్టు వాస్తవికత అవుతుందని గ్రహించారు. రచయిత సోషలిస్టు ప్రపంచ దృక్పథాన్ని అలవరచుకుని ఆ చూపుతో సమాజ వాస్తవికతను చిత్రించాలి. ఇంతవరకూ సోషలిస్టు వాస్తవికతకు గోర్కీనే ఉదాహరణంగా చూపుతున్నారు. దేశంలో సోషలిజం లేనిదే సోషలిస్టు వాస్తవికత ఎలా పుడుతుంది? అన్న ప్రశ్న ఒకటి తలెత్తుతుంది. గోర్కీ 'అమ్మ' రాసిన నాటికి రష్యాలో కూడా సోషలిజం లేదు. కాని సోషలిస్టు అన్వీక్షకిని అలవరచుకొనడానికి కావలసినంత సిద్ధాంతం పెంపొందింది. ఇప్పుడీ సిద్ధాంతం ఇంకా పెంపొంది అనేక దేశాలకు విస్తరించింది. కనక సోషలిస్టు వాస్తవికతను చిత్రించడానికి కావలసిన తాత్విక ఆధారం ఉంది. కాగా అందుకు కావలసిన పరిజ్ఞానాన్ని రచయిత సంపాదించ వలసి వుంటుంది. సోషలిస్టు వాస్తవికతను చిత్రించడానికి ఎన్నో నియమా లున్నాయి. వాటిలో ముఖ్యమైనవి ఇవి :

కమ్యూనిస్టు అన్వీక్షకి విషయంలో అచంచల నిష్ఠ. ప్రజాసేవా నిరతి. పాక్షికత. శ్రామిక జన సమరాలతో సన్నిహిత సంబంధం-సోషలిస్టు మానవత. అంతర్జాతీయత. చారిత్రక ఆశాభావం. రూపవాద వ్యష్టివాద సహజ వాద ఆదిమ వాదాల తిరస్కృతి.

ఇంతవరకు మానవజాతి సేకరించిన సకల నిక్షేపాలతోనూ నీ మనస్సును సుసంపన్నం చేసుకున్నప్పుడే నీవు కమ్యూనిస్టువు కాగలుగుతావు అంటాడు లెనిన్ సుందర భావనలకు ఆది మానవుడే ఒరవడి పెట్టాడు - వెండి బంగారాల ద్రవ్య ప్రయోజనాన్ని కనిపెట్టడానికి చాలా పూర్వమే ఆదిమానవుడు గనులు తవ్వి వెండి బంగారాలను వెలికి తీశాడు పుడమి తల్లి చీకటి కడుపులో చిక్కుకున్న కాంతి పుంజాలు ఆ లోహాలు వర్ణపటలిలోని రంగులన్నింటినీ ప్రతిరుచిస్తుంది వెండి అందులో ఆఖరి వర్ణమైన ఎరుపును ప్రతిరుచిస్తుంది బంగారం అంటాడు మార్క్స్ వీటిని ద్రవ్యప్రయోజనంకోసం కాక అందం కోసం తవ్వి తీశాడు ఆదిమానవుడు. బూర్జువా మానవత ఉదాసీనం సోషలిస్టు మానవత క్రియాశీలం బూర్జువా మానవతా వాదుల లెక్క ప్రకారం హిట్లరూ మానవుడే అతడి బూకెన్ వాల్డు శిబిరంలో చిత్రహింసలకు గురైన అభాగ్యులూ మానవులే హిరోషిమా నాగాసాకీలమీద ఆటంబాంబు వేసినవాడు కూడా మానవుడే అలాంటివాడిని చూసి 'ఓ మానవుడా! నీవెంత కఠినాత్ముడవు అంటారు బూర్జువా మానవతావాదులు సోషలిస్టు మానవాతావాదులు అలా అనరు— కంచికచర్ల కోటేశునీ అతడిని స్తంభానికి కట్టేసి నూనె గుడ్డలు చుట్టి కాల్చేసిన ఆసామినీ "ఓ మానవుడా'" అనరు అటువంటు చెరబట్టే అధికార కీచకుల్ని 'మానవుడా, నీవెంత నిర్దయుడవు' అనరు

అందమైన మాటలు- వాటి పొందిక, అలంకారాలు వగైరాలను రూపం అంటారు వాటి ద్వారా వ్యక్తం చేసే భావాన్ని విషయం అంటారు విషయంతో నిమిత్తం లేకుండా రూపానికి ప్రాముఖ్యం ఇస్తే దాన్ని రూపవాదం అంటారు ఇది శుద్ధ సౌందర్యవాదం "విషయం ఏదైనా వచన కవిత్వంలో రాస్తే చాలు అది అభ్యుదయం కన్న ఆరాకు లెక్కువ'' అనేది రూపవాదానికి మచ్చుతునక సమాజ వాస్తవికతకు ఆత్మనిష్ఠ ప్రతఫల వైఖరీ రూపమే సాహిత్యం నిజమే కాని సామాజిక అస్తిత్వంతో నిమిత్తం లెకుండా తన పశ్యంతి (ఉపచేతన)లోని భావాలకు వైఖరీ రూప కల్పించడం వ్యష్టివాదం సమాజ సంబంధాల జోలికి

పోకుండా తన ఇంద్రియానుభవాన్ని మాత్రమే చిత్రించడం సహజవాదం ఇంత వరకూ పెంపొందిన సంస్కృతినంతటినీ తిరస్కరించి, ఆదిమానవుని దశకు పోయి అలాంటి భావాలను చిత్రించడం ఆదిమవాదం మాస్కో, లండన్, న్యూయార్కు నిర్జనారణ్యాల్లో నగ్నవాదులు మొలిపించడం ఈ ఆదిమవాదానికి ఒక ఉదాహరణ వీటన్నింటినీ ఇప్పుడు సముచ్చయంగా 'అధునికత' మోడర్నిజం అని పిలుస్తారు పేరులో తప్ప ఆధునికత ఈ వాదాల్లో ఎక్కడా కానరాదు సోషలిస్టు అన్వీక్షకి గల వారు ఈ వాదాలన్నింటినీ తిరస్కరిస్తారు కాగా ఈ వాదాలన్నింటికీ భౌతిక పునాది లేకపోలేదు ఈ సమాజంలో ఇప్పుడు కానవచ్చే సకల కళ్మలాలకు, రుగ్మతలకూ అవి ప్రతిబింబాలు ఉదాత్త సాహిత్యం మొలకెత్తి ఏపుగా పెరగడానికి ఈ "ఆధునిక'' ప్రక్రియలన్నీ కంపోస్టుగా పని చేస్తాయి కనక ఇలాంటిదాన్ని కంపోస్టు సాహిత్యం అని పిలవడం సముచితం

కందుకూరి, గురజాడ, గిడుగులు మత సాహిత్య భాషా ఫ్యూడలిజాలతో యుద్ధాలు చేశారు ఆ యుద్ధాలు తరవాత మందగించాయి ఇంకా తాత్విక నైతిక ఫ్యూడలిజాలతో యుద్ధం సాగించవలసిన అవసరం వుంది అన్ని రంగాల్లోనూ యుద్ధం ముమ్మరం అయినప్పుడుమాత్రమే సవిమర్శక వాస్తవికత పుట్టడానికి అనువైన పరిస్థితులు ఏర్పడతాయి కనక తెలుగుసాహిత్యం గురజాడ తరవాత సవిమర్శక వాస్తవికతను అందుకోలేక పోయింది పైగా అంతకు ముందు పుట్టిన కాల్పనిక దశను తిరోగమించింది అలాంటి స్థితిలో సోషలిస్టు వాస్తవికతను ఊహించడం కూడా కష్టం ఎవరైనా తాము సోషలిస్టు వాస్తవికతను రచిస్తున్నా మనుకుంటే మనమేమీ చేయలేము మరుగుజ్జు తాను సాలవృక్షం కొమ్మల్ని అందుకుంటున్నట్లు భ్రాంతిపడితే ఎవరేం చేయగలరు? మానవజాతి సంగ్రహించిన నిక్షేపాలతో మనసును సుసంపన్నం చేసుకొనడానికి తెలుగు నాట అవకాశమే కనిపించడంలేదు హోమర్, వ్యాసుడు, వాల్మీకి, వర్జిల్, భవభూతి, మిల్టన్, కాళిదాసు, షేక్స్పియర్, గోర్కీ, గురజాడ, గెథే, గాలిబ్ ఎవరి కావ్యం అయినా అది

సౌందర్యనిధి విజ్ఞానఖని ఆ గనులను తవ్వే అవకాశం తెలుగు వారిలో ఎందరికి కలిగింది? ముందామెలకువలు నేర్చుకోవాలి ఆ నిధులను వాడుకోగల తెలివి అలవరచుకోవాలి అందుకోసం చూపు వెనకనున్న అసలు చూపును పదును పెట్టుకోవాలి తెలుగువాడు అలా చేయగలిగిన నాడు తిరిగి సవిమర్శక వాస్తవికత అవతరిస్తుంది సోషలిస్టు వాస్తవికత కూడా పుడుతుంది మన రచయితలకు శక్తి వుంది నిపుణత, లోక కావ్యాద్యవేక్షణ కొరవడ్డాయి అంతే ఆ కొరతను పూడ్చుకున్ననాడు తెలుగు రచయిత ప్రపంచ రచయితల సరసను గర్వంగా నిలబడగలుగుతాడు

ఆధునిక తెలుగు సాహిత్యంలో

# అభ్యుదయవాదం

—కంచెనపల్లి చినవెంకటరామారావు

తెలుగు సాహితీ జీవనం ఎన్నో దశలను దాటి వచ్చింది ఈ సాహితీ జీవనం, జన జీవితంతో పెనవేసుకొనిపోయి వుంటుంది ఈ జన జీవితం పునాదులు తెలుగు సమాజంలో వున్నాయి

సమాజాభివృద్ధికి అనుగుణ్యంగా సాహిత్యం ఆయా మజిలీల్లో వికసించి, పుష్పించింది ఒక్కొక్క మజిలీ ఒకొక్క యుగం ఆటవిక, అనాగరిక, నాగరిక దశల్లో మాతృస్వామ్య, పితృస్వామ్య, బానిస, భూస్వామ్య, జనస్వామ్య, సామ్య వాద యుగాలు ఆవిర్భవించాయి ఆటవిక, అనాగరిక దశలకన్నా నాగరిక దశలోనే అధిక సంఖ్యాక యుగాల ఆవిర్భావం, వికసనం జరిగింది ఆయా యుగాల అవసరాల కోసం కొన్ని సామాజిక కట్టుబాట్లు ఏర్పాటు చేసుకున్నారు వర్గ సమాజాలు వచ్చాక వాటికే ధర్మాలని పేరు పెట్టుకున్నారు అవి అనుల్లంఘ నీయాలనీ, ఆ పరమాత్మ వద్దనుండి సరాసరి దిగుమతి అయ్యాయనీ శాసించారు ఈ కట్టు దిట్టాలన్నీ ఆర్థిక వ్యవస్థ పునాదిగా, దాని ఉపరితలాలైన రాజకీయ సంబంధాలనూ, మతం, కళలు, తాత్త్విక, నైతికాలనూ స్పృశించేవే ఈ సంబంధాలన్నీ ఆయా యుగాల సాహిత్యాల ద్వారా ప్రచారంలోకి వచ్చాయి ఎంత అనుల్లంఘనీయాలని లక్ష్మణ గీతలు గీసి, గీ పెట్టినా యుగ మార్పిడితో పాటు ఆర్థిక రాజకీయ సంబంధాలూ, వాటితో పాటు మతం నీతి, కళలు సాహిత్యం మూలమట్టంగా మారుతూనే పోతున్నాయి మతం, కళలు, సాహి త్యాల్లో మార్పులు కొంత వ్యవధానంతో వస్తూ ఉన్నాయి నూతన మూల్యాలను అస్తిత్వంలోకి తీసుకొస్తున్నాయి

తెలుగు భాషా సాహిత్యాల చరిత్రకు సామాజిక చరిత్ర పునాది వంటిది సామాజిక చరిత్ర యొక్క అంగాంగంగా సాహిత్య చరిత్రను అధ్యయనం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది భారతీయ సమాజానికి సమగ్ర సామాజిక నిర్మాణం శాస్త్రీయ పద్ధతుల మీద జరగలేదు ఇంకా తారీకుల, దస్తావేజుల మతలబులతోనే, కులాల, మతాల కలుషిత దృక్కోణం నుంచే శిగపట్ల గోత్రాలు చెలరేగుతున్నాయి సామాజిక దృష్టితో చేసిన ప్రయత్నాలు చాలా స్వల్పం, చేయాల్సింది బోలెడంత ఉంది

తెలుగువాళ్ళు తెగలు (Tribes) గా ఉన్నప్పటి సాహిత్యం మనకు లభించలేదు ఆస్థానాలు, అగ్రహారాల సాహిత్యాలకి వ్యతిరేకంగా ప్రజానీకంలో ప్రచలితమై ఉన్న పదకవితలు కూడా మనకు దక్కలేదు వాటిపట్ల చిన్న చూపు చూపి పడదిట్టడం జరిగింది పురాణ, ప్రబంధ కవితల ఆవిర్భావానికి కల ఆర్థిక, సామాజిక పునాదులూ, వాటిల్లోని మార్పులూ మనకు అప్రస్తుతం పురాణ, ప్రబంధ కవితలు భూస్వామ్యయుగ వికాస పతనాలకు అంతర్భాగాలు భాషలోనూ, ఛందస్సులోనూ, భావాల్లోనూ, తత్వంలోనూ ఏమంత తేడా లేదు ఈ భూస్వామ్య యుగ సాహిత్యం, భూస్వామ్య యుగ వ్యవస్థలాగే ఎన్నో వెర్రి తలలు వేసి, ఇంచుమించు ఎనిమిది వందల ఏళ్ళు సాగింది బ్రిటిషు వాళ్ళు వచ్చి ఒక ఊపు ఊపిందాకా, అతలాకుతలం చేసిందాకా నిల్వనీరు లాగా ఉండి పోయింది

బ్రిటిషు వాళ్ళు తమ సామ్రాజ్యవాద ప్రయోజనాలకు అనుగుణ్యంగా కొన్ని ఆర్థిక, రాజకీయ, సాంఘిక మార్పులు చేశారు ఆనాటి కరడుగట్టిన భూస్వామ్య వ్యవస్థను కొన్ని పరిణామాలకు గురిచేశారు ఆదాయం పెరగటానికి ఆనకట్టలు కట్టారు తమ పాలనా యంత్రాంగపు మరలుగా గుమాస్తాలను తయారుచేసే ఇంగ్లీషు విద్యావిధానాన్ని ప్రవేశపెట్టారు తద్వారా దేశంలో ఒక మధ్యతరగతి విద్యావంతుల సృష్టి జరిగింది ఈ మధ్యతరగతి విద్యావంతులూ, మేధావుల నుండే ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమ నాయకత్వం ఆవిర్భ

వించింది. మనకన్నా ముందడుగు వేసిన బెంగాల్ పునరుజ్జీవనోద్యమం నుంచి ప్రేరణను పొందింది. కందుకూరి వీరేశలింగం పంతులు, రఘుపతి వేంకట రత్నం నాయుడు, గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు గారలు ఈ నాయకత్వాన్ని స్వీకరించారు. వీరి కార్యక్షేత్రం సాంఘిక సంస్కరణలకు, సాహిత్య ప్రక్రియలకు మాత్రమే పరిమితం. పారిశ్రామిక యుగ ధర్మమైన ప్రజాస్వామిక తిరుగుబాటును వీరు సంఘంలోనూ, సాహిత్యంలోనూ లేవదీశారు. దానికి పునాదులు వేసి, దారులు దిద్దారు. సాంఘిక సంస్కరణా క్షేత్రంలోనూ, సాహిత్య కేదారంలోనూ ఎన్నో విజయాలు సాధించారు. తెలుగు సాహిత్య ఉద్యానంలో కవిత్వంతో బాటుగా గద్యం, వ్యాసం, కథ, నవల, నాటిక, నాటకం ఇత్యాది ఎన్నో కొత్త అంట్లు తొక్కించారు.

వీరందరిలో గురజాడ అసమాన ప్రతిభాశాలి. తన కాలానికన్నా చాలా ముందున్నవాడు. గిడుగు వారి వ్యావహారిక భాషావాదాన్నీ, కందుకూరి, రఘుపతి గారల సంఘ సంస్కరణ దీక్షనూ జీర్ణించుకొని గేయం, కథానిక, నాటకం ఇత్యాది ఎన్నో సాహిత్య ప్రక్రియలను పండించాడు. వాటిని కళాత్మకంగా అత్యుత్తమ స్థాయికి తీసుకుపోయాడు. ఆధునిక సాహిత్యానికి మార్గాలు దిద్ది యుగకర్త అయ్యాడు. ఈయనలో కాల్పనికత, వాస్తవికత రెండూ రెండు పాయలుగా సంగమించాయి. సమకాలీన సమాజాన్ని సవిమర్శకంగానూ, సృజనాత్మకంగానూ, కళాత్మకంగానూ వాస్తవికతను ఆధారం చేసుకొని సౌందర్య విలువలు కాపాడుకుంటూ సాహిత్య సృష్టి చేశాడు. కాని ఆరోగ్య ప్రదమైన ఈ వారసత్వం పురోగమనం చెందలేదు. అలా కాకుండా సజీవమైన వ్యావహారిక భాషకు వ్యతిరేకంగా గ్రాంథికాన్నీ, వాస్తవికతకు బదులు కాల్పనికతనూ, గేయ సాహిత్యానికి వ్యతిరేకంగా ఛందోబద్ధ కవిత్వాన్నీ ఆధారంగా చేసుకొని భావ కవితోద్యమం విజృంభించింది. (వ్యావహారిక భాషా ప్రచారానికి కూడా భావకవితోద్యమం చేసిన దోహదాన్ని మరువకూడదు.) అయితే ఆరోగ్యప్రదమైన గురజాడ వారసత్వాన్ని అభ్యుదయోద్యమం మాత్రమే ముందుకు తీసుకువెళ్ళింది.

భావకవిత్వం మాత్రం కథకు విడాకులిచ్చి అనుభూతి వ్యక్తీకరణకు ప్రాధాన్యాన్నిచ్చింది దీనితోపాటు శైలీ లాలిత్యాన్ని సాధించింది కథలు, నాటికలు, నవలలు, సాహిత్య విమర్శలు ఇత్యాది గద్య సాహిత్యాన్ని కాల్పనిక వాదపు వెలుగులో సృష్టించింది కాల్పనిక వాద మాయా జంతారు తెరలు కారణంగా సమాజంలో వస్తున్న మార్పులను ప్రతిబింబించలేదు ఒకవంక జాతీయ స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతూ ఉంటే ''దిగిరాను, దిగిరాను, దివి నుండి భువికి'' అంటూ గజదంత గోపురాల్లో కాపురం చేస్తూ ఉండిపోయింది సమాజం నుండి వేరుపడిన తమ ఒంటరితనాన్ని సమర్థించుకోడానికి 'కళ కళ కోసమే' అన్న శిల్ప వాదం (formalism) లో చిక్కుబడి పోయింది సాహిత్యానికి తప్పకుండా ప్రయోజనం ఉండాలి, ఉంటుంది అన్న భారతీయ సంప్రదాయాన్ని కూడా తృణీకరించింది ఈ విధంగా సుమారు ఇరవై ఏళ్ళు (1910-1930) సాహిత్యోద్యమాన్ని ప్రభావితం చేసింది శిల్పవాదం ముదిరిన తరువాత వచ్చిన సాహిత్యం, ప్రతిభాశాలులైన మొదటితరం భావకవుల కవితలకు నీరసమైన ప్రతిధ్వనులుగానూ, జీవరహితంగానూ తయారయింది

భావకవిత యొక్క కాల్పనిక సాహిత్యంపై ఒక విప్లవాత్మకమైన తిరుగుబాటుగా అభ్యుదయ సాహిత్య యుగం ఆవిర్భవించింది ఇదేదో ఆకాశంనుంచి ఊడిపడిందేమీ కాదు కాల్పనిక కవితలోని దేశభక్తి విభాగం, మానవతావాదం యొక్క గుణాత్మక పరిణామమే అభ్యుదయ వాదం మొదట కవితతో ప్రారంభమై తరువాత కథానిక నవల, నాటకం, నాటిక ఇత్యాది గద్య ప్రక్రియలకూ అభ్యుదయ వాదం విస్తరించింది ఇదివరకూ తెలుగు సాహిత్యంలో వచ్చిన పురాణ, ప్రబంధ, కాల్పనిక యుగ పరిణామాలకన్నా అభ్యుదయవాదం విశిష్టమైనది, విప్లవాత్మకమైనది ఇతివృత్తంలోనూ, భావనలోనూ, భాషలోనూ, ఛందస్సులోనూ, సంవిధాన శిల్పంలోనూ, తాత్వికతలోనూ పూర్తిగా కొత్తదారులు తొక్కింది ఇంచుమించు 1930 నుంచి నేటివరకూ సుమారు అర్ధశతాబ్దం సాహిత్యక్షేత్రాన్ని ఆకట్టుకొని ఉంది అభ్యుదయ వాద ఆవిర్భావానికి కారణమైన

ఆర్థిక, రాజకీయ సాంఘిక కారణాలనూ, వాటి ప్రతిబింబంగా వచ్చిన సాహిత్య పరిణామాలనూ పరిశీలించే ముందు 'అభ్యుదయ' శబ్ద విచారం మంచిదను కుంటాను

'అభ్యుదయం' అన్న శబ్దానికి నేడు ప్రగతి, పురోగమనం అనే అర్థాలు స్థిరపడిపోయాయి ఈ యుగంలో వచ్చిన కవితకు అభ్యుదయ కవిత్వం అన్న పేరు రాశిలో కొంత పెరిగిన తరువాత చాలా కాలానికి వచ్చింది నిఘంటువుల్లో అభ్యుదయం అన్న పదానికి అర్థం- ఉదయించుట, సంభవము, కలుగుట, శుభము, మంగళము, వృద్ధి, అభీష్ట క్యారసిద్ధి, ఇష్టప్రాప్తి, ఉత్సవము- అని ఉంది. ప్రతి ప్రబంధంలోనూ, కావ్యంలోనూ, ''అభ్యుదయ పరం పరాభివృద్ధిగా'' అన్న సమాసాన్ని తీసుకొని అభ్యుదయ సిద్ధాంతం ప్రబంధాల్లో లేదా అని శంకించే కుశంకలకు ఆస్కారంలేదు ఇలాంటివి- ''అన్నీ మన వేదాల్లోనే వున్నాయష'' అనే మనస్తత్వ ప్రతిబింబాలూ, ఫలితాలూ తప్ప అన్యం కావు ఎందుకంటే-అభ్యుదయ సాహిత్యం ఒక ప్రత్యేకమైన చారిత్రక దశలో ఆవిర్భవించింది అభుదయ సాహిత్యం పుట్టుకతో రచనా సూత్రాలు మారి పోయాయి పాత విలువల స్థానే కొత్త విలువలు వచ్చాయి మాంధాతలనాటి పాత ఆలంకారిక సూత్రాల కొలబద్దలతో దీన్ని కొలవడానికి వీలులేకుండా పోయింది అలాగే దీని దృక్పథం, నూతన రచనా సూత్రాలూ అభ్యుదయ సాహిత్యానికి ఆలంబనాలు ఇవి సాహిత్యంలో ఒక విప్లవాన్ని తీసుకువచ్చాయి భావ కవిత్వంలో అనుభూతికి వున్న స్థానాన్ని దృక్పథం ఆక్రమించింది అంటే ఆత్మానుభూతి నుండి భౌతిక వస్తువుకూ, దాని వాస్తవికతకూ ప్రాధాన్యం వచ్చింది దీని తాత్విక దృష్టి కూడా ఇతః పూర్వానికన్నా భిన్నమైంది ''మానవుడు ప్రకృతి సూత్రాలనూ, సమాజ సూత్రాలను తెలుసుకోవడమే కాదు దానిని సామూహిక శక్తితో మార్చివేయగలడు అసలు 'ప్రజలే చరిత్ర నిర్మాతలు' అన్న సిద్ధాంతం దీనికి తాత్విక పునాది అభ్యుదయ వాదానికి ముందు ఉన్న దంతా ఆనంద సాహిత్యమైతే, అభ్యుదయ వాద సారస్వతం చైతన్యవంతమైంది

వాస్తవికత, సుందరత, తాత్వికతలు దీనికి పునాదులు సౌందర్యం ఇరుసుగా వాస్తవికతా చిత్రణ జరుగుతుంది తాత్వికత పూసల్లో దారంలాగా అంతర్ని హితమై ఉంటుంది

ప్రగతి, పురోగమనం అన్న అర్థం వచ్చేటట్లుగా అభ్యుదయ పదాన్ని మొట్టమొదట వాడినవాడు శ్రీశ్రీ అప్పుడాయన భావకవులు స్థాపించిన నవ్య సాహిత్య పరిషత్తులో సభ్యుడు దానిలో వుండే నవ యువకుల గ్రూపుకు నాయకుడు 1937 లో ఆయన రాసిన 'అభ్యుదయం' అన్న ఖండికలో ఈ పదం వాడాడు

నేడే

ఈనాడే

ఈనాడే

జగమంతా బలివితర్ది

నరజాతికి పరివర్తన

నవజీవన శుభ సమయం

**అభ్యుదయం**

ఇంచుమించుగా మొదటిసారి 'అభ్యుదయం' అన్న పదాన్ని సాంప్రదాయిక అర్థంతో కాక నూతన అర్థంలో, నేటి అర్థంలో ప్రయోగించాడు శ్రీశ్రీ

అభ్యుదయ వాద సాహిత్యం దృక్పథానికి ప్రాధాన్యం ఇచ్చిందని మనవి చేశాను ఈ దృక్పథం మార్క్సిజమేనని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు మార్క్సిజం లోని ప్రధాన లక్షణాలైన భౌతికవాదం, గతి తర్క సిద్ధాంతం, చారిత్రక భౌతికవాదం, వర్గపోరాటం ఇత్యాదులు అభ్యుదయ కవిత్వాన్ని సాహిత్యాన్ని కంరదఘ్నంగా ప్రభావితం చేశాయి వీటిని అన్వయించుకున్న కారణంగా

ఇంతకు పూర్వమున్న సాహిత్యాల్లాగా ఆముష్మిక చింతనకు దీనిలో స్థానం లేదు "మానవుడు తన మంచి చెడ్డలకు తానే బాధ్యుడు, ఆకలి — అజ్ఞానం, దరిద్రం ఇలాంటి వాటికి సంఘంలోని ఆర్థిక అసమానతలు, ఉత్పత్తి, పంపిణీల్లోని అసమానతలూ, ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం యిత్యాదులు కారణం వాటిని మార్చివేస్తే మానవుడు విముక్తిపొంది మహోన్నతుడు కాగలుగుతాడు మానవ సంఘానికి తన పరిస్థితులను తాను చక్కదిద్దుకునే శక్తి వుంది కానీ తగిన చైతన్యం లేదు ఆ చైతన్యాన్ని అందించడమే అభ్యుదయవాద సాహిత్యం చేయాల్సినపని ప్రజలే చరిత్ర నిర్మాతలు, మరెవ్వరూ కారు ధనిక, దరిద్ర భేదాలు పూర్వజన్మల పాప, పుణ్యకర్మం ఫలితమేనని చెప్పే కర్మసిద్ధాంతాన్నీ, తలరాతల్నీ, విధివాదాన్నీ, ఆకాశంలో ఉన్నాయనుకునే అదృశ్యశక్తులనూ, ఎక్కడో ఉన్న నక్షత్రాలూ, గ్రహాలూ మానవుని జాతకాన్ని నిర్ణయిస్తాయన్న సిద్ధాంతాలూ-ఇవన్నీ ఈ దృక్పథంలో బుద్ధిజాడ్య జనితాలు ఈ సిద్ధాంతాలు, వర్తమాన కాలంలోని పీడననీ, దోపిడినీ సమర్థించె పాలక వర్గాల చేతుల్లోని కీలుబొమ్మలని అభ్యుదయవాదం నమ్ముతుంది పాలకవర్గాలు ఉత్పత్తి శక్తులనూ, ఉత్పత్తి సంబంధాలనూ, వాటి వ్యవస్థనూ ఆటబొమ్మలుగా ఆడిస్తున్నాయి అల్పసంఖ్యాకులైన పీడకులు అత్యధిక సంఖ్యాకులైన కష్టజీవులను పీడిస్తున్నారు దాన్ని సమర్థించడానికి మతాన్ని, నీతిని, తత్త్వశాస్త్రాన్ని సృష్టించి ఆయుధాలుగా వాడుకుంటున్నారు శ్రామికులు వర్గ పోరాటం ద్వారా విప్లవాన్ని తెచ్చి, అధికారాన్ని సాధించి, సామ్యవాదాన్ని స్థాపిస్తారు" స్థూలంగా ఇది సామ్రాజ్యవాద, ఫ్యూడల్ గుత్తపెట్టుబడిదారీ వ్యతిరేక దృక్పథం కలది అభ్యుదయ వాద దృక్పథాన్ని నిర్ణయించేది ఎప్పటికప్పుడు సైన్సు, ఆర్థిక రాజకీయ, జాతీయ, అంతర్జాతీయ సాంఘిక, పురోగామి శక్తులు సామ్రాజ్యవాదం యొక్క పైశాచిక స్వరూపాలైన ఫాసిజానికీ నాజీజానికీ అభ్యుదయవాదం బద్ధశత్రువు అలాగే జాతీయవాదం పేరితో దాని ముసుగులో వెలామిశి కాజూసె మత మౌఢ్య ఛాందసాలపహాడా ఇది వ్యతిరేకం కళలూ, సాహిత్యానికీ సంబంధించి అభ్యుదయవాదం

చెప్పేదేమిటంటే-భౌతిక సంపదలను పిడికిట్లో బిగించి పెట్టుకున్న వాళ్ళే సాహిత్య సాంస్కృతిక రంగాల్ని కూడా గుప్పిట్లో పెట్టుకొని, వాటిచే ఊడిగం చేయించుకుంటారు. భౌతిక సంపదలను సమాజపరం చేసి శ్రామికుల అభివృద్ధికి ఉపయోగించినట్లుగానే సాహిత్యాన్ని, కళల్ని కూడా అందరికీ అందుబాటులోకి తీసుకురావాలి. తద్వారా అత్యధిక సంఖ్యాకులకు ఉపయోగపడే సాహితీ సంస్కృతులను పెంపొందింపచేయాలి''- పైన ఉదహరించిన విషయాలన్నీ అభ్యుదయం అన్న పదంలో ఇమిడివున్న వర్తమాన అర్థాలూ, అంతరార్థాలూ. ఇదంతా ఈనాడు 'అభ్యుదయ' పదంలో ఉన్న భావసముదాయమన్నమాట. దీన్నే 'అభ్యుదయ' శబ్దం యొక్క నిర్వచనం అనుకోవచ్చును. ప్రస్తుతానికి వస్తున్న-వచ్చే సామాజిక పరిణామాలు అభ్యుదయవాదంలోని విలువల చేర్పులకూ, మార్పులకూ కారణం కావచ్చు.

అభ్యుదయ వాదం పుట్టుకా, వికాసాలను చర్చించేముందు దాని చారిత్రక భూమికను కొంత పరామర్శించుకుందాం. దీని పుట్టుకకు సంబంధించిన ప్రేరక శక్తులు ఆనాటి జాతీయాంతర్జాతీయ పరిస్థితుల్లో ఉన్నాయి. 1930 నాటికి పెట్టుబడిదారీ ప్రపంచాన్ని ఆవరించిన ఆర్థిక సంక్షోభం ప్రపంచాన్నంతా కుదిపి, కదిపి వేసింది. వీటి కారణంగానే 1914 లోనూ, 1939 లోనూ ప్రపంచయుద్ధాలు సంభవించాయి. ఈ ఆర్థిక సంక్షోభం పెట్టుబడిదారులను బాగా బలిపించింది. శ్రామికులను, మధ్య తరగతి ప్రజలను కృంగదీసింది. ధరలు నిలకడను కోల్పోయాయి. ఇది ఇలా ఉండగా సోషలిస్టు జీవన విధానాన్ని అవలంబించి పురోగమిస్తున్న సోవియట్ యూనియన్‌లో ఆర్థిక సంక్షోభ కారు ఎక్కువు కమ్మలేదు. ప్రజల జీవన ప్రమాణాలు ప్రణాళికా బద్ధ ప్రగతితో పురోగమించాయి. పెట్టుబడిదారి ప్రపంచంలో జీవన ప్రమాణాలు నానాటికీ దిగజారుతున్నాయి. వీటన్నిటిని శ్రద్ధగా గమనిస్తున్న ప్రజాతంత్రవాదులూ, మేధావులూ వామపక్షీయ అతివాద భావాలంవైపు మొగ్గుచూపారు. మొదటి ప్రపంచ యుద్ధంతరువాత ప్రపంచ సాహిత్యంలో వచ్చిన ఇమేజిజం, సింబాలిజం, డాడాయిజం, నిరాశావాదాలపైన యూరప్‌లోని లెఫ్ట్ వింగర్సు-ఆడెన్, స్టీఫెన్ స్పెండర్, డెటాయిస్, కాడ్ వెల్, రాల్ఫ్‌ఫాక్స్

మొ॥ బ్రిటిషు కవులూ, రచయితలూ తిరుగుబాటు లేవదీశారు నిరాశావాద, శిల్పవాదాలను ప్రతిఘటిస్తూ ''న్యూసిగ్నేచర్స్'' అనే కావ్య సంపుటిని 1932లో వెలువరించారు లండన్ రచయితల మానిఫెస్టోను కూడా ప్రకటించారు ఈ మెనిఫెస్టోలోని అంశాలనే శ్రీశ్రీ తన 'ప్రతిజ్ఞ' అన్న ఖండికలో కళాత్మకంగా ఇమిడ్చి వివరించారన్న విషయాన్ని మనం మరువకూడదు అదే కాలంలో అభివృద్ధి నిరోధకాలైన ఫాసిజం, నాజిజాలు పుట్టుకొచ్చాయి ఆ పాములకు పాలు పోసి పెంచారు బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు స్పెయిన్ దేశంలో వచ్చిన ప్రజాతంత్ర విప్లవాన్ని గొంతునులిపే ప్రయత్నంలో సామ్రాజ్య వాదులు, ఫాసిస్టు ఇటలీ, నాజీ జర్మనీలను, స్పెయిన్‌లోని జనరల్ ఫ్రాంకోకు ఎత్తాసుగా ఉసికొల్పారు యూరప్ సంతా ఆక్రమించ బూనుకొన్న ఫాసిజం, నాజీజం, సామ్రాజ్య వాదాలకు వ్యతిరేకంగా ప్రజాతంత్రవాదులూ, వామపక్షీయులైన కమ్యూనిష్టు, సోషలిస్టు పార్టీలూ, పాప్యులర్ ఫ్రంటూ ఐక్య సంఘటనతో సంఘటిత మయ్యారు మంత్రి వర్గాలను కూడా ఏర్పరిచారు కొన్ని దేశాల్లో కాడ్‌వెల్ లాంటి మేధావులూ, రచయితలూ స్పెయిన్ విముక్తి పోరాటంలో పాల్గొని ప్రాణాలర్పించారు మన దేశంలో ఆనాటి కాంగ్రెసు సంస్థ నెహ్రూగారి నాయకత్వంలో ఆ పోరాటాలకు బలపరిచి స్నేహార్ద్రతను తెలిపింది పై నుదహరించిన పోరాటాల వెలుగులో గొప్ప సాహిత్యం వచ్చింది అదంతా అభ్యుదయ వాద సాహిత్యమే యూరప్‌లోని అభ్యుదయవాద సాహిత్య ప్రభావం భారత దేశం మీద కూడా పడింది

ఆనాటి స్వాతంత్ర్యోద్యమనాయకులు సామ్రాజ్య వాదులతో సాగించే రాజీ బేరాలూ, రాయబారాలూ చాలా మంది యువకులకు నచ్చలేదు అసంతృప్తి ప్రబలిపోయింది ప్రత్యామ్నాయంగా మార్క్సిజాన్ని అధ్యయనం చేయసాగారు అప్పటికే (1925లో) కమ్యూనిష్టు పార్టీ స్థాపించబడింది ఎంతో మంది సోషలిస్టులూ, కమ్యూనిస్టులూ కలిసి కాంగ్రెసు సోషలిస్టు పార్టీని ఏర్పాటు చేసి కాంగ్రెసులో భాగంగానే ట్రేడ్ యూనియన్‌లూ, రైతు సంఘాలూ ఏర్పాటు

వేశారు. రైతుకూలీలు వైపుపుండిన సమస్యలపై హక్కుల కోసం పోరాటం సాగించారు. భగత్‌సింగ్ లాంటి స్వాతంత్ర్య యోధులు వ్యక్తిగత హింసావాదంతో సామ్రాజ్య వాదాన్ని ఓడించలేమనే నిర్ణయానికి వచ్చి మార్క్సిజంవైపు మొగ్గారు. సామ్రాజ్య వాదాన్ని గడగడ లాడించిన టెర్రరిస్టులు కూడా మార్క్సిజం వెలుగులో సాగే సామూహిక ప్రజా ఉద్యమాలూ, పోరాటాలూ విప్లవకారకాలు కాగలవని గ్రహించారు. ప్రజాఉద్యమాల నిర్మాణంలో పాల్గొనసాగారు. అల్లూరి సీతారామరాజు సాగించిన మన్యం విప్లవం కూడా అదే కాలంలో విజృంభించింది. ఈ పోరాటాల వెలుగులోనే నజ్రుల్ ఇస్లాం ఇత్యాదులు విప్లవ కవితలు రాశారు. ముల్కరాజ్ ఆనంద్, ప్రేమ్‌చంద్ లాంటి వాళ్ళు సామాజిక వాస్తవికతనూ, వాటి వైరుధ్యాలనూ చిత్రించారు. కథానికా, నవలా సాహిత్యాలను వెలువరించారు. వీటన్నిటి పరిణామ ఫలితంగానే 1935 లో అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం ఏర్పాటయింది. అబ్బూరి రామకృష్ణారావుగారు ఆనాడు దానిలో సభ్యులు. వీరే లండన్ రచయితల మానిఫెస్టోను శ్రీశ్రీ చేత చదివించి భావపరిణామానికి దారి తీశారు. ప్రేమ్‌చంద్ అధ్యక్షతన 1936లో అఖిలభారత అభ్యుదయ రచయితల మహాసభ జరిగింది. నెహ్రూ, టాగూర్, సరోజినీదేవి మొదలైన వారు ఈ ప్రయత్నాలను ఆశీర్వదించారు. ఈ ప్రభావంలోనే శ్రీశ్రీ, నారాయణబాబు ఇత్యాదులు వస్తు ప్రధానంగానూ, ప్రయోగాత్మకంగానూ అభ్యుదయ కవిత్వం రాయడం సాగించారు. పఠాభి, శిష్ట్లా ఇత్యాదులు కవిత్వంలో రూప (form) విప్లవానికి దారులు వేశారు. ఈ పరిణామాల ఫలితంగా ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభలు 1943లో తెనాలిలో జరిగాయి. 1943 నుంచి 1947 వరకూ నాలుగు మహాసభలు తెనాలి, విజయవాడ, తెనాలి, మద్రాసు పట్టణాల్లో జరిగాయి. ఈ విధంగా అభ్యుదయ సాహిత్యయుగం ఉరుకులు, పరుగులతో సాగిపోయింది. సాహిత్యంలోని అన్ని ప్రక్రియలను ప్రభావితం చేసింది.

1943కు పూర్వమె 1933 నుంచె శ్రీశ్రీ మహాప్రస్థాన గేయాలు రాయడం సాగించాడు. నారాయణబాబు, పురిపండా, ముద్దుకృష్ణ ఇత్యాదులు భావ కవిత్వ

నికి భిన్నమైన కవిత్వం రాశారు సాహిత్య 'వస్తువు'తో భావపరమైన విప్లవం తెచ్చారు శిష్లా, పఠాభి ఇత్యాదులు భావ కవితా రూపమైన పద్యాలూ, గేయాల మీద తిరుగుబాటు చేసి వాటి నడుముల్ని విరగదన్నే ప్రయత్నంలో నిమగ్న మయ్యారు అప్పటికే గాంధీయిజం, రష్యా విప్లవంతో ప్రభావితమైన ఉన్నవ వారి నవల 'మాలపల్లి' 1923 ప్రాంతాల్లో వచ్చింది సుమారు 1936 ప్రాంతాల్లో రైతు భజనావళి ప్రచురణ జరిగింది అందులో కమ్యూనిష్టులూ, సోషలిస్టులూ, కాంగ్రెసు వాదులూ అంతా రైతుకూలీల కష్టాలను గూర్చీ, వారిని సంఘటిత పరిచి జమీందారీ విధానాన్నీ, సామ్రాజ్యవాదాన్నీ కూలదోయాలని ప్రబోధించే పద్యాలూ, గేయాలు రాశారు గరిమెళ్ళ వారి 'మాకొద్దీ తెల్లదొరతనము' ఇత్యాది గేయాలూ, అదే మార్గంలో రాసిన హరికథలూ, రామదాసు కీర్తనల దరువుల్లో రాసిన ప్రబోధాలూ ముమ్మరంగా ప్రచారంలో ఉన్నాయి ఇవన్నీ వస్తుపరం గానూ, భావపరంగానూ కవిత్వం కాదని భావ కవులూ, సాంప్రదాయ వాదులూ అవహేళన చేస్తున్నా రాసేవారు రాస్తూనేపోయారు యుగానుగుణ్యమైన సాహితీ రూపం, భావం స్థిరపడి పోయాయి

పురాణ కవులూ, ప్రబంధ కవులూ, భావ కవుల్లాగే అభ్యుదయ వాదులు కూడా తమ కవితా లక్షణాలను గూర్చిన వాదోపవాదాల్లోనూ, తర్జన భర్జనల్లోనూ పాల్గొన్నారు కవిత్వం ఎలా ఉండాలో శ్రీశ్రీ ఇలా నిర్వచించారు

కదిలేదీ, కదిలించేది
మారేదీ, మార్పించేదే
పాడేదీ, పాడించేదీ
మునుముందుకు సాగించేది
పెను నిద్దుర వదిలించేది
పరిపూర్ణపు బ్రతుకిచ్చేది
కావాలోయ్ నవ కవనానికి''___

నారాయణబాబు ''విలయవేళల, ప్రళయ తాండవం వేసే శివునకు - వెనుక పాట పాడే కవులుంటే'' కావాలంటూ ప్రకటించాడు

ఛందస్సుల సర్ప పరిష్వంగం, వ్యాకరణాల సంకెళ్ళు, నిఘంటువుల శ్మశానాలూ అధిగమించి పోవాలని తహతహ లాడింది అభ్యుదయవాదం అంటే అభ్యుదయ వాదం రావడంతో సాహిత్య భాగాలైన వస్తువుకూ, రూపానికీ ఉండాల్సిన సమతూకం చెదిరిపోయింది సాంప్రదాయక కవితా రూపాల్లో ఈ వస్తువులు ఇమడవు కనక కొత్త భావం పాత రూపానికి ఎదురు తిరిగింది దాని కనుకూలమైన రూపాన్ని నిర్ణయించుకోవడం జరిగింది ఈ రూపాలే మాత్రా ఛందస్సుల గేయాలూ, వచన కవిత్వాలూ ఇవి రెండూ ఒకే కాలంలో సాహిత్య రూపాలైనాయి మార్క్సిస్టు భావాలనూ, స్వాతంత్రోద్యమ భావాలనూ కళాత్మకంగా వెలువరించడానికి సాధనాలైనాయి ఈ విధంగా 1943 లో అభ్యుదయ రచయితల సంఘ స్థాపనకు పూర్వమె పది పన్నెండేళ్ళ కృషి పునాదిగానూ, పూర్వరంగంగానూ తయారై ఉంది

వ్యక్తుల వారిగా నవ్య సాహిత్య పరిషత్తులో చిన్న గ్రూపుగా ఉన్న అభ్యుదయ వాదానికి ఒక ఉద్యమ రూపం 1943 లో వచ్చింది సాహిత్య పాఠశాలల ద్వారా రచయితలకు తర్ఫీదూ, సభలలో కవితా పఠనాలు జరిగేవి ముఖ్యంగా నాటకాలూ, బుర్రకథలు, గొల్ల సుద్దులు, విచిత్ర వేషాలకు సంబంధించిన పాత జానపద రూపాల్లో కొత్త వస్తువు-అనగా రైతు కూలీల కష్టాలూ, సామ్రాజ్య వాదుల, జమీందారుల ఆగడాలూ, వాటికి వ్యతిరేకంగా జరిగే ప్రతిఘటనలూ కథాంగాలైనాయి కష్టజీవి కథానాయకుడైనాడు సిద్ధాంత పరంగా అభ్యుదయ వాదం తన పోరాటం సాగిస్తూనే, శ్రీశ్రీ ఇత్యాదుల వాదనలను ముందుకు తీసుకు పోతూనే, పాత పంథాలో ఉన్న కవులనూ, రచయితలనూ కూడా ఉద్యమంలోకి ఆకర్షించే ప్రయత్నాలు సాగించింది ఐక్య సంఘటనా వ్యూహం, ఎత్తుగడలూ ఉద్యమ పురోగతిని సాధించాయి ఆంధ్ర దేశమంతటా దాని ప్రభావం వెల్లివిరిసింది కొమ్ములు తిరిగిన, లబ్ధ ప్రతిష్ఠులైనవారు చాలామంది ఆకర్షితులైనారు

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారూ, విశ్వనాథ వారూ మాత్రమే కాక నిజమైన ప్రగతి వాదులూ, బూర్జువా ఉదారవాదులూ, మానవతావాదులూ, జాతీయ వాదులూ, సామ్రాజ్యవాద వ్యతిరేకులూ, సనాతన ఛాందసులూ, అభ్యుదయ నిరోధకులూ, వివిధ ఛాయా భేదాలవారూ ప్రథమ దశలో అభ్యుదయ వాదులుగా చెప్పుకోడానికి వెనుకాడలేదు నానాగోత్రికులు, అభ్యుదయ వాద వేదికపైకి వచ్చారు, ఆమోదాన్ని పొందారు పారే కృష్ణా గోదావరి నదీ జలాల్లో (చేతలెలావున్నా)చేతులూ, కాళ్ళూ కడుక్కోసాగారు అంతా అభ్యుదయ కవులమేనని చెప్పుకోవడం ఒక ఫేషన్ అయిపోయింది నిజంగా ఇంతమందిని సమీకరించుకోవడం ఉద్యమ విజయమేనని చెప్పక తప్పదు కానీ దానితోనే ఉద్యమం గుంటపూలు పూసే పునాదులు కూడా పడ్డాయి అభ్యుదయవాద తక్షణ ధ్యేయం సోషలిజం, కమ్యూనిజం స్థాపన కాదు అవి స్వాతంత్ర్యం వచ్చాక సాధించుకోవాల్సిన దీర్ఘకాలిక గమ్యం తక్షణ కర్తవ్యంగా జాతీయ స్వాతంత్ర్యాన్ని స్థాపించుకోవడం అది కర్తవ్యం, ధ్యేయంకూడాను ప్రజల కదలిక, రైతుకూలీ ఉద్యమాల ఊపు అశేష జనాన్ని ఆకర్షించింది దీనికి తోడుగా నైజాం వ్యతిరేక తెలంగాణాపోరాటం ఆంధ్ర దేశాన్నంతా కదిల్చించి వేసింది వెట్టి చాకిరీ భారంతో కృంగిపోతూ, మానవుణ్ణి మానవుడుగా బతకనియని పరిస్థితులకూ, జాగీర్దార్లూ, దేశముఖులు, పటేలు పట్వారీల దోపిడీకి వ్యతిరేకంగా ఆంధ్రమహాసభ నాయకత్వంలో సాగించిన పోరాటం ఉన్నత స్థాయికి పోయింది సాయుధ పోరాటం తిరుగుబాటు రూపాన్ని ధరించింది "చస్తే, ని బాంచను'' అనే తెలంగాణీయుడు మహావీరుడై తల యెత్తాడు. తిరుగుబాటు సాగించాడు వెట్టి చాకిరిని రూపుమాపాడు గ్రామ రాజ్యాలు స్థాపించాడు నిజాం బంటుల భూములను పేదవాళ్ళకి పంచారు నేటి భూదానాలూ, సీలింగులూ, భూపంపకాలకు ఆచరణాత్మకమైన పునాదులు ఆనాడే పడ్డాయి రైతు కూలీలు ఉవ్వెత్తుగా తిరుగబడ్డారు మట్టిలోంచి మాణిక్యాలు [illegible] విప్లవ పథంలా నాయకులా పుట్టుకొచ్చారు తెలంగాణా ఉత్త పచ్చిపులుసు భాయిగాడు, '[illegible] పడివుండే చపట' అన్న భావానికి శాశ్వత సమాధి జరిగింది పలికలను గడగడ

లాడించాడు ఫ్యూడల్ పునాదులను వేళ్ళతో సహా కదిలించి కుదిపివేశాడు అఖిం భారతావనికి సంస్థాన ప్రజల పోరాటాలకూ మార్గదర్శి అయ్యాడు కరుడుగట్టిన ఏ దుర్మార్గ భావాలున్నవాడో తప్ప మొత్తం ఆంధ్ర ప్రజానీకమంతా ప్రభావితులైనారు తమ వాళ్ళను ఆదుకోడానికి అంతా అండదండలను అందించారు అఖిలాంధ్ర లోకానికి దాశరథి అగ్నిధార, రుద్రవీణ, అనిసెట్టి అగ్నివీణ, సోమసుందర్ వజ్రాయుధం, రెంటాల సంఘర్షణ, గంగినేని ఉదయిని, కుందుర్తి తెలంగాణా ఇత్యాది కవితాసంపుటాలు ఉత్సాహాన్నిచ్చాయి నవలల్లో బొల్లిముంత శివరామకృష్ణగారి మృత్యుంజయులు, మహీధర రామమోహన్‌రావు గారి 'ఓనమాలు', కిషన్‌చందర్ గారి 'జబ్ ఖేత్ జాగి వురే' ఇత్యాదులూ నారాయణ గారి నవలలూ వచ్చాయి కథానికలు కోకొల్లలు వచ్చాయి సుంకర, వాసిరెడ్డి గారల ముందడుగు, మాభూమి ఇత్యాది నాటకాలు రచనా విధానం లోనూ, ప్రదర్శనారంగంలోనూ, పాత్రధారులను క్రమశిక్షణతో మెలచడంలోనూ బ్రహ్మాండమైన మార్పులకు దోహదం చేశాయి గరికపాటి రాజారావు గారి ప్రయోక్తృత్వం కూడా కొత్తదారులు వేసింది తెలంగాణా పోరాటం ద్వారా ఎందరో అజ్ఞాత కవులు పాటలూ, పద్యాలూ రాశారు అదే ఇతివృత్తంగా నవలలూ, నాటకాలూ, కావ్యాలూ వచ్చాయి మొత్తం తెలుగు సాహిత్య అకాశం లోనే కొత్త వెలుగు ప్రసారం కాసాగింది ఇది అభ్యుదయవాద సాహిత్యానికి స్వర్ణయుగం

ఇంతేగాక అభ్యుదయ సాహిత్యోద్యమం దాని ఆవిర్భావం సాహితీ క్షేత్రంలో ఒక విప్లవాన్ని సాధించింది, ఈ విప్లవం నూతనమైనది ఇంతకు పూర్వం వచ్చిన పురాణ, ప్రబంధ, భావ కవితా యుగాలకు పూర్తిగా భిన్నమైంది దీని స్వరూప స్వభావాలూ, తాత్విక పునాదులూ సరికొత్తవి సాహిత్యాన్ని, వివిధ రూపాలనూ ప్రజానీకం అందరికీ అందుబాటులోకి తేవడం దీని లక్ష్యం ప్రజానీకంలో బహుళ సంఖ్యాకులైన కార్మిక, కర్షకుల శ్రేయస్సాధన, వారి ప్రయోజనాలను కాపాడే సాహిత్య సృష్టి ఈ ఉద్యమధ్యేయం సామ్యవాద సంఘ స్థాపనను సాహిత్య ప్రక్రియల ద్వారా దోహదం చేయడం దీని లక్ష్యం

ఈ ఉద్యమం మార్క్సు గతితార్కిక భౌతిక వాదం తాత్విక పునాదిగా గల ఉద్యమం అయితే ఇది తనకు పూర్వపు సాహిత్యాన్ని ధ్వంసం చేయాలని చెప్పదు పూర్వసాహిత్యాన్నీ, దాని స్వరూప స్వభావాలనీ జీర్ణించుకొని భవిష్యత్తుకు బాటలు దిద్దుకొంటుంది ఇది శ్రామిక వర్గ పక్షపాతాన్ని సూత్రంగా అవలంబిస్తుంది అందుకే పారిశ్రామికయుగ ఉదార వాదులైన కందుకూరి, గురజాడ, గిడుగు ఇత్యాదుల వారసత్వాన్ని ముందుకు తీసుకుపోయే బాధ్యతని వహించింది సామ్యవాద వాస్తవికతను సాహితీ రంగంలో సాధించడానికి కృషి చేయడం దీని పరమాశయం వాస్తవికత, సుందరత, తాత్వికత- ఈ త్రిగుణాల సమ్మేళనాన్ని ఎల్లప్పుడూ దృక్పథంలో ఉంచుకుంటుంది ఈ ఉద్యమం-ఒక్క మాటలో చెప్పాలంటే—ఆంధ్రసాహిత్య ఉద్యమాల్లోనే అభ్యుదయ సాహిత్యోద్యమం ఒక గుణాత్మకమైన పరిణామం అందుకే ఇది తర్వాత తరాల రచయితల నందరినీ ప్రభావితం చేసింది నేటికీ ప్రభావితం చేస్తూఉంది భావ కవిత్వాన్ని ఆనంద కవిత్వంగానూ, అభ్యుదయ కవిత్వాన్ని చైతన్య కవిత్వంగానూ విశ్లేషించిన వేల్చేరు నారాయణరావుగారు ఆనంద కవిత్వం, చైతన్య కవిత్వం యొక్క తేడాలను విశ్లేషణ చేస్తూ ఈ క్రింది అభిప్రాయానికి వచ్చారు "ఇంత ప్రాథమికమైన తేడా వల్ల అభ్యుదయ కవిత్వం అంతవరకూ ఉన్న సర్వ కవితా ప్రాతిపదికల్ని తిరస్కరించిన విప్లవాత్మక కవిత్వమైంది ఆ తర్వాత వచ్చిన విప్లవకర కవిత్వానికి అంతటికి వర్తించే ప్రాతిపదికలు అభ్యుదయ కవిత్వమే సమకూర్చింది"(తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - పేజీ 178) - అభ్యుదయ వాద సాహిత్యం ఆ తర్వాత వచ్చిన సాహిత్యోద్యమాలన్నిటికీ పనికివచ్చే ఆచరణాత్మకమైనవీ, సిద్ధాంతపరమైనవీ అయిన పునాదులను వేసిందన్నమాట

అభ్యుదయ ఉద్యమం స్వాతంత్ర్యోద్యమంలో ఒక భాగంగా ఆరంభమైంది ఇది ఒక చారిత్రక సత్యం సాహిత్యంలో సామ్యవాద వాస్తవికత (సోషలిస్టు రియలిజం) సాధించడం దాని అంతిమ ఆశయం కాని, తక్షణ ఆశయం మాత్రం ఆనాటికి జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించడం మాత్రమే జాతీయ

స్వాతంత్ర్యం సాధించకపోతే సమాజం ఏవిధంగానూ ముందుకుపోదు, పోజాలదు అనాడు జాతీయ స్వాతంత్ర్య సాధన ఆశయ సిద్ధికి ప్రధాన ఆటంకాలుగానూ, శృంఖలాలుగానూ సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం ఉన్నాయి కనక స్వాతంత్ర్య విప్లవ సాధన పోరాటం సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక కర్తవ్యాలను ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాల్లో చేపట్టవలసి వుండింది అదే విధంగా సాహిత్య రంగంలో కూడా సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక కర్తవ్యాలను అభ్యుదయోద్యమం స్వీకరించింది జాతీయ స్వాతంత్ర్య సాధనా పోరాటంలో సాహిత్యకంగా తన కర్తవ్యాన్ని నిర్వహించింది ఫ్యూడల్, సామ్రాజ్యవాద స్వరూప స్వభావాలు గల సారస్వతంపై తిరుగుబాటు చేసింది సాహిత్య ప్రక్రియలన్నింటిలోనూ భాషకు సంబంధించిన, భావానికి సంబంధించిన విప్లవాలను సాధించింది ఈ విప్లవ సాధనకు కొన్ని పరిమితులున్నాయన్నది మనం మరచిపోకూడదు ఈ పరిమితులకు కారణాలు సమాజంలో వున్నాయి మనకు వచ్చిన స్వాతంత్ర్యం సామ్రాజ్యవాద వ్యతిరేకమైనదీ, ఫ్యూడల్ వ్యతిరేకమైనదీ మాత్రమే. అది సర్వసమగ్రమైన విప్లవం కాదన్నది అందరికీ తెలిసిన బహిరంగ రహస్యం ఇలాంటి సామాజిక పరిస్థితుల అస్తిత్వం యొక్క ప్రతిఫలనం (Reflection) సాహిత్యంలో కూడా ఉండక తప్పదు

అభ్యుదయోద్యమానికి సామ్యవాద వాస్తవికత అంతిమ లక్ష్యమైనా దాని కార్యక్రమం మాత్రం స్వాతంత్ర్య సాధనకు రచయితలందరి యొక్క ఐక్య సంఘటనను సాధించి, విజయాన్ని సాధించటం వరకూ మాత్రమే పరిమితమైంది కాని స్వాతంత్ర్యోత్తర కాలానికి సంబంధించిన కార్యక్రమాన్ని నిర్ణయించుకోవడంలో విఫలమైపోయింది ఉద్యమంలో స్తబ్ధత రావడానికి ప్రధానమైన, మౌలికమైన కారణం ఇదేనని నా అభిప్రాయం స్వాతంత్ర్యానికి పూర్వం ఏ శక్తులను సమీకరించుకోవాలి ? ఏ శక్తులను ఎదిరించాలన్నది స్పష్టంగా దృగ్గోచరమవుతూ ఉండేది అంటే ఎదిరించాల్సిన శత్రు వర్గం- పాలకులుగా ఉన్న సామ్రాజ్యవాద, ఫ్యూడల్ వర్గ శక్తులూ, ఆయా వర్గాల

ఆశ్రిత వర్గాలూనూ సమీకరించాల్సిన వాళ్ళు తక్కిన ప్రజానీకం కనక వ్యవహారం ముక్కుకు సూటిగా జరిగిపోయింది తద్వారా అభ్యుదయోద్యమం భాషలోనూ, భావంలోనూ విప్లవాత్మక విజయాల్ని సాధించింది - ఆ విజయా లన్నింటినీ సంఘటితం చేసుకోగలిగింది తద్వారా సాహిత్య చరిత్రను నిర్మించడంతోపాటు సాహిత్యంలోనే ఒక ప్రత్యేకమైన, నిర్దిష్టమైన స్థానాన్ని ఆక్రమించింది

స్వాతంత్ర్యోత్తర కాలానికి సంబంధించిన కార్యక్రమాన్ని ఎందుకు అభ్యుదయోద్యమం నిర్ధారించుకో లేకపోయింది? అన్న ప్రశ్నకు జవాబు 1947, 1948 నాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులను పరిశీలించకుండా అర్థం చేసుకోలేము ఆయా పరిస్థితుల విశ్లేషణకూ, వాటి వివరాలకూ పోకుండా ఒక్క మాటతో చెప్పాలంటే- స్వాతంత్ర్యోత్తర కాలంలో పరిపాలనాధికారాన్ని వహించిన వర్గాల స్వభావం ఏమిటి? ఆ పాలక వర్గాలు సామ్యవాదానికి దారులు వేస్తాయా ? అన్న ప్రశ్నలపైన అవుననీ, కాదనీ, రకరకాలుగా అతివాద వర్గాల్లోనూ, పార్టీల్లోనూ ఎడతెగని చర్చలు, విభేదాలు తలయెత్తాయి స్పష్టమైన లక్ష్య నిర్ధారణ కాలేదు అంతా అయోమయం, గందరగోళం సమాజంలోని ఈ పరిస్థితులే అభ్యుదయ సాహిత్యోద్యమంలోనూ ప్రతిఫలించక తప్పదు ప్రతిఫలించాయి కూడాను! మార్చుకోకుండా ఉన్న కార్యక్రమానికీ, ప్రజానీకకీ, మారిన పరిస్థితులకీ వైరుధ్యం తల యెత్తింది ఈ వైరుధ్యాన్ని పరిష్కరించుకునే ప్రయత్నాలు జరగలేదు జరిగినా అవి కేవలం నామమాత్ర ప్రయత్నాలే కనక విఫలం కాక తప్పలేదు ఈ ప్రధానవైరుధ్యం కారణంగా అభ్యుదయ సాహిత్య ఉద్యమంలో స్తబ్ధత తలయెత్తింది 1959 దాకా 'అభ్యుదయ' మాస పత్రిక ప్రకటనం జరిగినా ఉద్యమానికొక లక్ష్య నిర్దేశం జరగలేదు అభ్యుదయ సాహిత్యోద్యమంలో స్తబ్ధతకిది దారి తీసింది

# హేతువాదం

—ఆవుల మంజులత

జ్ఞాన సముపార్జనకు హేతువు (బుద్ధి) ప్రధాన సాధనం, గీటురాయి అని చెప్పే ఒక దర్శనం హేతువాదం దీనిని వ్యతిరేకించే విషయాలను బట్టి, ఇది ప్రధానంగా రెండు రూపాలు ధరించింది మతంలో ఈ దర్శనాని(Philosophy)కి ముఖ్యమైన ప్రతిఘటన దైవభావం అందువల్ల మత సంబంధమైన హేతువాదంలో ప్రధాన విషయం ప్రకృతికి అతీతమైనవిగా భావింపబడే వాటిని గురించి చర్చించి, అవి ప్రాకృతికమైనవేనని నిరూపించడం తత్త్వశాస్త్రంలో హేతువాదానికి ముఖ్య ప్రతిఘటన అనుభవవాదం (Empiricism) ఇంద్రియానుభూతికి అందేదే జ్ఞానమని చెప్పే ఈ వాదాన్ని హేతువాదం తిరస్కరించి, హేతువు (బుద్ధి) ద్వారానే యథార్థమైన జ్ఞానం సాధ్యమవుతుందని చెబుతుంది

తత్త్వశాస్త్రంలో హేతువాదం ప్రధానంగా జ్ఞానానికి సంబంధించిన వాదం నిజమైన జ్ఞానం బుద్ధివివేచనతోనే వస్తుందని ఇది చెబుతుంది ఇందుకు స్పష్టమైన ఉదాహరణగా ఇది తర్కాన్ని (Logic) గణితాన్ని పేర్కొంటుంది

క్రీ పూ 514 లో పార్మెనెడీస్ బుద్ధికి, ఇంద్రియ సంవేదనకు భేదం ఉందని చూపాడు ఇంద్రియాలద్వారా బాహ్య ప్రపంచంనుండి వచ్చిన జ్ఞానం కన్న, బుద్ధిద్వారా తెలుసుకున్న జ్ఞానమే యథార్ధమని భావించాడు

అర్వాచీన పాశ్చాత్య హేతువాదంలో దేకార్త్ (1596 - 1650), స్పినోజా (1632 - 1377), లీబ్నిజ్ (1646 - 1716) ప్రముఖులు ఆధునిక తత్త్వశాస్త్రానికి పితృతుల్యుడని చెప్పదగిన దేకార్త్ సంశయ పద్ధతిద్వారా

బుద్ధిని ఊతగా తీసుకొని, బాహ్య ప్రపంచాన్ని, ఆత్మను, ఈశ్వర అస్తిత్వాన్ని రుజువు చేసే ప్రయత్నం చేశాడు రేఖాగణితంలో axioms ' నుంచి propositions, theorems క్రమంగా నిర్మించగలిగినట్లే, తత్త్వశాస్త్రంలో కూడా బుద్ధి సహాయంతో భౌతికాతి భౌతిక యథార్థ విషయాలను తెలుసుకోగల మని అభిప్రాయపడ్డాడు స్పినోజా లీబ్నిజ్ ఈ ప్రపంచంలోని ప్రతి అంశమూ తక్కిన అన్నింటితో ముడివడి ఉంది కానీ, ఏదీ ఇంకోదానికి నిర పేక్షంగా లేదని భావించాడు అటు తర్వాత క్రీ శ 1770లో జన్మించిన హెగెల్ అనే తత్త్వవేత్త హేతువాద చరిత్రలో ప్రముఖుడుగా పేర్కొనదగిన వాడు బౌద్ధిక విషయాలు, అంటే బుద్ధి వివేచనకు సుసంగతమైన విషయాలు మాత్రమే సత్యాలు, యథార్థాలు యథార్థాలయిన విషయాలన్నీ బౌద్ధికాలే అని వివరించాడు

'ఈ ప్రకృతి నియమబద్ధంగా నడిచే యాంత్రిక వ్యవస్థ' అన్న రెనెదెకార్ట్ సర్ ఐజాక్ న్యూటన్ (1642-1727)ల భావాల ప్రభావ ఫలితంగా, ప్రకృతికి అతీతమైన అద్భుతాలను అంగీకరించడం వివేచన గలవారికి అసాధ్యమైంది బుద్ధిని ఉపయోగించి ప్రకృతిని దాని నియమాల ద్వారా వివరించ గలిగినప్పుడు, ఇదే బుద్ధిని ఉపయోగించి మతం ఆవిర్భావాన్ని, మతగ్రంథాల ఆవిర్భావాన్ని చరిత్ర అభివృద్ధినీ వివరించవచ్చు గదా ! హేతువాది దృష్టిలో ఇవన్నీ ప్రకృతిలో భాగమైన మానవుడు కల్పించినవే, అతని చేతలే ఒకానొకనాటివరకు మానవుడు ఆర్జించుకొన్న జ్ఞానం హద్దుగా మతం ఆవిర్భవించింది అప్పటి దైవాన్ని భావిం చిందీ మతాన్ని ఆవిర్భవింప జేసిందీ హేతువాద విధానమే 16 వ శతాబ్దికి పూర్వం హేతువాదులు కొందరు దైవవాదులు వారి అభిప్రాయం ప్రకారం దైవ శక్తికి అస్తిత్వం ఉంది ఆ శక్తి ప్రకృతిలో జోక్యం కల్పించుకోదు కాని, ప్రకృతి పుట్టుకకీ, దానిలోని నియమబద్ధతకూ కారణం చెప్పాలంటే దైవమనే శక్తి అవసరమని వారు విశ్వసించారు దీనినే మతసంబంధమైన హేతువాదంగా పేర్కొనవచ్చు ఇట్లా విశ్వసించిన వారిలో ముఖ్యులు ఇంగ్లండ్‌లోని జాన్ టోలండ్, మాథ్యూ టిండల్ ఫ్రాన్సులోని వోల్టేర్ కాని ఈ రెండు దేశాలలో కూడా ఆ తరువాతి హేతువాదులు దైవశక్తి ఉనికిని అంగీకరించలేదు

19 వ శతాబ్ది ప్రారంభంలో జర్మనీలో హెగెల్ నాయకత్వంలో మత సంబంధమైన హేతువాదం కనిపిస్తుంది హెగెల్ భావాలతో ప్రభావితులైన డేవిడ్ ఫ్రెడెరిక్ స్ట్రాస్, ఫెర్డినండ్ క్రిస్టియన్ బార్ అనేవారు బైబుల్‌కు వ్యాఖ్యానం వ్రాస్తూ, దానిలోని అతి ప్రాకృతిక అంశాలన్నీ కల్పితాలేనని తేల్చారు స్ట్రాస్ వ్రాసిన బైబుల్ వ్యాఖ్యానాన్ని జార్జి ఇలియట్ ఇంగ్లీషులోకి అనువదించాడు దీనిలోని భావాలు, కొత్త ప్రతిపాదనలు క్రైస్తవ లోకంలో దుమారం లేపాయి వాదోపవాదాలు చెలరేగాయి ఈయన అభిప్రాయాలనే ఫ్యూయర్ బా, ఫ్రెంచ్ మేధావి ఎర్నెస్ట్ నాన్ తమరచనలద్వారా బలపరచారు ఫ్యూయర్‌బా అభిప్రాయం ప్రకారం దైవభావన మానవుని అవసరాలకు, కోరికలకు అనుగుణంగా కాల క్రమాన పుట్టినదే డార్విన్ 1859లో ప్రచురించిన 'On the Origin of Species by Means of Natural Selection' అనే గ్రంథం బైబుల్‌లో వర్ణించబడిన సృష్టి క్రమంపై హేతువాదులు చేసిన విమర్శను బలపరచింది ప్రకృతిలో మానవావతరణ ప్రకృతి బద్ధమేనని హేతువాదులు ఊహించిన దానిని ఈ గ్రంథం రుజువు చేసింది

భారతదేశంలో బౌద్ధంలోను, ప్రాచీనుల షడ్దర్శనాలలోనివైన సాంఖ్య వైశేషికాల్లోను ఇప్పటి హేతువాద ఛాయలు కనబడుతున్నా హేతువాదానికి బాగా దగ్గరి పోలికలు గల ప్రాచీన దర్శనం లోకాయతం ఋగ్వేద కాలంనాటికే లోకాయతం బాగా ప్రచారంలో ఉండేది ఇహలోకాన్నే ఆధారంగా చేసుకొన్న దర్శనం గనక ఇది లోకాయత మయిందని కొందరంటారు 'లోకాన్ని యత్నించడం' అనేదే 'లోకాయత' పదానికి అర్థం అని దాస్‌గుప్త అభిప్రాయ పడ్డారు అభౌతిక, పారలౌకిక తత్వాలను, యజ్ఞయాగాలను విశ్వసించని లోకాయతం అర్థ కామసాధనవే ప్రధానమని భావించింది అందువల్ల అర్థ, కామశాస్త్రాలను సంబంధించిన గ్రంథాలు లోకాయతులే రచించారని అంటారు వీరు హేతుశాస్త్ర ప్రత్యక్ష ప్రమాణాన్నే ఆధారంగా గ్రహించారు అందువల్లే మను స్మృతి లోకాయతులను హైతుకులు నాస్తికులుగా పేర్కొంటుంది ఈ లోకాయ

తులు వేదప్రామాణ్యాన్ని, పరలోకాన్ని యజ్ఞయాగాలనూ నిరాకరించిన పాషం డులు కనక వీరు శిక్షార్హులని మనుస్మృతి చెబుతుంది

ఈశ్వరుడిని, వేదప్రామాణ్యాన్ని నిరాకరించి సర్వమూ స్వాభావికమేననే వాదమే లోకాయతమని శుక్రనీతి చెబుతున్నది కేవలం హేతువాదంపైన ఆధార పడి, స్వతంత్రాలోచన చేస్తూ, భౌతికవాదంలోకి పర్యవసిస్తున్న ఈ దర్శన మంటే తక్కిన వారికి గిట్టలేదు అందుకే వారు లోకాయతాన్ని నిరసించారు దాని అధ్యయనాన్ని నిషేధించారు. స్మృతులు కూడా లోకాయతులు శిక్షార్హులని చెబుతున్నాయి కాని పూర్వకాలంలో రాజధర్మం మొత్తం మీద లోకాయత సూత్రాలపైనే నడచిందని కౌటిల్యుని అర్థశాస్త్రం, మహాభారతంలోని రాజధర్మ ప్రకరణాలు, శుక్రనీతి చెబుతున్నాయని పండితులు అభిప్రాయ పడుతున్నారు అంతేకాదు హేతువాదాన్ని, లోకస్వభావాన్ని తెలుసుకున్న వారే భారతదేశంలో అర్థశాస్త్రానికి పునాది వేశారని కొందరి గట్టి అభిప్రాయం

భారత దేశంలో ఆధునిక దార్శనికులలో హేతువాదానికి అత్యంత ప్రాముఖ్యం ఇచ్చినవాడు మానవేంద్రనాథ్ రాయ్ (ఎమ్ ఎన్ రాయ్) దైవం పేరుతో మత సిద్ధాంతం, సంఘం పేరుతో ఉదారవాదం, జాతి పేరుతో ఫాసిజం మనిషిని సమష్టికోసం కొరముట్టుగా వాడుకొంటున్నాయనీ, అందుకు భిన్నంగా మానవుడిని సర్వశక్తి సంపన్నుడిగా, సర్వం సహాధికారిగా తీర్చిదిద్దేదే రాయ్ సిద్ధాంతం అనీ అంటారు ఆయన అనుయాయులు ఈయన సిద్ధాంతానికి ప్రాతి పదిక ఆధునిక విజ్ఞాన శాస్త్రాలు, శాస్త్రజ్ఞుల పరిశోధన ఫలితాలు, తత్త్వశాస్త్రం, చరిత్ర, రాజనీతి మొదలైనవి స్థూలంగా రాయ్ అభిప్రాయాలు ఇవి

శక్తి, పదార్థాల వినిమయం విశ్వం ఇది నియమబద్ధమైనది కార్య కారణ సంబంధం గలది ఈ ప్రకృతి పరిణామంలో ఒక దశలో జీవం ఏర్ప డింది జీవ పరిణామంలో ఒక దశలో మనిషి రూపొందాడు మనిషిలోనే మెదడు (బుద్ధి) సంపూర్ణత్వాన్ని పొందింది ప్రకృతిలోని నియమబద్ధతే, మనిషిలో

హేతుశీలంగా పరిణమించింది జీవికి సహజమైన జీవితేచ్ఛ మనిషిలో స్వేచ్ఛా పిపాసగా పరిణమించింది మెదడు పరిపూర్ణత చెందడంతో మనిషి ప్రకృతి రహస్యాలను తెలుసుకో గలుగుతున్నాడు అతడు ప్రకృతి రహస్యాలను ఎంత మేరకు తెలుసుకోగలిగితె, అతనిలో జ్ఞానం కూడా అంతమేరకే పెరుగుతుంది ఆ మేరకే ఆతని స్వేచ్ఛ విస్తరిస్తుంది అందువల్ల స్వేచ్ఛాన్వేషణ అనేది ఉన్నతస్థాయిలో జరిగే జీవితపోరాటమే' అని రాయ్ అభిప్రాయం యథార్థ సత్యమంటే మనిషి సంపాదించే జ్ఞానసారమె కాబట్టి మనిషి సత్యాన్వేషణలో ఆసక్తి గల స్వేచ్ఛా పిపాసి అనవచ్చు

అయితె మనిషికి ప్రకృతి సిద్ధంగా అబ్బిన హేతుశీలతె అతడిలో నీతిని, పరస్పర సహకారాన్ని పెంపొందిస్తుంది అంటే తన స్వేచ్ఛను కాపాడుకోవడం కోసం మనిషి ఇతరుల స్వేచ్ఛను గౌరవిస్తాడు సహకార ప్రయోజనాన్ని గ్రహించి, తనకోసమే సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక సంస్థలు నిర్మించుకొంటున్నాడు తనకు ఏది శ్రేయోదాయకమో, కాదో మనిషి తన హేతు శీలత ద్వారా గ్రహించ గలుగుతున్నాడు దాని ద్వారా తన సమాజ జీవితం సుఖవంతం కావడంకోసం కొన్ని నైతిక విలువలు ఏర్పరచుకొంటున్నాడు అంటే మనిషిలోని హేతుశీలతే అతని నీతికి ప్రాతిపదిక అన్న మాట

బ్రిటిష్ రేషనలిస్ట్ ప్రెస్ అసోసియేషన్ వారు తమ మెమొరాండంలో హేతువాదాన్ని ఇట్లా నిర్వచించారు

''హేతువాదమంటే హేతువు (reason) సర్వాధిక్యాన్ని నిర్నిబంధంగా అంగీకరించే ఒక మానసిక వైఖరి (mental attitude) నిర్హేతుకమైన భావనలను, ప్రమాణాలకూ (authority) తావులేకుండా, ప్రయోగాత్మకంగా నిరూపణ చేసుకొనడానికి వీలయిన దర్శనాన్ని (philosophy), నీతి శాస్త్రాన్ని (ethics) రూపొందించుకోవడమే దాని లక్ష్యం ''

హేతువాద లక్ష్యం యథార్థమైన జ్ఞాన సంపాదన ఆ జ్ఞాన లక్ష్యం మానవ జీవితాన్ని సుఖతరం, ప్రయోజనకరం చేయడం అందువల్ల పై చెప్పిన హేతువాదానికి, మానవుడే తన జీవితానికి కేంద్రం, అధిపతి అని చెప్పే మానవతా వాదానికి భేదం లేదు మానవతావాదు లందరూ హేతువాదులమనే చెప్పుకొంటున్నారు

తెలుగు సాహిత్యంలో హేతువాదచ్ఛాయలు వేమన పద్యాలలోనే కనబడ తాయి పరతత్వ భావనను అంగీకరిస్తూనే, మతంపేరిట, కులంపేరిట జరిగే దురాచారాలను, మూఢవిశ్వాసాలను ప్రశ్నించినవాడు వేమన ''ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల, చిత్తశుద్ధిలేని శివపూజయేలరా', 'రాతిబొమ్మ కేల రంగైన వలువలు, గుళ్ళు గోపురములు కుంభములును, కూడుగుడ్డ తాను కోరునా దేవుడు" అని, ''రాళ్ళు దెచ్చినరుచి రమ్యమౌ గుడి గట్టి, రాతి ప్రతిమచేసి ఖ్యాతిగాను, దేవుడనుచు మ్రొక్క దీవించిపల్కునా ? '' అని, ''గట్టు రాళ్ళ దెచ్చి కాలచేతులద్రొక్కి, కాసెయులుల చేత గాసిచేసి, మొరపరాళ్ళ కెరగు మొప్పెల నేమందు'' అని, విమర్శిస్తాడు "జాతి నీతి లేక జన్మమ్ములొక్కటి, అరయ తిళ్ళువేరె, ఆకలొకటి' అని తీర్మానిస్తాడు అయితే, కేవలం మూఢ త్వాన్ని విమర్శించడమేకాదు, మనిషి తన చేతలకు తానే కర్త అంటూ మానవ ప్రయత్నం ప్రాముఖ్యాన్ని చాటిచెప్పాడు "వ్రాత కంటె హెచ్చు వరమీదు దైవంబు, చేతకంటె హెచ్చు వ్రాతలేదు వ్రాతకజుడు కర్త, చేతకుదాగర్త'' అన్నాడు "అగ్ని బాణమేసి యంబుధి నింకించి, రాముడవలి కెగరాగి నిలిచి, చెట్లు గిరులు తెచ్చి సేతువు కట్టడా'' అని ప్రశ్నించి మూఢమైన విశ్వాసాలు కాదు పూనిక ముఖ్యం అంటాడు వేమన ''సాధనమున పనులు సమకూరు ధరలోన'' అని మనిషి పూనుకొంటే అతనికి సమకూరని దేదీ భూమిమీద లేదని మానవ శక్తి మీద అచంచల విశ్వాసం చూపాడు ఇంగ్లీషు భాషతో కలిగిన సంపర్కం, విజ్ఞానశాస్త్రాలు, పాశ్చాత్య సాహిత్యం - వీటితో కలిగిన పరిచయం, ఆధునిక తెలుగు సాహిత్యంలో గొప్ప మార్పు తెచ్చాయి సాహిత్యంలో ఇదివరకటి పారలౌకిక దృష్టిపోయి లౌకిక దృష్టి కలిగింది సాహిత్య ప్రయోజనంలో కొత్త

దృక్పథం కలిగింది మనిషి భౌతిక జీవితం ప్రాముఖ్యాన్ని గమనించడం, దాన్ని సుగమం చేసుకోవడానికి ప్రయత్నించే దృష్టి కలిగించడం ఆధునిక సాహిత్యానికి ప్రధాన ధ్యేయం అయింది

ఆధునిక తెలుగు సాహిత్యంలో మొట్ట మొదటి హేతువాద భావాలు కన బడేది 19 వ శతాబ్ది పూర్వార్థానికి చెందిన స్వామినేని ముద్దునరసింహ నాయ నింగారి 'హిత సూచని' అనే గ్రంథంలో అప్పటికే ఆయన మంత్రతంత్రా లలో మహత్తులు లేవని,వర్గ వ్యవస్థలో న్యాయం లేదని,బాల్య వివాహాలు కూడదని, స్త్రీ స్వాతంత్ర్యం కావాలని,భూత ప్రేత పిశాచాలు ఉండవని వ్రాశారు ఆ తర్వాత తెలుగు దేశంలో కొత్త చైతన్యం తెచ్చినవారు వీరేశలింగంగారు రాజకీయ స్వాతంత్ర్యాన్ని ఫలవంతం చెయాలంటే, ముందుగా ప్రజలలో భావ చైతన్యం అవసరమని గుర్తించి, మనుషులను అణిచే, బాధించే అన్ని రంగాలమీద తిరుగు బాటు చేశారు దానికి సాధనంగా సాహిత్యాన్ని చేపట్టారు అందుకె ఆయన సృష్టించిన సాహిత్యంలో అంతటా హేతువాద ఛాయలు కనబడతాయి దైవ భావన పరిధికి లోబడి ఉన్నా, ఆయన ప్రచారం చేసిన ఏకేశ్వరోపాసన, బ్రహ్మ సమాజ సిద్ధాంతాలు మతంపై హెతువాద ప్రభావాన్ని చూపిస్తాయి

మనిషి భౌతిక జీవితం పట్ల విశ్వాసం, దాని అభివృద్ధిపట్ల శ్రద్ధ గురజాడ రచనలలోని తాత్త్విక సారాంశం మనిషి జీవితాన్ని మెరుగు పరిచే విజ్ఞాన శాస్త్రా లంటే శ్రద్ధ, మనిషిని బాధించే వర్ణవ్యవస్థ, మూఢాచారాల తిరస్కృతి ఆయన రచనలకు ప్రధాన వస్తువు మనిషే తన జీవితానికి ప్రధాన కర్తగా ఆయన తన రచనలలో నిరూపిస్తాడు ముత్యాల సరాలన్నీ ఇందుకు ఉదాహరణలు 1909 మే 21 న ముని సుబ్రహ్మణ్యం గారికి వ్రాసిన లేఖలో ఆయన ఇట్లా అంటారు ''మతవిశ్వాసాలనేవి ఆచరణకు అసాధ్యమైనవి, నిరోధకమైనవి, గుది బండల వంటివి మానవుని ప్రేమించడమన్నది అతి సాధారణమైన జవిత సూత్రం ఇతరులను ప్రెమించడంవల్ల మానవునికి నిరవధికానందం సిద్ధిస్తున్నది- మనం

ఒకరికి ఇచ్చే ప్రేమ మళ్ళీ మనకు ప్రేమను కొనితెస్తుంది ఒకరి నొకరు ప్రేమించుకోవడం ఎంత మహత్తరమైనదని ఈ భూమి మీదకు స్వర్గం దిగి వచ్చినంత భూలోక స్వర్గమే ''

ఇటువంటి ప్రేమ తత్వాన్ని మరచిపోయి, కృత్రిమమైన మతాల పేరిట కలహించుకోవడం ఎంత అనర్థమో, దేవుడు చేసిన మనుషుల్లారా, మనుషులు చేసిన దేవుళ్ళారా ''మీ పేరేమిటి ?'' అనే కథతో ప్రతిభావంతంగా చిత్రించాడాయన

దేశమును ప్రేమించుమన్నా' అనడంలో నిజమైన దేశభక్తి మనుషులను ప్రేమించడమే నని 'దేశమంటే మనుషులోయ్' అనేది సూచిస్తుంది

'మనిషి చేసిన రాయిరప్పకు
మహిమ కలదని సాగిమొక్కుతు
మనుషులంటే రాయిరప్పల కన్న కనిష్టంగా''
చూడటం ఆయన దృష్టిలో బేలతనం
''కన్నుకానని వస్తుతత్వము
కాంచనేర్చరు లింగిరీజులు
కల్లనొల్లరు, వారి విద్యల
కరచి సత్యము నరసితిన్ "అనడంలో మనిషి జీవితం బాగుపడటానికి విజ్ఞానశాస్త్రాలు రాచబాట వేస్తాయనేది ఆయన అభిప్రాయమని తెలుస్తుంది

తెలుగు సాహిత్యంలో హేతువాదానికి మూల పురుషుడుగా 'త్రిపురనేని రామస్వామి' గారిని పేర్కొంటారు కొత్త సమాజాన్ని నిర్మించుకోవాలంటే ముందుగా ఛాందసత్వం పోగొట్టి, కొత్త ఫిలాసఫీని రూపొందించుకోవాలి అనే దృష్టితో హేతువాద ప్రచారార్థమే ఆయన సాహిత్యాన్ని సృష్టించారు ప్రజలలో భావ విప్లవం రావాలంటే, ముందుగా మతంపేరిట వారిలో పేరుకొని

పోయిన మూఢ విశ్వాసాలు పోవాలి ప్రజలలో మౌఢ్యాన్ని పెంచుతున్న మతాన్ని ప్రచారం చేసే పురాణాలను, కృత్రిమ అసమానతలు సృష్టించిన స్మృతులను హేతువాద దృక్పథంతో విమర్శించాలి ఇదే ఆయన రచనలలో ప్రధాన వస్తువు

ఆయన 'భగవద్గీత'లో ఇట్లా వ్రాశారు.

'శాస్త్రములనెల్ల జదివి విజ్ఞానమెరిగి
సంశయింపక సర్వథా చర్చజెసి
నిజమెరుంగ వలయు నిది నేర్వకున్న
మూఢ విశ్వాసమున జేటుమూడుచుండు''

ఇది స్థూలంగా ఆయన దృక్పథాన్ని తెలియజేస్తుంది

భిన్నకాలాలలో భిన్న ఋషిప్రోక్తాలయిన స్మృతులు పరస్పర విరుద్ధాంశాలకు ఆకరాలై అవాంఛనీయమైన బోధలు చేస్తుంటే, వాటిని ఆధారం చేసుకొని వచ్చిన పురాణాల ఫలితంగా కార్యకారణ సంబంధ దూరాలై ప్రజలలో ప్రబలిన వర్ణాశ్రమ ధర్మాలు, మూఢ విశ్వాసాలు పటాపంచలు చేసే ప్రయత్నమే శంబుకవధ, సూతపురాణ రచనలు శంబుక వధ ఆయన మొదటి రచన ఇది స్మృతులపైన హేతువాదదృక్పథంతో చేసిన పునర్విమర్శన ప్రజలందరికీ సమాన హక్కులుండాలనీ, సమానంగా పాలింపబడాలనీ వాదించే పరమ సాధువైన శంబుక మహర్షిని శూద్రుడనే కారణంగా శ్రీరాముడు వధించడం అన్యాయమని 'శంబుకవధ' నాటకంలోని సారాంశం

సూతపురాణం పాత పురాణాలను హేతువాద దృక్పథంతో పునః పరిశీలిస్తుంది సూతపురాణ రచన కారణాన్ని కవి ఇట్లా చెప్పాడు ''లోకంబు పురాణము లార్షేయములనియు, తదంతర్గత ధర్మములు, నీతులు, కధయు శిరోధార్యములనియు విశ్వసించుచున్నది ఈ విశ్వాసము వలన కలిగిన ప్రతిఫల మాత్మ

ద్రోహముగా పరిణమించుటఁ జేసి, పురాణములెంతవరకుఁ బ్రతికూలములో, ఎంతవరకుఁ బక్షపాత భూయిష్ఠములో మోడ్పుగన్నుతో నున్న విద్వల్లోకమునకుఁ జూపించు తలంపుతో సూత పురాణము రచింపబడినది '' స్మృతుల, పురాణాలు విమర్శనాత్మకంగా చదివిన కవి, తనకు కలిగిన సందేహాలను గంగా తీరాన ఉన్న సూతమహర్షిని అడగగా, ఆయన చెప్పిన వృత్తాంతమే 'సూత పురాణం' లోని ఇతివృత్తం

'చేసిన దోసమీశ్వరుని చింతన చేత నశించునన్న విశ్వాసము గల్గి, రేఁబవలు పాప మొనర్చుచు, తీరినప్పుడేదో సమయమ్ముగ' రామకోటి వ్రాసే భక్తకోటికి ఇందులో కవి జోతలు సమర్పించాడు

ఒకడు వేదమే భగవదుక్తమంటే, మరొకడు ఖొరానె భగవదుక్త మంటాడు వేరొకడు బైబులే భగవదుక్తమని వాదిస్తాడు అందుకే కవి ''ఇన్ని తికమకలేల పెట్టెదవు, తెల్పఁగ రాదె నిజంబు నీశ్వరా'' (సూత ౩ ఆశ్వాసం) అని అడుగుతాడు

'పాథోజనాభుండు భగవంతుఁడొకచోట
నొక చోట సైరిణ శాపోపహతుఁడు
ఆశికాక్షుఁడ ద్వితీయ బ్రహ్మ యొకచోట
నొకచోట ఋషి పత్నులకు విటుండు'

అంటూ ప్రారంభించి పురాణాలలో పరస్పర వ్యాఘాతాలను, అసంబద్ధాలను అధిక్షేపించాడు లోకమాన్యుడు మాండూక్యమునకు కప్పకు, సుశ్లోక చరితుఁడు శుక యోగి చిలుకకు, మౌని తల్లజుఁడు శౌనక బ్రహ్మర్షి శునికి, అఖిలాస్త్ర సం[illegible] [illegible]జ్ఞానమ అశ్వానికి పుట్టారన్నాన్ని విమర్శిస్తాడు. [illegible]తుల బట్టి తప్పులు విచారణ చేసి శిక్షలు వేసి, జాతుల నెట్టి ధర్మం ప్రచారం చేసిన మనువును, నీవు ఋషి వెట్లయ్యావని ప్రశ్నిస్తాడు.

స్వర్గ ప్రాప్తికోసం పడరాని పాట్లు పడిన శ్రోత్రియ వరులైన సోమయాజులు, వీర మరణం చెందిన వీరులు, యజ్ఞ యాగాదులు ఆచరించిన యోగులు, ఘోర తపస్సు చేసిన జటిలులు, స్వర్గం చేరి సాని కొంపలలోనే కాలం వెళ్ళదీస్తున్నారట అది చూచి వచ్చిన సూతమహర్షి "శివ! శివా! ఇది వట్టి భోగభూమి యుండరాదిందు మావంటి యోగులకు" అంటాడు ఇంద్ర లోకం వెళ్ళి దేవేంద్రుని చూచి వచ్చి సూతుడు "వేయి కన్నులు నాకు గన్పింప లేదు, పొడలు మాత్రము గన్పించె నొడలి నిండ" అంటాడు

వెక్కసమైన కుటుంబ భారమును వెల్లువ నీదలేక పల్లవించు దైవతకోటి పాల్వడి మొరపెట్టుకొని, చెంతకుచేరి "గోడు చెప్పుకొంటే, వారు ఆరుస్తారా, తీరుస్తారా ? ఇట్టివారికి జోతలు పెట్టనేల" అని ప్రశ్నిస్తాడు కవి అయితే ఆయన రచనలకు లక్ష్యం ప్రస్తుత సమాజంలోని మనిషి అందుకే

"మలమలమాడు పొట్ట, తెగమాసిన బట్ట కలంత పెట్టగా
విలవిల యేడ్చుచున్న నిరుపేదకు జాలిని జూపకుండ ను
న్మత్తం పడిపోయి జీవరహితంబగు బొమ్మకు నిండ్లు వాకిలుల్
పొలమును బొట్టనిచ్చెడి ప్రబుద్ధ వదాన్యుల నిచ్చ మెచ్చెదన్"
అంటాడు కవి

ఈ సూత పురాణ సంహితను శుద్ధాంత రంగంలో చదివిన దానికి ఫలము చిత్తశుద్ధీ, నీతి ప్రోత వివేచనమూనని కవి పేర్కొన్నాడు అంటే హేతువాద దృక్పథం కలగడమే కదా !

మానవుడి హేతుశీలం నుంచి ఉత్పన్నమయ్యే జ్ఞానం, నీతి, స్వేచ్ఛ, ఈ మతం ఆధిపత్యం వహిస్తున్న ఈ సమాజంలో బలి అయిపోతున్నాయి అందుకే మనిషి జీవితంలో మతం, దాని నుంచి ఉద్భవించిన వర్ణాశ్రమ ధర్మాల ప్రభావాన్ని హేతువాదంతో అగ్గించే ప్రయత్నమే భగవద్గీత రచన, ధూర్త మానవ, కుప్పుసామి శతకాల రచన

'శంకరుని యంత వేదాంత శాస్త్రవేత్త
అనియెగా 'అహం బ్రహ్మాఽస్మి యనుచు' గాన
నాకు నేనె నమస్సు లొనర్చుకొందు
నాది మధ్యాంత శూన్యుండ నైతినంచు'

అని భగవద్గీతలో ప్రార్థన వ్రాశాడు కవి వర్ణవ్యవస్థతో సంఘం క్షీణించి పోయిందని, సర్వ మానవ సమతాధర్మం గల నూతన వ్యవస్థ రూపొందించ డానికి, యుద్ధం చెయ్యమని బ్రహ్మనాయుడు బాల చంద్రుడికి కారెంపూడి కదనరంగంలో చేసిన హేతువాద ఉపదేశమె భగవద్గీత

''ఒక్క జాతి యందుద్భవ మొంది కూడ, స్పర్శ దోషంబు దృష్టి దోషంబ టంచు, బతితమై పోవు చుండెఁ బ్రభ్రష్టమగుచుఁ, దెలుఁగు జాతి పునస్సృష్టి వందె చెపుమ?'' అంటాడు బ్రహ్మనాయుడు 'మతమను మాట మోసము సుమా, ఇదె మూలము ధర్మ పీఠకున్' అని హెచ్చరిస్తాడు ''మతములె పుట్టి కున్న యెడ మారణ కర్మములిన్ని సాగునే'' అని చరిత్రవైపు పారజూడ మంటాడు చివరికి 'సృష్ట్యాది కులంబులున్ మనుజులందరు నొక్కటె' అని తీర్మానిస్తాడు

కుప్పుసామి, ధూర్తమానవ శతకాలు మనిషి వ్యక్తిత్వాన్ని కించ పరుస్తూ, ఉపదేశం చేసేవి కావు అవి ఆలోచనలను రేపే స్వభావం గలవి

''గొంటరులఁ దుంటరుల గుమిగూర్చి సృష్టిఁ
జేసి చీటికి మాటికి డాసి తారు
తప్పుకొని చచ్చు చుండగఁ దనియుచుండు
గొప్పవానికి''

అంటే సృష్టికర్తని కవి పెద్ద మొగాడి కెకెలు చెప్పాడు, కుప్పుసామి శతకంలో

''ఏడొ ఎద్దాలుగొ, మూడొ యెన్నొ, జంతు
లెల్ల సృష్టించి నటువంటి యీపెడొకరా

యిర్వురో, యెందరో వారికెల్ల-నేటి
కోళ్ళ నర్పింతు భక్తితోఁ గుప్పసామి''
అనేది దీనిలో రెండో పద్యం

'గుడికి తరచు పోయి గొణుగు చుండెడి వాడు, పెద్దపాప మేదో, చేసి యుండు'' అని వ్యాఖ్యానిస్తాడు కవి పాత ఆచారాలను విమర్శిస్తూ

'చచ్చిపోయిన వెంటనే జన్మమెత్తు
జీవి కుడువఁ గర్మమటంచుఁ జెప్పుచుందు
రట్టులైనచోఁ బితృలోకమెట్టువచ్చు'' అని
'చచ్చి పోయిన దానికే సరణి జేరఁ
గలవు పిండములు నివాప జలముకూడ''
అని విమర్శిస్తాడు

ధూర్తమానవ శతకంలో మానవుడు తనకు చేస్తున్న అన్యాయాలను అక్రమాలను ఈశ్వరుడు కవిగారి కలం ద్వారా చెప్పుకొని దూషిస్తాడు దశావతారం పేరిట దేవుడికి ఎన్ని పాప కార్యాలు మనిషి అంటగట్టాడో అవన్నీ విమర్శిస్తాడు

మతం మీద విప్లవం ప్రకటించి, మానవ జీవితానికి మానవుడే అధిపతి; కేంద్రం అని నిరూపించబూనే ప్రయత్నమే 'ఖూనీ' నాటక రచన ఇది వేను రాజు కథ దీనిలో వేనుడు హేతువాది ఇందులో రామస్వామి గారు తన భావాల విశదీకరణకు విస్తృత పీఠిక వ్రాశారు దానిలో ఆయన ''మతము ప్రతి దేశము నందు సౌజన్యము, సౌభ్రాతృత్వము సమానత్వమును జిందర వందర చెసి, మానవుల నల్లకల్లోలము జేసి, ప్రపంచ శాంతి లేకుండఁ జేయుటయే కాకుండ, మహాపురుషుల నెందరినో తన పొట్టఁబెట్టుకున్నది'' అన్నారు

దేవుని పుట్టుపూర్వోత్తరాల చరిత్రను ఆయన ఇట్లా ఊహించారు ''మానవుడు మృగదశలో నున్నప్పుడే కొండగానో, ఏ యేరుగానో వెలసిన దేవుఁడు

మానవ విజ్ఞానము పరిణామము బొందుమన్నకొలఁది భగవంతుఁడే కొండల రూపమును వదలి, మృగమై, మృగము నుండి మనుష్యుఁడై, మనుష్య దశనుండి యదృశ్యరూపుఁడైఁ, యదృశ్యనిరాకారుఁడై, నిరంజనుఁడై నిర్వికల్పుఁడయ్యెను ఇఁకఁ దరువాతి దశ ఏమి? శూన్యత్వము అనగా నాస్తికత్వము ఇదియే మూఢ మానవ ప్రతిపాదితుఁడైన భగవంతునికినేఁడు వాటిల్లుచున్న దశ''

ఇటువంటి దేవుడు ప్రార్థించినంతమాత్రాన, ప్రీతుడై సిరిసంపదలనిచ్చి, పరలోక సౌఖ్యాల నిస్తాడనడం మానవుని మనోదౌర్బల్యాన్ని సూచిస్తున్నదని ఆయన నమ్మకం ''ఈశ్వరారాధన చేతఁ బాపపరిహారము కల్గునను విశ్వాసము దోషాచరణకు దోహదము చేయకుండునా?'' "ఆస్తికత్వము ప్రపంచ పరిణామమునకు నాటంకము గలుగజేసెను గాని తోడ్పడలేదని గట్టిగ జెప్ప వచ్చును'' అని పేర్కొన్నాడు ''భగవంతునిఁ బ్రేమించుటకన్న తోడి మాన వుల బ్రేమించుట పరమోత్తమంబు'' అనే మానవతా దృక్పథాన్ని చూపాడు

ఈ నాటకంలో వేనరాజు వెలిబుచ్చే అభిప్రాయాలన్నీ రామస్వామిగారివే వేదకర్మల పేరిట జరిగే హింసాపూరితాలైన జంతు బలులను వేనరాజు నిర సిస్తాడు "దృగ్గోచరుడు కానివాడును, మానవులచే సృజియింపబడినవాడును సృష్టి స్థితి లయకారకుడేమి? సృష్టి స్థితి లయలు స్వభావ జన్యములు కావా? మన కంటికి గన్పట్టుట లేదా? పుట్టినది గిట్టకున్నదేది? ఇందులో భగవంతు నకుఁ బెత్తనమేల? పెత్తనమే యున్న యెడల నిన్ని ఘాతుక కృత్యములేల జరుగును? వీనిని అరికట్టడా? ఎందుకు ఆపఁడు?" అని ప్రశ్నిస్తాడు

''నేను నాస్తికుడనైన లోకమునకు గల్గు నష్టమేమి? నేనేమయిన పరహింసాచరణమునకుఁ గడంగి, లోకము దుఃఖభూయిష్ఠముగా జేయుచుంటినా?'' అని దేవుని పేర జరిపే అత్యాచారాలను విమర్శిస్తాడు వేనుడు ''ఎవరి అభి ప్రాయములు వారు నిరాఘాటంబుగ వెలిబుచ్చుకొనుటకు నా రాజ్యంబున నెల్లరకు

సర్వాధికారంబున్నది'' అన్న వేనరాజు పలుకులు కవిరాజు భావప్రకటన స్వాతంత్ర్యకాంక్షను తెలియజేస్తున్నాయి

కవిరాజు రచనలను కాలానుక్రమంగా పరిశీలిస్తే, ఆయనలో భావ పరిణామం తేట తెల్లమవుతుంది మొదటి రచనలయిన శంబుక వధ, సూత పురాణాలలో ఆయన వేదప్రామాణ్యం అంగీకరించే భావాలు కనబడతాయి శంబుకమహర్షి వేదప్రామాణ్యాన్ని అంగీకరించని చోటికి ఎక్కడికీ రానంటాడు సూతపురాణంలో ''నిత్యసత్య పతత్త్వ మహత్త్వశక్తి''ని ధ్యానించాడు కవి కాని తరువాతి రచనలయిన ఖూనీ, భగవద్గీతలలో ఆయనలో హేతువాదం సంపూర్ణ రూపంలో ప్రకటితమైంది 'ఖూనీ' నాటకంలో నాయకుడు వేనుడు 'వైదిక కర్మమన్న పొరపాటుననేనియు మెచ్చని' స్థితికి వచ్చాడు

త్రిపురనేని రామస్వామి గారి కుమారుడే సుప్రసిద్ధ రచయిత గోపీచంద్ తండ్రిగారి భావాలప్రభావం గోపీచంద్ మీద కొంతవరకు కనిపిస్తుంది ఆయన తన నవల 'అసమర్థుని జీవితయాత్ర'ను 'ఎందుకు ?' అని ప్రశ్నించడం నేర్పిన నాన్నకు అంకితం చేశాడు

గోపీచంద్ మొదటి దశలో చేసిన రచనలలో హేతువాదం కనిపిస్తుంది ఆయన కథల్లో ఒకటైన 'దేవుని జీవితం'లో ఒక అమ్మాయి దేవుణ్ణి అన్వేషిస్తూ ఉంటుంది పరిణామ క్రమంలో నాగరికత అభివృద్ధి చెందుతున్న కొద్దీ మనిషి భావాలకు అనుగుణంగా అతను సృష్టించుకున్న దేవుడు కూడా పరిణతి చెందుతూ వస్తున్నాడని తెలుసుకొంటుంది చివరికి బోధి వృక్షం కింద నుంచుని ''దేవుడు గొప్పవారి మెదడులోను ప్రా లయాలలోనూ దర్శనమిస్తుంటాడు ఆయన కోసం వృథా ప్రయాస ఎందుకు? నేను కావలసిన రోజున ఆయనే నన్ను వెదుక్కుంటూ వస్తాడు' అని తెల్సు కొంటుంది

'ఉభయకుశలోపరి' లేఖలలో గోపీచంద్ 'చిత్తగించవలెను' అనే శీర్షికతో వ్రాసిన పీఠికలో ఇట్లా అంటాడు ''ప్రకాశీకాన్ని తన చెప్పు చేతల్లో ఉంచు

కోవడానిగ్గాను అనేక అబద్ధాలను సబద్ధాలుగా, నీతులుగా, ధర్మాలుగా ప్రచారం చేశారు అవే దేవుడనే అబద్ధం, కర్మ అనే అబద్ధం, పాపం అనే అబద్ధం '' ఈ లేఖలకు వ్రాసిన 'పి యస్ ' అనే ముగింపు 'మానవుని ఆదర్శం ప్రకృతిని మానవ సంఘంకోసం ఉపయోగించుకోవటం' అంటాడు గోపీచంద్ ఆయన మొదటి నవల 'పరివర్తన' హేతువాద మార్గంలోనే నడచింది గోపీచంద్ రచనలలోనే కాక తెలుగు నవలా సాహిత్యంలోనే విలక్షణమైంది 'అసమర్థుని జీవిత యాత్ర ' మానవ ప్రయత్నం ఆవశ్యకాన్ని చాటి చెప్పడమే ఈ నవల ముఖ్యోద్దేశం 'యమపాశం' కూడా వ్యక్తి స్వేచ్ఛ, మానవ ప్రయత్నం ప్రాముఖ్యాన్ని చాటి చెప్పే నవల

హేతువాద సాహిత్యంలో ఇటీవల వెలువడిన గ్రంథాలలో ముఖ్యంగా పేర్కొనదగింది నార్ల వేంకటేశ్వరరావు గారి 'జాబాలి' నాటిక, 'నార్లవారి మాట' పద్యాలు మొదలైనవి రామాయణాన్ని గురించిన హేతువాద దృక్పథ ఫలితమే జాబాలి నాటిక, దాని విస్తృత పీఠిక రామాయణ, భారతాలు ప్రధానంగా కథలే, కావ్యాలే, పురాణాలే కాని చరిత్రలు కావు, కానేరవు అనేది నార్లవారి అభిప్రాయం నార్లవారు రామాయణ కావ్యం గురించి విస్తృత పరిశోధన చేశారు రామాయణంలోని కథలుగా బహుళ ప్రచారం పొందిన ప్రక్షిప్తాలలోని పరస్పర వైరుధ్యాలు, అసంగతాలు పీఠికలో చర్చించారు వాల్మీకి రామాయణంలో ఉన్న కొన్ని అంశాలను సామాన్య జనుల ప్రచారంలోకి రానివ్వక పోవడాన్ని చర్చించారు ప్రక్షిప్తాలు లేని వాల్మీకి రామాయణంలో నాయకుడు మానవాతీత వ్యక్తి కాదని, విమర్శక దృష్టితో పరిశీలిస్తే తేలుతుందని నార్ల తమ పీఠికలో ఇట్లా వ్రాశారు ''మానవాతీత వ్యక్తులను కాక, మానవులై వుండి, కొన్ని ఆశా నిరాశలకు, రాగద్వేషాలకు, కష్ట సుఖాలకు, జయాపజయాలకు నా వలె, మీ వలె మరొకరివలె లోనైన వ్యక్తులను మాత్రమే పాత్రలుగా తీసుకొని, వాల్మీకి తన మహాకావ్యాన్ని రచించాడు ఆ పాత్రల స్వరూపాన్ని ప్రక్షిప్తాలెంతగా మరుగుపరుస్తున్నా వాటిలోనుంచి మానవత తొంగి చూస్తూ ఉంటుంది కనుకనే, మన

లోని మానవతను ఆత్మబంధువువలె ఆదరంగా పలకరిస్తూ వుంటుంది కనుకనే ఇన్ని శతాబ్దాల తర్వాతైనా, వాల్మీకి రచన తన సమ్మోహక శక్తిని కోల్పోలేదు'' అభూత కల్పనలను, కాకమ్మ కథలను గురించి ఆయన ఇట్లా బాధపడుతున్నారు ''చదువు సంధ్యలున్నవారే, పట్టభద్రులైన వారే, పండిత ప్రకాండులుగా చెల్లుతున్నవారే, ఈ నవయుగానికి తగినట్టు నవ్యభావాలను ప్రచారం చేస్తూ, నూతన సంఘ నిర్మాణానికి ప్రాతిపదికలను వేయడంలో ప్రత్యేక బాధ్యత వహించవలసిన ప్రజానాయకులే, పత్రికా సంపాదకులే ఈ కాకమ్మ కథలన్నింటిని కడిగిపోసిన సత్యాలుగా స్వీకరించడం మన దేశ దౌర్భాగ్యం కాదా? ఈ మేధావులే, ఈ సంఘ నాయకులే ఇంత మౌఢ్యాన్ని ప్రదర్శిస్తే శాస్త్రీయ (సైంటిఫిక్) దృక్పథం మన ప్రజలలో ఏ విధంగా విస్తరిస్తుంది? వైజ్ఞానిక పథంలో మన జాతి ఏ విధంగా పురోగమిస్తుంది? సాంకేతిక రంగంలో మన దేశం ఏమి విజయాలను సాధించగలుగుతుంది?''

హేతువాద సాహిత్యంలో పేర్కొనదగిన రచనలు చలం 'సావిత్రి', ముద్దుకృష్ణ 'అశోకవనం', పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారి 'మహాభారత విమర్శ' మొదలైనవి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు మహాభారత కథను చారిత్రక, సామాజిక దృక్పథంతో పరిశీలించి కథా ఘటాలకు గల భూమికను వివరించారు.

హేతువును నిర్నిబంధంగా అంగీకరించు ఆలోచనా విధానం శుద్ధ హేతువాదమైతే, మానవుడే అన్నింటికి అధిపతి, కేంద్రం అనే మానవతా వాదం అనువర్తిత హేతువాదం వంటిదనవచ్చు సాహిత్యంలో వీరేశలింగం గారితో ప్రారంభమైన ఆధునిక యుగానికి ప్రాతిపదిక హేతువాదమే ప్రకృతిని అర్థం చేసుకోవడానికి, ప్రకృతికి, మనిషికి గల సంబంధం అర్థం చేసుకోవడానికి ప్రారంభమైన హేతువాదం లౌకిక జీవితాన్ని మరింత సుగమం చేసుకోవడానికి వృద్ధి చెందింది మనుషుల మధ్య అసమానతలు, విభేదాలు తొలగించడానికి చెబుతున్న మార్గాలలో తేడాలున్నా లక్ష్యం ఒకటే అందువల్ల ఆధునిక సాహిత్యాన్ని హేతువాదం ప్రాతిపదికగా గల సాహిత్య మనవచ్చు ఆ హేతు వాద సాహిత్యమే అభ్యుదయ, విప్లవ సాహిత్యాలకు బీజాలు నాటింది

**ఆధునిక తెలుగు సాహిత్యంలో**

# అధివాస్తవికాన్వేషణ

—నగ్నముని

ఆధునిక తెలుగు సాహిత్యంలో అధివాస్తవికత వేసిన అడుగు జాడల ఆరా తియ్యమన్నారు ఈ సమావేశ నిర్వాహకులు

ఇప్పుడెందుకీ ప్రస్తావన? అని కొంతమందికి అనిపించడం సహజం

కాని నాకలా అనిపించడం లేదు మనిషి సాధించిన అద్భుతమైన విజ్ఞాన ప్రగతిని మనిషి మనుగడకే ఎసరుబెట్టే విధంగా రాజ్యాధిపతులు ఉపయోగించడం చూసి, జీవిత వాస్తవికత బీభత్సంగా తయారవడం గమనించి, మానవ విలువలే మట్టికొట్టుకుపోతున్న రెండు ప్రపంచ యుద్ధాల మధ్య సంక్షోభ సంధ్యలో ఫ్రాన్సులో ఉద్యమించిన అధివాస్తవికత గురించి - నేడు భారతీయ జీవితంలో పాత విలువలు కుళ్ళి, కొత్త విలువలు ప్రవేశించని స్తబ్ధతా సంధ్యలో జన జీవితం శవప్రాయంగా తయారైన సమయంలో, సాంస్కృతిక సాహితీ రంగాలు నిర్వీర్య ప్రేక్షకులుగా మారిపోతున్నవేళ-జీవితపు పూర్తి వాస్తవికత, అధి వాస్తవికత కోసం అర్రులు చాచిన ఉద్యమం గురించి సమీక్షించుకోవడం చాలా చారిత్రక ప్రాధాన్యతగల సందర్భంగా నేను భావిస్తున్నాను

ఐతే, నగ్నమునినే ఎందుకు ఎంచుకున్నట్లు? నగ్నమునినే కాదు, మరే కవిని యిటువంటి అతి ముఖ్యమైన సాహితీ విషయంపై మాట్లాడడానికి ఎంచుకున్నా దానికొకటే కారణం - తెలుగులో సాహితీ విమర్శకులు బహు తక్కువగా వుండడం వాళ్ళు కూడా గతాన్ని ప్రయోజనాత్మకంగా సమీక్షించి, వర్త

మానం పోకడను గ్రహించి, భవిష్యత్తులో రావలసిన సాహిత్య ధోరణులకు వూపిరిపోసే విధంగా విమర్శ చెయ్యడం లేదు దానికి కారణం - తెలుగులో సృజనాత్మక కవి, రచయితల స్థాయికి విమర్శకుడు ఎదగలేదేమోననిపిస్తూ వుంటుంది

ఆధునిక తెలుగు సాహిత్యంలో కవితారంగం మాత్రమే జీవిత వాస్తవికతకు నిత్యం స్పందిస్తున్నది కవి మాత్రమే మేలుకుని వున్నాడు వాస్తవికత, మరింత వాస్తవికత, అధివాస్తవికత నందుకోడానికీ, వాస్తవ బీభత్సాన్ని ఎదుర్కోడానికీ సిద్ధంగా వున్నాడు జీవితం మూల పదార్థంలోకి వెళ్ళి, అవసరమైన లవణాలను గ్రహించి, బాహ్యలోక యథార్థంతో సమానంగా తెలుగు కవిత ప్రవహిస్తున్నది ప్రపంచ వ్యాప్తంగా లేచే ప్రతి సాహిత్య, సాంస్కృతిక, రాజకీయ, సాంఘిక కెరటాలను తెలుగు కవి మాత్రమే పట్టుకుంటున్నాడు

తెలుగులో నవల, నాటక రంగాలు ఎదుగూ బొదుగూ లేకుండా వున్నాయి 'విమర్శ' అంటే పాక్షిక దృష్టికిలోనై తిట్టడం మాత్రమే అనుకుంటున్నాడు తెలుగు విమర్శకుడు

దీనివలన సృజనాత్మక కవులకు, రచయితలకు, నూతన ధోరణులకు విమర్శకుడు వుపయోగ పడకపోవడమే గాక తన వుష్ట్రపక్షి తలతో అడ్డంగా కూడా తయారవుతున్నాడు అందువల్ల ఈనాడు కవి కవిత్వం రాసుకుంటూ పోవడమేగక యింకా అనేక పనులు చేయవలసి వస్తున్నది కవి కవిత్వం రాస్తాడు, పుస్తకం అచ్చు వేసుకుంటాడు, తన భావాలు చెప్పుకుంటూ ఉపన్యసిస్తాడు విమర్శలు రాస్తాడు వగైరా వగైరా సవాలక్ష కవిని ప్రజలకు మరింత చేరువచేసే విమర్శకుడు ఆ పని సవ్యంగా చెయ్యలేక అడ్డంగా తయారవుతున్నాడు తెలుగు కవి వీరిబారిని పడక తప్పడంలేదు నా దృష్టిలో విమర్శకుడనే పెద్దమనిషి అన్ని రంగాలలోనూ జరుగుతున్న కృషిని గమనిస్తూ, కవికంటే రెండడుగులు ముందు నడుస్తూ, విశ్వ

సాహిత్య విహంగావలోకనం, జాతీయంగా సింహావలోకనం చేస్తూ సృజనాత్మక కవి, రచయిత చేస్తున్న ప్రయత్నాన్ని ఆబ్జెక్టివ్‌గా అంచనా వేస్తూ నిర్భయంగా అవసరమైన, ఆరోగ్యకరమైన ధోరణులవేపు సాహితీ ప్రవాహ దిశను మళ్ళించడానికి తోడ్పడేవాడు విమర్శకుడు రాజకీయ నాయకుడిలా 'వెస్టెడ్ యింటరెస్టు'తో గాక, నిర్భయ మేధావిగా ప్రపంచ వ్యాప్తంగా వస్తున్న అనేక ధోరణులను, సిద్ధాంతాలను ఈ దేశ ప్రజల ప్రయోజనాలకు అన్వయించి విమర్శాయుధాన్ని ప్రయోగిస్తే, కవి, రచయిత ఎక్కువ కాలం వృధా చెయ్యకుండా ఎదగడానికి వీలవుతుంది

ఎదగడమంటే - వ్యక్తిగతంగా అవసరమైన ధోరణులేవైనా వుంటే వాటిని సరిచేసుకోడానికీ, యీనాడు ప్రజలకు, సాహిత్యానికీ మధ్య వున్న దూరాన్ని తగ్గించడానికీ ఎక్కువ కాలం వృధా చెయ్యకుండా, కొత్త రచనా రహస్యాలను ఆవిష్కరించుకుంటూ ముందుకు వెళ్ళడానికి వీలవుతుంది అంతే కాక, విమర్శకుడు నిజంగా మేలుకుని వుంటే సాహితీ లోకంలో కుహనా విలువలు తలెత్తడానికి వీలుగాని పరిస్థితి ఏర్పడుతుంది అందుకే అంటున్నాను- తెలుగు సాహితీ విమర్శకుడు సృజనాత్మక కవికీ, రచయితకీ వుపయోగపడే స్థాయికి ఎదగాలి లేకపోతే, యింతకాలం ఎదురుచూస్తూ, విమర్శకుణ్ణి గౌరవిస్తూ వస్తున్న కవి, ఆ గౌరవాన్ని వుపసంహరించుకుని విమర్శా రంగంలో కూడా ప్రవేశించవలసివస్తుంది విమర్శకుడు దొంగ పోస్టు మార్టెమ్ రిపోర్టు లివ్వడం యికనైనా ఆపాలి లేకపోతే, ఆ పోస్టు మార్టెమ్ కత్తే అతనికి ఎదురు తిరుగుతుంది

ప్రస్తుతాంశం - 'ఆధునిక తెలుగు సాహిత్యంలో అధివాస్తవికత' తెలుగునాట అధివాస్తవిక రచనను, ఇవ్వవలసినంత చోటు ఇవ్వలేదని, దొరకవలసినంత ఆదరణ దొరకలేదని పురిపండా అప్పలస్వామిగారి తెలుగు కవిత్వాల ఆంగ్లానువాదాల పుస్తకం 'సౌదామిని'కి ముందుమాట రాస్తూ శ్రీశ్రీ బాధపడినట్లు నాకు జ్ఞాపకం అధివాస్తవిక రచన విషయంలో నాకూ అటువంటి

బాధ కొంత వుంది మరికొంత మంది కవుల చేతుల్లో మరికొంత కాలం అధి వాస్తవికత నలిగి వుంటే వస్తుపరంగా గాక, వచన కవితా నిర్మాణానికి సంబంధించి మేలు జరిగి వుండేదని, కవిత్వం వచనంలా వున్నా ఫర్వాలేదనుకో వడం పోయి, వచన కవిత్వం వచనం కంటే కృతకమైపోయి, వచన కవిత్వంలో ప్రణయం మొదలు ప్రళయం వరకూ ఏ వస్తువునయినా స్వీకరించవచ్చు ననుకునే భావన పోయి, మరి ముఖ్యంగా తెలుగు కవిని పట్టి పీడిస్తున్న వస్తు వైవిధ్యంతో సంబంధం లేకుండా లలితంగా, సుందరంగా, సుఖంగా అభి వ్యక్తీకరణలో ప్రపంచాన్ని సమీపించే మనస్తత్వం పోయి, ఛందస్సుల వంటి పట్టాలూ, ఆసరాలూ లేకుండా, నిరాధారంగా తాడుమీద నడవడం వాంటి వచన కవితా ప్రక్రియకి గొప్ప వూపు దొరికేది ఆధునిక కవితా ప్రక్రియ అయిన వచన కవితలో సాంప్రదాయిక పద్ధతి ఆలోచనపోయి, ఆధునిక ఆలోచనా సీమ సరిహద్దులు జరిగి విస్తృతమయ్యేది

రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలాన రెండు వర్గాల సంఘర్షణ బలవత్తర మవుతున్న వేళ రెండు విభిన్న మానవ, కళా విషయాల విధ్వంసన, సృజనల మధ్య రెండు భౌతిక, సత్య, స్వప్నగత సుప్త చైతన్య సరిహద్దుల మధ్య అంతఃకరణ అంతరంగం వేపు మానవ సమాజ శక్తికి మూల ప్రదేశం స్వప్నంగా భావించి ఫ్రాంసులో లేచి ప్రపంచ భాష లన్నిటా ప్రభావ పూరితంగా ప్రజ్వరిల్లి పడిన కెరటం అధివాస్తకవిత మూడో యుద్ధం వేపు ప్రపంచం వురుకులు పెడుతున్న ఈ దశలో దీన్ని సమీక్షించుకోడం వల్ల ఏమైనా వుపయోగముందేమో చూద్దాం

తెలుగులో మొదటిసారి అధివాస్తవిక రచనల ప్రకటన ఆరంభమైనప్పుడు సహృదయులు విస్మయం, వేచి చూడడం కంటే అనుమానం, ఆందోళనలకు తీవ్రంగా గురైనట్లు కనబడుతుంది దానికి కారణం చెతవాలెమ అప్పటికే వరాల స్థాయిలో కొస్తున్న అభ్యుదయ వాదం దీనివల్ల అపకృతులమయి మవుతుందేమో

నని భయం ఈ కారణం తప్పక ఆలోచించవలసినదే ''శ్రీ శ్రీ సాహిత్యం''- కావ్యవిభాగంలో శ్రీ కె ఎ రమణారెడ్డి ఇలా అంటున్నారు-

''మరో మహా యుద్ధం విరుచుకు పడటానికి ముందు నుంచీ, మొదటి యుద్ధ కాలం నుంచీ ఫ్రాన్సు వంటి పాశ్చాత్య దేశాలలో భావ సంచలనం సాగుతూ వచ్చింది ధనస్వామ్య ప్రపంచ హంస గీతం ఇలా అప్రశుతుల మయమై పోయిందేమో తెలియదు గాని అంతకు ఎంతో ముందు నుంచీ, గత దశాబ్ది చరమ దశకం నుంచి కూడా- (ఇంకా వెనక్కూపోయి నులివేళ్ళను వెదికి పట్టవచ్చు) ఈ భావకల్లోలం సాగుతూనే వుంది సంజ్ఞావాదం (Symbolism) ఇంద్రియానుభూతుల నిషాకు, ఖుషీకి అధిక ప్రాముఖ్యమిచ్చి యథార్థ వస్తువును అవగతం చెసుకొని కావ్యంలొ పునస్సృష్టించడంలో ఉపమానాన్నో, రూపకాన్నో గాక సంజ్ఞను మాత్రమే ఆశ్రయిస్తూ భావచిత్రాలను కుదించి వేయసాగిన కవులలో వెర్లైన్ (Verlaine), రాంబో (Rimband), మల్లార్మే (Mallarme) ముఖ్యులు కవిత్వానికీ, గానానికీ మధ్యగల అంతరాలనన్నిటినీ తీసివేసి పరస్పరాశ్రితాలుగా చేయడానికి బోద్‌లేర్ (Baudelaire) కవిత్వం-ముఖ్యంగా అతని correspondences - పనికివచ్చి తోవచూపింది వాస్తవాన్ని అవగతం చేసుకోవడంలో సకలేంద్రియాలూ పని చేయాలి అలా అన్నీ పనిచేసినప్పుడు పుట్టుకొచ్చే కళలో చూపు, వినికి, వాసన, కల అన్నీ కలగలిసిపోయి దానికి వైచిత్రిని చెకూరుస్తాయి

''విచిత్రమే సౌందర్యం !
సౌందర్యమే విచిత్రం !''

అయితే, ఆవరకే మొదలై బలీయం కూడా అయిన ఫ్రాయిడ్ (Freud) మనస్తత్వ పరిశోధనల తోటి నేరుగా సంజ్ఞావాదం బ్రహ్మ ముడిపెట్టుకోలేదు సుప్తచైతన్యం (subconscious) లోకి దిగి దానిలోతు నెమకిపన్నా, అంతరంగ చైతన్య అగాధాలనె కళకు ప్రాతిపదిక చెసినందుచెత, ఈ రెంటికీ ఒక

లాంటి భావసామ్యం చేకూరింది క్రమేపీ అవి ఒండొంటితో కలిసి 'సర్రియలిజం'లో సంగమించాయి

ఇంగ్లీషు కవి స్విన్‌బర్న్ ద్వారా, ముఖ్యంగా అతని గాన ప్రధానమైన కవిత్వంద్వారా, ఫ్రెంచి మహాకవి బోద్‌లేర్‌ను, మరి అతని కావ్యానువాదాల అధ్యయనం ద్వారా అమెరికన్ కవి ఎడ్గార్ ఆలెన్‌పోను శ్రీ శ్రీ సమీపించాడు ఇలా మొదలైన పాశ్చాత్య నవీన విచిత్ర కవిత్వ ప్రభావం ఇప్పటికీ తనమీద చెరగని ముద్రగా నిలిచివుంది

భావ కవిత్వంతోటి ముఖం మొత్తిన రోజుల్లోనే 'మహాప్రస్థానం' గేయాలు పరంపరగా వెలువడుతున్నప్పుడు కూడా, దానికి జతగానో, రిలీఫ్‌గానో ఈ వెర్రి వెతుకులాట కొనసాగింది విశాఖపట్నానికి శాశ్వతంగా వీడ్కోలు చెప్పి, మద్రాసులో కొన్నాళ్ళు 'ఆంధ్రప్రభ'లోనూ, ఢిల్లీలో కొన్నాళ్ళు 'ఆకాశవాణి' లోనూ, లక్నోలో ఆర్మీలోనూ పనిచేయవలసి రావడం జీవితానుభవాన్ని సంపన్నం చెయ్యడానికే గాక, కవిత్వంలో ప్రయోగాలు చేసి చూడడానికి కూడా బాగానే ఉపకరించింది చెవిలో తానూదిపోయిన గురుమంత్రం శ్రీరంగం నారాయణ బాబును గురువును మించిన శిష్యుణ్ణిగా చేసింది 'స్వజేశజమ్' అని ముద్దు పేరు పెట్టుకొన్న తెలుగు 'సర్రియలిజం' 'అతివాస్తవిక వాదం' నుంచి 'అధివాస్తవిక వాదం'గా తప్పుదిద్దుకొనే లోపునే పీఠాధిపతి హోదాతో 'అశాంతి నికేతనం' నుంచి తాను ప్రకటనలు జారీ చేసేంతవరకూ పోయాడు శ్రీశ్రీ 'ఖడ్గ మేఘ్రహం' వర్ణ విపర్యయంవల్ల పరువు నిలుపుకొంది 'జిననాథ దేవుని శిరస్సు అలంకారాన్ని ఆశ్రయించ బట్టి సరిపోయింది 'ఆడుది' ఆడించి ఆరాట పెట్టసాగింది ఆశ్చర్యమూ, హాహాకారమూ కలగలిసిపోయేలా ఆహాశ్చర్యం తయారైంది అర్థం అధ్వాన్నపు అడవికి పోయింది ''న న న త్తి మాటలు" కూడా కవిత్వమయ్యాయి క్రియ విశృంఖలమైంది విభక్తి షికారెళ్ళి ది కవి హృదయంలోని రోగ రాగాలాపన ఎలా సాగితే అలా కావ్యం రూపాలంకరణ చేసుకోవలసి వచ్చింది కవి 'స్వేచ్ఛాజీవి' అయినప్పుడు,

స్వేచ్ఛ నియమ రాహిత్యమైనప్పుడు, శబ్దనేత కాకుండా 'శబ్ద ప్రభువు' మాత్రమే కాగలిగాడు నిరంకుశత్వమనేది నైష్ఫల్యమే అయింది నిరర్థకతకూ, అసర్థకతకూ అభేదం కలిగింది

గుడ్డిలో మెల్లగా శ్రీశ్రీ శ్రీరంగం నారాయణబాబులా అగమ్యగోచరమైన అధివాస్తవిక కవిత్వాన్ని రాయలేమ ఎందుచేతనంటె రాయలేడు కనుకనె క్రియలో గుణంలో మంచిదీ, మిన్నైనదీ దానినెప్పుడూ విస్మరించలేకపోయాడు శ్రీశ్రీ అధివాస్తవికతలో ఆనందం వుందేమో - అధివాస్తవికానందం, కాని అభ్యుదయం లేదు బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు రాసినట్టుగా-

"Surrealism, by its very character, cannot be progressive Progress belongs to the realm of realities It is measure of social growth, the growth of a social order from stature to stature It is matter for statistical or quantitative appraisement It is real, surrealism is unreal It is a device of distortion in the realm of art"

హేతుబుద్ధిని నిరాకరించి, దాని నతిక్రమించిపోయి వస్తుయాథార్థ్యానికి వెనకనున్న సత్యాన్ని అవగతం చెసుకొని వివిధ కళలలో దానిని నిరూపింప బూనుకొన్న డాడాయిజం, క్యూబిజం, ఫ్యూచరిజం వంటి ఆధునిక ధోరణులకు 'SURREALISM' అంటూ 1981లో అపోలినేర్ (Apollinaire) నామకరణం చెసిపోయాడు ట్రిస్టన్ జారా (Tristan Tsara), ఆంద్రేబ్రితో (Andre Breton), లూయీ అరగాం (Louis Aragon)వంటి రచయితలు ప్రతిష్ఠించిన డాడాయిజం పిల్లంతొక్కు-పయుకుం పద్ధతిలో (infantilism) ఉధృతమై ప్రపంచపు రంగస్థలంపై ఘోరమై కొల్లదించబూనుకొంది ఆ తర్వాత బ్రెతో స్వయంగా 'సర్రియలిజం' స్థాపించి ఫ్రాయిడ్ పంశోధనలను కావ్యకళకు

అంటుగట్టాడు Automatic writing అనేది ఉద్భవించిది అయితే డాడా యిజం కంటే యిది మెరుగు అది పూర్తిగా విధ్వంసన పరాయణం దీనికి positive ideas కొన్నైనా ఉండేవి ఆలోచనా క్రమాన్ని యధాతథంగా బహిర్గత పరచడమే ఈ ధోరణి చెప్పుకొన్న సంకల్పం

హేతు బుద్ధి పెట్టె అదుపునుంచి అజమాయిషీ నుంచీ తప్పించుకొని మనో గతి ఎటు నిర్దేశించి శాసిస్తే అటు, నైతికమైన ప్రమేయాలకు అతీతంగా కళ ఉండాలి చైతన్యానికీ, సుప్త చైతన్యానికీ- వ్యక్తా వ్యక్తాలకు మధ్యగల అడ్డు గోడలన్నీ పోయి, వాస్తవాన్ని తలదన్నేంతటి అధివాస్తవం (Super-reality) ఏర్పాటుతుంది అందులో కల, మెలకువ, నిజము, కల్పన, అన్నీ కలగలసి పోతాయి జీవితాన్ని శాసించవలసింది ఈ విరాట్ వాస్తవమే అర్థాన్ని అపే క్షించకుండా, స్వచ్ఛందంగా ఉద్దేశరహితంగా, కవి కావ్యం రాస్తాడు మాటలు తమంత తామే (Spontaneous గా) వచ్చి తమ వరసనూ క్రమాన్నీ తామే నిర్ణయించుకొంటాయి వాటి అర్థమేమిటో సృజన తర్వాతనేగాని, సృజనకు ముందు తేలదు

ఈ అయోమయ మనోవ్యాపారంలో కవీ, కళాకారుడూ తమ తమ మనస్సులను humble - recording - machines గానే వ్యవహరిస్తారు. కాబట్టి శుద్ధ కవిత్వం, శుద్ధ కళ పుట్టుకొస్తాయి కళా, కలా సంగమించి ఏదిఏదో తెలియరానంతగా కలిసిపోతాయి

ఇది సిద్ధాంతం-అయితే శ్రీశ్రీ ఆచరణ, రోణంకి అప్పలస్వామి గారన్నట్లు ''సిద్ధాంతానికి బెత్తెడు దిగువగానే ఉండిపోయింది- కాబట్టి లోకం బతికి పోయింది'' ఇంక 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం' అన్న తమ పరిశోధనా గ్రంథంలో అధివాస్తవిక ధోరణి గురించి శ్రీ వెల్చేరు నారాయణ రావు యిలా అభిప్రాయపడుతున్నారు-

— శ్రీ శ్రీ, శ్రీరంగం నారాయణ బాబుల అధివాస్తవిక ప్రయోగాల గురించి ఒకమాట చెప్పడం అవసరం తెలుగులో అధివాస్తవిక కవిత ఎనాడూ ఒక ఉద్యమ స్థాయికి రాలేదు తెలుగులో కవిత్వం మీద ఈ ధోరణి కలిగించిన ప్రభావం ఏదీ లేదు ఈ రకం కవిత్వం ప్రధానంగా ఈ ఇద్దరు కవులకే పరిమితం కావడం అది దాదాపు ఎవరికీ ఆమోదయోగ్యం కాకపోవడం యాదృచ్ఛిక సంఘటనలు కావు అధివాస్తవిక ధోరణికి ప్రేరణ తెలుగు జీవితం నుంచి వొచ్చినదీ కాదు తెలుగు కవిత్వం నుంచి వొచ్చినదీ కాదు, పెట్టుబడిదారీ వ్యవస్థలో యాంత్రిక నాగరికత వెర్రితలలు వెయ్యడం, నగర జీవిత ప్రభావంవల్ల వ్యక్తికి సమాజం నుంచి ఎడబాటు (alienation) కలగడం, సమాజపుటడవిలో మనిషి దిక్కులేని వాడుగా తయారవడం, ప్రపంచ యుద్ధ రూపంలో కనిపించిన వాస్తవికతని తట్టుకోలేక, తిరోముఖుడైన వ్యక్తి అనుభవించే ఆత్యంతిక అసమర్థత, ఇవేవీ తెలుగు జీవితంలో కలిగిన అనుభవాలు కావు

ఎటు చూసినా పరమ సమర్థంగా పురోగమిస్తూ ప్రపంచాన్ని అరచేతిలో పెట్టుకోగలిగే, ప్రకృతి శక్తులను పనిముట్లుగా మార్చుకోగలిగె శక్తిని ఆధునిక విజ్ఞానం ఎల్ల సాధించిన బూర్జువా నాగరికతలో మనిషి తనను తాను మార్చుకోలేక, తాను తయారుచేసిన యంత్రానికి బానిసై, తాను సాధించిన విజ్ఞానంలో తానే బందీ అయి, తోటి మానవులను బానిసలను చేసే కృషికి తోడ్పడే స్థితికి వచ్చినప్పుడు వ్యక్తిలో కలిగిన తిరుగుబాటుతత్వం, అనాగరికతకి మూలప్రాయమైన కార్మిక హేతువుల్నీ, తాత్విక వ్యవస్థనీ తిరస్కరించే తిరుగుబాటు తత్వం, యివి-తెలుగు జీవితంలో ఏనాడూ భాగాలు కావు

ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతం, ఈ వ్యవస్థని సమూలంగా తిరగదోస్తున్నప్పుడూ, యూక్లిడ్ న్యూటన్ల యాంత్రికవర్గం తంకించులవుతున్నప్పుడూ ఏదో ఐం ఫాలాలోంచి బయటపడి ఎంతగా సంతోషించె స్థితి తెలుగు జీవితంలో ఏనాడూ లెదు ఫ్రాయిడ్ వచ్చి మనిషిని సుప్త చైతన్యం బయటికి తెచ్చి మెంకువకీ

సుషుప్తికీ, కలకీ తర్కానికీ, బయటికీ లోపలికీ మధ్యనున్న గోడలు పగలగొట్టి నప్పుడు

'Down with syllogisms, corolories, Q E D, cause and effect, the whole and the sum of its parts! open the gates to the dream, make room for automatism We are about to see a man as he is, we shall be whole men, 'unchained', 'delivered', daring at last to be aware of our desires and daring to fulfill them "

అని ప్రపంచ వాస్తవికతని భగ్నం చెయ్యవలసిన, హేతు వ్యవస్థని కూలదొయ్యవలసిన ఇరుకు పరిస్థితి తెలుగు దేశంలో ఏనాడూ లేదు

భాషా వ్యవస్థ మీద తిరుగుబాటు చేసి, తద్వారా వ్యక్తిని బంధించే ప్రపంచ వాస్తవికతను భగ్నంచేసి, దానికి ప్రత్యామ్నాయాన్ని చూపించే అవసరం పాశ్చాత్య దేశాల్లో వున్న పరిస్థితి వల్ల కలిగినది వ్యక్తిని బందీని చేసే ఆ దేశాల వ్యవస్థపై తిరుగుబాటు, ఆ వ్యవస్థ సృష్టించిన కళా రూపాలపై విధ్వంసక చర్యగా తయారైంది

అయితే, పాశ్చాత్య దేశాలలో రూపొందిన ఈ అధివాస్తవిక ఉద్యమం తత్వతః రాజకీయమైన తిరుగుబాటు అనీ, విప్లవాత్మకమైన ప్రభావాలున్నదనీ, అప్పటి కమ్యూనిస్టు ఉద్యమంతో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా సంబంధం వున్న ఉద్యమమనీ విస్మరించకూడదు తెలుగులో వచ్చిన అధివాస్తవిక ధోరణిలో ఈ తాత్విక గాఢత లేదు అందుచేత అది వట్టి ప్రయోగ వాదంగానే మిగిలిపోయింది అభ్యుదయ కవిత్వ ఉద్యమంలో దీనికి సహజమైన చోటు కలగడానికి ఆస్కారం లేకపోయింది

"నానా సూన వితాన వాసనల నానందించు సారంగం'లో చమత్కృతినే కవిత్వం అనుకుంటున్న వాళ్లకి, 'నాదు నిశ్వాస తాల వృంతాలు గలవు', 'నాకు కన్నీటి సరుల దొంతరలు కలవు' అనుకుంటూ, లేని అనుభూతికి కవిత్వాకారం యిచ్చుకుంటున్న వాళ్లకీ—

సింధూరం రక్త చందనం
బంధూకం సంధ్యారాగం
పులి చంపిన లేడి నెత్తురూ
ఎగరేసిన ఎర్రని జెండా-

కవితా రంగంలో అలజడి కలిగించగా-

కాకికేమి తెలుసు, సైకో ఎనాలసిస్
ఆటవెలది ద్విపద కర్తగారు
5 3 2 ఆముక్త మాల్యద
విశ్వదాభిరామ వినురవేమ

లాంటి కవిత్వం చిలిపితనంగానూ, వెర్రితనంగానూ మాత్రం కనిపించింది

తెలుగు కవిత్వంలో ఏ ముఖ్య పరిణామానికీ కారణం కాలేకపోయిన అధివాస్తవిక కవిత్వాన్ని గురించి ఇంతకన్నా ఎక్కువ పరిశీలన ఇక్కడ చెయ్యడం లేదు "

ఇలా సుదీర్ఘంగా ఉటంకించటం ఆపి, అధివాస్తవిక ఉద్యమం గురించి, ఆత్రేయితో నుంచి శ్రీశ్రీ వరకు ఈ ధోరణిలో రచనలు చేసిన కవుల గురించి మరి కొంత మంది సాహితీపరులు తయారుచేసిన ఛార్జిషీటులోని అంశాలు స్పష్టంగా తెలియజేస్తాను

1 సమాజం నిర్లక్ష్యంచేసిన నిత్యసత్యాలు వీరికి అర్థరహితంగా కనిపించాయి

2 సమాజంలో కనిపించే సౌందర్యం గాక జుగుప్స వీరికి ప్రధానంగా కనిపించింది

3 వైచిత్రిని సాధించటమే రచనా లక్ష్యమైపోయింది

4 ఫ్రాయిడ్ కామవాంఛ సిద్ధాంతం (libido) వీరిని అపరిమితంగా ఆకర్షించింది

5 సుషుప్తావస్థలోని అవ్యక్తంవేపు ప్రయాణం సాగించారు

6 బీభత్సం వీరి ప్రధాన రసం

7 అసంపూర్ణ కాంక్షలకు తమ రచనల్లో ప్రాధాన్యత నిచ్చారు

8 'కళ కళకొరకే' అన్న అభ్యుదయ నిరోధక సిద్ధాంతం దీనికి ప్రోద్బలం

9 ఇది అరాజక వాదం

ఇవి ఆధారాల్లేని ఆరోపణలు ఎంతమాత్రం కావు చాలావరకు అధివాస్తవికులే తమ కవితల ద్వారా, చర్యల ద్వారా అటువంటి ఆరోపణలకు అవకాశమిచ్చారు తెలుగు అధివాస్తవికులు మరీ ఎక్కువ అవకాశం ఇచ్చారు అయితే అధివాస్తవికత రచనావసరం వెనుక వారు ప్రగాఢంగా నమ్మిన తాత్వికకోణాల్లో నుండి కూడా చూడవలసిన అవసరం వుంది

దానికి ముందు మరో విషయం కూడా పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది

"ఏ కవిత్వాన్నయినా వస్తువు, కవి, కావ్యం, శ్రోతలు ఈ నాలుగు అంశాల దృష్ట్యా చూడవలసి ఉంటుంది" అన్నారు వెల్చేరు నారాయణరావుగారు (చూ పేజి 113-'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం') ఈ నాలుగే గాక 'కాలం' అనే మరో అతిముఖ్యమైన అంశాన్ని కూడా దృష్టిలోకి తీసుకుని తద్వారా అంచనాలు వెయ్యాలని నేననుకుంటున్నాను

తెనుగు సాహితీ సముద్రతీరానికి మొదటి నుండీ దిగుమతి చెయ్యడానికొచ్చే ఓడలే తప్ప, ఎగుమతి చేసే ఓడలు లేకపోవడంవల్ల - (Inferiority Complex ఏమైనావుందేమో పరిశీలించాలి) సంస్కృతం నుండి గాని తాను

వాదంతో ప్రారంభమైన మన గ్రంథస్థ సాహితీ చరిత్రలో—ఇక్కడి కాలానికీ, అవసరాలకీ, అన్వేషణలకీ ఒక్కోసారి సంబంధంలేని విధంగా కూడా, వరుస క్రమం లేకుండా కూడా దృక్పథాలు, ధోరణులు, ఉద్యమాలు దిగుమతైనై

ఈ సందర్భంలో నేను భారతం తెలుగులోకి ఎందుకు అనువదింపబడాలని ప్రశ్నించడం లేదు తెలుగులో భారత అనువాదావశ్యకత వేరు, తెలుగు సాహిత్యపు ఆది కావ్యంగా రావలసిన, పేర్కొనవలసిన అవసరం వేరు

1920 ప్రాంతంలో ఫ్రాన్సులో బయలుదేరి ప్రపంచ వ్యాప్తంగా కళా, సాహిత్యరంగాల్ని ప్రభావితం చేసిన అధివాస్తవికోద్యమ నేపథ్యానికీ తెలుగు దేశంలో అది దిగుమతి అయ్యేనాటి సామాజిక యథార్థానికీ నేరుగా సంబంధ మేమీలేదు

ఆధునిక తెలుగు సాహిత్యం వయస్సు యింకా వందేళ్లు నిండలేదు ఈ శతాబ్దారంభంలో గురజాడ, కందుకూరి, గిడుగు, ఉన్నవలచే మనం ఆధునిక యుగప్రవేశం చెయ్యబడ్డాం సాహిత్య, సామాజిక రంగాల్లో ఉవ్వెత్తున సంస్కరణ వాదదృక్పథంతో, సామాజిక స్పృహతో ప్రారంభమైన ఈ యుగంలో మధ్యలో ఆత్మాశ్రయమైన భావకవితోద్యమం రావడం జరిగింది దేశస్వాతంత్ర్యంకోసం ఉద్యమం నడుస్తుండే భావకవులు తమ ప్రబంధ వ్యూహాప్రేయసిపై కవిత్వాలు రాస్తున్నారు అలాగే అభ్యుదయకవితోద్యమం పతాక స్థాయికి చేరుకుంటున్న దశలో అధివాస్తవికులు ప్రవేశించారు

తిరిగి అభ్యుదయవాదం పుంజుకోవలసిన తరుణంలో వ్యాపార సంస్కృతి దేశాన్ని ముంచివేయడం జరిగింది

ఫ్యూడల్ సమాజం నుంచి పెట్టుబడిదారీ సమాజంలోకి పరివర్తన చెందే దశలో ఒక క్రమ పద్ధతిలో దీని సంఘర్షణలో, చిత్రణలో అనేక ఉద్యమాలు యూరప్‌లో వొచ్చాయి కొంతకాలం తేడాతో ఆయా దృక్పథాలు, ఉద్యమాలు తెలుగు దేశానికి కొన్ని దిగుమతి అయినాయి

ప్రకృతి, అద్వితీయ ప్రణయారాధన, గత వైభవ పునరుద్ధరణ, అద్భుత సాహస, స్వేచ్ఛా ప్రియత్వం మొదలైన అనేక కోణాలు గలిగిన కాల్పనికోద్యమం జంఝామారుతంగా వీచిన తర్వాత ఫ్యూచరిజం, ఇమేజిజం, సింబాలిజం, డాడాయిజం, సర్రియలిజం వొచ్చాయి

మొదటి యుద్ధంలో మానవ మేధస్సు, సంస్కృతి, సాంఘిక చట్రం కుప్ప కూలిపోవడం లేక నిస్తేజకరమైనవని నిరూపణ కావడం, శాస్త్ర విజ్ఞాన ఫలితం సర్వమానవాళికీ చెందకపోవడమేగాక మానవ మారణహోమానికి వినియోగపడడం కళ్లారా చూసి గత కాలపు సకల విలువల్నీ ధ్వంసం చెయ్యాలంటూ జూరిచ్‌తో ట్రెస్టన్ జారా నాయకత్వాన 1916 లో డాడాయిజం ప్రారంభమై ఫ్రాన్సు చేరుకుంది ఈ ఉద్యమం యూరప్ అంతటా కళా, సాహితీ రంగాలను ప్రభావితం చేసింది

గత కాలపు సర్వ విలువల్నీ ధ్వంసం చెయ్యమనడమే దీని తాత్వికత ఆ ఉద్యమంలో కొంతకాలముండి ఆచారణాత్మకత ఏమీ లేక, విధ్వంసన తర్వాత మరో తాత్విక సిద్ధాంత మేమీ లేక డాడాయిజం నుండి బయటి కొచ్చి లూయీ ఆరగాం, పాల్‌ఎలార్డ్, పెరె, ఫిలిప్పిసొపాల్ మొదలైన దాదాపు పన్నెండు మందితో వాస్తవికోద్యమం ప్రారంభించాడు మొదటి మానిఫెస్టో 1924 లో వెలువరించాడు సాల్వడార్ డాలీ, మాక్స్, ఎర్నెస్ట్, మాన్‌రే వంటి సుప్రసిద్ధ కళాకారులు, ఫిలిం దర్శకులు కూడా యీ ఉద్యమంలో వున్నారు

వీరు ఫ్రాయిడ్ 1900 వ సంవత్సరంలో ప్రచురించిన Interpretation of Dreamsను తమ తాత్విక గ్రంధంగా చేసుకున్నారు

"శాస్త్రవేత్తలు, తాత్విక దార్శనికులు చెబుతున్నది వాస్తవం కాదు ఎందుకంటే వారు సాధించిన శాస్త్ర విజయాలు మానవాళికి చేరడం లేదు అందుకు చెప్పే కారణాలు సహేతుకంగా కనపడడం లేదు వాస్తవికతా దృక్పథం వలన సమస్యలు పరిష్కరింపబడడం లేదు మనిషి దాదాపు సగం

జీవితం నిద్రలో గడుపుతున్నాడు అంటే సుప్త జాగృతిలో మనిషి యింత వరకూ చొరని ఈ సుప్తచైతన్య క్షేత్రంలోనే మనిషి యీ రకంగా ప్రవర్తించ డానికి సమాధానాలు దొరకవచ్చు ఆదే నిజమైన మూలాధారం కావచ్చు అని భౌతిక వాస్తవికత యొక్క విఫలత యుద్ధంలో చూసి అంతర్ముఖు"లయ్యారు

భౌతిక వాస్తవం కొద్ది వాస్తవమేనని, పూర్తి వాస్తవం స్వప్నసీమలో నున్న సుప్త చైతన్యంలోనే ఇమిడివుందని అధివాస్తవికులు విశ్వసించారు ఆ క్షేత్రంలోనే కళాకారుడికి సృజన జాగృతమవుతుందని నమ్మి ప్రయాణించారు తద్వారా రాజకీయ విప్లవం, సమాజ పురోగతి సాధ్యమనుకున్నారు ప్రేమ, విప్లవాలను ఏకకాలంలో కోరుకున్నారు స్వప్నసుషుప్తావస్థలో మేల్కొనే అజ్ఞాత భావాల ఆవిష్కరణే ఆదర్శమైనది వీరికి కవిత రచనలో ఆకస్మికతకి (chance) objective automatic పద్ధతికి ప్రాధాన్యత నిచ్చారు

మిలిటరీ, రాజ్యాంగ యంత్రం, సైన్సు సాధించిన విజయాలు ఆదిమాన వుడిచేత జిక్కినట్లు నిర్ధారణ చేసుకున్నారు

వాళ్ళు తమ అభిప్రాయాలను ఇంకా ఇలా ప్రకటించారు సంకెళ్ళూ, ఏ ఆచ్ఛాదనలూ లేని స్వేచ్ఛాయుత మానవుణ్ణి చూడాలని కాంక్షించారు మనిషి ఆలోచనలు, చర్యలు అతని జీవితం అంతా నిద్రాస్థితిలోనే జీవం పోసుకుంటు న్నాయి ఆ ప్రదేశానికి వెళ్ళడానికే అతను భయపడుతున్నాడు, తర్కబద్ధ నిర్మాణం, క్రియలు సమాసాలు, మొదలైనవేవీ వాక్యాల్లో ఉండకూడదు, మాటలుంటాయి, వాటిష్టం వచ్చిన అర్థాలని అవి అందజేస్తాయి, వాటికి సంబం ధించని అర్థాలు కూడా ప్రసారంచేస్తే చెయ్యవచ్చు తర్కబద్ధమైన నిర్మాణం సౌందర్యవంతం, దాన్ని ధ్వంసంచెయ్యాలి 'కవిత్వం ఆత్మతో ఆత్మ మాట్లాడే భాష కావాలి '

భావచిత్రాలు భావాలతో, feelings తో ప్రయాణించకూడదు, మెరుపుల్లా ఉండాలి తనుకాదు, తనలో కనబడని తన తనమే ఆ అతిథే ప్రత్యక్షంగా

కవిత్వంలో పుంకాలి చివరికి, పలికేవాడూ, తానూ ఒకటే కావాలి తనలో తాను బాహ్య, అంతర్గత స్థాయిల్లో సంలీనం కాగలగాలి క్షణికంలో శాశ్వతత్వాన్ని బంధించాలి ఏకత్వంలో అనేకత్వం విలీనం కావాలి కవితా రచనవి కొద్దిమందో చేసేది కాదు, సామూహిక కార్యం కాగలగాలి పద్యపాదాలు ఛందస్సుల ప్రకారం నిర్మించుకుంటూ పోయే పద్ధతి పోవాలి, సుప్త చైతన్యమే కవిత్వం డిక్టేట్ చేసే automatic text కావాలి కవిత్వంలో కళ, సౌందర్యం చోటు చేసుకోరాదు

కాంక్ష, దానిఫలప్రయత్నమే సహజమైంది మతం, కుటుంబం, నీతి విధించిన సంకెళ్లు బద్దలు కొట్టాలి – అప్పుడే నూతన మానవుడి ఆవిర్భావం జరుగుతుంది

బయటికి పరస్పర విరుద్ధంగా కనిపించే స్వప్నం, వాస్తవికత యీ రెండూ ఏకవాస్తవికతగా, అధివాస్తవికతగా రూపొందాలి

అధివాస్తవిక రచయితల భావాలు మరి కొన్ని -

* సాహిత్యంతో మాకు ఎలాంటి సంబంధము లేదు అయితే, అవసరమైతే అందరికి మల్లేనే దాన్ని మేం వుపయోగించగలం

* అధివాస్తవికత అభివ్యక్తీకరణకు మరో పద్ధతి కాదు, అంత సులభమైనదీ కాదు, కవితా మార్మికతా కాదు, మనసును బంధవిముక్తి గావించేది, లేక అలాంటిది

* మనుషుల్లోని తప్పుల్ని సరిజేసెయ్యగలమని మేం చెప్పడం లేదు, ఎంత కదిలిపోయే పునాదులపై వాళ్లు ఇల్లు కట్టుకున్నారో చెప్పదలచుకున్నాం

* మేం తిరుగుబాటు చెయ్యడంలో సిద్ధహస్తులం దానికి ఏ పద్ధతి అవలంబించవలసొచ్చినా వదలం మాకు సాధ్యం కాని పద్ధతేమీ లేదు, అవసరమైతే

* సౌందర్యం గడగడలాడిస్తుంది అట్లా చెయ్యకపోతే అది సౌందర్యం కాదన్నమాట

* భావం పదార్థాని కంటే అత్యంత అధికమైనది ఇటువంటి భావాలు అనేకం పరస్పర విరుద్ధంగా కనిపించేవి అధివాస్తవిక రచయితలు ప్రకటించారు ఆ తరువాత చాలామంది (1938 తర్వాత) సర్రియలిస్టులు French Communist పార్టీలో చేరడం జరిగింది ఏదిఏమైనా 19.8-40 ల మధ్య యూరప్‌లో సాంఘిక, రాజకీయ, తాత్విక సంఘటనలను ప్రభావితం చేసింది సర్రియలిజం

భౌతిక వాస్తవికత పూర్తి వాస్తవికత కాదని మనిషి స్వప్న సీమలోకి ప్రయాణించి సుప్త చైతన్యాన్ని మేలుకొల్పడానికి ప్రయత్నించింది అధివాస్తవికం కనబడేదంతా యథార్థమని నమ్మలేదు అధివాస్తవికం నిర్ధారణ అయిపోయాయనుకునే నియమాల్ని, పద్ధతుల్నీ, ఆలోచనా క్రమాన్నీ, రూపాల్నీ నమ్మలేదు అధివాస్తవికం

రెండు ప్రపంచ యుద్ధాల మధ్య మారణాయుధం మానవుణ్ణి మరుగుజ్జుని చేసేస్తే, మానవత్వాన్ని ఒక గుప్పెడు బూడిద చేస్తే ఆ బీభత్సంలో వెర్రి కేకతో ఆధునికం ఆత్మలోకి ప్రవేశించినదే అధివాస్తవికం ఆంద్రేబ్రితో, పాల్ ఎలార్డ్ మొదలైనవారు చాలా అద్భుతమైన, అరుదైన కవిత్వం రాశారు భౌతిక భావచిత్రాలు ఎక్కడ శవాలైపోతాయో అక్కడనుండి అధివాస్తవిక జీవంతో ఆ భావ చిత్రాలు వాళ్ళ కవిత్వాల్లో కదలాడుతూ వుంటాయి యుద్ధ బీభత్సంలో తప్పిపోయిన నగరాల్లో మానవుడి అంతరంగపు అంగాలు బయటికి తెచ్చి చూపినట్లుగా ఉంటాయి ఫ్రెంచి అధివాస్తవిక కవులు నిజమైన, గంభీరమైన శబ్ద సౌందర్యాన్నీ, పరస్పర విరుద్ధాకర్షణల్లో మెరిసే సౌందర్యాన్ని హేతువుకు అతీతమైన నిర్మాణాన్ని వారి రచనల్లో సాధించారు

నిజానికి ఈ తాత్విక గాఢత తెలుగు అధివాస్తవిక కవుల్లో ఎవరికీ లేదు శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబుల కవితల్లో సాంప్రదాయికత, ధ్వని, చమ

త్కారం, హాస్యం, ఉత్తి శబ్ద వైచిత్రి వాళ్ళని యీ తాత్విక గాఢతకి దూరంగా వుంచేశాయి శ్రీశ్రీ 'అభిసారికి కడసారి' నారాయణబాబు —: మౌనశంఖం కొంత దగ్గరగా వస్తాయి ఏ సాంప్రదాయిక ఆలోచనా వాసనల్లేని ఆధునిక అధివాస్తవిక కవి తెలుగులో అజంతా ఒక్కడే అధివాస్తవిక తాత్విక గంభీరత తక్కినవాళ్ళకంటే కొంత ఎక్కువ అతనిలోనే వుంది అయినా అతనూ సుప్త జాగృతిలోంచి బయటకొచ్చి రాస్తున్నట్లుంటాడు డిలాన్ థామస్, మలార్మె నిర్మాణ పద్ధతికి అతని కవిత్వం దగ్గరగా ఉంటుంది తక్కిన వాళ్ళు రాసినవి ఆధునిక భ్రమలే తప్ప ఆధునికం కావు అచ్చమైన అధివాస్త విక వచన పాదాలు కొన్నయినా అజంతాలోనే మనకు దర్శనమిస్తాయి

అధివాస్తవికులు మన పెద్దలు చెబుతున్నంత రాక్షసులు కాదు, ఎందు కంటే అధివాస్తవిక పద్ధతి అంత సులువైనదికాదు తెలుగుదేశంలో ఒక ఉద్య మంగానో ఒక కవితా నిర్మాణంలో పూర్తిగా ఒక పద్ధతిగా ఈనాడు రావలసిన అవసరం లేదు

ఆధునిక కవితా రచనకు అవసరమైన కవిత సామగ్రిలో ఒక రంగుగా, ఒక కోణంగా, ఎక్కడన్నా కావలసిన ఎఫెక్టుకోసం దీన్ని ఉపయోగించుకో వచ్చు

అయితే అధివాస్తవికులు లేవదిసిన తాత్విక ప్రశ్నలు ఇంకా ప్రశ్నలు గానే వున్నాయి సిద్ధాంతాల ద్వారా సమాధానాలు గాక, వాస్తవంలో, మానవుడి ఆచరణలో సమాధానాలు లభించేవరకూ అవి ప్రశ్నలుగానే వుంటాయి

**ఆధునిక తెలుగు సాహిత్యంలో**

# అస్తిత్వవాదం

—నిఖిలేశ్వర్

మనిషి మనుగడ ప్రపంచంలోని ఏ సాహిత్యానికైనా - తత్వానికైనా మూలం శతాబ్దాలుగా మనిషి తన ఉనికి గురించి వివిధ రకాలుగా వ్యాఖ్యానించుకుంటూ వస్తున్నాడు కేవలం వ్యాఖ్యానం-వివేచనం మాత్రమే చాలదు ఉనికిని మరింత అర్థవంతం - సుఖవంతం చేసుకోడానికి ఈ ప్రపంచాన్ని మార్చే తత్వ శాస్త్రం కార్ల్ మార్క్స్‌తో మలుపు తిరిగింది ప్రతి వ్యవస్థలో ఉత్పత్తి సాధనాలు - యాజమాన్యం ఎవరి చేతుల్లో వుంటాయో వాళ్ళకు నిజమైన స్వేచ్ఛ-మనుగడ వుంటుందనే సామాజిక యథార్థాన్ని ప్రపంచం తెలుసుకుంది

అయినా మనిషి సమిష్టిలో భాగస్వామ్యం పొందేముందు వ్యక్తిగా ఎన్నో సమస్యలను ఎదుర్కొంటాడు మరీ ముఖ్యంగా పెట్టుబడిదారి వ్యవస్థతో వ్యక్తి జీవితం ఎన్నో నిబంధనలను నిషేధాలను లోనై వుంటుంది శ్రమ శక్తిలో సరియైన పాత్ర లేక, శ్రామిక ఉత్పత్తిలో న్యాయమైన హక్కులేక వ్యక్తి మధ్య తరగతిలోకి లేదా బూర్జువా వర్గంలోకి చేరిపోతున్నాడు వర్గ వ్యవస్థను మార్చగలిగే పోరాటంలో తన సొంత కర్తవ్యాన్ని శ్రమజీవులతో సమేకమై నిర్వహించాలనే సామాజిక స్పృహ లేనంతకాలం ఈ మధ్య తరగతి వ్యక్తి తనకుతానే పరాయి వాడుగా, ఒంటరిగా, దిక్కులేనివాడుగా మిగిలిపోతుంటాడు

వ్యక్తికి సమాజానికి మధ్య (ముఖ్యంగా పెట్టుబడిదారీ వ్యవస్థలో) వివిధ రంగాలలో వుండే సంఘర్షణ తరచుగా వ్యక్తి అస్తిత్వం గురించి సందేహాలను

రేకెత్తిస్తూ వుంటుంది ఇలాంటి సందేహాలను లేవనెత్తి వ్యక్తి ప్రధానమైన ఒక తాత్విక దృక్పథాన్ని ఆధునిక ప్రపంచంలో ప్రచలితం చేసినవాడు జ్యాపాల్ సార్త్రి

రెండో ప్రపంచ యుద్ధ కాలానికి ముందు ఆ తర్వాత ఫ్రాన్స్‌లో వుండే అనిశ్చిత జీవన పరిస్థితులవల్ల యూరప్ ఖండంలోని ఫ్రెంచి పౌరుని మనుగడ ఆ కాలంలో నిస్సహాయంగా మారిపోయింది ఎవరికి వారే తమ గమ్యాన్ని వెతుక్కొంటూ తమ అస్తిత్వ రక్షణ కోసం, సాధ్యమైనంతగా ఆనందాన్ని పొందే అనుభవాలకోసం పరుగులు ప్రారంభించారు ఆర్థికంగా ఒక వైపు పెట్టుబడి దారి దోపిడీ సంబంధాలు మరోవైపు జర్మన్ నాజీల దురాక్రమణ ఫ్రాన్స్‌లో నెలకొంది వాటిలోంచి ఒంటరితనం వచ్చింది అదే ఆ ఫ్రెంచి పౌరుల్ని ఏకాకి తనపు పరిమితుల్లో బంధించింది నాజీలను ప్రతిఘటించే దేశభక్తి కొందరిలో వున్నా నిరాశవల్ల చాలా మంది ఫ్రెంచి ప్రజలకు ఒక మహత్తరమైన ఆశయం కోసం జీవితాన్ని సార్థకం చేసుకోవాలనే ఉన్నతమైన విలువ కొరవడింది కేవలం వ్యక్తిగతమైన స్వేచ్ఛతో ఎలాగో మనుగడను కొనసాగించడమే ఒక కీలకమైన జీవిత సారాంశమనే తత్వం ఉబికి వచ్చింది

మొదలు ఈ రకమైన వ్యక్తివాద తాత్విక దృక్కోణం సాహిత్య రూపంలో ఫ్రాన్స్‌లో వచ్చింది డాడాయిజం, సర్రియలిజం లాంటి అరాచక నిష్ప్రయోజన వాదాలు కొంత వ్యాపించాయి 1930-50 మధ్య ఫ్రెంచి మేధావులు అక్కడ విచ్ఛిన్నమైపోయిన విలువల మధ్య ఆలోచించారు - రచనలు చేశారు

అలాంటి దశలోనే తాత్వికంగా మనిషి ఉనికి ఆ తర్వాత సంభవించె మృత్యువు - వీటి మధ్య మనిషి స్వేచ్ఛాజీవిగా తాను ఏమి కావాలో తానా విధంగా మారగలిగె అవకాశాలు - తవేదనలు - అన్వేషణలు ఉన్నాయని సార్త్రే తన కథలు, నవలలు, నాటకాలు తాత్విక గ్రంథాలలో విడమర్చి సవిస్తారంగా చెప్ప

కొన్నాడు అవే ఈనాడు ఆధునిక దర్శన శాస్త్రంలో ఒక విభాగంగా నిలిచి పోయాయి ఫ్రెంచి సాహిత్యానికి - తాత్విక విభాగానికి సార్త్రి అతి ముఖ్యమైన సృజనాత్మకమైన సంపత్తిని చెకూర్చిపోయాడు

ఈ రచనల ఇంగ్లీషు అనువాదాలు ఆధునిక తెలుగు రచయితలను కొంత మేర ఆకట్టుకొన్నాయి 1950-75 మధ్య చెదురు మదురుగా తెలుగులో అస్తిత్వవాద తాత్విక దృక్కోణ ప్రభావంతో కొన్ని రచనలు వచ్చాయి ఆ తత్వాన్ని ఆకళింపు చేసుకొని వివిధ ప్రక్రియల్లో కొందరు తెలుగు రచయితలు మౌలికమైన రచనలు చేసారు ఈ ప్రభావం కవితా కథానిక నాటకాలపై స్వల్పంగా, నవలలపై అధికంగా వుంది తత్ఫలితంగా ఆధునిక తెలుగు జీవితాన్ని ఆలోచనల స్థాయిలో కొంత వరకు, ఆచరణలో అతి స్వల్పంగా ఈ అస్తిత్వ వాద దర్శనం చోటు చేసుకొన్నది దేశంలో విస్తరిస్తున్న పారిశ్రామికీకరణ, నగర జీవితంలోని క్లిష్ట సమస్యలు ఈ తత్వం వైపు మొగ్గడానికి కొంతమంది మధ్య తరగతి మెధావులకో అవకాశం దొరికింది

## సార్త్రి జీవితం

''అభిప్రాయాల స్వరూపం, మనిషి అస్తిత్వానికి సంబంధించిన సత్యం ద్వారా నిర్ణయమవుతూ వుంటుంది (మార్క్స్) అనే యధార్థాన్ని నమ్మినపుడు సాధారణంగా ఒక తత్వవేత్త జీవన పరిస్థితులు పరిగణనలోకి తీసుకోవలసి వుంటుంది 1905 లో ప్యారిస్‌లో జన్మించాడు సార్త్ర్ తల్లి అన్నామేరీ స్క్విట్జర్ భర్త చనిపోగానే తల్లితండ్రుల ఇంట్లో ఆశ్రయం పొందుతుంది తన తండ్రి మరణం తన జీవితంలో ఒక గొప్ప సంఘటన అని సార్త్ర్ చెబుతూ తాను పసివుగా వుండగానె మేరి స్వంత తల్లితండ్రుల వద్ద స్వేచ్ఛ కోల్పోయిందనీ, తనకెమో నిజమైన స్వేచ్ఛ లభించిందని అంటాడు 'వర్డ్స్' పేర తన స్వీయ చరిత్ర రాసుకొన్న సార్త్ర్ - చిన్నవాడు పసితనంలో తల్లి పాలు దొరక్క, ఆప్యాయత లభించక తొమ్మిది నెలల ప్రాయంలోనే జబ్బుపడి నీరసంతో ఎదో

దిక్కు తెలియని మనుషుల మధ్య వున్నానని, నిజంగా తల్లి తనను వొడిలోకి తీసుకొన్నప్పుడు ఎవరో కొత్త వ్యక్తి దగ్గరికి వెళ్ళినట్టు అనిపించిందని వర్ణిస్తాడు ఆ తర్వాత జీవితం తాత అమ్మమ్మల ఇంట్లో ఒంటరిగానే గడిచింది పుస్తకాల మధ్య శబ్దమయ ప్రపంచంలోనే గాలి పీలుస్తూ సార్త్ర్ యౌవ్వనంలో అడుగు పెట్టాడు ఆనాటి ఫ్రెంచి సామాజిక వ్యవస్థలోని యాంత్రికత్వం, మమతానురాగాలు లభించని పెట్టుబడిదారీ వ్యవస్థలోని పరాయితనం (వైమనస్యత) సార్త్ర్‌ను ఒక "శిథిలమైన అద్దాల మేడ"గా మార్చివేసింది

సార్త్రె 1933-34 మధ్య జర్మనీలో హస్సెర్ల్, హెడెగ్గర్ లాంటి తత్త్వవేత్తల దగ్గర తత్వశాస్త్రాన్ని అధ్యయనించాడు ఆ తర్వాత అధ్యాపకుడిగా- రచయితగా జీవితం గడిపాడు ఫ్రాన్స్‌లో రెండో ప్రపంచ యుద్ధకాలంలో హిట్లర్‌కు వ్యతిరేకంగా ఉద్యమంలో పాల్గొన్నాడని నాజీలు సంవత్సరం పాటు బంధించారు వ్యక్తిగా కాకుండా సామూహికంగానే పోరాడగలమనే నమ్మకంతో ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ సభ్యుడైనాడు కాని 1956లో హంగరిపై రష్యా దాడిచేసినపుడు పార్టీ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చాడు ఆనాడు ఫ్రాన్స్ అల్జీరియాలో అనుసరించిన హింసాయుతమైన వలసవాదాన్ని బాహాటంగానే ఖండించి అల్జీరియా ప్రజలు జాతీయ స్వాతంత్ర్యం కోసం జరిపిన ప్రతిహింసా చర్యలను సమర్థించాడు 1960 తర్వాత ఇండోచైనా ప్రాంతాలలో ఫ్రాన్స్ వలసాధిపత్యాన్ని పుణికి పుచ్చుకున్న ఉత్తర అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని నిశితంగా ఖండించాడు వియత్నాంలో అమెరికన్ సైనికులు జరిపిన పాశవిక చర్యలను గర్హిస్తూ వారిని యుద్ధ నేరస్థులుగా శిక్షించాలని బెర్ట్రాండ్ రస్సెల్ ఏర్పాటుచేసిన ట్రిబ్యునల్‌లో చురుకుగా పనిచేసాడు 1968లో ఫ్రాన్స్‌లో బూజుపట్టిన బూర్జువా వ్యవస్థను కూలదోయాలని లేచిన విద్యార్థుల తిరుగుబాటును స్వయంగా పాల్గొని సమర్థించాడు ఆ తిరుగుబాటును వెన్నుపోటు పొడిచిన ఫ్రెంచి మితవాద కమ్యూనిస్టు పార్టీ పెత్రపు సార్త్ర్ ఖండించాడు ... మానవతావాదిగా ప్రపంచంలో ఎక్కడ అన్యాయం జరిగిన తన గొంతు వినిపించాడు సంస్థాగతమైన గుర్తిం

వును నిరాకరించి 1965లో ఇచ్చిన నోబెల్ బహుమానాన్ని తిరస్కరించాడు మావో, గువేరా, కాస్ట్రోలను స్వయంగా కలిసాడు

## సార్త్రె తాత్విక ప్రపంచం :

అస్తిత్వవాదాన్ని ప్రారంభించిన కిర్క్‌గార్డ్ స్వతహాగా హెగెల్ భావ వాద ధోరణిని కొంత నిరాకరించాడు సిద్ధాంతాలు సూత్రాలపై కాకుండా ఉనికి - ఆచరణకే ప్రాధాన్యత ఇవ్వాలనే మౌలిక అంశం సార్త్రెకు ముందే వుండేది ఈ తత్వాన్ని జర్మన్ తత్వవేత్తలు జాస్పర్స్, హెడెగ్గర్, ఉన్‌మానో అభివృద్ధి పర్చారు వీటి ఛాయలు దాస్తోవస్కీ, కాఫ్కా రచనల్లో ప్రస్ఫుటమైనాయి 1940లో అస్తిత్వవాదం ఆధునికరూపంలో నిరీశ్వర అస్తిత్వవాదంగా సార్త్రె ప్రవచించగా ''Being and nothingness'' గా బయటికి వచ్చింది

క్రిస్టియన్ అస్తిత్వవాదంగా మరోవైపు మతపరమైన అస్తిత్వవాదం కూడా యూరప్‌లో ప్రచారంలో వుండేది జాస్పర్స్, గాబ్రియల్ మార్సెల్స్ లాంటి రచయితలు మౌలికంగా భగవంతుని భావనను నమ్మి రచనలు చేశారు

మనిషి సారాన్ని లేదా చైతన్యాన్ని నిర్ణయించేది మనిషి మనుగడ మాత్రమే (Existence Precedes essence) అనే ముఖ్యమైన అంశం, మార్క్సిజం మౌలికంగా వివేచించే ''పదార్థమే చైతన్యానికి మూలం'' అనే దానికి అతి సమీపం మిగతా అంశాలలో అస్తిత్వవాదం వ్యక్తిస్వేచ్ఛ, వ్యక్తి అస్తిత్వం అనే వాటికి అత్యధిక ప్రాధాన్యత ఇవ్వడం మూలాన వ్యక్తివాద భావవాదంగా మిగిలిపోతుంది

అస్తిత్వ తత్వానికి సంబంధించిన ఆది భౌతిక తత్వాన్ని, మనిషి అనుభవాన్ని చైతన్యయుతమైన అనుభవంగా గుర్తిస్తూ ఒక పద్ధతి ప్రకారంగా మనస్తత్వశాస్త్రరీత్యా పరిశీలించె (An essay on Phenomenological

Ontology) బృహత్తర వ్యాసంగా సార్త్రె "Being and Nothingness" రూపంలో తీర్చిదిద్దారు

ఈ అస్తిత్వవాదాన్ని స్థూలంగా ఇలా నిర్వచించవచ్చు- "చైతన్యాన్ని వ్యక్తిగతమైన అస్తిత్వమే నిర్ణయిస్తుంది ఏది కావాలో ఎన్నుకునే సంపూర్ణమైన స్వేచ్ఛ మనిషికి వుంది కాని ఏది కావాలో అనే దానికి హేతుబద్ధమైన ఆధారం లేదు అందువల్ల మనిషి నిరంతరం ఆదుర్దా-వైమనస్యాలతో (పరాయి వాడిననే లక్షణం) జీవిస్తాడు"

ఇంతకు Existentialism కు సరియైన పారిభాషిక పదం తెలుగులో "అస్తిత్వవాదం" అనడం సరియైనదేనా అని అనుమానం రావచ్చు గత ఇరవై సంవత్సరాలుగా వాడుకలోకి వచ్చిన ఈ పదం సమంజసంగానే ఉంది (తెలుగుభాషా సమితి ప్రచురించిన విజ్ఞాన సర్వస్వం 7 వ సంపుటిలో ఇదే పారిభాషిక పదం ఉంది) అయితే అస్తిత్వవాద నిర్వచనాన్ని మొత్తం ఒకే పదంలోకి కుదించాలనె తాపత్రయం కొద్దీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారు ("భారతి" 1966 ఫిబ్రవరి) Existentialism కు "సర్వాస్తి స్వభావ వైశేషికవాదం" అనే పదాన్ని సూచించి సమర్థించారు ఇది ఏదో భారతీయకరణలాగా వుంది తప్ప సహజమైన అనువాదం మాత్రం కాదు

అస్తిత్వవాద సారాంశాన్ని ఈ రకంగా కుదించవచ్చు "మనిషి ఏకాకి తన స్వంతంపై తప్ప ఇతరులపై ఆధారపడలేడు అనంతమైన బాధ్యతల నడుమ విసరబడిన ఏకాకి - ఏ సహాయం లేకుండా తనకు తాను నిర్దేశించుకొన్న లక్ష్యం వైపు - తనకు తాను ఈ భూమిపై నిర్మించుకొన్న విధివైపు సాగిపోయేవాడు"

"మనిషి తన స్థితిగతులన్నింటికి స్వయంగానే బాధ్యత వహిస్తాడు కాబట్టి అస్తిత్వానికి ముఖ్యమైన అర్థం స్వేచ్ఛ ఎందువల్లనంటే మనిషి తన మృత్యు పర్యంతం తాను ఏమి కాదలుచుకున్నాడో దానిని రూపొందించుకోడానికి ప్రయ

త్నిస్తాడు "నేను" మరణించడానికి స్వతంత్రుణ్ణి కాను, అయితే నేను మరణించే ఒక స్వతంత్ర వ్యక్తిని మృత్యువు నేను దాటలేని ఒక సరిహద్దు - అలాగే ఇతరుల ఉనికి వల్ల నా స్వేచ్ఛకు ఒక హద్దు ఏర్పడుతున్నది"

సార్త్ర్ ప్రకారంగా ఒక విధంగా మనిషి చైతన్యం అస్తిత్వం ఒక్కటే చైతన్యం అనేది సాధారణంగా ఒక వస్తువును గ్రహించే చైతన్యంగానే వుంటుంది అయితే వస్తువుకతీతంగా కూడా వుండి ఆత్మ చైతన్యంగా వుండగలదు చైతన్యం యొక్క ముఖ్య లక్షణం ప్రశ్నించడం వస్తువుల స్వరూపాన్ని నిశ్చయించగలం కాని చైతన్య స్వరూపాన్ని ఖచ్చితంగా నిర్ణయించలేము ఆవిధంగా అది అవస్తువు (nothing) గా మారిపోతుంది శరీరం వున్నందువల్ల మనిషి వస్తుగతంగా వుండగలడు కాని అతనికి వుండే ఆత్మగత అస్తిత్వం (subjective existence) జీవిత గమ్యాన్ని నిర్ణయిస్తుంది శరీర రూపంలొ వున్నందువల్ల వ్యక్తి ఇతర వస్తువుల - వ్యక్తుల సంపర్కంలోకి వస్తాడు - ఫలితంగా తన స్వేచ్ఛకు నిరంతరం ప్రతిఘటన ఎదురవుతూ వుంటుంది మరో వ్యక్తి నన్ను ఒక వ్యక్తిరూపంలో కాకుండా కేవలం ఒక వస్తువు రూపంలో చూస్తాడు కాబట్టి నా స్వేచ్ఛ ప్రమాదంలో పడిపోతుంది ఈ నిరాపేక్షమైన వ్యక్తి స్వేచ్ఛను నమ్మినందువల్లనే సార్త్ర్ తన నాటకం "నో ఎగ్జిట్" లో ఇతరులంటే నరకమే (Hell is others) నని వ్యాఖ్యానించాడు ఈ భావం సంఘ వ్యతిరేకమైనదే కాకుండా అవాస్తవికమైనది కూడాననే విషయాన్ని సార్త్ర్ తన జీవిత అంతిమ దశలో గ్రహించాడు

సార్త్ర్ అస్తిత్వవాదాన్ని - మార్క్సిజాన్ని సమన్వయించాలనే దృష్టితో "Critique of Dialectical reason" అనే గ్రంథాన్ని రాసాడు మార్క్సిజాన్ని ఇరవయ్యో శతాబ్దపు దర్శనంగా అంగీకరిస్తూ అస్తిత్వవాదాన్ని సామ్యవాదానికి సంబంధించిన ఒక పద్ధతిగా స్వీకరించాడు

అయితే సార్త్ర్ "క్రిటిక్ ఆఫ్ డైలెక్టికల్ రీజన్" లొ మానవ చరిత్రను మార్క్సిస్టు దృక్పథంతోనే సరిగ్గా అర్థం చేసుకోగలమని స్పష్టీకరించాడు కాని

అస్తిత్వవాద ధోరణిలో వ్యక్తి చరిత్ర నిర్మాత అని ఒక వైరుధ్యాన్ని ప్రతిపాదిస్తాడు

మానవ "వ్యక్తి" సామాజిక జీవిగా సమాజంలోనే రూపొందుతాడనే అంశాన్ని ఆయన పట్టించుకోలేదు ఈ సమన్వయాన్ని సాధించాలనే ప్రయత్నం లోనే సార్త్ర్ మరో వైరుధ్యానికి లోనైనాడు మనిషి వ్యక్తిత్వ నిర్మాణమనేది శ్రమ ప్రక్రియలోంచి ప్రారంభమవుతుందని మార్క్సిస్టు అవగాహనచెబుతున్నది కాని సార్త్ర్ ఈనాటిదాకా చరిత్రను ప్రేరేపించిన శక్తి కొరత (లేనితనం Scarcity) అని నమ్ముతున్నాడు ఆ విధంగా నథింగ్‌నెస్ అనేది "**కొరత**" రూపం పొందింది

'బీయింగ్' అంటే వుండడం లేదా జీవించడం అయితే దానికి ముగింపు పలికేది 'నథింగ్‌నెస్' అంటే ఒక లేనితనపు భావం లేదా మృత్యువు చివరికి మృత్యువు అన్నింటికి సమాధానమవుతుందనే నైరాశ్యాన్ని జర్మన్ తత్వవేత్త నిషే నుంచి సార్త్ర్ దాకా యూరోపియన్ తత్వ శాస్త్రంలో భావ వాదాన్ని నడిపించింది అయితే ఆ నైరాశ్యాన్ని పటాపంచలు చేసి మనిషికి వర్గపోరాటమనే ఆయుధం ద్వారా చైతన్యవంతమైన చారిత్రక ఆశావాదాన్ని మార్క్సిజం మహోన్నతమైన మానవ వాదంగా అందజేసిన అంశం విదితమే

సార్త్ర్ మహామేధావిగా-అభ్యుదయవాదిగా-మానవతావాదిగా-రచయితగా మిగిలిపోయినా, రెండో ప్రపంచ యుద్ధం అవశేషాల మీద సార్త్ర్ అస్తిత్వవాదం మధ్య తరగతి మానవుడి ఒంటరితనానికి,నైరాశ్యానికి,పరాయితనానికి-కుంచించుకపోయిన తత్వానికి మానసిక రుగ్మతలకు మాత్రమే భాష్యంగా నిలిచిపోయింది నిషేను ఉపయోగించుకొన్నట్టే తిరోగామి శక్తులు అస్తిత్వవాదాన్ని స్వేచ్ఛాప్రియుల దర్శనంగా ప్రచారం చేసి తమకు మరో తాత్విక ఆధారాన్ని జోడించుకున్నారు ఈ వైపరీత్యాన్ని సార్త్ర్ స్వయంగా ఊహించకపోయినా వాస్తవంగా జరిగింది ఇదే

సార్త్ర్ అస్తిత్వవాదంలో ఈ వైరుధ్యాలు - ప్రమాదాలు వున్నప్పటికీ వ్యక్తిగతంగా ఆయన 1967 నుంచి రెండో దశలో అంటే చివరి పదిహేనేళ్ళు ప్రపంచంలో ఎక్కడ తిరుగుబాట్లు జరిగినా, విప్లవ భావాలు కనపడినా నిస్సంకోచంగా సమర్థించాడు సామ్యవాదవ్యవస్థ నిర్మాణానికి ముందు ఆ తర్వాత క్రమంలో సాంస్కృతిక విప్లవం యొక్క అవసరాన్ని సమర్థించాడు స్వయంగా రచయిత తన అక్షరాల ద్వారా ప్రజా ఉద్యమాలకు నిబద్ధుడవుతున్నాడని, భావ విప్లవాన్ని తెచ్చి రెండోస్థాయి కార్యక్రమాన్ని ప్రమాదాన్ని ఎదుర్కొనే విధంగా చేబడతాడని నిజాయితీగా నమ్మి, కొంతకాలం ప్రత్యక్షంగా ఫ్రెంచి కార్మికుల మధ్య పనిచేసాడు సార్త్ర్ 1975 లో అమెరికన్ ''న్యూస్‌వీక్'' పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఇలా అంటాడు -

''ఏవో ప్రత్యేకమైన సత్యాలను ప్రవచించడం లేదా ప్రజలకు సలహాలను ఇవ్వడం నా పాత్రకు సంబంధించిన అంశమని నేను భావించడం లేదు ఈనాడు మేధావి పాత్ర అది మాత్రం కాదు మావో వాదులు అది గ్రహించారు నేను వారితో ఏకీభవిస్తున్నాను భావాలు వాటంతటవేరావు నిజం అనేది ప్రజలనుంచి వస్తుంది ప్రజల దగ్గరికి భావాలను తీసుకెళ్ళడం కాదు- ప్రజా హృదయాల దగ్గిరిగా వెళ్ళాలి వాళ్లు అంగీకరిస్తే వాళ్ళ భావాల కనుగుణంగా సరియైన స్పష్టమైన అభివ్యక్తినివ్వాలి ఉద్యమంతో ఎప్పుడూ అడుగులో అడుగు కలుపుతూ వెళ్ళాలి "

సార్త్ర్ తన ''బియింగ్ అండ్ నథింగ్‌నెస్'' లోనే ''అస్తిత్వపరమైన మనో విశ్లేషణ'' (Existential Pyscho—analysis) ను ప్రతిపాదించాడు ఆ తర్వాత ప్రత్యేకించి "సైకాలజీ ఆఫ్ ఇమాజినేషన్" అనే పుస్తకం కూడారాసాడు ఆత్మపరిశీలన ద్వారా ఇంద్రియానుభవాలను, కాల్పనిక చిత్రాలను (మనిషి [illegible]ంలోని అంశాలను) వ్యక్తికి పరిమితంచేసి అధ్యయనం చేసే విధానాన్ని అస్తిత్వ పరమైన మనోవిశ్లేషణ అని చెప్పుకోవచ్చును ఈ పద్ధతిలో రచనలు చేసిన వారున్నా ప్రధానంగా బెర్గ్‌సన్, ఎరిక్‌సన్‌లు పెంపొందించిన

చైతన్య ప్రవంతి (stream of consiousness) టెక్నిక్‌ను తెలుగులో బుచ్చిబాబు నుంచి నవీన్ తదితరులదాకా కొంతమంది నవలాకారులు అనుస రించారు

## సార్త్రె రచనలు :-

జ్యాపాల్ సార్త్రె ఫ్రెంచిభాషలో రచించిన మొదటి సృజనాత్మకమైన రచ నలలో ముఖ్యమైనవి నవలలు–కథానికలు-నాటకాలు–ఆ తర్వాత వచ్చేవి ఇతర గ్రంథాలు, "నాసీ" "ది ఏజ్ ఆఫ్ రీజన్" "ది రిప్రీవ్" "ఐరన్ ఇన్ ది సోల్" (నవలలు), "ఇంటిమెసి" (కథలు), "ఫ్లైస్" "అల్టొనా", "లుసిఫర్ అండ్ ద లార్డ్" "ది రెస్‌పెక్టబుల్ ప్రాస్‌ట్యూట్" (నాటకాలు), "బీయింగ్ అండ్ నథింగ్‌నేస్", "క్రిటిక్ ఆఫ్ డైలెక్టికల్ రీజన్" (తాత్విక గ్రంథాలు), "ఎస్సేస్ ఇన్ ఈస్తటిక్స్", "వాట్ ఇజ్ లిటరేచర్" (సాహిత్య విమర్శన గ్రంథాలు), "ది సైకాలజీ ఆఫ్ ఇమ్యాజినేషన్" (మనోవిశ్లేషణ గ్రంథం)—ఫ్రెంచి నవలా రచయిత గస్తోవ్ ప్లొబా, ("మేడమ్ బోవరి" రచయిత) ఒకనాటి నేరస్థుడు (తరవాత జైల్లో రచయితగా మారినవాడు) జ్యాజినేలపై సవిస్తారంగా మనో విశ్లేషణాత్మకమైన గ్రంథాలు ప్రారంభించి అసంపూర్ణంగా వదిలేసాడు ఫ్రాన్స్‌లో సార్త్రె సమకాలీనులైన అంద్రెమాలా, అల్బర్ట్ కామూలపై అస్తిత్వవాద ప్రభావం స్పష్టంగా వుంది కాని కామూ చివరకి శూన్యవాదిగా–దిక్కులేని వ్యక్తి వాదిగా మారిపోయి విడిపోయాడు.

## తెలుగు సాహిత్యంలో 'అస్తిత్వవాద' ధోరణులు

సార్త్రెను తెలుగు సాహిత్యానికి వివరంగా పరిచయంచేసిన రచయితగా ముందు ఆర్ యస్ సుదర్శనం గారిని చెప్పుకోవాలి ఆయన 1964 నుంచి "భారతి" మాసపత్రికలో "అస్తిత్వవాదం" గురించి అప్పుడప్పుడు రాసారు "Words" అనువాదం "శబ్దమయ ప్రపంచం" పేరుతో భారతిలో ధారావాహి కంగా వెలువడింది 1969 లో "సృజన" సార్త్రె ఇచ్చిన ఇంటర్వ్యూల ప్రమ

రించింది 1972 లో ''పిలుపు'' పక్షపత్రికలో, 1975 లో ''ఆంధ్రప్రభ'' (13-6-76)లో ''సార్త్రె మార్క్సిజాన్ని నిరాకరిస్తున్నాడా?'' అనే వ్యాసాలను ఈ వ్యాసకర్త ప్రచురించాడు పన్నాల సుబ్రహ్మణ్య భట్టు అప్పుడప్పుడు 'ఆంధ్రజ్యోతి', 'ఆంధ్రప్రభ' లో సార్త్రె పై వ్యాసాలు రాసారు. 'హిమజ్వాల' నవలా రచయిత వడ్డెర చండీదాస్‌గారు స్వయంగా సార్త్రె అస్తిత్వవాదంపై పరిశోధన జరిపి డాక్టరేట్ పుచ్చుకొన్నారు

విప్లవ రచయితల సంఘం ఏర్పడిన తర్వాత రచయిత నిబద్ధత-నిమగ్న తల అంశం చర్చకు వచ్చినప్పుడల్లా, సార్త్రె సాహిత్య విశ్వాసాలను తెలుగు రచయితలు ఉటంకించారు వెల్చేరు నారాయణరావు గారు ''తెలుగులో కవితా విప్లవాల స్వరూపం'' అనే పరిశోధనా గ్రంథం అనుబంధంలో ప్రత్యేకించి సార్త్రె రాసిన "What is literature'' నుంచి విస్తృతంగా కోట్ చేశారు

ఆధునిక తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లో వచ్చిన రచనలపై సార్త్రె విశ్లేషించిన ''నాస్తిక అస్తిత్వవాద'' ప్రభావం ప్రత్యక్షంగా-పరోక్షంగా వుంది ఈ ప్రభావం తెలుగు సాహిత్యంలో ఒక ఉద్యమాన్ని సృష్టించకపోయినా కొంతమంది మేధావులను-రచయితలను తీవ్రంగానే ఆలోచింప చేసింది అయితే సార్త్రె తాత్విక ధోరణి ఇక్కడి కొంతమంది రచయితలకు ఆలంబనమైనా అది నాస్తిక అస్తిత్వవాద ధోరణిలో కాకుండా ఆస్తిక ధోరణిలోనే సాగింది ఇది మార్క్సిస్టు వ్యతిరేక ప్రచారానికి ఆయుధంగా ఉపయోగపడింది మినహాయిం పుగా వడ్డెర చండీదాసు మాత్రం నిజాయితీగా''నాస్తిక అస్తిత్వవాదాన్ని'' అనుస రించి వ్యక్తివాద అరాచక దృక్పథాన్ని స్పష్టంగానే చిత్రించాడు

నాస్తిక అస్తిత్వవాద ప్రభావం ఆధునిక తెలుగు సాహిత్యంపై ఏమేర విస్తరించిందనే అంశాన్ని వీలైనంతగా పరిశీలించినపుడు మనముందుకు వచ్చే ర్ధనలు ఇవి .

## కథానికల్లో :

"భారతి" మాసపత్రికలో వచ్చిన ఇస్మాయిల్ కథ "వల"(జనవరి 66), ఆర్ ఎస్ సుదర్శనం కథ "ఏకాంతం" (ఫిబ్రవరి 66) అస్తిత్వవాద ఆలోచనా విధానంతో వచ్చినవే వ్యక్తి "ఏకాంతం" గురించి చర్చించాలని కొంత ఆధ్యాత్మిక ధోరణిలో సుదర్శనం గారు ఈ కథ రాసారు ఇందులో ఆనందరావు సిగిరెట్ అలవాటు మానుకోలేడు ఆ దురలవాటును మాన్పించాలని ఆయన భార్య ఒకరాత్రి అతని పడకను మరో గదిలోకి మార్చి శిక్ష విధిస్తుంది ఆ ఏకాంతాన్ని భరిస్తూ ఆనందరావు రూపంలో రచయిత "ఏకాంతం" గురించి ఇలా అంటాడు— "ఏకాంతం అంటే ఎవరికీ ఇష్టం వుండదు ఏకాంతానికి అర్థం లేదు! జీవితానికి మాత్రం అర్థం వుందా? ఆ ప్రశ్నకు జవాబు నీతి, ప్రేమ, అధికారం బాధ్యత, మర్యాద, డబ్బు, ఆరోగ్యం అనే విలువలు- అన్నీ ఏకాంతానికి వ్యతిరేకమైనవే! అవి ఇతరులతో మనిషికిగల సంబంధాన్ని రకరకాలుగా నిర్వచిస్తాయి! ఏకాంతం అంటే ఇతరులతో సంబంధం లేని స్థితి ,
మనిషి ఏకాంతానికి అర్థం వుందా? లేదా? యోగులు, ఋషులూ ధ్యానముద్రలో, సమాధ్యవస్థలో తమలో తాము అన్వేషించేది కూడా ఏకాంతంకాక మరేమిటి? ఏకాంతం సామాజికమైన విలువకాదు, కాదని దాన్ని త్రోసిపుచ్చటమేనా? దానికి జీవితంతో సంబంధం లేదా?" కాలి కాస్సేపు ఆనందాన్ని ఇచ్చే సిగిరెట్టు నుసిగా మారిపోయినట్టే మనిషి జీవితం అనుభవాంతో కాలి నిష్ప్రయోజనం కావలసిందే ననే వ్యక్తి శూన్యవాదాన్ని- కేవలం అనుభవం ముఖ్యమనే భావాన్ని చిత్రించే ఉద్దేశంతో సుదర్శనం గారు ఈ కథ రాసారు

ఇస్మాయిల్ ( ప్రస్తుతం "స్మైల్" పేరుతో రాస్తున్న రచయిత ) ...ంతో ప్రతిభావంతంగా "వల" కథ రాసారు ఈనాటి నగర నాగరికతలో ఆధునికంగా నిర్మొగమాటంగా ఆలోచించే యువతి మనస్తత్వాన్ని ...వం'లో శక్తివంతంగా చిత్రించారు స్వేచ్ఛగా ప్రేమించి వివాహానికి పూర్వమే

సెక్సును ఆనందించి "పల" నాయిక రహీంను వివాహం చేసుకోవాలనుకుంటుంది కాని రహీం అనుకోకుండా అకస్మాత్తుగా లారీ యాక్సిడెంట్‌లో మరణిస్తాడు- మృత్యువు మనిషి ఆలోచనలకు, అంచనాలకు హద్దువేసి వ్యక్తి జీవితాన్ని నిలిపి వేస్తుందనే అస్తిత్వవాద భావాన్ని ఇక్కడ ఇస్మాయిల్ చాలా తెలివిగా సహజంగా అన్వయించాడు ఆ యువతి నిర్భయంగా గర్భనిరోధక సాధనాలు ఉపయోగిస్తూ రహీంతో సెక్సును తనివితీరా అనుభవిస్తుంది కాని ఒకరోజు ఆవేశంలో గర్భనిరోధక సాధనాన్ని మరచిపోవడంవల్ల గర్భం వస్తుంది ఈలోగా రహీం చచ్చిపోతాడు "నాకే గర్భం రాకుండావుండి రహీం చచ్చిపోయి వుంటే నేను అంతగా బాధపడేదాన్ని కాదేమో!" అని ఆ యువతి యాంత్రికంగా ఆలోచిస్తుంది ఆ తర్వాత రవి అనే కాలేజీ లెక్చరర్‌ను పెళ్ళి చేసుకోవాలని వలపన్నుతుంది కాని ఆ "రవి" అతి సన్నిహితంగా వచ్చి తన గత జీవితపు సెక్సు విశృంఖలత్వాన్ని కప్పిపుచ్చి మోసం చేయలేనని చీటిరాసి వెళ్లిపోతాడు "ఇసుకలో అందమైన పేకమేడ"లా జీవితంలో మరో అవకాశం కూలిపోయిందని ఆ యువతి భావిస్తుంది ఈ కథలో ఇస్మాయిల్ తండ్రి పాత్రద్వారా ఫ్రీసొసైటీ సెక్సు సంబంధాలు, నైతిక విలువల గురించి వివరంగానే పాజిటివ్‌గా చెప్పిస్తాడు "ఫ్రీ సొసైటీలో ఆడది ప్రేమిస్తుంది అది తప్పుకాదు ప్రేమించిన వాణ్ణి కులమతాల ప్రసక్తి లేకుండా పెళ్ళి చేసుకుంటుంది అది తప్పుకాదు ఆ ప్రేమికుల మధ్యకానీ, వివాహితుల మధ్యకానీ డబ్బు అడ్డురాదు కాని వివాహేతర సంబంధాలు వుంటే మాత్రం తప్పే అనాలి అటువంటి సంబంధాలకు తెరకాదు పెళ్లి పరస్పర రక్షణకోసం, అనురాగం కోసం పెళ్లి అందువల్ల వివాహబంధంలో కొన్ని నైతికమైన విలువలు అవసరం"

"త్రిపుర" రాసిన పదమూడు కథల్లో కొన్నింటిపై అస్తిత్వవాద ప్రభావం వుంది ఆయన తమ దేశవిదేశాల అనుభవాల్ని బ్రిటిష రచయిత గ్రాహమ్‌గ్రీన్ ఫక్కీలో చెప్పే ప్రయత్నం చేసారు దాదాపుగా చైతన్యస్రవంతి టెక్నిక్‌లో కథలన్నీ రాసారు జైన బౌద్ధ తత్వాల అంతర్గత చైతన్యంతో

జీవితానుభవాలను నిర్లిప్తంగా స్వీకరిస్తూ ''చావు'' భయాన్ని 'కేసరిపలె కీడు'గా చిత్రిస్తూ త్రిపురగారు ఒక విలక్షణమైన శైలితో కథలు రాసారు

ఊహా నైశిత్యంలో మనిషిలోని ఒంటరితనాన్ని, అనుభవాల జ్ఞాపకాల్ని చాలావరకు First person singularలో కథలు చెప్పారు వీటిలో ''చీకటి గదులు,'' ''భగవంతంకోసం'', ''జర్కిన్'' కథలు విశిష్టమైనవి ఆయన ''ఆలోచన'' నుంచి ''తెలుసుకోడానికి'' గెంతగలిగితే అన్వేషణ పూర్తి అవుతుందని ఈ కథల్లో వ్యక్తి అనుభవానికి ఉనికికి ప్రాధాన్యత ఇస్తారు

డా కేశవరెడ్డి ఇటీవల ప్రచురించిన కథ "పార్టీ"- పాండిచ్చేరిలో కథాస్థలం- క్లబ్‌లో వ్యక్తి సుఖాన్వేషణ, నిరాశ - వీటిని అస్తిత్వవాదానికి దగ్గరగా తీసుకవచ్చారు

నాటకాల విషయానికి వచ్చినపుడు సార్త్రి ప్రభావం ఏమేరకు వున్నదనేది పరిశోధించవలసివుంది మద్రాస్ ఆకాశవాణి నుంచి ప్రసారమైన రావూరి భరద్వాజ రచించిన రెండు నాటికల్లో అస్తిత్వవాదం అంతసూత్రంగా వుందని మొదలి నాగభూషణశర్మగారు చెబుతున్నారు

## నవలల్లో—

తెలుగు నవలా సాహిత్యంలో ఈ అస్తిత్వవాద తాత్విక దృక్పథం గణనీయంగానే చోటుచేసుకున్నది 1946 లోనే బుచ్చిబాబు రచించిన నవల "చివరికి మిగిలేది '' ఇందులోని ప్రధానపాత్ర దయానిధి ఆనాటి సాంఘిక పరిస్థితులతో రాజీపడక, వ్యక్తిత్వ జీవితంలోని కాంప్లెక్స్‌లవల్ల, సౌందర్యారాధనలో, ఏదో సాధించాలనే తపనతో తనతో తాను రాజీపడే ప్రయత్నంలో జీవిస్తాడు ఈ దయనిధి వ్యక్తిత్వం- ఆలోచనలు - అనుభవాలు సార్త్రి అస్తిత్వవాదానికి ఎంతో సమీపంగా వచ్చేవే- కాని బుచ్చిబాబుపై ఫ్రాయిడ్, రస్సెల్, సోమర్ సెట్‌మామ్‌ల ప్రభావమే అధికంగా వుందనే యథార్థాన్ని తీసుకుంటే ''చివరకు మిగిలేది'' ఈ అస్తిత్వవాద ధోరణిలోకి రాదు

అయితే బుచ్చిబాబు ''చివరకు మిగిలేది'' నవలను ఒక ఆదర్శంగా తీసుకొని ఆయన వ్యక్తిగత సౌందర్యాన్వేషణను స్వయంగా పుణికి పుచ్చుకొని అదే పద్ధతిలో 1969లో వడ్డెర చండీదాస్‌గారు ''హిమజ్వాల''ను తెలుగు సాహిత్యానికి ఇచ్చారు ''చివరకు మిగిలేది'' నవలలోని శైలీ విన్యాసం, అలాంటి ఉపశీర్షికలే ఈ "హిమజ్వాల''లో దర్శనమిస్తాయి ఆ కృతజ్ఞతతోనే తన నవలను చండీదాస్‌గారు- "తెలుగుతనపు కూపంలో యిమడలేక అభాసుపాలైన కళాతపస్వి శ్రీ బుచ్చిబాబుగారి స్మృతికి'' అని అంకితమిచ్చారు

ఇంతకు ముందే ప్రస్తావించినట్టు నిరీశ్వర- అస్తిత్వవాదానికి సౌందర్యాన్వేషణే ప్రధాన లక్ష్యంగా తీసుకొని కేవల వ్యక్తివాద ధోరణిలో "హిమజ్వాల'' తన ప్రత్యేక స్థానాన్ని కొనితెచ్చుకున్నది ''వెలుగు మరక'', ''మూగవోయిన వీణ'', "వుప్పొంగిపోనాది గోదారి'', ''అనుభూతి సిగ్గెరుగదు'', "ప్రేమ వెర్రి బాగులదిట'', ''మరీచికాన్వేషణ'', ''సశేషమ్ జీవితం'' అనే ఉపశీర్షికల కింద 700 పేజీల (రచయిత అర్థానుస్వా(సా)రం) మధ్య పిచ్చిగడ్డి మొలచినట్టు సవిస్తారంగా అల్లుకపోయింది ఈ నవల ''ఒక వురుమూ ఒక మెరుపూ'' అని, ఇది ఒక గొప్ప బూర్జువా నవల అని పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు సర్టిఫికెట్ ఇచ్చారు మధ్య తరగతి ఇంటలెక్చువల్ పాఠకుల వోపికను కూడా పరీక్షించే ఈ నవలలో చల్లగా మెల్లగా పాకే మంటలు - మంచులో భగ్గుమండే జ్వాల లాంటి అసందర్భపుటాలోచనలు షాక్ ఇవ్వాలని ప్రయత్నిస్తాయి

"హిమజ్వాల''లోని ప్రధాన పాత్రలు గీత, కృష్ణ చైతన్యలు అస్తిత్వ వాదానికి సజీవమైన మోడల్స్ ఇద్దరిలో ఆనందానికి - అనుభూతికి సిగ్గెరగని పద్ధతిలో అన్వేషణ సాగించే లక్షణం వుంది ఈ రెండు పాత్రల ద్వారా వడ్డేర చండీదాస్ గారు ఎంతో వోపిగ్గా సినికల్ (మానవ అస్తిత్వం-విలువలపై నమ్మకం లేనితనం) తత్వాన్ని, మానసిక రుగ్మతలను-వ్యక్తిగతమైన విపరీతమైన అహంకారాన్ని తనలోకి తానే ఇముడ్చుకునే మానసిక

జాడ్యాన్ని, సమాజానికి - శ్రమకు దూరంగా సుఖలాలసలో మాత్రమే సార్థకత పొందాలనే తపనలో వోడిపోయే తత్వాన్ని చాలా విలక్షణంగానే చిత్రించారు

జీవితమే వ్యక్తిగతమైన ఒక సుఖాన్వేషణగా బతుకుతున్న వ్యక్తి వాదులకు గీత-చైతన్యలు ప్రతినిధులు, వీళ్లు వీలైనంత స్వేచ్ఛ కావాలని కోరుకొంటారు ఏ రకమైన సామూహిక పోరాటాల్లోకి అసలే రారు యథేచ్ఛగా జీవించాలనే కోరిక వున్నప్పుడు సంఘం కట్టుబాట్లతో ఘర్షణ పడక తప్పదు సాంప్రదాయబద్ధమై అలవాటుగా వున్న సాంఘిక నియమాలను ఒక గొప్ప సామాజికమైన మార్పుకోసం కాలదన్నితే మనం అర్థం చేసుకోవచ్చు కాని ప్రధానంగా ఏదో అన్వేషించాలనే తపనతో ప్రతిదాన్ని ప్రశ్నిస్తూ శారీరక వాంఛలను విచ్చలవిడిగా తీర్చుకున్నా సంతృప్తి లేక చివరికి వ్యక్తి అరాచకత్వంలోకి-శూన్యంలోకి విసరబడి నిరంతరమైన మానసికావేదనలో కొట్టు మిట్టాడుతారు వ్యక్తి సంతృప్తికి - విధి నిర్వహణకు మధ్య సామంజస్యం కుదరనపుడు మిగిలేది అరాచకత్వం ఇలాంటి అరాచకత్వం అంతిమంగా మృత్యువు కౌగిట్లోకి చేరిపోయి నిష్ప్రయోజనంగా జీవితాన్ని నిరర్థకం చేసుకొంటుంది - లేదా అనంతమైన ఆత్మశాంతి అనే పేరుతో హిమాలయాల సానువుల్లో ధ్యాన మగ్నమై పలాయనవాదాన్ని బోధిస్తుంది

త్రిపురనేని గోపీచంద్ ప్రత్యక్షంగానే అస్తిత్వ వాదాన్ని సమన్వయించాలనే దృష్టితో మూడు నవలలు రాసారు వీటిలో 'మెరుపుల మరకలు'' ముఖ్యమైనది మిగతా రెండు నవలలు "పిల్ల తెమ్మెర'', "గడియపడని-తలుపులు'' ఆ తత్వ ప్రభావం వున్నా ఏదో హడావిడిగా పత్రికకోసం రాసిన మామూలు నవలల్లా వున్నాయి

"మెరుపుల మరకలు'' నవలలో ప్రధాన పాత్ర ఉషారాణి అన్ని సౌకర్యాలు వున్న సౌందర్యవతి-చురుకైన వ్యక్తి భర్తవల్ల శారీరకమైన - మానసికమైన తృప్తిలేక నచ్చిన మగాళ్లను వేటాడుతుంది చక్రవర్తి అనే పత్రికా రచయితను, శ్రీకాంత్ అనే యువకుణ్ణి, కమలాకరం అనే వివాహితుణ్ణి

పరిచయం చేసుకొని సెక్స్ అనుభవాలను పొందుతుంది భర్త రామానుజంను మభ్యపెడుతుంది ఆ విధంగా ఉషారాణి ఆత్మ వంచన (bad faith)కు ప్రతీకగా బతికిందని రచయిత సార్త్రె వివరించిన బ్యాడ్ ఫెయిత్‌ను చిత్రిస్తాడు చివరికి ఉషారాణి హిమాలయ ప్రాంతాలకు వెళ్ళిపోయి కరుణానంద స్వాముల వారి ఆశీస్సులతో యోగినిగా మారిపోతుంది

గోపీచంద్‌గారు "భోగి కానివాడు మోక్షగామి కాడు" అనే నమ్మకాన్ని నిరూపించాలని ఉషారాణి పాత్రద్వారా ఒక మంచి విశ్వాసాన్ని లేదా విముక్తి మార్గాన్ని యోగసాధనతోనే వెదుక్కోవచ్చుననే పరిష్కారాన్ని - చూపించారు, మతపరమైన అస్తిత్వ వాదాన్నే ఆయన ఆశ్రయించాడు కాని సార్త్రె నాస్తిక అస్తిత్వ వాదాన్ని అనుసరించలేకపోయాడు ఈ నవలలో సార్త్రె తత్వం గుర్తించి, ఫ్రెంచి ప్రజల జీవిత విధానం గురించి చర్చ వుంది

ఇదే ధోరణిలో ఆర్ ఎస్ సుదర్శనం గారు "సంసార వృక్షం" నవల రాసారు "ఒక వ్యక్తి జీవితం అతని మనస్సు యొక్క ప్రతిబింబమే" అనే అశాస్త్రీయ భావధోరణితో మధ్య తరగతి మనిషి అనిశ్చిత వైఖరిని అస్తిత్వ వాద పరిధిలోకి తీసుకవచ్చారు గోపీచంద్ గారి లాగానే సుదర్శనం గారు కూడా వ్యక్తులకి యోగులు-బాబాల శరణం తప్ప మరో మార్గం లేదనే పలాయన వాదాన్ని పరిష్కారంగా చూపుతున్నారు -

ఆచార్య రజనీష్ ఆశ్రమంలో అలెన్ అనే అమెరికన్ యువకుడికి-నవలా నాయకుడైన లాయర్‌కు సార్త్రె నిర్వచించిన అస్తిత్వ వాదంపై చర్చ జరుగుతుంది అందులో "ఏకాంతమూ, స్వేచ్ఛ ఒకటేనని, వ్యక్తి తన జీవితానికి అర్థం తనే కల్పించుకోవాలనీ అంటూనే మార్క్సిస్టు దృక్పథంతో సామాజిక నిబద్ధతను ఏర్పర్చుకోవడం కర్తవ్యమని ఫ్రెంచి దార్శనికుడు ఎగ్జిస్టెన్షలిజమ్‌కు మార్క్సిజమ్‌కు పెళ్లి చెయ్యడానికి పూనుకొన్నాడు ఇందులో అసంబద్ధత లేదూ?" అని లాయరు ద్వారా రచయిత ప్రశ్నిస్తాడు సామాజిక నిబద్ధత అనే వాస్తవ ప్రసక్తి రాగానే సుదర్శనంగారు అస్తిత్వ వాదంతో వున్న

ఆ వొక్క పాజిటివ్ అంశాన్ని కూడా తిరస్కరించే విధంగా ఈ నవలను అల్లుకపోయారు

శీలా వీర్రాజుగారి "కొడిగట్టిన సూర్యుడు" వచన కావ్యంలో, "మైనా" నవలలో అస్తిత్వ వాద ఛాయలు వున్నాయి వీటి గురించి వివరంగా పరిశీలించ వలసిన అవసరం వుంది

వినుకొండ నాగరాజుగారి "ఎంతదూరం", "తాగుబోతు", "ఊబిలో దున్న" లాంటి నవలల్లో కూడా అస్తిత్వ వాద ధోరణి వుందని విమర్శకులు చెబుతున్నారు అయితే రచయిత స్వయంగా ఈ అంశాన్ని అంగీకరించడు వాటిని కూలంకషంగా చదివి ఈ విషయాన్ని తేల్చవలసి వుంది

గత సంవత్సరం "ఆంధ్రజ్యోతి" వారపత్రికలో సీరియల్‌గా వచ్చిన నరసింహారావుగారి నవల "ఆత్మహత్య" ఇటీవల అస్తిత్వ వాద ప్రభావంతో వచ్చిన రచనే!

ఈ వరసలోనే జి యస్ కృష్ణ రచించిన "జీవితయాత్ర", శిష్ట్లు కృష్ణమూర్తి రచన "మనసుగతి", కంఠంనేని రాధాకృష్ణగారి నవలలు వస్తాయేమో చూడవలసి వుంది

## కవిత్వం -

సార్త్రి ఆలోచనా విధానం ఆధునిక తెలుగు కవులపై ఎంతవరకు వుందనే అంశాన్ని చివరగా ఇప్పుడు తెలుసుకుందాము

శ్రీశ్రీగారు నిస్సందేహంగా మార్క్సిస్టు అవగాహనతో కవిత్వాన్ని రాసినా అధివాస్తవిక ధోరణి ఆయన రచనల్లో వుందని మనకు తెలుసు ప్రత్యేకించి కవృందు క్ష్ణంగా పవప [illegible] డించిన శ్రీ అస్తిత్వ వాదాన్ని అంగీకరింపు చేసుకొని కవిత్వం రాయలేదా అనే అనుమానం రాక మానదు ఆయన రాసిన

కొన్ని కవితల్లో సర్రియలిజం 'ప్రభావం' స్పష్టంగానే వున్నా ఎగ్జిస్టెన్సియలిజం ఛాయలు కనపడవు

దేవరకొండ బాలగంగాధరతిలక్ కవిత్వంలో మానవతావాదం సర్వత్రా వున్నా అస్తిత్వవాదం అంతస్సూత్రంగా చోటు చేసుకున్నది ''భారతి'' మాస పత్రిక, ఆగస్టు 1964 లో వచ్చిన ఆయన కవిత ''అదృష్టాధ్వగమనం'' దీనికి దృష్టాంతం—

''లౌకిక జగత్తు కల్పించిన వ్యత్యాసాల విశ్వాసాల పూర్వార్థగోళంలో
ప్రయోజన విజయపరంపరల పాలరాతి మేడమీద చిటారు గదిలో నువ్వు
నేనో మరి - ఇంకా సమాజంలో
స్థూలమైన ఆకృతిని అస్తిత్వాన్ని పొందని పొందలేని ఊహా మరుత్తుని-
ఏకాకిని !

ఒకే ఒక తీగ మాత్రం మిగిలిన యీ సితారాని మోసుకొని
యీ నిశాముఖాన నిలిచి పాడుకుంటున్నాను
ఎవరూ వినని పాటని
ఇలాగే నడుస్తున్నాను
ఎవరూ నడవని బాటని

అన్వేషించుకుంటూ
మామూలు దారుల్ని మర్యాదల్ని మంచి చెడ్డల్ని విడిచి
రాత్రిం దివామధ్య రహః కిర్మీర రథ్య పడిపోతున్నాను
ఆశతో విశ్వాసంతో ఆత్మబలంతో!

అన్నా
నేనొక వ్యాకులయుతుణ్ణి దుఃఖితుణ్ణి
నా లోపల నా బాధలు

నా వెలుపల క్షతజగత్తు ఆక్రోశించిన కరుణాబీభత్సరవాలు
నిరంతర పరిణామ పరిణాహ జగత్కటాహంలో
సలసల క్రాగె మానవాశ్రుజలాలు !

అజంతా మొత్తం డజన్ కవితలు మాత్రమే గత 30 సంవత్సరాలలో రాసివుంటారు కవితాశిల్పం-పదాల ఎన్నిక అతని ప్రత్యేక ముద్రను వ్యక్తం చేస్తుంది ఈనాటిదాకా అజంతాగారు వ్యక్తిగతమైన అన్వేషణలో, ఒంటరితనంతో, పరాఙ్ముఖ లక్షణాలతోనే వోటమితత్వాన్ని ప్రతిధ్వనించే కవితలు రాస్తున్నారు (నాలుగైదు నెలల క్రితం "ఆంధ్రజ్యోతి'' వారపత్రికలో వెలువడిన కవిత దీనికి నిదర్శనం) ఆ రోజుల్లో అజంతాగారు ''రోజూ చూస్తూనే ఉన్నాను'' అని ''కళ్ళవెనక ఉమ్మెత్తచెట్లను, ఊసరక్షేత్రాలను, ఉద్రేకవంతమైన సరస్సులను, ఉరితీయబడుతున్న అక్షరాలను' దర్శించి చివర "ఆకళ్ళవెనక దీపం వెలగదు అక్కడ సంగీతం వినపడదు'' అనే అస్తిత్వపు ఆవేదనను (Existentialistic anguish) వెలిబుచ్చుతారు

వ్యక్తి జీవితం-మృత్యువు-ఎదురుగా వుండే మానవుని ఉనికిలోని కష్టాలు-ప్రకృతి ఇవన్నీ వేగుంట మోహనప్రసాద్ కవిత్వంలో పరుచుకున్నాయి వ్యక్తి ఏకాకితనం, పరాయితనమనె వైమనస్యత (alienation)ను ముందుకు తీసుకవచ్చాడు—

''శవం
మైనంతో మలచి నీళ్ళల్లో వుంచిన శిల్పం
కాష్ఠంలో కాలే కొవ్వొత్తి
శవాన్ని తొక్కినా నొక్కినా ఏమీ అనదు
కాని మనకే భయం''

దిగంబరకవుల ఆరాధనా ధోరణిపై రెండో సంపుటం ఎటకు సార్త్ర్ అస్తిత్వవాద ప్రభావం స్పష్టంగా వుంది మార్క్సిజాన్ని అస్తిత్వవాదంతో

సమన్వయం చేయాలనే ప్రయత్నం జరిగింది

రెండో సంపుటిలోని ముందుమాటలో ''మా తాత్విక దృక్కోణం'' కింద దిగంబరకవులు ఇలా చెప్పుకున్నారు—

'మనిషి భౌతికవాంఛ నిజం ఈ వాంఛతోబాటు అచేతనంగా వున్న మూడో ప్రపంచం కూడా నిజం అలాగే మానసికమైన ఏకాకితనం కూడా వాస్తవమే కాని, ఈ ఏకాకితనం మాత్రమే అస్తిత్వంకాదు పరిసరాలు, మానవ బాంధవ్యాలు వొదిలి క్షణంపైక్షణం బరువుగాపడి యీడుస్తూపోవడం గాకుండా, చైతన్యవంతమైన ఆత్మసంతృప్తితో సాగే జీవితం నిజమైన అస్తిత్వం''

ఈ కవుల్లో ప్రధానంగా నగ్నముని, నిఖిలేశ్వర్, మహాస్వప్నలపై అస్తిత్వవాద ప్రభావం వుంది

''అర్థంకాని అనంతశూన్యం అంచుమీదకి
ఆకారంలేని కుర్చీ నొకటి లాక్కుని
అర్థవంతమైన బ్రతుకు వెన్నెల చుక్కల్ని కప్పులో వొంపి
ఒక్కొక్క క్షణం పెదవుల కానించి
విషాదాన్ని ఆరాధిస్తూ వుంటానా
హాయలు హాయలుగా పొగలు పొగలుగా
కెరట కెరట కెరటాలుగా కాలం
నా కాళ్ళని ముంచెత్తుతూ వుంటుందా
ఎందుకో ఒక్కసారి ఏకాంతంలోకి
నిర్జిరారణ్యాలు నడిచివస్తాయి
నిబిడాంధకార గహ్వరాలు తెరుచుకుంటాయి''

—నగ్నముని 'జైల్లో సముద్రం'

''నగరం నడిరోడ్డుమీద
నాగరికత పొడ్డుమీద [illegible]గా నిలబడ్డ
మనిషీ మనిషి మనిషీ

ఎలుగెత్తి పిలుస్తున్నా
వెర్రికేక లేస్తున్నా

ఈ నాగరికతను మానభంగం చేస్తాను నేను
ప్రతి పుట్టను పగలగొట్టి
విషభుజంగాల్ని పట్టి కోరలు తీస్తాను నేను
ఈ ఘోరారణ్యంలో కారుచిచ్చు రగిలిస్తా
ఈ నాగరికత రావణ లంకాదహనం చేస్తా
పుడుతున్నా పుడుతున్నా
కడుపు రగిలి పుడమి పగిలి పుడుతున్నా
నవప్రపంచ వీధుల్లో నగ్నంగా వెడుతున్నా''

—మహాస్వప్న 'హఠాత్తుగా పట్టపగలు బట్టలన్నీ విప్పేసి'

"నా దేశంలో నేను ఏకాకిని
ఎప్పటికప్పుడు ఎదురునిల్చి
కత్తిదూసి ప్రశ్నిస్తున్నాడు హామ్లెట్

మిగిలిన అఘోమయపు చీకట్లో
ఎరుసగా నియమన్న కరెంటు దీపాల్లో
నేను నా దేశానికి పరాయివాడిని
జ్వలిస్తున్న ఏకాకిని
స్నేహం ఇవ్వని దేశంలో
స్నేహంలేని ప్రతివాడూ ఒక్కొక్క ద్వీపం"

—నిఖిలేశ్వర్ 'నా దేశంలో నేను ఏకాకిని'

ఇదే క్రమంలో అనుభూతివాద కవులు ఇస్మాయిల్, గుంటూరు శేషేంద్ర శర్మ, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, మాదిరాజు రంగారావులాంటి కవులు వస్తారు

## ముగింపు

మనిషి మనుగడ లేదా అస్తిత్వం తాను జీవించే సమాజంలోని ఉత్పత్తి క్రమం-దాని యాజమాన్యం తద్వారా నెలకొనే ఆర్థిక-రాజకీయ-సాంఘిక పరిస్థితుల అదుపులో వుంటుందనే మౌలికమైన సామాజిక యధార్థాన్ని ఒంటరితనపు గుహలోనే ముడుచుకుపోయే మనిషి గ్రహించలేడు అందువల్లనే సార్త్రె కోరిన మనిషి ఉనికి బాహ్యతారహితంగా కేవలం స్వేచ్ఛగా జీవించాలనే తత్వాన్ని ప్రబోధించింది వ్యక్తి జీవితం - స్వేచ్ఛ సామాజిక సంబంధాలతో సాపేక్షకమైన అంశంగా వుంటుందనే యధార్థాన్ని సార్త్రె అంతిమంగా అంగీకరించాడు కాని తెలుగు సాహిత్యంలో కొందరు వ్యక్తివాదులు ఈ వాస్తవాన్ని ఈనాటికీ ఆమోదించకుండా తమ ఒంటరి మేడల్లో కాల్పనిక లోకాల్లో తేలియాడుతున్నారు ఒక విధంగా జ్యాపాల్‌సార్త్రె తాత్విక దృక్పథ ప్రభావం ఫ్రాన్స్‌లో 1965 నాటికే అంతరించిపోయింది ఆధునిక తెలుగు సాహిత్యంలో కూడా ఈ అస్తిత్వ వాదం పుస్తకాల ద్వారా వచ్చి వ్యక్తివాదులకు తోడై వున్నది కాస్తా క్షీణించి పోయింది

**ఆధునిక తెలుగు సాహిత్యంలో**

# అనుభూతివాదం

—నందిని సిధారెడ్డి

జీవితం స్థిరమైంది కాదు. అన్ని యుగాల్లోనూ, అన్ని కాలాల్లోనూ జీవితం ఒకేలా ఉండదు సమాజ క్రమ పరిణామాన్ని బట్టి జన జీవితం పరివర్తన చెందుతుంది పదార్థంలో ఉండే వైరుధ్యాలూ, సమాజంలో ఉండే వైరుధ్యాలూ జీవితంలోనూ ప్రతిబింబిస్తాయి జీవితం గురించిన అవగాహనల్లోనూ ఆక్రమిస్తాయి పై నేపథ్యంలోంచి అవగాహన ప్రాతిపదికగా విభిన్న కళా రూపాలు ఏర్పడతాయి

ఆర్థిక సంబంధాలు మారినప్పుడల్లా సమాజం మారుతుంది సమాజం మారినప్పుడల్లా జీవితం మారుతుంది సంస్కృతి మారుతుంది అనుభూతులు మారతాయి

ఫ్యూడల్ వ్యవస్థ పతనమై క్రమేణా ధనస్వామ్యవ్యవస్థ అవతరించింది. యంత్రాలు అవతరించాయి పరిశ్రమలు వెలిశాయి జీవితం ఆధునికమై పోయింది యాంత్రిక జీవితాన్ని మోయలేక కళారూపాలు 'కాల్పనికత'ని సృష్టించుకున్నాయి

అప్పటికి స్థిరపడ్డ ఆంగ్ల పాలన కాలం నాటికి ఆంధ్ర సాహిత్యంలో ప్రబంధ కవిత్వం గతించి భావ కవిత్వం వచ్చింది పాశ్చాత్య దేశాల్లో మార్క్సిజం వెలుగులో జరిగిన కార్మిక పోరాటాలూ, రష్యన్ విప్లవమూ, తర్వాత ఇక్కడ సాగిన తెలంగాణ రైతాంగ పోరాటం కలిసి సామాజిక చైతన్యాన్ని ప్రచారం చేశాయి ఫలితంగా అభ్యుదయ సాహిత్యం ప్రవహించింది

రానురాను ప్రజల చైతన్యస్థాయి విలోమించి ఉద్యమ తీవ్రత తగ్గింది రోజురోజుకూ జీవితం దుర్భరమై పోయింది ధనస్వామ్య సంస్కృతి అన్ని రంగాల్ని వ్యాపారంగా మార్చివేసింది రాజకీయాలు మొదలుకుని సాహిత్యం దాకా అన్నీ వ్యాపార కేంద్రాంతమైనాయి వ్యాపార సంస్కృతి నైతిక విలువ లన్నిట్నీ ఊడ్చివేస్తే నిరాశ, నిరుత్సాహం, నిర్వేదం కరుడుగట్టినాయి చైతన్యం పరిణతి చెందని అభ్యుదయ కవులు మధ్యతరగతి కవిత్వం రాశారు ఎన్జీవో, నిరుద్యోగి వేదనల్లోంచి మెల్లమెల్లగా ప్రణయ, భావకవిత్వంలోకి కూరుకు పోయారు వ్యవస్థను కంట్రోలు చేస్తున్నవర్గం ప్రజల సెంటిమెంట్లనీ, మూఢ నమ్మకాలను తెలివిగా క్యాష్ చేసుకుంటున్నది చుట్టూ అల్లుకున్న స్తబ్ధతని దిగంబర కవులు చీలిస్తే, వ్యవస్థ మీద శాస్త్రీయమైన పోరాటాన్ని ప్రచారం చేస్తూ విప్లవ కవిత్వం విజృంభించింది ఇంతవరకు జరిగిన చరిత్ర స్థూలంగా ఇది ఇవాళ 1980 నాటికి ధనస్వామ్య వ్యవస్థ మరిన్ని కొత్త మార్గాల్తో మనిషిని పీల్చుకు తింటుంది జీవితం మరింత సంకీర్ణమైంది

ఈ దశలో—దందహ్యమాన దశాబ్దంలో (1970-80) విప్లవ కవిత్వం ధాటికి తట్టుకోలేక, దాంతో కలిసి నడవలేక వెనక్కి వెళ్లాం అనిపించుకోలేక ఎటూ తేల్చకుండా ఉండాలనుకున్నారు కొందరు మధ్య తరగతి కవులు కవిత్వంలోకి రాజకీయాలు రావటం వాళ్లకు నచ్చలేదు లోకానుభూతులకి తట్టుకో లేక ఆత్మానుభూతుల్ని ఎర్పరచుకున్నారు 'శుద్ధం'గా, 'శుభ్రం'గా జీవించా లనుకున్నారు ఈ ధోరణి మనస్తత్వంతో 'అనుభూతి వాదం' అనే శాఖ చిగురు తొడిగింది

ధనస్వామ్య వ్యవస్థలో మధ్య తరగతి మనస్తత్వం ఊగిసలాడుతుంది Middle class is a class of vacillation అని లెనిన్ సూత్రీక రించాడు బూర్జువా [illegible]లో [illegible]తం వ్యక్తిత్వం 'ఉత్పత్తి సంబంధాల్లో ఉన్న హేతుకారిత్వం కవిత్వాన్ని ప్రత్యక్ష జీవితం నుంచి, సంఘ వాసన ల్నుంచీ, ఘోరంగా దూరం చేసి భ్రాంతిమయ వాతావరణాన్ని సృష్టిస్తుం

దంటాడు త్రిపురనేని మధుసూదనరావు అలాటి వాతావరణంలో ఏకాంతంగా అనుభూతి పొంది, కవిత్వం రాయాలని వీళ్ల సిద్ధాంతం అయిఉండాలి

అనుభూతి వాదం తలెత్తటానికి దోహదం చేసిన స్థితిగతుల్ని ఇట్లా వివరించవచ్చు

1 మధ్యతరగతి మనస్తత్వం
2 వ్యక్తివాదం
3 శుద్ధకళావాదం
4. ఆనందలక్ష్యం
5 ఉనికి లేదా మేధావివాసనలు
6 అత్యాధునికుల మనిపించుకోవటం
7 పరిస్థితుల సానుకూల్యం
8 పత్రికల ప్రోత్సాహం
9 శిల్పదృష్టి

## మధ్యతరగతి మనస్తత్వం

పై వర్గానికి ఎగరలేక, అడుగువర్గాన్ని సమర్థించలేక ఊగిసలాడతాడు మధ్యతరగతి మనిషి సమాజం అంటేనే భయపడటం, పరిసరాల్ని కాదనలేకా, అనుకూలంగా మలచుకోనూలేకా కొట్టుమిట్టాడతాడు కోరికల్ని అదుపు చెయ్యా లేక, తీర్చుకునే ధైర్యం లేక బాధపడుతూ ఉంటాడు జీవితంలోని బల హీనతలు, ఆలోచనల్లోని అవకతవకలు దాచి ప్రకటిస్తే తట్టుకోలేక అంతర్ముఖు డవుతాడు మధ్యతరగతి మనస్సు కాంప్లెక్సు పుట్ట

ఈడిపస్ కాంప్లెక్స్‌లోని అస్థిరత, అయోమయత్వం విళ్లలో బాగా కనిపిస్తాయి ఆత్మన్యూనతా భ్రాంతి (Inferiority Complex) కూడా చోటు చేసుకుంటుంది ఈ అనుభూతివాద కవిత్వంలో ఈ రకం మనస్తత్వం

విపరీతంగా కనబడుతుంది ఈ తరగలికి చెందిన కవి తనది 'ధనికవాదం కాదనీ, సామ్యవాదం కాద'నీ చాటుకుంటాడు 'అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యా'లంటాడు 'ఏకాంతంగా తలుపులు వేసుకుని వెక్కి వెక్కి ఏడుస్తా'డు 'నవ్వుతా'డు

## వ్యక్తివాదం (ఆత్మాశ్రయతత్వం)

వ్యక్తివాదం ధనస్వామ్య వ్యవస్థ కిరీట మంటారు అనుభూతికవి తను, తన జీవితం, తన అనుభూతి ప్రధాన మనుకుంటాడు తనచుట్టే గిరిగీసుకుని తనకు తనే పరాయివాడుగా కనబడతాడు దీన్నే Self-Alienation అనొచ్చు 'నన్ను నేనే పోల్చుకోలేక నాకు నేనే సహస్ర యోజనాల దూరంలో ఉన్నా'ననుకుంటాడు జీవితం వ్యక్తినిష్ఠ మనుకుంటాడు వ్యక్తి శక్తిసామర్థ్యాలను బట్టి కష్టసుఖాలు లభిస్తాయని నమ్ముతాడు చివరికి సంఘానికి దూరమై, జీవితానికి దూరమై, ఒంటరివాడౌతాడు ఆత్మను ఆశ్రయించి తనలో తాను ఏకాంత సౌందర్య లోకాన్ని రచించుకుంటాడు జీవితంనుంచీ, సమస్యల్నుంచీ పలాయనం చిత్తగించే ఈ మనస్తత్వాన్ని Escapism అంటాం పలాయనతత్వానికి ప్రతిరూపమైన వ్యక్తివాదం అనుభూతివాదానికి ప్రాణాధారం అయింది

## శుద్ధకళావాదం

సాహిత్యం రాజకీయాల కతీతంగా ఉండాలంటారు ''సాహిత్యానికి సిద్ధాంత సంబంధ కాలుష్య మంటిందనీ, సాహిత్యచరిత్రలో ఇది కాలుష్య యుగ మనీ'' అజంతా అభిప్రాయ పడినాడు వీళ్లు పరిశుద్ధమైన కవితా కుసుమాల కోసం చూస్తారు 'కవి అనుభూతిని తప్ప మరిదేన్నీ, తన వస్తువులా కడగంట సయినా చూడని కవిత శుద్ధకవిత' అని నిర్వచించారు అన్యవస్తువేదీ కవిత్వాన్ని స్పృశించి గూడదని వీళ్ల మతం 'శుద్ధకళ' అనే వాదం పెట్టుబడిదారీ వ్యవస్థలో తప్ప మరో సమాజంలో వెలువడేందుకు భౌతికమైన ఆస్కారం లేదని కె వి రమణారెడ్డి చెబుతాడు శుద్ధకవితా రూపాన్నే 'స్వేచ్ఛ' అని అనుభూతి కవులు

అనుకుంటారు సమాజస్పర్శా, రాజకీయాలూ, కవిత్వాన్ని కలుషితం చేస్తాయన్న దురూహలోంచి పుట్టిందిది

## ఆనంద లక్ష్యం

అనుభూతి కవులు కవిత్వం కేవలం ఆత్మానందం కోసమని విశ్వసిస్తారు కావ్యం ఆనందానుభూతి కొరకేనని కొందరు ఆలంకారికుల అభిప్రాయం 'ఆనందమును పొందుట ఇంద్రియాతీత-లక్షణమ్ము అది ఇంద్రియాతీతమైన అనుభూతి' గా అనుభూతినిపేర్కొన్నాడు విశ్వనాథ సత్యనారాయణ 'అందం, ఆనందం కవిత్వ పరమావధి' అనుకుంటారు ఈ అనుభూతి ప్రియులు

భావవాదులు కావటం, సంప్రదాయ సిద్ధాంతాలు, ఆలంకారిక లక్షణాలు జీర్ణించుకుపోయి నాడుల్ని బంధించటం, అనుభూతి వాదుల్లో గమనించవచ్చు, ఆనందమే జీవితాశయం గనకా, కవిత్వం నిజ జీవితంలో లేని ఆనందం ప్రతిపాదిస్తుంది గనకా కవిత్వం జీవితం కంటే ప్రీతిపాత్రమైంది ఆనందం జీవితం నుండి కాక, కవితా చందనశాలల్లోంచి, కల్పితస్వప్న లోకాల్లోంచి ఊరసాగింది రా రా అన్నట్లు 'ఆనందం యెప్పటికయినా వ్యక్తి హృదయ నిష్టమే గనక, వ్యక్తికీ, సమాజానికీ సంబంధం తెగిపోతుంది'

కేవల వైయక్తిక అనుభూతుల వల్ల జనించే ఆనందం ఏ దశలోనూ సమాజానికి చెందదు

## అత్యాధునికుల మనిపించుకోటం

కవితా క్షేత్రంలో అనుభూతి వాదులు తాము అత్యాధునికులమని ఫీలింపు కోవటానికి ప్రయత్నిస్తున్నారు శ్రీకాంతశర్మ చెప్పుకున్నాడు 'అనుభూతి కవిత అత్యాధునిక కవితాశాఖ' అని కవిత్వానికి శాశ్వతత్వం చేకూర్చుతున్నామని వీళ్లు ఎప్పటి కప్పుడు భ్రమిస్తారు తమ కవితను 'రకరకాల బొమ్మ

ంతో అలంకరించిన అనుభూతుల పల్లకి'గా వర్ణించు కున్నారు 'అనుభూతి ప్రక్రియలో గందర గోళంఉందని' కూడా చెప్పుకున్నారు

ఆధునికుల మనిపించు కోవటం కోసం 'ఆధునిక ఇతిహాసమ'ని తమ కావ్యానికి తామే నామకరణం చేసుకున్నారు 'మనస్సులో ఉన్న భావానికి, తాత్త్వికంగా ఉన్న సంక్లిష్టతని యథా తథంగా వాక్యాల్లో పెట్టే కవులు ఈ శాఖలో ఉన్నారు ' కేవల 'ఆధునికత' కోసం కొన్ని ప్రయోగాలు చేశారు వీరు

## ఉనికిని చాటుకోటం లేక మేధావి వాసన

తన ఉనికిని చాటుకోవటానికి Igo ప్రయత్నిస్తుంది Superiority complex వ్యక్తి వాదుల్లో ఎక్కువగా ఉంటుంది బూర్జువా మేధావి మనస్తత్వం తమనుతామే అధికులుగా భావించుకుని ఆహ్లాద పడుతుంది అలాకాకపోతే తనను తానే కించపరచుకుని నీరస పడుతుంది అందుకే తమ మీద తామే 'పెత్తనం' చూపించుకుంటారు.

ఏదో మార్పు తీసుకు రావాలను కోవటం, ఏమీ చేయలేక శూన్యంలోకి పరిగెత్తటం చేస్తారు లోకాన్ని ఉద్ధరించటానికి 'వైజ్ఞానిక నాయకత్వాన్ని' ప్రతిపాదించటం చేస్తారు చేతకాక జనంనుంచి పలాయనం చిత్తగించి, పువ్వుల్ని చూస్తూ శతాబ్దాలు కూచుంటారు

మానసిక రుగ్మత Psycho-neurotic అనే స్థితిని దాటి ఉన్మాదావస్థ Insanity లోకి వెళ్లిపోయి పురాణ పురుషుని వలె తన కీర్తి చిరస్థాయిగా నిలిచిపోవాలనుకోవడం ఈ తరగతికి చెందిన కొందరు కవులలో కనిపిస్తుంది మానిఫెస్టో లేని, ఏకాభిప్రాయం లేని వాళ్లందర్నీ బలవంతంగా ఒక మూసలో ఇరికించి వాదంగా నిలబెట్టడానికి విశ్వప్రయత్నాలు చేస్తారు

## పరిస్థితుల సానుకూల్యం

పురోగామి శక్తులు అణచివేతకు గురిఅవుతున్న పరిస్థితులలో, ఆంక్షలూ, నిషేధాలవల్ల రాజకీయ కవిత్వం తాత్కాలికంగా కొంత ఉధృతి తగ్గిన దశలో

అనుభూతి కవిత్వం కోకొల్లలుగా వచ్చింది బాహిర పరిస్థితుల్ని ఎదుర్కోలేని అంతర్ముఖత్వం అనుభూతి కవిత చెదురుమదురు కావడానికి తోడ్పడింది

## పత్రికల ప్రోత్సాహం

కొన్ని పత్రికలు ఈ వాదాన్ని Establish చెయ్యటానికి ప్రయత్నించాయి ఇదే రకం మనస్తత్వం గల, బూర్జువా వ్యాపార సంస్కృతి ప్రతినిధులైన పత్రికాధిపతులు కూడా సహజ బలహీనతల చేత, ఈ శుద్ధ, అమలిన అనుభూతులే నిజమని నమ్మించే ప్రయత్నం చేయటం జరిగింది

కాంట్రవర్సీ సృష్టించి Readership ని పెంచుకోటానికి మరో రకంగా ప్రయత్నించారు

## శిల్ప దృష్టి

కవిత్వం ఉద్యమ రూపంలో హోరెత్తి సింహ కంఠ నాదాలు చేస్తున్నప్పుడు భరించలేక, పక్కన 'శిల్పం' కావాలంటూ కొసవేలుతో పొడుస్తుంటారు

'ఎట్లా చెప్పావన్నదే ముఖ్య' మంటూ అభివ్యక్తి వైపు దృష్టి మళ్ళించటానికి కృషి చేస్తారు 'దేని మీదైనా రాయి కవిత్వం రాయి' అనే నినాదం ఈ ధోరణికి సంబంధించిందే

కవిత్వం పాళ్ళు తగ్గిందనీ, అలంకారాల మధ్య, పద చిత్రాల మధ్య నిలబడి పిలుస్తుంటారు వస్తువు నుంచి శిల్పాన్ని వేరుచేసి, Craftsmanship నైపుణ్యాన్ని గానం చేస్తారు చెలం అంటాడు 'తాను చెప్పదలచుకున్న సంగతి స్పష్టంగా తనకే తెలీనప్పుడు, తన చేతకానితనాన్నీ, అర్థ అస్పష్టతనీ ఛందస్సు చీరల వెనకా, అలంకారాల మధ్యా, కఠిన పదాల బురఖాలలోనూ దాచి మోసగించాలని చూస్తాడు కవి ముఖ్యంగా సహజ సౌందర్యం తక్కువైనపుడు'

అంచెలంచెలుగా వచ్చిన కవిత్వాన్ని 'అనుభూతివాదం' గొడుక్రిందచేర్చి పరిశీలించితే అందిన అంశాలివి

ఈ శాఖకి ఇంతకు ముందున్న సాహిత్య శాఖల్లో కొన్నిటికి సంబంధం ఉంది అసలు 'అనుభూతి' అనేది కొత్తదేం కాదు అనుభూతి వాదం పాత కొత్తల మేలు కలయిక కూడా కాదు ఇది పాతపాతల కలయికే ముసుగు మాత్రం కొత్తది అనుభూతి ప్రాచీన శాఖల్లోని కొన్ని ధోరణులకు అచ్చు ప్రతిలా ఉంటుంది

'అనుభూతి' అంటే అనురక్తి, అనుభవం 'ప్రత్యక్షాది ప్రమాణ జన్య జ్ఞానం' అని నైఘంటుకార్థం దీన్నే "ఇంద్రియముల ద్వారమున అంతఃకరణము పదార్థములపై వ్యాపించి ఆ పదార్థము స్వరూపమును గ్రహించుట" అని వావిళ్ల వారు అభిప్రాయపడ్డారు

ఇంగ్లీషులో అనుభూతిని Experience అనీ, Feeling అనీ వ్యవహరిస్తారు 'Description of the subject- matter of Psychology' నే Experience అంటాం

ఈ అనుభూతులు ప్రపంచ దర్శనం వల్ల కలుగుతాయి అవి రెండు రకాలుగా వెలువడుతాయి

1 లోకానుభూతులు Extraverted

2 ఆత్మానుభూతులు Intraverted

ఒక వ్యక్తి చైతన్యం సమాజ వృత్తం చుట్టూ నిండి ఉన్న అనుభవాల్ని సమగ్రంగా దర్శించినపుడు సామాజికానుభూతులుగా బయటపడతాయి అలా కాక ప్రవృత్తి, వ్యక్తి ద్వారా అంతస్సీమల్లోకి ఇంకిపోయినపుడు స్వాప్నికానుభూతులుగా వెలువడుతాయి

రెండు రకాలుగా వెలువడే అనుభూతులూ కవిత్వంగా వికసించటానికి అవకాశముంది కాని - కవి యొక్క అనుభూతి చైతన్యాన్ని బట్టి కవితా కళ వర్గీకరించబడుతుంది ఇట్లా వెల్వడే అనుభూతుల్ని నాల్గు విధాలుగా విభజించవచ్చు

1 Simple feelings రుచులు మొదలైనవి

2 Organic feelings ఆకలి, దాహం, బాధ వంటివి

3 Activity feelings లైంగిక, అభిరుచి, ఉత్సాహం,అనిష్టం

4 Sentimental and attitude feelings
నైతిక, ఆలంకారిక, మత, మేధస్, సాంఘిక

అనుభూతి వైరుధ్యాల్ని బట్టి కవిత్వంలో భిన్నత్వం గోచరిస్తుంది ఉదాహరణకు ఒకే వస్తువు, అవగాహన స్థాయినీ, మానసిక స్థితినీ పురస్కరించుకొని , భిన్న అనుభూతుల్ని అందిస్తుంది సముద్రం ఒకరికి 'వేయి కర్రల సముద్రం'గా కన్పిస్తుంది ఒకరికి 'పీరుని నేత్రం'లా కనిపిస్తుంది

'Poetry is Spontaneous overflow of powerful feelings' అని Wordsworth కవిత్వాన్ని నిర్వచించాడు 'A vent for over charged-feelings' అని Kebel వివరించాడు

ఈ అనుభూతులు క్రమబద్ధం కాకపోతే అస్పష్టత, అయోమయం సంభవిస్తుంది అది గుర్తించి శ్రీకాంత శర్మే స్వయంగా 'ఈ అనుభూతి ప్రక్రియలో ఎంతటి గందరగోళమున్నదో అదంతా ఈ వాదంకవి కవిత్వంలోనూ కనిపిస్తుంద'న్నారు

'అనుభూతి కళను అభ్యసించడమంటే, సచేతనంగా, సబుద్ధికంగా, సంకల్ప సహితంగా జీవితాన్ని ఆచమనం చెయ్యటం' అని శేషేంద్ర శర్మ భావించాడు

'బాహ్య ప్రపంచ దృశ్యాలు అంతరంగ ప్రపంచంలో దృశ్యత్వాన్ని కోల్పోయి కేవల అనుభూతిగా మిగల్తాయ'ని శ్రీకాంత శర్మ వివరించాడు ఇప్పుడు వీళ్ళు ప్రతిపాదించిన అనుభూతివాదం పై అభిప్రాయాన్నే ప్రతిబింబి స్తుంది మొత్తం మీద వీరి దృష్టిలో అనుభూతుల్ని పువ్వుల్లాఅల్లిన దండే కవిత్వం

## అనుభూతివాదం - రసవాదం

మనవాళ్ళు ప్రాచీన కవిత్వాన్ని రసదృష్టితో కొలిచారు ఇప్పటికీ ఆధునిక కవిత్వాన్ని సంప్రదాయవాదులు రసదృష్టితోనే చూస్తారు నిజానికి - అప్పుడు రసవాదం కవితాత్మను ఆవిష్కరించటానికి ఆనాడు బాగా అవసరమైంది ఈనాడు అనుభూతి వాదంగా ప్రచారమయ్యేదంతా జీర్ణించుకు పోయిన రస వాదమే దీనికన్న ఇంకా రసవాదం విశాలమైంది ఇంతకన్నా ఎక్కువ వైవిధ్యం అందులో ఉంది

భరతుడు మొదటిసారిగా రసాన్ని చర్చిస్తూ కావ్యశరీరం ఇతివృత్త మయినా సౌందర్య హేతువు రసమని స్పష్టం చేశాడు రసప్రాధాన్య వాది భరతుడు ఇందుకు 'మృదు లలిత పదార్థాల్ని' ఉద్దేశించాడు

ఆనంద వర్ధనుని మతానుసారం కావ్య పరమ లక్ష్యం రసానుభూతే వస్తు, అలంకార, రస ధ్వనుల్లొ రసధ్వనే ఉత్తమ మైందిగా చెప్పాడు 'కావ్య స్యాత్మా స ఏవార్థః' రసధ్వనియే కావ్యానికి ఆత్మగా పేర్కొన్నాడు

కాళిదాసు దృష్టిలో మధురమైన శబ్దాలే కవిత్వానికి కావాలి 'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్ పర్యుత్సుకో భవతి'లో అందమైన వాటిని చూడడం, మధురమైన శబ్దాలను వినడం గురించి పేర్కొన్నాడు ఆ శబ్దాల వల్ల కలిగే రసమే ఆనందం ఖచ్చితంగా అనుభూతి వాద కీలకమూ అదే లలిత లలిత పదబంధాలు తప్పనిసరయినా నిద్రా సింధు సైకత తీరాలు, జాజి పువ్వుల అత్తరు దీపాలు, ఆనందపు తెరవాపలెత్తే పవపలూ అవసరమైనాయి

ఆ రసానందమే అనుభూతివాదులు ప్రత్యేకించి నొక్కి చెబుతున్నది 'పువ్వుల్ని చూస్తూ శతాబ్దాలు గడిపినా', 'కొండలకేసి చూస్తూ కొన్ని యుగాలు గడిపినా' వాళ్లు చూసేది ఈ రసానందమే, ఈ అనుభూతే

రసానందమూ బ్రహ్మానందమూ ఒకటేనని ఆలంకారికులమతం కాగా బ్రహ్మానందం ఇంద్రియాతీతమైంది పూర్తిగా ఈ లోకంతో ఈ జీవితంతో సంబంధం లేనిది ఇది మత సంబంధి, తెలియకపోయినా ఇది మత సంస్కృతికి ఉపయోగిస్తుంది

## అనుభూతి వాదం-Art for Art Sake

పాశ్చాత్య దేశాల్లో ముఖ్యంగా ఫ్రెంచి సాహిత్యంలో బయల్దేరిన 'Art for Art Sake' 'కళ కళ కోసమే' అన్న వాదం యొక్క సారాంశాన్ని కూడా అనుభూతి వాదం పుణికి పుచ్చుకున్నది 1890 లో కేవలం 'కళ కళ కోసమే' అనే వాదం వెలుగులోకొచ్చింది 'Art has no moral obligations' అని వాళ్లు ప్రచారం చేశారు 'Art concerned with only beauty, through the Principle of Art for Art Sake' కళ సౌందర్యానికి మాత్రమే చెంది ఉంటుందనీ వాళ్లు ఘంటాపథంగా చెప్పారు

1873 లో Walter Pater అనె అతను History of the Renaissance అనే పుస్తకం రాశాడు దాంట్లో Modern manifestation అనే అధ్యాయం కింద ఈ వాదాన్ని వివరించాడు న్యాయంగా 'కళా వాదాన్ని' ఒక తాత్త్విక శాఖగా మొదట భావించింది అలెగ్జాండర్-బౌంగార్టెన్ (Baumgarten) అతను 1750 లో Aesthetica అనె గ్రంథాన్ని Latin లో రచించాడు తర్వాతెవ్వరూ దాన్ని ఆధునిక భాషల్లోకి అనువదించలేదు ఈ వాదాన్ని Aesthetic movement అని కూడా అంటారు సౌందర్యాన్ని ప్రతిష్ఠించటమే వీళ్ల ధ్యేయం అనుభూతి వాదులు

ఘోషించే సౌందర్యం కూడా ఇదే. విప్లవ కవిత్వంలో రాజకీయాలు చోటు చేసుకోవటం అత్యంత సహజం. కళారూపాల్లో రాజకీయాలుండకూడదనీ, ఉంటే అది 'కళ' కాదనీ వీళ్ల అభిప్రాయం. కళ అనేది సౌందర్య సూత్రం మీదే నిర్మింపబడాలని వీళ్లు వాదిస్తారు. కరుణకూడా వెన్నెల సముద్రంలో ఈదాలనీ, అత్తరు దీపాలు వెలిగించాలనీ అంటారు.

మధ్యతరగతి జాడ్యాలు, వ్యక్తిగత విశ్వాసాలూ సౌందర్య ధోరణుల్ని పునః ప్రతిష్ఠించాలని చూస్తాయి. విద్యార్థులు రాజకీయాలకి దూరంగా ఉండాలని పైవర్గం అంటుంది. 'కవులు రాజకీయాలకు దూరంగా ఉండాల'ని వాదించే అనుభూతి ప్రియులు ఒక వర్గ ప్రయోజనాన్ని ఆశించే ఉన్నారనటం స్పష్టం. ప్రతి విషయాన్ని సౌందర్యీకరించటం, ఆదర్శీకరించటం, ఆత్మాశ్రయ పంజరంలో బంధించటం ఒక వర్గ ప్రయోజనాన్ని సంరక్షించి సుసంపన్నం చేయటానికే.

## అనుభూతి వాదం-భావ కవిత్వం

భావ కవిత్వానికి ఇంచుక తేడా కూడా లేకుండా అనుభూతి వాదం రంగం మీదికొచ్చింది. ఎంత పేరు మార్చినా కట్టూ, బొట్టూ, మాట మనిషిని ఇట్టే పట్టిస్తుంది. అనుభూతి వాదం భావ కవిత్వమనే పాత క్రీమ్‌కి కొత్త లేబుల్ మాత్రమే. అందుకే కుందుర్తి ఎప్పుడో అన్నాడు, 'అనుభూతి వాదం ఇటీవలి కాలంలో భావ కవితాయుగ సంబంధి' అని. రా.రా. గారుకూడా ఈ తత్వాన్ని భావకవిత్వ ఛాయగానే విడమరచి చూపారు. 'భావకవిత్వపు పోకడలను వ్యక్తిగత అనుభూతి వాదం పేరుతో మళ్లీ ప్రవేశ పెట్టార'ని రంగనాథాచార్యులు విశ్లేషించారు.

భావ కవిత్వానికి ప్రధాన గుణం అంతర్ముఖత్వం, ఆత్మాశ్రయ తత్వం. ఈ నీడలు అనుభూతి వాదంలో కూడా స్ఫుటంగా తేట కడతాయి. శబ్దాలకుండే రంగుయా, వాసనల్ని భావకవికి లాగే అనుభూతి కవీ విశ్వసించాడు. స్త్రీ పురుషుల ఆత్మ సౌందర్యాన్ని వర్ణించాడు. భావకవి బాటలోనే తనకు కల్గిన

సుఖదుఃఖాల్ని తెరమరుగు లేకుండా వెల్లడించుకున్నాడు ప్రకృతి వర్ణనల్లో సుకుమార సౌందర్య తత్వాన్ని నిర్దేశించాడు మనో నేత్రానికి భాసించిన ప్రకృతి అనుభూతులే ఈ కవిత్వంలో చోటు చేసుకున్నాయి సంప్రదాయ సిద్ధమైన సంస్కార దృష్టి కలిగింది లౌకికానందానికి బదులుగా అలౌకికానందం అతిగా ఊరింది భావ కవిత్వం ఎన్నో పాయలుగా చీలినట్లే అనుభూతి కవిత్వంలో సామాజిక, మానవతా, శృంగారాది పాయలుండవచ్చునట

స్వాతంత్ర్యానికి పూర్వం ఆనాటి పరిస్థితులననుసరించి, భావకవులు జాతీయోద్యమ చారిత్రక దశను గుర్తించి దేశభక్తిని గానం చేశారు తర్వాత నామ మాత్రంగా స్వాతంత్ర్యం వచ్చింది ఇరవయ్యేళ్ల పాలన జన జీవితాన్ని దుర్భరం చేసింది కన్నీళ్లనుంచీ, కష్టాలనుంచీ, దుఃఖంత్వం నుంచి కొత్తగా మానవతావాదం తలెత్తింది మరోపక్క దేశ కాల పరిస్థితులు చారిత్రక పోరాటాలకు బాటలు వేశాయి ఈ చారిత్రక పరిస్థితుల్ని గుర్తించకపోగా అశాస్త్రీయమూ, అస్పష్టమూ అయిన మానవతావాదం అనుభూతి కవుల కాదర్శమైంది అంటే భావకవులకున్న హృదయ వైశాల్యం కూడా వీళ్లకు లేకుండా పోయింది

"నా ఆకాశాన్ని మడచి చంకన పెట్టుకొని పొమ్మన్న చోటకే పోతాను'' అని పలాయన వాదానికి దారి తీయించింది అనుభూతివాదం రసానందవాదంతో రూపుదిద్దుకుని, భావికవిత్వంతో ప్రాణం పోసుకుని, 'కళ కళ కోసమే' అని బయల్దేరిన అసామాజిక ధోరణి అనుభూతివాదం

## తెలుగు సాహిత్యంలో 'అనుభూతి' వాదం

అభ్యుదయ కవిత్వం స్వేచ్ఛా విహారం మొదలెట్టగానే మెల్లమెల్లగా భావ కవిత్వం చల్లబడి అదృశ్యమై పోయింది భావకవిత్వానికి సంబంధించిన కవులు కూడా అభ్యుదయ కవితవైపు మొగ్గుచూపక తప్పలేదు

తర్వాత రాజకీయంగా స్తబ్ధత ఏర్పడింది అభ్యుదయ కవిత్వం పల్చబడింది మధ్య తరగతి జీవితం తప్ప మరో వస్తువు కంటికి కనిపించలేదు

అణిగిమణిగి ఉన్న భావకవిత్వపు ధ్వనులు మళ్లా వేషం మార్చుకొని పుంజుకో జూచినాయి అట్లా అభ్యుదయ కవిత్వానికి, భావ కవిత్వానికీ మధ్య లోలకంలా ఊగుతూ 'అనుభూతి' పదం వాడుకలోకి వచ్చింది

ఆధునిక కవిత్వంలో 'అనుభూతి' కవిగా ముద్రవేసుకున్న మొట్టమొదటి కవి తిలక్ ఈ అనుభూతిదృష్టి కొలను లాగా అక్కడే ఉండిపోయింది తప్ప ఇది ప్రవహించలేదు దిగంబర కవుల షాక్ ట్రీట్‌మెంటూ, విప్లవకవుల ప్రభంజనం సమాజాన్ని కుదిపింది కవిత్వాన్ని కదిలించింది ఆ దశలో వీటితో సంబంధం లేకుండా విలక్షణమైన అనుభూతుల్ని పేర్చుకొని వేగుంట మోహన ప్రసాద్ కవిత్వం చింతించాడు ఇస్మాయిల్ తన చెట్టునుంచి కొత్త పదచిత్రాల్ని పంచిపెట్టాడు ఒత్తిడులకులోనై విప్లవకవిత కొంత అజ్ఞాతం కాగానే శ్రీకాంత శర్మ తన అనుభూతుల్ని గీతాలుగా తనే ముద్ర వేసుకున్నాడు శేషేంద్రశర్మ చిత్రోక్తుల తీగలపై నడిచాడు అరచేత్తో అలంకారాలు సృష్టించాడు ఇంకా కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, వై శ్రీరాములు ఈ ధోరణికి దగ్గరగా నడుస్తున్నారు

తిలక్ 'అమృతం కురిసిన రాత్రి,' వేగుంట మోహనప్రసాద్ 'చితీ చింత', ఇస్మాయిల్ 'చిలుకలు వాలిన చెట్టు' (చెట్టు నా ఆదర్శం, మృత్యువృక్షం) శేషేంద్ర శర్మ 'శేషజ్యోత్స్న', 'మండే సూర్యుడు,' 'నీరై పారిపోయింది,' 'సముద్రం నా పేరు' కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ 'వెలుతురు పిట్టలూ,' వై శ్రీరాములు 'రంగులపక్షి' ఈ ధోరణి కవిత్వంలోకి వచ్చిన సంపుటాలు

## రూపం

రూపంలో కూడా అనుభూతి కవిత్వానికి భావ కవిత్వంతో పోలికలున్నాయి వీళ్ల వచన కవితల్లోనూ Lyric లక్షణాలున్నాయి, ఒక్క మోహనప్రసాద్‌లో తప్ప తొలిదశలోది కాకపోతే శేషేంద్రశర్మది మళ్లా ప్రత్యేకమైన గద్యం

తిలక్, శ్రీకాంతశర్మ ఇస్మాయిల్ల కవిత్వంలో Lyric పాలెక్కువ శ్రీకాంత శర్మ సంపుటిలో వృత్తాలు కూడా ఉన్నాయి

* ఒక్కసారి మనసుమారి కలలబాట విడిచిపెట్టి ఏలపుచెలిమ తొలగనెట్టి నడిరాలిరి పడిపోవకు (తిలక్)

* గిరిశిఖరిపై, చిరుగరికపై పరిగెత్తినెను పసిశింమబెరుగుదుమ (శ్రీకాంత్)

* తొలసంజ నారింజ ఎవరు ఒలిచేరు తెలిఎండతొనలను ఎవరు పంచేరు (ఇస్మాయిల్)

అయినా భావకవిత్వాన్ని అనుభూతివాదాన్నీ వేర్పరిచేది ప్రధానంగా రూపమే భావకవుంది పద్యాత్మకం వీళ్లది వచనాత్మకం

## భాష

పదాలు, పదబంధాలు, నాజూకు అలంకారాలు కూడా భావకవిత్వం నుంచి పూచినవే 'ఎరుపెరుపు చెక్కిళ్లు' 'సంజవన్నెలబాల' 'యౌవనధనుస్సులు' 'చిరుఆకాశాలూ' 'సరత్తీరాలూ,' 'రాగవైరాగ్యాలూ' మొదలైనవి నిండా ఉన్నాయి

## వస్తువు

సంస్కరణ వాదంతోనో, ఆదర్శవాదంతోనో సమాజం మారుతుందను కుంటారు వీళ్లు త్రిపురనేని మధుసూదనరావు ఈ దృక్పథాన్ని ఇలా వివరించాడు 'సంస్కరణ వాదం, మానవతావాదం, ప్రేమ, విశ్వమానవప్రేమ, శాంతియుత సహజీవనం, జాతీయత, దేశభక్తి, సంప్రదాయ సామరస్యం మొదలైన వాదాలను పెట్టుబడిదారీ వ్యవస్థే ప్రవేశపెడుతుంది ఇవి ప్రచారం చేసే కవి ధనస్వామ్య చట్ట పరిధిలోనే చేస్తాడు కాబట్టి అతడు బూర్జువా కవిగానే మిగిలిపోతాడు స్వప్నాలూ, ఎంటిది లోకాలూ, ఏదో తెలియని వేదన, దేని

కోసమో తేలని ఆరాటం, రంగులూ వాసనలతో నిండిన ప్రకృతి విశ్లి వస్తువులు పోతే అనుభూతికవుల్లో రెండు Positive అంశాలు మాత్రం మెరుస్తుంటాయి ఒకటి, వైవిధ్యం కోసం చేసిన కొన్ని వచనప్రయోగాలు రెండు, ఇమేజరీ (Imagery)లో కొత్తపుంతలు తొక్కటం ఇవి మాత్రమే వాళ్ళ 'ఆధునికత'ని చెబుతాయి

అనుభూతివాదం కవిత్వంలోనే తప్ప తెలుగు సాహిత్యంలోని ఇతర ప్రక్రియల్లో ఎక్కడా స్పష్టంగా కనిపించదు బుచ్చిబాబు 'చివరకు మిగిలేది'లో వడ్డెర చండీదాస్ 'హిమజ్వాల'లో అక్కడక్కడా Transparent గా కనిపిస్తుంది లత 'మోహనవంశి'లో కొంత మేరకు చోటు చేసుకుంది బుచ్చిబాబు కథల్లో కొంచెం, చలం 'ఓ పువ్వు పూసింది'లో కొంత ఉంది ఎక్కడయినా బలవంతంగా లాగాల్సివొస్తుంది ఎందుకంటే ఇది కవిత్వంలోనె ఒక వాదంగా పరిణమించే అవకాశం లేకుండా ఉంది చలంను 'అనుభూతివాది' అని అంటాడు శ్రీకాంతశర్మ చలం-జీవితంమీదా, సంఘంమీదా యుద్ధం ప్రకటించాడు చలం అనుభూతివాది కాదు రెబెల్

'అనుభూతి కవిత్వం' అనేది ఒక వాదం కాదు కావటానికి వీల్లేదు వస్తునిర్దేశం లేకుండా, నియమ నిబద్ధత లేకుండా ఏదీ వాదంగా పరిణతిచెందదు అంతేకాక - తనదంటూ ఒక సిద్ధాంతం, ఒక తాత్విక దృక్పథం లేకుండా, ఆధారంగా ఉండే జీవితం లేకుండా ఏదీ వాదంగా నిలబడలేదు 'అనుభూతి వాదం' పరిపూర్ణమైన వాదం కాదు బలహీనమైన ఒక ధోరణి మాత్రమే వీళ్ళు తమ కవిత్వంలో ఉండొచ్చనంటున్న సాంఘిక, నైతిక, జాతీయ తదితర శాఖలు భావకవిత్వంలోనూ ఉన్నాయి భావకత్వంలోని పాయల్లో Liberal Look ఉంది జీవితం పట్ల సానుభూతి ఉంది అనుభూతి కవిత్వంలో అది [illegible] పూర్వం పెద్దింటి కాంతలుండేవారు వాళ్ళు గదిలో బంధించబడేవారు గోడ రంధ్రాలద్వారా వచ్చే గాలీ, వెలుతురు ఆ చిరు ప్రపంచమె వారి జీవితం వాళ్ళనె 'అసూర్యంపశ్యలు' అనేవాళ్ళు అలాంటి

శుద్ధాంతఃకాంతల పష్కించిన సౌందర్యమే శుద్ధకళావాదమని రమణారెడ్డిగారు చమత్కరించారు శుద్ధకళావాదమంటూ, శుభ్రమైన అనుభూతివాదమంటూ ఒకటి ఉండటానికి ఆస్కారంలేదు వీళ్ళందరినీ అనుభూతి కింద బలవంతంగా ఒక వ్యక్తి ముడివేసిందే తప్ప ఉన్నవాళ్ళయినా అందరూ ఇష్టపడిందికాదు అందుకే ఎవరి వాదాలు వాళ్ళకున్నాయి ఒకరిది వైజ్ఞానిక నాయకత్వం, ఒకరికి దుఃఖమే సార్వకాలికం, సార్వజనికం, ఒకరిది శుద్ధతత్వం, ఒకరిది ఏ తత్వమూ కాదు

కొందరికి అనుభూతివాదులుగా పిలిపించుకోడం Personal గా ఇష్టం లేదట ఇట్లా ఒక Force లేని, కాలేని వాదం అనుభూతి కవిది ప్రజలను సాహిత్యం నుంచీ, సాహిత్యాన్ని రాజకీయాల నుంచీ, రాజకీయాల్ని ప్రజల్నుంచీ కాపాడాలని రకరకాల వాళ్ళు చేసే ప్రయత్నం చూసి కుటుంబరావుగారికి ముచ్చటేసేదట అట్లా ముచ్చటపడవలసిన సాహిత్యమే అనుభూతి ధోరణికి సంబంధించిన సాహిత్యం

సమాజం వినా అనుభూతి లేదు అనుభూతి వినా కవిత్వం ఉండదు అన్ని రకాల కవిత్వంలోనూ అనుభూతి ఉండితీరుతుంది చెట్లు లేకుండా అడవి కాదు, అనుభూతుల్లేకుండా కవిత్వం కానేరదు ఎవరికయినా భౌతిక జీవితమే సత్యం వారి చైతన్యాన్ని, పరంపరంగా విజృంభించే ఆలోచనల్ని ఆ జీవితం నిర్ణయిస్తుంది వారి జీవితానుభూతుల్నుంచే వారు మాట్లాడినా - కవిత్వం రాసినా Dostoevsky అంటాడు 'A man always talks from his own ache'

తన బాధని పట్టించుకోకుండా, తన బాధకి కారణాలు విశ్లేషించుకోకుండా బాధ నుంచి తాత్కాలిక ఉపశమనం పొందటానికి ఆత్మలోకి అంతర్ముఖత్వం పొంది తనలోతానే మధుర మంజుల సుషమా గంధర్వలోకాలు, చందనశాలలూ సృష్టించుకుని స్వప్నిస్తే ఏమీ జరగదు జరిగేది ఎవ్వరినీ కదిలించదు

**ఆధునిక తెలుగు సాహిత్యంలో**

# చైతన్య స్రవంతి

—నవీన్

ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు నిర్వహిస్తున్న 'సారస్వత వేదిక' కార్యక్రమంలో నన్ను చైతన్యస్రవంతి అన్న అంశం మీదనే మాట్లాడమనటానికి కారణాలను వెతుక్కోవలసిన అవసరం లేదు 1969 లో నా 'అంపశయ్య' నవల ప్రచురించబడినప్పటి నుండి నా పేరు 'చైతన్య స్రవంతి' శిల్పం అనండి-ధోరణి అనండి-పద్ధతి అనండి-మొత్తం మీద ఈ 'చైతన్య స్రవంతి'తో ముడిపడి పోయింది కొందరు విమర్శకులు తెలుగులో 'చైతన్య స్రవంతి' శిల్పాన్ని పోషించిన మొట్ట మొదటి నవల 'అంపశయ్య' అంటే, మరి కొందరు అసలు అంపశయ్యలో ఈ శిల్పం లేనేలేదని నిరూపించడానికి ప్రయత్నించారు ఈనాటి నా యీ ప్రసంగి వ్యాసానికి ముందు నేను మీకొక విషయం స్పష్టం చెయ్యదల్చుకున్నాను అదేమిటంటే చైతన్య స్రవంతి శిల్పం మీద నాకు ప్రత్యేకమైన మోజు గాని, అధికారం కాని లేవు ఈ శిల్పాన్ని గూర్చి గాని, ఈ శిల్ప లక్షణాలను గూర్చిగాని నాకు సంపూర్ణంగా తెలుసునని కూడా నే ననుకోవటం లేదు నేను రచించిన 'అంపశయ్య' నవలలో ఈ శిల్పం తాలూకు లక్షణాలు కొన్ని ఉన్నాయి కాని ఆ లక్షణాలు ఆ నవలలోకి రావటం కేవలం యాదృచ్ఛికం చైతన్య స్రవంతి శిల్పాన్ని బాగా అధ్యయనం చేసి, మధించి, ఈ పద్ధతిలో ఒక నవల రాయాలని ప్రయత్నించి నేను అంపశయ్య నవలను రాయలేదు ఒకానొక [illegible], కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో నా మేధస్సును వేధించిన అనేక అనుభవాలనుండి, జ్ఞాపకాలనుండి, ఆలోచనలనుండి, ఆందోళనలనుండి, బాధలనుండి, గాథలనుండి, కలలనుండి, కన్నీళ్ళనుండి నన్ను నేను

విముక్తుణ్ణి చేసుకోవడానికి రాసుకున్న రచన 'అంపశయ్య' వీటన్నిటిని కాగితం మీద పెట్టాలన్న తపన నా చేత ఆ నవలను రాయించింది—చాలా అప్రయత్నంగా, సహజంగా నా కలం నుండి వెలువడిన రచన అది దాంట్లో శిల్పం, వస్తువు వేర్వేరని నేనెప్పుడూ అనుకోలేదు ఆ నవల రాస్తున్న రోజుల్లోనే కొందరి మిత్రుల సలహాపై చైతన్య స్రవంతి శిల్పాన్ని గూర్చి తెలుసుకునే ప్రయత్నం చేశానేగాని అత్యంత సంక్లిష్టమైన ఆ శిల్పం నాకు అంతుచిక్కలేదు ఆ శిల్పాన్ని పోషించిన కొందరు రచయితల మీద మాత్రం అపారమైన గౌరవం కల్గింది

II

చైతన్య స్రవంతి శిల్పాన్ని గూర్చి నాకు తెలిసిన కొన్ని విషయాల్ని మీకు చెప్పేముందు ఈ శిల్పాన్ని అనితర సాధ్యంగా పోషించిన ఒక మహా రచయితను గూర్చి చెప్పాలి

జేమ్స్ జాయిస్ ఈ శిల్పాన్ని సాహిత్యంలో పోషించటాన్నొక యజ్ఞంగా, ఒక తపస్సులా భావించాడు జాయిస్ తన జీవిత కాలాన్నంతా ఈ శిల్పపు లోతుల్ని శోధించి ఈ శిల్పపు ఆఖరి అంచుల్ని అందుకోవటానికే ఖర్చు చేశాడు ఈ ఒక్క శిల్పంలోనే కాదు సాహిత్యానికి అందుబాటులో ఉన్న అన్ని శిల్పాలను జాయిస్‌లా తన రచనల్లో మేళవించుకున్న రచయిత మనకు చాలా అరుదుగా ఉంటారు

అతి సాధారణమైన మానవ జీవితాన్ని అత్యంత క్లిష్టమైన శిల్పరూపాల్లో చిత్రించటం జాయిస్ ప్రత్యేకత ఆయన రచించిన 'యులిసెస్' నవల — డబ్లిన్ నగరంలో నివసిస్తున్న ఓ ముగ్గురు వ్యక్తుల సాధారణ జీవితాల కేవలం ఒక రోజులో వాళ్ళ జీవితాల్లో జరిగిన అతి సాధారణమైన సంఘటనలు - ముఖ్యంగా ఈ సాధారణ బాహ్య సంఘటనలు వాళ్ళ అంతరంగ ప్రపంచంలో ఎలాంటి ప్రేరణల్ని సృష్టించాయన్న అంశంమీద కేంద్రీకరిస్తూ రాయబడింది అయితే 'యులిసెస్' నవల సామాన్య పాఠకులకు అర్థం కావేమో నవలంటే

సాధారణంగా సాధారణ పాఠకులకు ఒక ఆసక్తిదాయకమైన కథ, నాటకీయమైన సన్నివేశాలు, ప్రేమలు, త్యాగాలు, ఆదర్శవంతులైన నాయికా నాయకులు పాత్రలుగా వుంటారనే అభిప్రాయమే వుంటుంది ఇవేవి లేని 'యులీసెస్' నవలను మామూలు పాఠకులు ఆదరించలేక పోయారు కాని 'యులీసెస్' నవల ప్రచురింపబడినప్పటినుండి ఈనాటి వరకు సాహిత్యాన్ని సీరియస్‌గా తీసుకని అధ్యయం చేసే సాహితీ పిపాసులకు అమృతాన్ని పంచిపెడుతున్నది ఆ నవలలోని ప్రతిఘట్టంలోనూ ఒక కొత్త శిల్పాన్ని పోషించాడు జాయిస్ యులీసెస్ లాంటి రచన చేసిన రచయితకు ఇక కొత్తగా అధిరోహించగల్గే సాహితీ శిఖరాలంటూ యేవీ ఉండవు శిల్ప సంపదకు సంబంధించినంతవరకు ఆ రచనను సాహిత్యంలో చివరిమాట అని చెప్పొచ్చు కాని జాయిస్ లాంటి కళాతపస్వి 'యులీసెస్' తర్వాత మరో 20 సంవత్సరాలు శ్రమించి 'ఫెన్నిగన్స్ వేక్'' అన్న మరో రచన చేసాడు యులీసెస్‌లో వున్నది చైతన్య స్రవంతి అయితే 'ఫెన్నిగన్స్ వేక్'లో వున్నది సుప్త చైతన్య స్రవంతి అన్నారు విమర్శకులు ఐన్‌స్టీన్ మొదటిసారి తన 'థియరీ ఆఫ్ రెలిటివిటీ'ని ప్రతిపాదించినప్పుడు ప్రపంచ-లో కేవలం 12 మందికి మాత్రమే అర్థమయ్యిందట- అల్లానే జాయిస్ 'ఫెన్నిగన్స్‌వేక్' నవలను కూడా బహుశా 12 మంది కంటె ఎక్కువమంది అర్థం చేసుకుని వుండరు ఈ నవలను అర్థం చేసుకోవాలంటే కనీసం 12 భాషల్లో పాండిత్యం ఉండి తీరాలట! ''వైజ్ఞానిక ప్రపంచంలో ఐన్‌స్టీన్ ప్రతిష్ఠా ప్రాముఖ్యం వంటివే సాహిత్యలోకంలో జాయిస్ ప్రాభవమూ, ప్రత్యేకత[1]'' అంటాడు శ్రీశ్రీ

జాయిస్‌ను గూర్చి శ్రీశ్రీ మరో మాట కూడా అన్నాడు "1914-18 మధ్య యావత్ప్రపంచమూ ఒక మహా యుద్ధంలో నిమగ్నమై వుంటే జేమ్స్

1 'జేమ్స్ జాయిన్ చైతన్య స్రవంతి' శ్రీశ్రీ సాహిత్యం - రెండు - (వచన విభాగం)
1973-1950 కూర్పరి కె వి రమణారెడ్డి
పుట సంఖ్య 492

జాయిస్ ఒక మహా కావ్యరచనలో నిమగ్నుడైనాడు ఆ యుద్ధానికి ఫలితంగా రష్యాలో వచ్చిన సామ్యవాద విప్లవానికెంత ప్రాముఖ్యం వుందో సాహిత్యంలో 'యులీసెస్' నవలకు అంతే ప్రాముఖ్యం ఉంది" 2

జాయిస్ అందరికీ అర్థం కాడు అతనిది నారికేళపాకమనే కాదు . ఇంకా ప్త ముందుకెళ్ళి పాషాణపాకం అనవలసి ఉంటుంది కాని అతన్ని అర్థం చేసుకునే మేధాస్థాయికి ఎదిగిన వాళ్ళకు సాహిత్యామృతాన్ని పంచి పెడ్తాడు జాయిస్ ఎంత మధిస్తే అంత అమృతం ఎంత అధ్యయనం చేస్తే అంత ఆనందం ఎన్నిసార్లు చదివితే అన్ని కొత్తఅర్థాలు ఎంత శోధిస్తే అంత లోతు ఎంత విహరిస్తే అంత దూరం జాయిస్ రచనల్లో మనకు కనిపిస్తాయి సాహిత్య సృష్టికి జాయిస్‌లా తనకు తాను సంపూర్ణంగా అంకితం చేసుకున్న రచయితలు చాలా అరుదుగా ద్యోతకమవుతారు అంతటి మహాశిల్పి శబ్ద బ్రహ్మ మన స్తత్వవేత్త కళాతపస్వి జాయిస్ పోషించిన చైతన్యప్రవంతి శిల్పాన్ని గూర్చి సాధికారికంగా, సంపూర్ణంగా చెప్పగల్గటం ఆ శిల్పపు పైపై అంచుల్ని మాత్రమే చేరుకోగల్గిన నాలాంటి వాడికి సాధ్యంకాదని మొదలే మనవి చేస్తున్నాను అయినా జాయిస్ మీద, ఈ శిల్పం మీద వున్న గౌరవంతో ఈ శిల్పాన్ని గూర్చి నాకు తెలిసిన కొన్ని విషయాల్ని సాధ్యమైనంత స్పష్టంగా చెప్పటానికి ప్రయత్నిస్తాను

III

చైతన్య ప్రవంతి అనే ఈ నూతన ప్రక్రియ ఆంగ్ల సాహిత్యంలో ప్రవేశించటానికి యేవో కొన్ని చారిత్రక పరిస్థితులు పనిచేశాయని, దీని వెనుక యేదో ఒక 'ఇజమ్' ఉందని కొందరు విమర్శకులు అంటే అనచ్చు కాని నాకు తెలిసినంతవరకు - తమ సృష్టిస్తున్న సాహిత్యాన్ని మానవ జీవితానికి - ముఖ్యంగా మానవుడి అంతరంగ జీవితానికి ఇంకా దగ్గరగా తీసుకెళ్ళాలన్న

2 అదే గ్రంథం

కొందరి రచయితల్లోని తపనే ఈ నూతన ప్రక్రియకు దారి తీసింది చైతన్య స్రవంతి ధోరణిలో రచనలు చేసిన రచయితలకు ముందు రచనలు చేసిన రచయితలకు లోపలి ప్రపంచం ఒకటి ఉంటుందని, వాళ్ళ బాహ్యచేష్టలను, ప్రవర్తనను ఈ లోపలి ప్రపంచం ప్రభావితం చేస్తుందని తెలీదని చెప్పడానికి వీల్లేదు సాహిత్యం పుట్టినప్పట్నించి ఈ విషయం రచయితలకు తెలుసు సిగ్మండ్ ఫ్రాయిడ్ పదేపదే ఒక విషయం చెబుతుండేవాడు 'Unconscious' లేక 'సుప్తచేతన' అన్న దాన్ని గూర్చి తనకంటె ముందే రచయితలకు తెల్సునని, కాని రచయితలకు తెలిసిన ఈ విషయాల్ని తాను శాస్త్రీయంగా నిరూపించానని ఫ్రాయిడ్ అంటాడు అలాగే పాత్రలకు అంతరంగ ప్రపంచమొకటి ఉంటుందని తెలియటమే కాదు ఆ ప్రపంచాన్ని సాహిత్యంలో చిత్రించే పద్ధతిని కనిపెట్టటం అందుకు కావల్సిన సాహిత్య పరికరాలను సృష్టించడం ముఖ్యం సరిగ్గా ఇదే చైతన్య స్రవంతి పద్ధతితో రచనలు చేసిన రచయితలు సాధించిన విజయం అంతకు ముందు రచనలు చేసిన రచయితలకు, ఈ తరహా రచనలు చేసిన రచయితలకు ఉన్న తారతమ్యం కూడా ఇదే ! పాత్రలకు అంతరంగ ప్రపంచమొకటుందని, దానిని నాటకాల్లో అయితే స్వగతాల వల్ల, నవలల్లో అయితే ఒక పాత్ర లోపల యేమనుకుంటున్నాడో రచయితే చెప్పటం ద్వారా చూపించే ప్రయత్నం రచయితలు చేసేవాళ్ళు కాని ఇదంతా పైపైనే జరిగింది అంతరంగ ప్రపంచాన్ని కేంద్రంగా, బాహ్య ప్రపంచం తాకిడికి ఆ ప్రపంచం పొందే వివిధ ప్రకంపనల్ని వివిధ ప్రేరణల్ని , ఆ ప్రపంచంలోనే అంతర్భాగమైన జ్ఞాపకాల్ని, ఊహల్ని, ఆలోచనల్ని, అనుభవాల్ని చిత్రించే మార్గాల్ని అన్వేషించాలన్న ఆరాటం ఆనాటి రచయితలకు లేదు ఈ ఆరాటం, ఈ అన్వేషణ జాయిస్ లాంటి రచయితలకు కల్గాయి తత్ఫలితంగానే చైతన్యస్రవంతి నవల ఉద్భవించింది ఇదివరకటి రచయితలెవ్వరూ స్వీకరించని విధంగా పాత్రల అంతరంగ ప్రపంచాన్ని సాహిత్య వస్తువుగాస్వీకరించవచ్చునని, ఈ ప్రపంచాన్ని కేంద్రంగా చేసుకొని పాత్రల్ని సృష్టించవచ్చునని చైతన్య స్రవంతి రచయితలు నిరూపించారు ఇందుకోసం ఈ రచయితలు సృష్టించిన నూతన సాహిత్య పరి

కరమే చైతన్యప్రవంతి శిల్పం ఈ విధంగా ఈ రచయితలు సాహిత్యంలోకి మానవుడి అంతరంగిక ప్రపంచమనే నూతన వస్తువును, ఈ నూతన వస్తువుకు అక్షర రూపంలో బొమ్మ కట్టడానికి చైతన్య ప్రవంతి అనే నూతన సాహిత్య పరికరాన్ని అందించారు ఆ విధంగా సాహిత్య పరిధిని పద్ధతుల్ని విస్తృతంచేశారు

1V

ఈ తరహా సాహిత్యానికి సిగ్మండ్ ఫ్రాయిడ్ ప్రతిపాదించి ప్రచారం చేసిన మనోవిశ్లేషణా సిద్ధాంతాలకు చాలా దగ్గరి సంబంధం ఉందని పలువురు విమర్శకులు భావిస్తారు కాని ఒక ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఈ తరహా సాహిత్యాన్ని సృష్టించిన రచయితలెవరూ తమ మీద ఫ్రాయిడ్ సిద్ధాంతాల ప్రభావం వుందని ఎక్కడా చెప్పలేదు ఫ్రాయిడ్ విశ్లేంచిన విషయమూ - ఈ రచయితలు చిత్రించడానికి ప్రయత్నించిన విషయమూ - ఇంచుమించు రెండూ ఒక్కటే కాబట్టి, ఫ్రాయిడ్ తన సిద్ధాంతాల్ని ప్రచురించాకే ఈ రచయితల రచనలు బయటకొచ్చాయి కాబట్టి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, ఫ్రాయిడ్ మనోవిశ్లేషణా సిద్ధాంతాలు ఈ తరహా సాహిత్యాన్ని ప్రభావితం చేశాయని ఒప్పుకోక తప్పదు అందువల్ల ఫ్రాయిడ్ మనోసిద్ధాంతాల్ని క్లుప్తంగా తెలుసుకునే ప్రయత్నం చేద్దాం

ప్రతి మానవుడిలోను 'సుప్తచేతన' అనే ఒక బలమైన మానసిక కేంద్రం ఉంటుందని, దీని స్వరూప స్వభావా లేమిటో మనకు మామూలుగా తెలీదని, యాదృచ్ఛికంగా మానవుని ప్రవర్తనలో కనిపించే కొన్ని వైపరీత్యాలను, లేక నిద్రపోతున్నప్పుడు వాళ్ళు కనే కొన్ని కలల్ని విశ్లేషించటం ద్వారా మాత్రమే ఈ సుప్తచేతనను గూర్చి తెలుసుకోవచ్చునన్నది ఫ్రాయిడ్ సిద్ధాంతాల్లో కల్లా ముఖ్యమైంది ఈ విషయాన్నే ఇంకాస్త వివరంగా తెలుసుకుందాం

మానవుడి చేతన లేక ఇంకా స్పష్టతకోసం మనస్సు అందాం – ఈ మనస్సులో మూడు అరలుంటాయి అన్నింటి కంటె కింద ఉండేది సుప్తచేతన-

మధ్యంలో ఉప చేతన—పైన చేతన అంటే మన జాగ్రదవస్థ సుప్తచేతనలో ఏముందో మనకు తెలియదు—అదొక అంధకార బంధురమైన ప్రపంచం కాని సుప్తచేతనలో సంచరిస్తున్న అవతారాలే ఉపచేతనలో—ఉపచేతన అంటే మనం నిద్రలో ఉండే దశ-నిద్రపోతున్నప్పుడు మనకు ఎన్నో కలలొస్తాయి ఈ కలలేమిటి ? సుప్తచేతనలో మనకు తెలియకుండా సంచారం చేస్తున్న వివిధ శక్తులే మనకు ఉపచేతనలో కలల రూపంలో దర్శనమిస్తాయి ఈ కలల్ని అర్థం పర్థం లేనివని కొట్టెయ్యటానికి వీల్లేదంటాడు ఫ్రాయిడ్ అంధకారబంధురమైన సుప్త చేతన మీద కొంచెం వెలుగును ప్రసరింపజేసేవి ఈ కలలే – సుప్తచేతన అనే గదికి తాళం వేశారనుకుందాం—ఈ తాళాన్ని తీసి గదిలోకి ప్రవేశించటానికి కావలసిన తాళపు చెవి లాంటిది ఈ ఉపచేతన ఉపచేతనలో దర్శన మిచ్చే కలలు, అలాగే జాగ్రదవస్థలో కూడా మనం చేసే కొన్ని యాదృచ్ఛికమైన పొరపాట్లు, మాటల్లో తడబాట్లు కూడా సుప్తచేతనను అర్థం చేసుకోవటానికి తోడ్పడతాయంటాడు ఫ్రాయిడ్

సభ్య ప్రపంచం అంగీకరించని అనేక శక్తులు సుప్తచేతనలో వుంటాయి ముఖ్యంగా లైంగికపరమైన కోరికలు, ఆలోచనలు అక్కడ చోటు చేసుకుంటాయి సభ్యప్రపంచం అంగీకరించదు కాబట్టే మనం వాటిని బలవంతంగా లోపలికి నెట్టేస్తాం కాని నిద్రపోయిన స్థితిలో మనలోని నిషేధపు యంత్రాంగం (సెన్సారింగ్ మెకానిజమ్) తన శక్తిని కోల్పోతుంది ఆ స్థితిలో సుప్త చేతనలో దాక్కున్న మనలోని కోర్కెలు కలల రూపంలో ఉప చేతనలోకి ప్రవేశిస్తాయి అయితే ఈ కలలు కూడా స్పష్టంగా ఉండవు మన కోరిక ఉన్న దున్నట్టుగా కలల రూపంలో ప్రవేశించదు ఎందుకంటే నిద్రపోతున్నప్పుడు సెన్సారింగ్ మెకానిజం కొంత సడలినా పూర్తిగా పోయిందనికి చెప్పడానికి వీలులేదు ఉదాహరణకు సభ్య సమాజం అంగీకరించని కోరిక ఒక

టుంది - ఒక స్త్రీకి ఒక పురుషుడి మీద లైంగిక వాంఛ కల్గింది ఆ కోరిక వెంటనే సుప్త చేతనలోకి వెళ్ళి పోయింది ఆ కోరిక ఆ స్త్రీ నిద్రపోయిన స్థితిలో ఉపచేతనలో ప్రవేశిస్తుంది కాని సరిగ్గా ఆ పురుషుడితో తాను కల్సుకున్నట్టుగా ఆ కల ఉండదు ఈ కోరిక అనేక మారు రూపాలతో అనేక సంకేతాలతో కలలో అస్పష్టంగా కనిపిస్తుంది దీనిని డ్రీమ్ సింబాలిజమ్ అంటాడు ఫ్రాయిడ్ అయితే సభ్య సమాజం అంగీకరించని కోరికను బలవంతంగా అణచివేసుకున్న ఆ స్త్రీ జాగ్రదవస్థలో చాలా విచిత్రంగా ప్రవర్తించవచ్చు ఇదే హిస్టీరియా లాంటి మానసిక వ్యాధులకు దారి తీయ వచ్చు అయితే ఒక అనుభవజ్ఞుడైన మానసిక శాస్త్రవేత్త ఆమె కలల్ని విశ్లేషించడం ద్వారా ఆమె సుప్తచైతన్యాన్ని తెల్సుకుని ఆమె జబ్బుని నయం చెయ్యగల్గుతాడు ఇలా సుప్తచేతన, ఉపచేతన, చేతన—మనస్సు యొక్క ఈ మూడు అరల్ని—ఈ అరల్లో కలగా పులగంగా తలెత్తుతుండే కోరికల్ని, ఆలోచనల్ని, సంకేతాల్ని, జ్ఞాపకాల్ని విశ్లేషించే పద్ధతిని ఫ్రాయిడ్ ప్రచారం చెయ్యటంతో పాత్రల మనస్సంచారాల్ని చిత్రించాలని ప్రయత్నించే రచయితల్ని ఈ పద్ధతులు ఎంతో ఉత్తేజితుల్ని చేశాయి

## V

ప్రతి గొప్ప రచయిత కూడా మానవ జీవితం యొక్క ఏదో ఒక భాగాన్ని సాధ్యమైనంత వాస్తవికంగా చిత్రించాలని తద్వారా తనను చదివిన పాఠకునికి ఒక కొత్త అనుభవాన్నివ్వాలని ప్రయత్నిస్తాడు అతి క్లిష్టమైన మానవ మనస్సంచారాన్ని చిత్రించాలన్న కొందరి రచయితల తపనే చైతన్య స్రవంతి నవలకు దారి తీసింది మనస్సు యొక్క మూడు రూపాలైన చేతన, ఉపచేతన, సుప్తచేతన—ఈ మూడింటిని వివిధ కోణాల్లో ఫోటోగ్రాఫ్ చెయ్యాలి అప్పుడే నిజమైన మానవుడిని అర్థం చేసుకున్నట్టవుతుంది బయటకు కనిపించేది నిజం కాదు ఈ లోపలి ప్రపంచమే నిజమైన ప్రపంచం

ఈ చేతన, ఉపచేతన, సుప్తచేతన మధ్య స్పష్టమైన సరిహద్దులు లేవు ఈ మూడు కలగాపులగంగా, గజిబిజిగా కలసిపోయాయి ఈ మూడింటి సమాహార రూపమైన చైతన్యం ఒక గొలుసుకట్టుగా కాకుండా ఒక ప్రవాహంలా సాగుతుంది ఈ ప్రవాహం కూడా ఎప్పుడూ ఒకే దిశలో పయనించదు భూత భవిష్యత్తు వర్తమాన కాలాల సరిహద్దులు కూడా చెరిగిపోతాయి ఈ ప్రవాహం భవిష్యత్తు నుండి భూతకాలంలోకి, వర్తమానకాలం నుండి భూత భవిష్యత్ కాలాల్లోకి అవిచ్ఛిన్నంగా ప్రవహించవచ్చు మనస్సు పొందే అనేక ప్రేరణలకు, స్పందనలకు ఒక స్పష్టమైన రూపం ఉండకపోవచ్చు అలాగే మనస్సు పొందే వివిధ గతులు, వివిధ స్థితులు విచిత్రంగా ఉంటాయి మనస్సు పొందే అనుభూతులు, ఆలోచనలు చిత్ర విచిత్రంగా ఉంటాయి కొన్ని గొప్పవి, కొన్ని చెత్తవి, కొన్ని ఉదాత్తమైనవి, కొన్ని అసహ్యకరమైనవి, కొన్ని సభ్యమైనవి, మరికొన్ని అసభ్యమైనవి ఈ మనస్సు కొన్నిసార్లు హిమాలయ శిఖరాల్లో విహరిస్తే మరుక్షణంలో పసిఫిక్ మహాసముద్రంలోకి పడిపోతుంది ఇలా అవిక్లిష్టంగా, గజిబిజిగా, గందరగోళంగా ఉండే మనస్సంచారాన్ని మాటల రూపంలోకి అనువదించటం అంత సులభమైన విషయం కాదు అసలు పూర్తిగా సాధ్యం కూడా కాదేమో అయినా కొందరు రచయితలు మానవుడి మనస్సంచారాన్ని బొమ్మకట్టి చూపించాలని ప్రయత్నించారు అందుకోసం వాళ్ళు కొన్ని ప్రత్యేకమైన సాహిత్య పరికరాలను సృష్టించారు

రచయిత అయినవాడు ఇంత సంక్లిష్టమైన మనస్సంచారాన్ని చిత్రించే ప్రయత్నం చేసి పాఠకుల్ని ఇబ్బంది పెట్టటం దేనికి ? దీనివల్ల రచయిత యేం సాధిస్తున్నాడు ? ఇందుకు సమాధానాన్ని వర్జీనియా వుల్ఫ్ ఇలా చెప్పింది

"జీవితాన్ని చూడు అప్పుడు జీవితం మన నవలల్లో చిత్రించబడినట్టు లేదనిపిస్తుంది ఒక సాధారణ మస్తిష్కాన్ని ఒక మామూలు రోజు పరీక్షించు ఆరోజు ఆ మస్తిష్కం ఎన్ని విచిత్రమైన స్పందనల్ని పొందుతుందో ! గొప్పవి, పిచ్చివి, మామూలువి, గంభీరమైనవి, ఉక్కులా కోసేసేవి నిరంతరం

కురిసే అసంఖ్యాకమైన అణువుల్లా ఈ స్పందనలు మన మస్తిష్కం మీద కురుస్తాయి ఇవే ఒక మానవుడి జీవితంలో ఒక సోమవారంగా ఒక మంగళవారంగా రూపొందుతాయి జీవితాన్ని ఇలా చూసినప్పుడు జీవితం అంటే పూర్వం ఉన్న అభిప్రాయానికి ఇప్పుడున్న అభిప్రాయానికి చాలా తేడా కనిపిస్తుంది ఇప్పుడు నవలాకారుడి దృష్టిలో ముఖ్యమైంది మానవుడి బాహ్యరూపం కాదు ఈ అంతరంగ జీవితం రచయిత నిజంగా స్వతంత్రుడైతే, బానిస కాకపోతే, తను యేది నిజమని అనుకుంటాడో, అదే రాయాలనుకుంటే సంప్రదాయం, ఆచారాలు శాసించేదే రాయాలనుకోకపోతే, తను తనలోపల పొందే అనుభూతుల ఆధారంతోటే రచనలు చెయ్యాలనుకుంటే ఆ రచయితకు చక్కగా కొన్ని అధ్యాయాలుగా విభజింపబడిన ఇతివృత్తం, హాస్యం, విషాదం, ప్రేమ లేక వినాశనం మొదలైనవేవీ పూర్వంలాగా అందరూ అంగీకరించేటట్టుగా ఉండవు జీవితం చక్కగా ఒక దానివెంట ఒకటి ఒక అందమైన పద్ధతిలో అమర్చబడిన దీపావళి కాదు జీవితం ఒక ప్రకాశవంతమైన చక్రం లాంటిది మనలో చైతన్యం జనించినప్పట్నించి అది అంతమయ్యే వరకు మనను చుట్టివేసి కనిపించి కనిపించకుండా ఉండే ఓ తెరలాంటిది జీవితం ఎంతో వైవిధ్యం కల్గి ఇంతకాలం మానవుడికి తెలియకుండా ఉన్న ఈ అనంతమైన చైతన్యాన్ని చిత్రించటం-అదెంత కష్టతరమైనా, క్లిష్టమైనా-ఒక నవలాకారుడి బాధ్యత కాదా?"[3]

మానవుడి బాహ్య రూపం నిజం కాదు అతన్ని లేక ఆమెను అర్థం చేసుకోవాలంటే వాళ్ళ లోపలి రూపాలను కూడా చూపించాలి లోపలి

3 వర్జీనియా వుల్ఫ్ రాసిన 'Modern Fiction' అన్న వ్యాసంలో 'Look with in, and life, it seems is very far from being like this ' అన్న భాగానికి స్వేచ్ఛానువాదం 'Modern Fiction' - Essay by Virginia Woolf, Collected Essays by Virginia Woolf - volume II Page No 106

ప్రపంచమే సాహిత్యానికి వేదిక కావాలి అప్పుడే రచయిత మానవ జీవితాన్ని సంపూర్ణంగా చిత్రించిన వాడవుతాడన్న ఆవేశమే చైతన్య స్రవంతి నవలకు పునాది అయ్యింది ఈ తరహా సాహిత్యం పాఠకున్ని కొంత ఇబ్బంది పెట్టాయి సాహిత్యం కేవలం వినోదం కోసమే - హాయిగా చదువుకోవటానికి మాత్రమే అనుకునే పాఠకులు ఈ తరహా సాహిత్యాన్ని ఆస్వాదించలేరు ఈ సాహిత్యం సృష్టించడానికి రచయిత ఎంత కృషి చేసాడో ఈ సాహిత్యాన్ని అర్థం చేసుకోవటానికి అందులో కొంతైనా పాఠకుడు కృషి చెయ్యవలసి ఉంటుంది ఆ మాత్రం కృషి చెయ్యటానికి పాఠకుడికి ఓపిక, సామర్థ్యం ఉంటే ఈ తరహా సాహిత్యం కూడా ఎంతో మనోరంజకంగా ఉంటుంది

## VI

ఈ ధోరణిలో రాయబడే సాహిత్యానికి-ముఖ్యంగా నవలకు చైతన్య స్రవంతి సాహిత్యం లేక నవల అన్న మాట స్థిరపడి పోయింది ఇది 'Stream of Consciousness' అన్న ఇంగ్లీష్ మాటకు అనువాదం ఇంగ్లీషులో ఈ మాటను సృష్టించిన వాడు విలియమ్ జేమ్స్ విలియమ్ జేమ్స్ 'Principles of Psychology' అన్న తన గ్రంథంలో చేతన అనేది ఒక నదీ ప్రవాహం లాంటిదని, అది ఎప్పుడు నిశ్చలంగా ఉండదని అన్నాడు

అయితే ఈ తరహా సాహిత్యాన్ని "Stream of consciousness' సాహిత్యమని పిలవటాన్ని హర్షించని రచయితలు కూడా కొందరున్నారు ఉదాహరణకు ఈ తరహా సాహిత్యానికి ఆద్యురాలని చెప్పబడె డోరతి రిచర్డ్సన్ అనే రచయిత్రి ఇలా అంది

'Stream of consciousness is a muddle headed phrase Its not a stream Its a pool, a sea, an ocean It has depth and greater depth and when you think you have reached its bottom, there is

nothing here and when you give yourself upto one current, you are suddenly possessed by another "[4]

చేతన చాలా లోతైన ఒక మహా సముద్రం లాంటిదని, దాన్ని అందుకోవటం అంత సులభం కాదని డోరతి రిచ్చర్డ్సన్ అభిప్రాయపడింది

తెలుగులో చైతన్య స్రవంతి అన్న మాటను మొట్ట మొదటిసారి వాడుకలోకి తెచ్చింది శ్రీశ్రీ యే ననుకుంటాను 1941 లో చనిపోయిన జేమ్స్ జాయిస్‌ను గూర్చి శ్రీశ్రీ ఒక రేడియో ప్రసంగం చేశాడు ఈ ప్రసంగం 1947 సెప్టెంబర్-అక్టోబర్ 'ఆంధ్ర శిల్పి' సంచికలో ప్రచురించబడింది ఈ ప్రసంగంలో శ్రీశ్రీ 'Stream of conscious' అన్న మాటకు 'చైతన్య స్రవంతి' అని పేరు పెట్టటంతో ఈ తరహా సాహిత్యానికి ఈ పేరు స్థిరపడిపోయింది

ఇక్కడే మరొక విషయాన్ని కూడా స్పష్టం చెయ్యాలి- 'చైతన్య స్రవంతి' అన్నది కేవలం ఒక నూతన శిల్పం మాత్రమే కాదు అంటే ఒక విషయాన్ని చెప్పే పద్ధతిలో కనుగొన్న మార్పు మాత్రమే కాదు ఈ ధోరణి మనకొక కొత్త విషయాన్ని కూడా ప్రవేశ పెట్టింది అదే మానవుడి చేతన చేతనను కథాకేంద్రంగా తీసుకోవటం, అనేక పద్ధతుల ద్వారా (ఈ పద్ధతులు తర్వాత చూద్దాం) ఈ చేతన పొందే వివిధ గతుల్ని చిత్రించటం చైతన్యస్రవంతి సాహిత్యంలో జరుగుతుంది కాబట్టి ఈ తరహా సాహిత్యంలో వస్తువు, శిల్పం రెండూ కొత్తవె వస్తువు నుండే శిల్పం ఉద్భవిస్తుంది ఇక్కడ కూడా జరిగిందదే- చైతన్యస్రవంతి అన్నది కేవలం ఒక శిల్పరూపం మాత్రమే అనుకోవటం చాలా పొరపాటు

4 కొలూరి శ్రీరామమూర్తి 'తెలుగు నవలా సాహిత్యంలో మనో విశ్లేషణ' లోంచి తీసుకోబడింది

కవిత్వం, నాటకం, కథ, నవల మొదలైన వివిధ సాహితీ ప్రక్రియల్లో చైతన్య స్రవంతి ధోరణిని ప్రవేశపెట్టే అవకాశం ఉన్నప్పటికి ఈ ధోరణి ఎక్కువగా నవలలకే పరిమితమైంది అందుకు ముఖ్యమైన కారణం యే ఇతర సాహితీ ప్రక్రియలకు లేని కొన్ని ప్రత్యేకమైన లాభాలు నవలాప్రక్రియకుండటమే నవల పరిధి చాలా విశాలమైంది [5] మానసిక శాస్త్రం, సాంఘికశాస్త్రం మొదలైన వైజ్ఞానిక రంగాల్లో మానవుడు కనుక్కున్న అనేక నూతన విషయాలకు కళారూపం ఇవ్వటంలో నవల విజయవంతమైనట్టుగా మరే సాహితీ ప్రక్రియ కాలేదు చైతన్య స్రవంతి నవల ఇందుకొక ముఖ్యమైన ఉదాహరణ

## VII

ఆద్యంతాలు అన్న ఒక క్రమం లేకుండా భూత భవిష్యత్ వర్తమాన కాలాల్లోకి యథేచ్ఛగా ప్రవహించె పాత్రల చైతన్యాన్ని చిత్రించే సాహిత్యాన్ని చైతన్యస్రవంతి సాహిత్యమనవచ్చునని పై వివరణ వల్ల స్పష్టమౌతున్నది ఈ

5 From 'A Reader's Guide to Great Twentieth Century English Novels' by Fedrick R Karl and Magalaner Page No 3 "As a social and moral document as well as a contained artform, the novel from Cervantes' 'DON QUIXOTE" through Joyce's 'ULYSSES' has responded more quickly and fully to new ideas than any other literary genre Accordingly the 20th century novel following the rapid introductions of new modes of thoughts in psychology, natural science and sociology has reacted boldly to absorb and transform this material into literary communications

చైతన్యం చాలా గజిబిజిగా ఉంటుంది మామూలు మాటల్లో చెప్పలేనివిగా ఉంటుంది మన మనస్సుల్లో కల్గుతున్న ఇలాంటి భావాలకు అక్షర రూపం ఇచ్చేటప్పటికి వాటి స్వరూపం మారిపోతుంది అక్షరరూపం ఇచ్చేటప్పటికి వాటికొక స్పష్టత వస్తుంది అసభ్యమైన ఆలోచనలు సభ్యమైనవిగా మార్తాయి అందువల్ల చైతన్య ప్రవంతి సాహిత్యాన్ని సృష్టించే రచయిత రెండు ముఖ్యమైన సమస్యల్ని ఎదుర్కొంటాడు

ఒకటి ఒక మనిషి మనస్సు లోపలి పొరల్లోని ఆలోచనలేమిటో తెల్సుకోవటం ఎలా ? రెండు అతి సంక్లిష్టమైన యీ ఆలోచనలకు అక్షర రూపం ఇవ్వటం ఎలా ? ఈ రెండు సమస్యల్ని ఈ తరహా సాహిత్యం సృష్టించిన రచయితలెలా పరిష్కరించుకున్నారో చూద్దాం-

మొదట ఒక మనిషి యొక్క ఆలోచనా ధోరణి- యే దాపరికం లేకుండా నిజంగా ఎలా ఉంటుందో తెలుసుకోవటానికి రచయితలు తమ మనస్సునే కేంద్రంగా చేసుకుని తమకు తామే వేరొక మనిషిలా విశ్లేషించుకున్నారు మన లోపలి ఆలోచనలేమిటో మన మనస్సు ఎంత విపరీతంగా, వికారంగా, ఎంత అద్భుతంగా, ఎంత ఉదాత్తంగా ఎంత నీచంగా, ఎంత అసభ్యంగా ఆలోచించగలదో మనకంటె బాగా మరెవ్వరికీ తెలీదు. ఇలాంటి మనస్సును బొమ్మ కట్టాలంటే ఒక రచయితకు తన మనస్సే ముఖ్యమైన ముడిసరకు తనను తాను నిర్దాక్షిణ్యంగా వేరొకనిలా విశ్లేషించుకున్నప్పుడే ఒక రచయిత ఈ తరహా సాహిత్యాన్ని సృష్టించగలడు అందుకే ఈ సాహిత్యానికి ఎక్కువగా రచయితల ఆత్మకథలతో దగ్గరి సంబంధం ఉంటుంది రచయిత నిజజీవితంలో సంఘటనలు, వ్యక్తులు, ప్రదేశాలు ఈ తరహా సాహిత్యంలో ఎక్కువగా చోటు చేసుకుంటాయి అందుకని ఈ తరహా సాహిత్యం మనకు అర్థం కావాలంటే ఆ రచయిత వ్యక్తిగత జీవితాన్ని గూర్చి మనకు క్షుణ్ణంగా తెలిసి ఉండాలి జేమ్స్ జాయిస్ సృష్టించిన సాహిత్యం నిండా ఆయన నిజ జీవితంలో జరిగిన సంఘటనలు, ఆయన కలుసుకున్న వ్యక్తులు ఆయన తిరిగిన ప్రదేశాలు చోటు చేసుకున్నాయి కాబట్టి

ఈ తరహా సాహిత్యంలో రచయిత తనకు బాగా తెలిసిన వ్యక్తులనే పాత్రలుగా, ముఖ్య పాత్రకు తననే ఆధారం చేసుకుని సృష్టించటం జరుగుతుంది అలా జరిగినప్పుడే పాత్రల మనస్సుల అంతరాంతరాల్లోకి వెళ్ళి రచయిత అక్కడ జరుగుతున్నదేమిటో పాఠకుల ముందుంచగల్గుతాడు

## VIII

ఇప్పుడు ఈ తరహా సాహిత్యాన్ని సృష్టించే రచయిత ఎదుర్కొనే రెండో సమస్యను ఎలా పరిష్కరించుకున్నాడో చూద్దాం

మన లోపలి ప్రపంచం పొందే ప్రేరణలు, స్పందనలు, జ్ఞాపకాలు, గత స్మృతులు, ఊహలు, ఇన్‌ట్యూషన్స్, భావాలు, అనుభూతులు - స్పష్టాస్పష్టంగా కలగాపులగంగా ఉండే వీటన్నిటికి అక్షరరూపం ఇవ్వటానికి రచయిత యేం చేస్తాడు?

ఇంగ్లీషులో 'ఫ్రీ అసోసియేషన్' అనే మాటుంది దీనిని ముక్తానుషంగా అని అనువదించవచ్చుననుకుంటాను బయట ప్రపంచం కల్గించిన చిన్న ప్రేరణ మన మనస్సు అనే సరస్సులో ఎన్నో అలల్ని సృష్టిస్తుంది ఈ ప్రేరణ ఒక జ్ఞాపకానికి దారితీయవచ్చు ఆ జ్ఞాపకం ఎన్నో దృశ్యాల్ని, ఎందరో వ్యక్తుల్ని, ఎన్నో మాటల్ని మన మనఃఫలకం మీదికి రప్పిస్తాయి ఇవి మన మనఃఫలకం మీదికి ఎలా వస్తున్నాయో అలాగే వెంట వెంటనే యే దాపరికం లేకుండా బయటకు చెప్పటాన్నే ఫ్రీ అసోసియేషన్ అంటారు ఫ్రాయిడ్ మనో విశ్లేషణా సిద్ధాంతంలో ఈ ఫ్రీ అసోసియేషన్‌కు చాలా ప్రాముఖ్యం ఉంది ఒక మానసిక రోగి మనస్సులో— ముఖ్యంగా అతని సుప్తచేతనలో యేముందో తెలుసుకోవటానికి ఆ రోగిని హాయిగా ఉండె ఓ పక్కమీద పడుకోబెట్టి అతని బుర్రలోకి యే ఆలోచన వస్తే దాన్ని చెప్పేయ్యమంటారు అలా మాట్లాడుతున్నప్పుడు ఓ అనుభవజ్ఞుడైన మానసిక వైద్యుడు ఆ రోగి సుప్తచేతనలో పని చేస్తున్న గుర్తేమిటో తెలుసుకొని ఆ రోగికి మానసిక ఆరోగ్యాన్ని చేకూర్చగల్గుతాడు సరిగ్గా

ఇలాగే తన పాత్రల మనస్సుల్ని శోధించటానికి రచయితలు కూడా తమ పాత్రల ఫ్రీ అసోసియేషన్ని ఆధారం చేసుకున్నారు చైతన్యస్రవంతి సాహిత్యంలో ఫ్రీ అసోసియేషన్‌కున్న ఈ ప్రాముఖ్యాన్ని దృష్టిలో పెట్టుకునే రాంభట్ల కృష్ణమూర్తి గారు ఈ తరహా సాహిత్యాన్ని నిర్వచించారు

''బాహిర జగత్ సంపర్కం వల్ల మనస్సులో ఏర్పడే ముక్తానుషంగాల ప్రవాహాన్ని సాహిత్య రూపకంగా నమోదుచేసే పద్ధతిని ఇప్పుడు చైతన్యస్రవంతి అని పిలుస్తున్నారు [6]''

ముక్తానుషంగం అంటే ఎలా ఉంటుందో తెలుసుకోవటానికి ఒక ఉదాహరణ నేను రాసిన అథోలోకం అన్న కథ ఇలా ప్రారంభమౌతుంది

''అబ్బబ్బ ఎంత అసహ్యకరమైన చప్పుడు. నీకే ఉందా కారు, అంత భయంకరమైన హారన్ పెట్టుకోవటానికి? 'కాంట్యూ ఎనౌన్స్ యువర్ కమింగ్ లైకె జంటిల్మన్ సర్!' అన్నాడు ఏ జి గార్డెనర్ చిన్ననాడు చదువుకున్నదేదీ వెంటనే మరచిపోయే గొప్ప అలవాటు మనకు లేదన్నమాట! మన జ్ఞాపకశక్తి అద్భుతం అందుకే బోలెడంత చెత్త ఎప్పుడూ ఈ బుర్రలో మెదుల్తుంటుంది అనవసర విషయాల్ని జ్ఞాపకం పెట్టుకోవటం అందువల్ల అరిష్టాలు ఎవరో ఎక్కడో రాయగా చదివినట్టు జ్ఞాపకం మాలతిచందూర్ ప్రమదావనంలో. ఆంధ్రప్రభ ఇప్పుడు పూర్తిగా ఆడవాళ్ళ పత్రికయి పోయిందేమిటి?''

అథోలోకం కథలో నాయకుడు అతని పేరేమిటో కూడా రచయిత మనకు చెప్పడు అతడు బజార్లో పోతున్నాడు కారు హారన్ అతన్ని డిస్టర్బ్ చేసింది ఎప్పుడో చదువుకున్న ఏ జి గార్డెనర్ వ్యాసంలోని ఓ వాక్యం గుర్తొచ్చింది దాంతో మాలతిచందూర్ రాసిన మరో వ్యాసంకూడా అతని మనస్సులో

6 చూ॥ రాంభట్ల కృష్ణమూర్తి నవీన్ కథల సంపుటి 'లైఫ్ ఇన్ ఎ కాలేజీ'కి 'ముక్తానుషంగం' పేరుతో రాసిన ఉపోద్ఘాతం

మెదిలింది ఆ తర్వాత 'ఆంధ్రప్రభ' వారపత్రికలో ఎక్కువ మంది ఆడవాళ్ళే రాస్తున్నారన్న విషయం గుర్తొచ్చి ఆ పత్రిక పూర్తిగా ఆడవాళ్ళ పత్రికయి పోయిందేమిటని ప్రశ్నించుకున్నాడు ఇలా ఒకదాన్నుండి మరొకదానికి దారి తీస్తూ ఇందులోంచే ఒక కథ పుడుతుంది ఆ కథ మామూలు కథల్లాకాకుండా పాత్ర మనస్సును చిత్రించేదిగా ఉంటుంది

పాత్ర ముక్తానుషంగాన్ని పాఠకుడి ముందు పెడుతున్నప్పుడు రచయిత మధ్యమధ్యలో కల్పించుకోడు పూర్వపద్ధతిలో అయితే తన నవలలోని పాత్రలకు పాఠకులకు మధ్య రచయిత ఉంటాడు తన పాత్రల్ని, వాళ్ళ గుణగణాల్ని, వాళ్ళ రూపాన్ని, వేషాన్ని పాఠకులకు వివరంగా చెబుతాడు మధ్యమధ్య తన పాత్రలు అలా ఎందుకు ప్రవర్తించవలసి వచ్చిందో వివరిస్తాడు జీవితాన్ని గూర్చి వ్యాఖ్యానాలు చేస్తాడు పాఠకులకు యేది చెప్పాలో ఏది చెప్పకూడదో రచయితే నిర్ణయించి ఆ ప్రకారంగా కథను నడిపేవాడు

చైతన్య స్రవంతి పద్ధతిలో రచయిత పాఠకులకు ఇంతగా సహాయపడటం ఉండదు పాఠకులు తమంతట తాముగా తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉంటాయి పాత్ర పేరేమిటి ? అతడెలా ఉంటాడు ? ఎక్కడ పుట్టాడు? ఎక్కడ పెరిగాడు ? మొదలైన అంశాలన్ని అతని ముక్తానుషంగంలో దొర్లుతున్న అంశాలను బట్టి పాఠకుడే తెలుసుకోవాలి పాత్రకు పాఠకుడికి మధ్య ఒక ప్రత్యక్ష సంబంధం కల్పించబడుతుంది రచయిత పక్కకు తప్పుకుంటాడు ఈ లోకాన్ని సృష్టిస్తున్నవాడు భగవంతుడనుకుంటే మనకు అతని సృష్టే కనిపిస్తుంది గాని అతడెక్కడా కనిపించడు అలాగే రచయిత కూడా-అతడు సృష్టిస్తున్న సాహిత్యమే కనిపిస్తుంది గాని అతడెక్కడా కనిపించడు [7]

7 జేమ్స్‌జాయిస్ రాసిన 'Portrait of an Artist as an young man' అన్న నవలలో నాయకుడు స్టెఫెన్ డెడ్లస్ తన సాహిత్య సిద్ధాంతాన్ని వివరిస్తూ ఇలా అంటాడు
"The artist like God of creation remains within or behind or above his handiwork, Invisible refined out of existence, indifferent paring his fingernails"

## IX

పాత్రల ముక్తానుషంగాన్ని చిత్రించటానికి చైతన్యస్రవంతి రచయితలు అనేక పద్ధతుల్ని సృష్టించుకున్నారు అందులో ముఖ్యమైనవి

1 ఆంతరిక స్వగతాలు
2 రచయిత సర్వజ్ఞత్వం
3 చలనచిత్రాల్లో వాడే టెక్నిక్‌లు
4 యాంత్రిక విధానాలు
5 వాక్సంబంధమైన విధానాలు

1 ఆంతరిక స్వగతాలు ఆంతరిక స్వగతాలు లేక ఆంతరిక భాషణం (Interior monologue) చైతన్య స్రవంతి సాహిత్యంలో చాలా ప్రముఖ పాత్ర వహిస్తాయి స్వగతం అనేది నాటకాల్లో చాలా కాలంనుండే అమల్లో ఉంది తమ పాత్రలు లోపల యేమనుకుంటున్నారో చెప్పటానికి నాటక రచయితలు స్వగతాల్ని వాడేవాళ్ళు షేక్స్పియర్ నాటకాల్లో ఇవి సుదీర్ఘంగా సాగేవి అయితే చైతన్యస్రవంతి సాహిత్యంలో కనిపించే స్వగతాలకు, పూర్వపు నాటకాల్లో కనిపించే స్వగతాలకు చాలా తేడా ఉంటుంది నాటకాల్లో ఉండేవి స్వగతాలైతే చైతన్యస్రవంతిలో ఉండేవి ఆంతర స్వగతాలు నాటకాల్లోని స్వగతాలు ప్రేక్షకుల కోసం ఉద్దేశించబడినట్టివి స్పష్టంగా ఒక క్రమ పద్ధతిలో ఉంటాయి చైతన్య స్రవంతిలో రచయిత ఈ స్వగతాల్ని పాత్రం ఉపచేతనను, సుప్తచేతనను ప్రదర్శించటానికి ఉపయోగిస్తాడు కాబట్టి ఇవి గజిబిజిగా, క్రమం లేకుండా, గందరగోళంగా ఉంటాయి మన లోపల ఉత్పన్నమయ్యే కొన్ని ఆలోచనలను బయటికి చెప్పాలనుకున్నప్పుడే వాటికి భాషారూపం ఇవ్వవలసి ఉంటుంది అప్పుడే వాటికొక స్పష్టత, క్రమపద్ధతి యేర్పడతాయి ఒక ఆలోచనకు భాషా రూపం ఇచ్చేటప్పటికే దాని స్వరూపం మారిపోతుంది ఎదుటి వ్యక్తి వింటాడు కాబట్టి ఆ ఆలోచన ప్రప్రథమ స్వరూపాల్ని కొంతమార్చి దాన్ని సభ్యసమాజం అంగీకరించేలా సంస్కరించి చెప్పవలసి ఉంటుంది కాని చైతన్యస్రవంతి

సాహిత్యంలో ఆ ఆలోచన యొక్క ప్రప్రథమ స్వరూపమే కావాలి అలా అయితేనే ఆ పాత్రయొక్క నిజరూపాన్ని అర్థం చేసుకోవటానికి వీలౌతుంది అందువల్ల ఒక ఆలోచన యొక్క ప్రప్రథమ రూపమే అంటే దానికి భాషా రూపం ఇచ్చి బయటకు చెప్పటానికి ముందే అంటే ఆ ఆలోచన యొక్క వాక్పూర్వ దశనే ఆంతరిక స్వగతంగా చెప్పే ప్రయత్నం ఈ తరహా సాహిత్యంలో జరుగుతుంది

ఆంతరిక స్వగతాల్ని మళ్ళీ రెండు భాగాలుగా విభజిస్తారు ఒకటి ప్రత్యక్ష ఆంతరిక స్వగతం రెండు పరోక్ష ఆంతరిక స్వగతం

పాత్ర మనసులో ఉత్పన్నమౌతున్న ఆలోచనల వాక్పూర్వదశను రచయిత మధ్యలో తను జోక్యం చేసుకోకుండా పాఠకుల ముందుంచటాన్ని ప్రత్యక్ష ఆంతరిక స్వగతం అంటారు ఉదాహరణకు 'అంపశయ్య' నవలలోని ఈ భాగాల్ని గమనించండి

"లావెటరి గోడల మీద బూతుబొమ్మ లెందుకు? ఓ పుస్తకం రాసిపారేస్తే ''ఆంధ్రపరదేశ సాహిత్య అగాథమి'' ఓ ఎవార్డు పారేస్తుందేమో! ఔను ఎంత వండర్‌ఫుల్ టైటిల్ ''లావెటరీలమీద బూతుబొమ్మలెందుకు?' ఓ లక్ష కాపీలు అమ్ముడుపోతుంది ఎమ్మెస్కోవాళ్ళు పాకెట్ బుక్‌గా వేస్తే బయటకొచ్చాడు స్విచ్ ఆన్ చేశాడ -బాత్‌రూం బాత్‌రూంలో గమ్మత్తైన వాసన-వాష్ బేసిన్‌లో కాస్త మొహం కడుక్కొని వెడ్తే నిద్రమబ్బు వదుల్తుందేమొ' అబ్బ-అంత ఓపికే? నిద్ర ముంచుకొస్తున్నది రూం కెడదాం-మళ్ళా పడుకోవటమా ? అసహ్యంగా ఉంటుంది-పరమ అసహ్యంగా ఉంటుంది ట్యూబ్‌లైట్ స్విచ్ ఆఫ్ చేశాడు-ఇంతకుముందు ఆన్ చేశాడు - ఏమిటో పిచ్చి - స్విచ్ చూసినప్పుడల్లా ఆన్ చెయ్యటం ఆఫ్ చెయ్యటం ఆన్ చెయ్యటం ఆఫ్ చెయ్యటం '

ఇదంతా నవలలోని ముఖ్య పాత్రయొక్క ఆంతరిక స్వగతం రచయిత ఎక్కడా జోక్యం చేసుకున్నట్టు కనిపించడు పాత్ర మనస్సులోని ఆలోచనల్ని ప్రత్యక్షంగా మనకు చూపించాడు వాటినిబట్టి పాత్ర మనసులోని ఉపచేతన

ఎలా పనిచేస్తున్నదో పాఠకుడు కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే అర్థంచేసుకో గలడు జేమ్స్ జాయిస్ రచన 'యులీసెస్' లోని చివరి భాగంలో మిసెస్ మోలీబ్లూమ్ యొక్క చైతన్య స్రవంతిని ఎలాంటి విరామచిహ్నాలు లేకుండా రచయిత పాఠకుల ముందు పెట్టాడు - ప్రత్యక్ష ఆంతరిక స్వగతానికి ఈ భాగాన్ని గొప్ప ఉదాహరణగా పేర్కొనవచ్చు 'అంపశయ్య'లోని చివరి నాలుగైదు పేజీలు కూడా ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు

పరోక్ష ఆంతరిక స్వగతంలో రచయిత అప్పుడప్పుడు పాఠకులకు కొంచెం సహాయపడ్తాడు - ఉదాహరణకు అంపశయ్యలోని ఈ క్రింది భాగాలను చూడండి

''గొప్ప వేగంతో రాసుకుపోతున్నాడు రవి
తలుపు చప్పుడు గుర్నాథంగాడు

"హలో రవీ ! యేం చేస్తున్నావు ? యేదన్నా రాస్తున్నావా ? నోట్స్ ప్రిపేర్ చేస్తున్నావా ? నాక్కూడా ఇవ్వవా?''

గుర్నాథం పళ్ళికిలించాడు గుప్పుమని యేదో పాడువాసన రవిని ఉక్కిరి బిక్కిరి చేసింది డర్టీఫెలో-డిస్టర్బ్ చేశాడు అలా రాస్తూ ఎన్ని గంటలైనా తనసితాను మరచిపోయేవాడు నిజంగా ఇలా రాయటం ఎంత రిలీఫ్‌నిస్తుందో- పొను-తాను వెళ్ళిపోవాలనుకున్నాడు కదూ? '

పై భాగంలో "గొప్ప వేగంతో రాసుకుపోతున్నాడు రవి'' అన్న చోట, గుర్నాథం గదిలో కొచ్చాడని చెప్పినచోట, గుర్నాథం పళ్ళికిలించినప్పుడు ఏదో పాడు వాసన రవిని ఉక్కిరిబిక్కిరి చేసిందని చెప్పినచోట రచయిత జోక్యం కనిపిస్తుంది అయితే వెంటవెంటనే పాత్ర ఆంతరిక స్వగతం ఉంటుంది ఇలా రచయిత మధ్యలో కల్పించుకుంటూ పాత్ర ఆంతరిక స్వగతాన్ని చిత్రించే పద్ధతిని పరోక్ష ఆంతరిక స్వగతం అంటారు

2 రచయిత సర్వజ్ఞత్వం రచయిత సర్వజ్ఞత అనేది సాంప్రదాయ సాహిత్యంలోను ఉంటుంది ఈ తరహా సాహిత్యంలోను ఉంటుంది రచయిత సర్వజ్ఞత అంటే తన రచనకు అందులోని పాత్రలకు సంబంధించిన-తవరకు రచయితకే అన్ని విషయాలు తెలుసుననుకోవటం - రచయిత అన్నిచోట్లా ఉంటాడు-అన్ని విషయాలు అతనికే తెలుసు-రచనకు సంబంధించినంతవరకు రచయిత సర్వాంతర్యామి - సర్వజ్ఞుడు - అయితే సాంప్రదాయ సాహిత్యంలో రచయిత ప్రతిచోట కనిపిస్తాడు - కథ చెప్పేది రచయితే అనే విషయం మనకు పదే పదే గుర్తొస్తుంటుంది కాని చైతన్యస్రవంతి రచనలో రచయిత చాలా తక్కువగా కనిపిస్తాడు-ఏ సాహిత్యమైనా రచయిత సర్వజ్ఞుడైనప్పుడే సృష్టించ బడుతుంది ఒక పాత్ర మనస్సులోపలి పొరల్లో యేం జరుగుతున్నదో ఈ రచయితకేం తెలుసు? ఆ పాత్ర ఆలోచనలు సరిగ్గా అలాగే ఉన్నాయని ఈయనకేం తెలుసు అని మనం అడగటానికి వీల్లేదు - అవి ఎంతవరకు వాస్తవికంగా ఉన్నాయన్న విషయాన్ని గూర్చి మాత్రమే మనం చర్చించవచ్చు ఇంతకుముందే చెప్పినట్లు ఈ తరహా సాహిత్యంలో రచయిత తననుతానే ఒక పాత్రగా మలచుకొని వాస్తవికతను పోషించటానికి పాటుపడ్డాడు ఇదే విషయాన్ని మరోలా చెప్పాలంటే ఆత్మాశ్రయమైన ఇతివృత్తానికి వస్త్వాశ్రయరూపం ఇవ్వటానికి రచయిత ప్రయత్నిస్తాడు (Objective Presentation of subjectivity)

3 చలన చిత్రాల్లో వాడే టెక్నిక్‌లు సినిమాల్లో వాడే కొన్ని టెక్నిక్‌లను ఈ తరహా నవలల్లో విరివిగా వాడుకోవటం జరుగుతుంది అందులో కొన్ని

ఫ్లాష్‌బ్యాక్ అంటే పాత్ర మనసు అకస్మాత్తుగా గతం వైపు మళ్ళటాన్ని చిత్రించే పద్ధతి

క్లోజప్ అంటే ఒక పాత్రను కేంద్రంగా తీసుకొని ఆ పాత్ర మనస్సంచారాన్నే క్షుణ్ణంగా ప్రదర్శించటం

ఫేడవుట్ అకస్మాత్తుగా ఒక ఆలోచన అంతమై అందుకు భిన్నమైన మరొక ఆలోచన చోటు చేసుకోవటం

పనోరమా పాత్రను అన్ని దిక్కుల నుండి చూపించటం

మాంటెజ్ మనసు మీద పడే రెండు పూర్తి విరుద్ధమైన ఒకదానితో ఒకటి సంబంధంలేని అంశాలను పక్కపక్కనే ప్రదర్శించటం

మల్టిపుల్ వ్యూ . ఒకేసారి మనస్సులోని వివిధ భావాలను అంటే చేతన, ఉపచేతన, సుప్తచేతనలను ఒకదాని వెనుక మరొకదానిని చూపించటం

కటింగ్ ఒక దృశ్యాన్ని అకస్మాత్తుగా ఆపెయ్యటం

సినిమాల్లో వాడబడే ఈ టెక్నిక్స్‌ని తమ రచనల్లో విరివిగా వాడటం ద్వారా చైతన్య స్రవంతి రచయితలు చిత్రణకు అసాధ్యమైన మనస్సంచారాన్ని చిత్రించగల్గారు

4 యాంత్రిక విధానాలు విరామ చిహ్నాలైన ఫుల్‌స్టాప్ కామా మొదలైన వాటిని తొలగించటం ద్వారానో లేక కొన్ని మాటల్ని విచిత్రమైన పద్ధతుల్లో ప్రింట్ చెయ్యటం ద్వారానో రచయిత తను అనుకున్న ప్రయోజనాన్ని సాధించటాన్ని యాంత్రిక విధానాలంటారు

5 వాచక విధానాలు రచనలో కొన్ని ప్రత్యేకమైన వాచకవిధానాల ద్వారా పాత్రల చైతన్యం ఎలా ప్రవహిస్తున్నదో వివరించవచ్చు పాత్రం మనసులో కొన్ని మాటలు ప్రత్యేకంగా చోటు చేసుకోవటం లేక ఒక మాట మరో మాటలో కలిసిపోవటం మొదలైన వాటిని వాచక విధానాలంటారు జాయిస్ రచించిన 'ఫెన్నిగన్స్‌వేక్' లో ఇలాంటి ప్రయోగాలు చాలా విరివిగా చేశాడంటారు 'అంపశయ్య' నవలలోని చివరి భాగంలో కూడా ఈ పద్ధతిని ఉపయోగించటం జరిగింది పాత్రల మనసు బాహ్యప్రేరణల కారణంగా సంచలానికి లోనైనప్పుడు

ఒకమాట మరొక మాటతో కలిసిపోయి కొత్త ఉచ్చారణను పొందుతుంది కొన్ని సార్లు ఒకమాట ఇంకోమాటగా మారుతుంది లేక కొన్ని మాటలు పదే పదే రిపీట్ అవుతాయి ఒక భాషాపదం ఇంకో భాషాపదంతో కలిసి విచిత్రమైన రూపాన్ని పొందుతుంది, ఇలా శబ్దాలతో చాలా విచిత్రమైన ప్రయోగాలు చెయ్యటం చైతన్య స్రవంతి సాహిత్యంలో తరచుగా కనిపిస్తుంది

పైన వివరించిన విధానాలతో చైతన్య స్రవంతి సాహిత్యాన్ని సృష్టించిన రచయితలు తాము తీసుకున్న ఒక స్పష్టమైన రూపంలేని ఇతివృత్తానికి ఒక రూపం ఇవ్వటానికి ప్రయత్నించారు [8]

## X

తెలుగులో చైతన్య స్రవంతితో మొట్టమొదటి రచన చేసినవారు బహుశా శ్రీశ్రీ యేననుకుంటారు ఆయన 1940 ప్రాంతాలలో రాసిన చరమరాత్రి కథల సంపుటిలో 'ఒసే తువ్వాలందుకో ' 'కోనేటి రావు' అన్న రెండు కథలు ఈ పద్ధతిలో రాయబడ్డాయి ఆ తర్వాత బుచ్చిబాబు 'చైతన్య స్రవంతి' అన్న పేరు తోనే ఈ పద్ధతిలో ఒక కథ రాశాడు మొత్తమ్మీద పాశ్చాత్య సాహిత్యంలో మొదటి ప్రపంచయుద్ధం తర్వాత ప్రారంభమైన ఈ ధోరణి తెలుగు సాహిత్యంలో రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ప్రారంభమైంది- ఒక్క తెలుగులోనే కాకుండా ఇతర భారతీయ భాషల్లోకూడా సరిగ్గా ఇదే సమయంలో ఈ రకమైన ప్రయోగాలపట్ల రచయితలు ఆకర్షితులు కావటం గమనార్హం హిందీలో 'అజ్ఞేయ' రాసిన 'నదీకేద్వీప్', బెంగాలీలో అవధూత్ రచించిన "ఉధారమ్ పూరక్ ఘాట్", సమరేష్ బాసూ రాసిన 'బిబర్ & ప్రజాపతి' మొదలైన రచనలు ఈ ధోరణికి ఉదాహరణలు

8 "The Problem of form for Stream of Consciousness novelist is the Problem of how order is unposed on disorder" – Robert Humphrey Stream of Consciousness in Modern Novel

తెలుగులో పైన ఉదహరించిన శ్రీశ్రీ కథల్లో ఈ ధోరణి ఛాయామాత్రం గానే కనిపిస్తుంది ఈ ధోరణిలో ఒక సమగ్రమైన రచన చెయ్యాలని సీరియస్‌గా ప్రయత్నించిన మొదటి రచయిత బుచ్చిబాబే ఆయన కథ 'చైతన్య ప్రవంతి' వస్తువులోను, శిల్పంలోను ఈ తరహా సాహిత్యపు లక్షణాలన్నింటిని పుణికి పుచ్చుకున్నది

నవలా సాహిత్యంలో మొట్టమొదట రా వి శాస్త్రి గారి 'అల్పజీవి'లో అక్కడక్కడ చైతన్య ప్రవంతి ధోరణి కనిపిస్తుంది 'అల్పజీవి'లో చాలా భాగం సాంప్రదాయ పద్ధతిలో రాయబడింది మొత్తం నవలంతా చైతన్య ప్రవంతి పద్ధతిలో నడిచిన మొదటి నవల 'అంపశయ్యే' ననుకుంటాను అయితే అంపశయ్యలో కనిపించేది యే 'యులీసెస్' లో లాగానో ఈ పద్ధతి యొక్క అత్యంత సంక్లిష్ట రూపం కాదని గమనించాలి ఈ ధోరణి 'అంపశయ్య' లో చాలా సరళ రూపంలో సగటు పాఠకుడికి అర్థమయ్యేలా మారిపోవటం కనిపిస్తుంది

అంపశయ్యతో బాటు ఈ పద్ధతిలో వచ్చిన ఇంకా కొన్ని నవలల్ని పరిశీలిస్తే ఒక విషయం స్పష్టమౌతుంది అదేమిటంటే ఈ తరహా సాహిత్యాన్ని జాయిస్ లాగానో లేక వర్జీనియా వుల్ఫ్ లాగానో ఒక నిరంతరమైన తపస్సులా భావించి కృషి చేసిన తెలుగు రచయితలెవరూ లేరు ఈ శిల్పం యొక్క అన్ని లోతుల్ని శోధించి ఆఖరు అంచుల వరకు వెళ్ళాలని యే రచయితా ప్రయత్నించినట్టు కన్పించదు సాహిత్యం ముఖ్యంగా నవలా సాహిత్యం డబ్బు చేసుకునే ఒక వ్యాపారంగా మారిన ఈ రోజుల్లో అలాంటి ప్రయత్నాలను, ప్రయోగాలను ఆశించటం అత్యాశే అవుతుందేమో! శ్రీశ్రీ, బుచ్చిబాబుల కథలు, రా వి శాస్త్రి, నవీన్, వడ్డెర చండీదాస్, వినుకొండ నాగరాజుల నవలలు ఈ తరహా సాహిత్యానికి ఒక ప్రారంభం మాత్రమే భవిష్యత్తులో ఇంకా కొందరు రచయితలు ఈ మార్గంలో పయనించి ఈ తరహా సాహిత్యాన్ని ఇంకా ముందుకు తీసుకెళ్తారని ఆశిద్దాం

ఈ వ్యాసానికి ఉపకరించిన కొన్ని ముఖ్య గ్రంథాలు


| | | |
|---|---|---|
| 1 | కోడూరి శ్రీరామమూర్తి | తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ |
| 2 | బుచ్చిబాబు | 'చైతన్య స్రవంతి' కథ |
| 3 | శ్రీశ్రీ | శ్రీశ్రీ సాహిత్యం - వచన విభాగం II |
| 4 | కాత్యాయని విద్మహే | "చైతన్య స్రవంతి రచనా శిల్పం గురించి" వ్యాసం-విమర్శని-కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖ వారి త్రైమాసిక |
| 5 | డి విద్యేశ్వరి | తెలుగు నవల - మనో విశ్లేషణ |
| 6 | నవీన్ | 'లైఫ్ ఇన్ ఎ కాలేజి' కథల సంపుటి |
| 7 | నవీన్ | అంపశయ్య నవల |
| 8 | Robert Humphrey | Stream of Consciousness in Modern Novel |

ఆధునిక తెలుగు సాహిత్యంలో

# విప్లవ వాదం

—వేమూరి రామారావు

విప్లవం అనే మాట ఇంగ్లీషులో 'revolut on' అనే మాటకు సమంగా తెలుగులో వాడుతున్నాం. బ్రౌన్ నిఘంటువులో 'విప్లవం' అనే మాటకు ruin, national calamity, దేశోపద్రవము అనె అర్థాలున్నై. శబ్ద రత్నాకరము, సూర్య రాయాంధ్ర నిఘంటువుంలో కూడా ఈ రకమైన అర్థాలే ఉన్నై. అందువల్ల మనం ఇంగ్లీషులో revolution అనే మాటకున్న అర్థాలే ఇక్కడ గ్రహించాలి. ఈ మాటకు American College Dictionary,1 A Complete overthrow of an established government or political system, (as the English revolution (1688), American revolution (1715), the French revolution (1789), or the Chinese revolution ('911), the Russian revolution (1917) 2 A Complete or marked Change in something (ఇతర శాస్త్రాలలో వేరే అర్థాలున్నాయి, అవి మనకు అవసరం లేదు) ఈ రెండర్థాలలోను ఈ మాట ప్రయోగంలో ఉంది. మానవ పరిణామాన్ని 'Human revolution' అని Anthropologists అంటారు. నారాయణరావు కవితా విప్లవాల స్వరూపం అనడం ఇంగ్లీషు మాటకున్న ఈ రెండో అర్థంలోనే.

ఈ మాటకున్న మొదటి అర్థమే ప్రస్తుతం మనకు అవసరం. కానీ కమ్యూనిస్టుల ప్రయోగంలో ఈ మాటకు ఇంకా పరిమితమైన అర్థం ఉంది

'ఒక ఆర్థిక పునాదిమీద ఏర్పడ్డ రాజకీయ వ్యవస్థను బల ప్రయోగంతో సమూలంగా పెకలించటం' అనే అర్థంలో వాళ్ళు వాడుతున్నారు

ఈనాటి తెలుగులో 'విప్లవం' అనే మాట ఈ రెండర్థాలలోనూ స్థిర పడింది అయినా ఇక్కడ మొదటి అర్థంలోనే వాడుతున్నాను

'విప్లవ వాదం' అంటే ప్రస్తుతం ఉన్న వ్యవస్థను బల ప్రయోగం ద్వారా మార్చాలనే రాజకీయ సిద్ధాంతానికి అనుకూలమైన సాహిత్య సిద్ధాంతమే ప్రస్తుత ప్రసంగ విషయం విప్లవ వాదం రాజకీయాలతో ప్రత్యక్ష సంబంధం ఉన్న సిద్ధాంతం కాబట్టి, రాజకీయ పరిస్థితిని తడవకుండా విప్లవ వాదాన్ని గురించి మాట్లాడటం నేల విడిచి సాము చెయ్యటం అవుతుంది

విప్లవ వాదం అనగానె మనకు అభ్యుదయ వాదం కూడా గుర్తొస్తుంది ఈ రెంటికీ ఉన్న పోలికలూ, భేదాలూ మనకిక్కడ ప్రసక్తాలు

భారతదేశం సామ్రాజ్య వాదుల పరిపాలన కింద ఉన్న రోజుల్లొ స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది కమ్యూనిస్టు లకూ, ఇతరులకూ ఒక ముఖ్యమైన భేదం ఉంది సర్వ విషయాలనూ స్పృశించే తత్వ శాస్త్రం కమ్యూనిస్టులకుంది ప్రకృతీ, సమాజం, చైతన్యం-వీటి పరిణామ క్రమాన్ని ఇదే తత్వ శాస్త్రంతో పరిశీలిస్తారు అందువల్ల సాహిత్య, కళా రంగాలు కూడా కమ్యూనిస్టులు ఉపేక్షించరు ప్రజల్లొ చైతన్య స్థాయిని పెంచటంలో కమ్యూనిస్టులు అన్ని అవకాశాలనూ వినియోగించుకొంటారు కమ్యూనిస్టు ఉద్యమాభిముఖంగా పనిచేసే కొన్ని సంఘాలను కమ్యూనిస్టులు ఏర్పాటు చెస్తారు వీటిని 'ప్రజా సంఘాలు' అంటారు కమ్యూనిస్టు పార్టీకీ, ప్రజా సంఘాలకూ కొన్ని భేదాలున్నై, ప్రజా సంఘాల్లో క్రియాశీల పాత్ర పోషించేది కమ్యూనిస్టులే అయినా, ఆ సంఘాల్లో సభ్యులంతా కమ్యూనిస్టులు కానక్కరలేదు అంతిమ లక్ష్యాలకు అనుగుణంగా విస్తృత ప్రాతిపదిక మీద

ఈ ప్రజా సంఘాలేర్పడతాయి మొత్తం సమాజాభివృద్ధికి అనుకూలంగా ఉండే శక్తులతో, వ్యక్తులతో కలిసి ఈ సంఘాలేర్పడతాయి కమ్యూనిస్టులు కోరే సోషలిస్టు విప్లవం ఒక్క వేటుతో వచ్చేదికాదు, దానికి ముందు ప్రజల ఆలోచనల్లో ఎన్నో మార్పులు రావాలి విప్లవం కమ్యూనిస్టులు తెచ్చేదికాదు, ప్రజలు చేసేది ముందుగా చైతన్యవంతులైన ప్రజలు కమ్యూనిస్టులు, సమాజ పరిణామ గతిని అర్థం చేసుకొని రావలసిన మార్పులను గమనించేది కమ్యూనిస్టులు ఆ మార్పుకు ప్రజలను తయారుచేసే బాధ్యత వాళ్ళదే అందుకనుగుణంగా వివిధ రంగాల్లో ప్రజా సంఘాలు పనిచేస్తుంటాయి

కమ్యూనిస్టుల అంతిమ లక్ష్యం కమ్యూనిస్టు సమాజ నిర్మాణం, ప్రజా సంఘాలు తక్షణ లక్ష్యాలకోసం పని చేస్తాయి ఈ లక్ష్యాలు ప్రజా పోరాట దశలను బట్టి ఉంటాయి ఉదాహరణకు వ్యావహారిక భాషా ఉద్యమం తీసుకోండి, గ్రాంథిక భాష నేటి అవసరాలకు సరిపోదు, వ్యావహారికం నేటి ప్రయోజనాలకు అవసరం అనటానికి కమ్యూనిస్టు కానక్కరలేదు అయితే చాలా మందితో పాటు కమ్యూనిస్టులకు కూడా వ్యావహారిక భాష ప్రయోజనకారి కనుక కమ్యూనిస్టులు మిగతావాళ్ళతో కలిసి వ్యావహారిక భాషా వ్యాప్తికి పని చేస్తారు కమ్యూనిస్టులు ప్రధానపాత్ర వహించే ప్రజా సంఘాలు ఈ విషయంలో మరుగ్గా పని చేస్తాయి స్త్రీ విముక్తి అన్నా, పౌర హక్కులన్నా, ఇట్లాంటి అన్ని సమస్యల మీదా కలిసి వచ్చే భిన్న అభిప్రాయాల వాళ్ళతో కలిసి, కమ్యూనిస్టులు ప్రజా సంఘాలద్వారా ఉద్యమాలు నిర్మిస్తారు సాహిత్య రంగంలో 'అభ్యుదయ రచయితల సంఘం' ఈ విధంగానే ఏర్పడింది

ఆనాటి అభ్యుదయ రచయితల సంఘంలో ఉన్న వాళ్ళంతా కమ్యూనిస్టులు కారు ఇతరులూ ఉన్నారు సామాజికాభ్యుదయం కోసం రచయితలు కృషి చేయాలనే నమ్మకమున్న వాళ్ళంతా అందులో సభ్యత్వాని కర్హులే అప్పటి సప్యకవుల్లో చాలా మంది అభ్యుదయ రచయితల సంఘంతో సహకరించిన వాళ్ళు నోరి నరసింహశాస్త్రి, తరువాత విశ్వనాథ సత్యనారాయణ వంటి వారు మాత్రం

మొదట్నుంచీ అభ్యుదయ రచయితల సంఘానికి కొంత దూరంగానూ, వ్యతి రేకంగా కూడా ఉంటూ వచ్చారు ఇందుకు కారణం వాళ్ళు కమ్యూనిస్టు వ్యతి రేకులు కావటం మాత్రమే కాదు, సాహిత్యంలో ఇతరత్రా చాలా మంది కావాలను కునే ప్రజాస్వామ్యయుతమైన మార్పులకు కూడా వీళ్ళు వ్యతిరేకులు సాంఘి కంగా సరే సరి

కమ్యూనిస్టు ఉద్యమ బలానికీ, ప్రజా సంఘాలు పనిచేసే తీరుకూ ప్రత్యక్ష సంబంధం ఉంది అభ్యుదయ రచయితల సంఘ చరిత్ర (ఇతర ప్రజా సంఘాల చరిత్ర కూడా) అదే ఋజువు చేస్తుంది కమ్యూనిస్టు ఉద్య మంలో వచ్చిన చీలికలు, ఈ ఉద్యమాల్లోనూ ప్రతిఫలిస్తున్నై

1946 నుంచి 1948 వరకూ కమ్యూనిస్టు ఉద్యమం ఆంధ్రదేశంలో బలంగా ఉంది అభ్యుదయ రచయితల సంఘానికది స్వర్ణయుగం ఆ తరు వాత నిర్బంధా లెక్కువయినై తెలంగాణా పోరాటం ఉధృతంగా జరిగినప్పుడు తొలి రోజుల్లో అభ్యుదయ రచయితల సంఘం, కవిత్వం, నాటకాల ద్వారా ఆ పోరాటానికండగా నిలిచింది ఆ తరవాత నిర్బంధం ఎక్కువయిన తరవాత రచయితల సంఘం చెదిరి పోయింది

1950 లో పోరాట విరమణ తరవాత, పోరాటాన్ని కీర్తిస్తూ కొంతకాలం అభ్యుదయ కవిత్వం బతికింది, కాని ఎక్కువ కాలం మనలేదు ఇందుకు కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన మార్పులే కారణం ఉద్యమం ప్రజా పోరా టాలనుంచి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి ఎగిరినప్పుడు అభ్యుదయ రచయి తలు కూడా ప్రజారంగాన్ని వదిలి సినిమాం కెగిరారు అభ్యుదయ రచయితల స్తబ్ధతకు అది కారణమనుకుంటాను ఆ తరువాత 1955 లో ఆంధ్రలో జరి గిన బై-ఎలక్షన్‌లలో అభ్యుదయ రచయితలంతా ఒకసారి కళ్ళు తెరిచారు కళ్ళు తెరిపించింది అభ్యుదయ సిద్ధాంతి, అవకాశవాద రచయితలే కమ్యూనిస్టులు అధికారానికి వస్తే ఆడవాళ్ళని—వాళ్ల వస్తువులయినట్టు—సమాజపరం చెస్తారని,

మీ నోళ్ల కుట్టేస్తారని, ఇట్లా రకరకాల అసహ్యకరమైన అబద్ధాలు పత్రికలు రాస్తుంటే, ఆ పత్రికా సంపాదకుల నాయకత్వాన కొందరు అభ్యుదయ నిరోధక అవకాశవాద రచయితలు, కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్య శక్తులను బలపరచమని లక్ష్య ప్రకటన చేశారు శ్రీ శ్రీ ఉపన్యాసాలద్వారా, కుటుంబ రావు, నార్ల చిరంజీవి వ్యాసాలు, లేఖలద్వారా, రాంభట్ల కృష్ణమూర్తి కార్టూన్లు, వాటికింద కార్టూను కవితలద్వారా ఒంటరి వీరుల్లా పోరాడారు సంఘం మాత్రం కనపడలేదు ఎన్నికల్లో కమ్యూనిస్టులు చాలా గట్టిగా ఓడిపోయారు 1956 లో అభ్యుదయ పత్రికను, సంఘాన్ని కొన్నాళ్ల బతికించారు, సుమారు రెండేళ్ళు బతికినై తుమ్మల వెంకట్రామయ్య గారు, కె వి రమణారెడ్డి గారు ఎంత శ్రమపడేవారో నెనెరుగుదును, కాని వారి శ్రమ ఏమంత ఫలించలేదు అందుక్కారణం కమ్యూనిస్టు ఉద్యమ స్వభావంలో మార్పేనని నా అభిప్రాయం

తెలంగాణలో అభ్యుదయ రచయితల సంఘానికి వేళ్ళేర్పడలేదు రాను న్నది ఏది నిజం, అది ఒకటే సోషలిజం అన్నవాళ్ల కూడా సమయం వచ్చి నపుడు సోషలిస్టు వ్యతిరేకులనే సమర్థించారు

ఆ తరవాత 1962-64 సంవత్సరాల కాలంలో కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికలు మొదలయినై ఇంకా సాగుతూనే ఉన్నై ఈ చీలికలను గురించి రష్యన్ మిత్రుడు నికితాగురోవ్ చెప్పిన ఒక జోక్ గుర్తొస్తున్నది రష్యాలో పిల్లలు, 'Let us play the Indian game Let us split' అంటారట

1967 లో నక్సల్‌బరీ, శ్రీకాకుళ ప్రాంతాల్లో విప్లవ కమ్యూనిస్టు నాయ కత్వాన సాయుధ పోరాటాలు జరిగినై ఈ ఉద్యమ ప్రేరణతో 1969 లో 'తిరుగబడు,' 1970 జూలైలో 'మార్చ్' అనే కవితా సంపుటులు వచ్చినై సుబ్బారావు పాణిగ్రాహి ఆ పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొంటూ విప్లవ గీతాలు రాశారు 'ప్రజలను సాయుధం చేస్తున్న రివల్యూషనరీ నేడు కవి' అన్న నిర్వ చనం శ్రీకాకుళ పోరాట ప్రభావాన్ని చూపుతుంది

1970 ఫిబ్రవరిలో విశాఖలో జరిగిన శ్రీశ్రీ షష్టిపూర్తి సమావేశంలో 'రచయితలకు సవాల్' అనే కరపత్రం అక్కడి రచయితలను పోలరైజ్ చేసింది

1970 లో సెవెన్‌స్టార్ సిండికేట్ వారేర్పరచిన అభ్యుదయ సదస్సులో అభ్యుదయ రచయితల సంఘం మళ్లీ బయటికొచ్చింది, కాని శ్రీశ్రీ, కుటుంబ రావు, రమణారెడ్డి మొదలైన పాత అభ్యుదయ కవులు వేరుబడి దిగంబరకవులు, తిరుగబడు కవులతో కలిసి విప్లవ రచయితల సంఘం ఏర్పరిచారు 1970 అక్టోబరులో ఖమ్మంలో మొదటి మహాసభ ఏర్పాటు చేసుకొన్నారు ఇది స్థూలంగా తెలుగు సాహిత్యంలో విప్లవవాద ప్రవేశం జరిగిన తీరు, అందుకు సంస్థాపరంగా కృషిచేసిన విప్లవ రచయితల సంఘం ఏర్పడ్డతీరు

రాజకీయంతో సంబంధం లేని సాహిత్య విప్లవ వాదమంటూ ఏదీలేదు రాజకీయ మనె మాటకు కమ్యూనిస్టుల్లో కూడా ఒకే అర్థం ఉన్నట్టు లేదు, సాయుధ పోరాటమే విప్లవమని కొందరంటే, మార్గమేదైనా, సోషలిజం దిక్కుగా జరిగే పరివర్తనమే విప్లవమని మరి కొందరంటారు తెలుగు భాషకు సమగ్ర మైన నిఘంటువు తయారుచేసే వాళ్ళు 'విప్లవం' అనే మాటకున్న అర్థభేదాలు వివరించ దల్చుకుంటే చాలా శ్రమ పడాలి

కమ్యూనిస్టులమని అనుకునే రాజకీయ పార్టీలు, గ్రూపులూ సరిగ్గా ఎన్ని ఉన్నాయో నాకు తెలియదు సుమారు 10 ఉంటాయనుకుందాం ఈ సంఖ్య ఎక్కువనుకుంటే కనీసం 7, 8 అయినా ఉంటాయి వీటి మధ్య ఒక స్పష్టమైన విభాజక రేఖ గీయొచ్చు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం తమ లక్ష్యాల కనుకూల మార్గమని నమ్మేవి, అట్లా నమ్మనివి అనేదే ఆ విభజనకు సూత్రం దాన్ని ఇంకో రకంగా సూత్రీకరిస్తే 'సాయుధ పోరాటం అవసరం' అనేవి, 'తప్పనిసరి అవసరం కాదు' అనేవి అనికూడా విభజించవచ్చు అంటే ప్రస్తుతం, పార్ల మెంటరి ప్రజాస్వామ్య మార్గం Vs సాయుధ పోరాట మార్గం అనేవి కమ్యూ నిస్టులను ప్రధానంగా విడదీస్తున్న అంశాలు నిజానికి కమ్యూనిస్టులకు ఏ మార్గమూ

సూత్రరీత్యా నిషిద్ధం కాదు ఇప్పుడున్న పరిస్థితుల్లో పార్లమెంటరీ ప్రజాస్వామ్య మార్గం పనికిరాదని కొందరంటే, సాయుధపోరాట మార్గం పనికిరాదని మరి కొందరంటారు సాయుధ పోరాటవాదులే విప్లవవాదులు, సాహిత్యంలో విప్లవ వాదానికి మూలకర్తలు వారే విప్లవ వాదుల్లో భేదాల సంగతి తరువాత చూద్దాం విప్లవ వాదులను పార్లమెంటరీ వాదుల నుంచి వేరుచేసే ఇతర అంశాలను కూడా గమనిద్దాం

1 అంతర్జాతీయ రంగంలో సోవియట్ యూనియన్ అమెరికాలాగే ఒక సామ్రాజ్యవాద దేశమనీ, అమెరికా కన్నా ప్రమాదకరమైనదనీ, విప్లవవాదులంటారు అమెరికాలాగే రష్యా కూడా ప్రపంచ పెత్తనాని కెగబడుతున్నదనీ, తూర్పు యూరపు దేశాలను వలస దేశాలుగా చూస్తున్నదనీ, వాటితో బాటు, కొన్ని తటస్థ దేశాలను కూడా ఆర్థికమైన దోపిడీకి గురి చేస్తున్నదనీ, విప్లవవాదులంటారు దీన్నివీరు 'సోషల్ సామ్రాజ్యవాదం' అని పిలుస్తారు

2 జనచైనా ఈనాటి విప్లవ కేంద్రం అని విప్లవవాదుల నమ్మకం ప్రపంచంలో విముక్తి పోరాటాలకు అండగా ఉండటం, అంతర్జాతీయ స్థాయిలో సహకారాన్ని, సలహాలను అందించటం, విప్లవ కేంద్రం పని అనుకుంటాను

3 1947 లో ఈ దేశంలో జరిగింది అధికార మార్పిడి విదేశీ దోపిడీ దార్లు, స్వదేశం పెత్తందార్లకు అధికారం ఇచ్చారు, స్వాతంత్ర్యం రాలేదు

4 ఈ దేశంలో ప్రస్తుతం ప్రధానంగా ఉన్నది భూస్వామ్య ఆర్థిక విధానం, దానిమీద ఆధారపడ్డ భూస్వామ్య సంస్కృతి, పెట్టుబడిదారీ విధానం అత్యంత ప్రాథమిక దశలో ఉన్నది

దీన్నిబట్టి విప్లవ కమ్యూనిస్టుల ప్రకారం భారత ప్రజల పోరాటం, సామ్రాజ్యవాద, భూస్వామ్య, పెట్టుబడిదారీ విధానాలకు వ్యతిరేకంగా ఉండాలి

5 మావో ఆలోచనా విధానం ఈనాటి పరిస్థితులకు అన్వయించే మార్క్సిస్టు దృక్పథం మార్క్సిజం చలనం లేని సిద్ధాంతం కాదని, పరిస్థితుల కనుగుణంగా మార్పులను, చేర్పులను అంగీకరిస్తూ శ్రామికవర్గ రాజ్యస్థాపన ఉపయోగించే శాస్త్రమనీ భావం భూస్వామ్య విధానం పెట్టుబడిదారీ వ్యవస్థగా మారే వరకూ విప్లవ పోరాటాలు ఆగనక్కర్లేదనీ, విప్లవంలో పట్టణాల కార్మికులతో పాటు పల్లెల వ్యవసాయకూలీలూ, రైతులూ విప్లవంలో సమభాగస్వాములవుతారనీ, మావో సిద్ధాంతం చెబుతుంది నూతన ప్రజాస్వామ్యం విప్లవానికి ప్రథమ దశ అని, సోషలిస్టు విప్లవం తరవాత దశ అని కూడా చెబుతుంది

6 శ్రామిక వర్గ విముక్తి దీర్ఘకాలిక సాయుధ ప్రజా పోరాటాల ద్వారానే సాధ్యమవుతుందనీ చైనా అనుభవం చెబుతుంది

ఇవి స్థూలంగా విప్లవవాద కమ్యూనిస్టులంతా అంగీకరించే అభిప్రాయాలు, అయితే విప్లవకమ్యూనిస్టులలో వ్యూహం-ఎత్తుగడలకు సంబంధించిన భేదాలు చాలా ఉన్నాయి వర్గ శత్రు నిర్మూలన ఒక దశలో విప్లవ పోరాటంలో భాగమని ఒక వర్గం భావిస్తే, మరో వర్గం దాన్ని వ్యక్తిగత హింసాకాండగా వర్ణించింది సాయుధ పోరాటమే ఏకైక మార్గమని ఒకరంటే, ప్రధాన మార్గమని మరొకరూ, ఒకానొక మార్గం మాత్రమేననీ ఇంకొకరూ అంటారు ఈ రకమైన భేదాలు, ఇంకా సూక్ష్మాతిసూక్ష్మమైన భేదాలు ఈనాడు విప్లవ కమ్యూనిస్టు గ్రూపులను విడదీస్తున్నాయి

ఇక సాహిత్యంలో వీటి ప్రభావమేమిటి ? అనే ప్రశ్న ఉంది రచయితల సంఘాలు తమ సిద్ధాంతాలను ఇంత స్పష్టంగా చెప్పలేదు అందుక్కారణం రాజకీయ పార్టీలకు, ప్రజాసంఘాలకు ఉన్న భేదం వల్లనే

1970 [illegible] ఖమ్మంలో [illegible] విరసం ప్రణాళికలో "మార్క్సిస్టు [illegible] పునాదిగా వెలువడే భావాలను ప్రచారంచేస్తూ, రచయితలు సామాజిక చైతన్యాన్ని ఉద్దీపింపజెయ్యాలి" అన్నారు "మార్క్సిజాన్ని శాస్త్రం

గానే కాక, శస్త్రంగా ఆమోదిస్తూ రాజకీయ మహోద్యమానికి చేదోడువాదోడు కావాలి'' అని ప్రకటించారు, ఎక్కడా మావో ఆలోచనా విధానం ప్రసక్తికాని, విప్లవ కేంద్రం ప్రస్తావన గానీ లేవు కాని ''విప్లవ పోరాటలన్నిటినీ సాకల్యంగా సమీక్షిస్తూ, ప్రజల దీర్ఘకాలిక విమోచన పోరాటాలను సమర్థిస్తూ విప్లవ రచయితల సంఘం సాహిత్య కృషి చేస్తుంది'' అని ప్రకటించారు (వి ర సం ప్రత్యేక సంచిక, 1971 పే 49-50) కాని అరుణతార మొదటి సంచిక అట్ట వెనక (1977, నవంబరు) వేసిన వి ర సం ప్రణాళికలో ''నూతన ప్రజా తంత్ర విప్లవ లక్ష్యంగా, మార్క్సిజం, లెనినిజం – మావో ఆలోచనా విధానం వెలుగులో, విప్లవ రచయితల సంఘం సాహిత్య, కళారంగాలను తన కార్యక్షేత్రంగా ఎంచుకుంటూంది'' అని కనిపిస్తుంది ఇదే ప్రణాళికలో ''సోషల్ సామ్రాజ్యవాదంలో గర్భితమై ఉన్న ప్రపంచాధిపత్య కాంక్షను ప్రతిబింబించే జాతీయ దురహంకార వైఖరిని, వర్గ సంకర ధోరణిని వ్యతి రేకిస్తుంది'' అని సోషల్ సామ్రాజ్యవాద ప్రసక్తి కూడా వస్తుంది •

వి ర సం ఏర్పడ్డ తొలిరోజుల్లో రాజకీయ పార్టీలతో దానికి ఉండాల్సిన సంబంధం విషయంలో చాలా తర్జనలు భర్జనలు జరిగినై విరసం రాజకీయాలకు అతీతమూ కాదు అధీనమూ కాదు అని రమణారెడ్డి గారన్నారు విప్లవ రచయితల సంఘం ఒక రాజకీయ పక్షాన్ని అనుసరించి వెళ్ళడానికి నాకు అభ్యంతరం ఉన్నదని కుటుంబరావు గారన్నారు (సృజన-16, ఆగష్టు 1970)

ఇదే సందర్భంలో నిబద్ధత, నిమగ్నత అనే అంశాలమీద తీవ్రమైన చర్చలు జరిగినై ! వి ర సంలో ముఖ్యులు తాము రాజకీయ లక్ష్యాలకు నిబద్ధులమే కాని రాజకీయ పోరాటాల్లో నిమగ్నులం కానవసరం లేదని ప్రకటించారు

అయితే నిబద్ధత నిమగ్నత అనే విభజన కృత్రిమమైనదనీ, విప్లవ పోరాటంలో సాంస్కృతిక సైన్యం లాంటిది రచయితల సంఘమనీ కొందరు వాదించారు

వి ర సం నాటికీ అభ్యుదయ రచయితల సంఘ కాలానికీ ఉన్న ప్రధాన భేదం ఒకటి ఉంది రచయితల సంఘానికి రాజకీయ లక్ష్యాన్ని సూచించే పార్టీ ఒకటే ఉండేది తొలినాటి అ ర సం. రోజుల్లో

వి ర సం ఏర్పడ్డప్పుడు విప్లవ పార్టీలు లేక గ్రూపులు కనీసం మూడైనా ఉన్నాయి "మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానాన్ని జనరల్‌గా ఆమోదించినా, దాన్ని భారతదేశ నిర్దిష్ట పరిస్థితులకు అన్వయించటంలో విప్లవ కారులందరి మధ్యా ఏకాభిప్రాయం లేదు'' (వి మా వ్య ధో ప్ర ) వి ర సం ఈ విప్లవ గ్రూపులన్నిటికీ వేదికగా ఉంది ఈ విప్లవ గ్రూపులకు మధ్య పోటీ ఉండటం సహజం ఉన్న సంఘాన్ని తమ కార్యక్రమానికి అనుకూలంగా మార్చుకోటానికి ప్రయత్నించటమూ సహజమే సరిగ్గా అదే జరిగింది విరసంలో మార్క్సిస్టు వ్యతిరేక ధోరణులను ప్రతిఘటించండి (1973), సాంస్కృతిక విప్లవం- మన కర్తవ్యాలు (1974), విరసంలో విచ్ఛిన్నకుల కుట్రలను భగ్నం చెయ్యండి (1975) అనే పరస్పర ఆరోపణల సమాధానాల డాక్యుమెంట్లు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి 1975 జనవరిలో, అనంతపురం సభల్లో ఒక వర్గం చీలింది వీరు ఆ తరువాత ఏర్పడ్డ జనసాహితీ సాంస్కృతిక సమాఖ్యలో భాగస్వాములయ్యారు వీరిలో చాలామంది ముఖ్యులు పూర్వం వి ర సం లో ఉన్నవారే వీరి ప్రధానలక్ష్యం భూస్వామ్య, సామ్రాజ్యవాద సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడటం "ఏ సంస్కృతికైనా ఆర్థిక వ్యవస్థే పునాది ఆ పునాది ధ్వంసం కాకుండా ఆ సంస్కృతి అంతం కాదు అదేవిధంగా ఒక కొత్త సంస్కృతి అభివృద్ధి చెందాలంటే దానికి అనుగుణ్యమైన ఆర్థికవ్యవస్థ ఏర్పడాలి" అని ప్రకటించిన జనసాహితివారు 'మార్క్సిజం' అనే మాట వాడకపోవటం విశేషం స్పష్టంగా చెప్పకపోయినా 'సామ్రాజ్యవాదం, అగ్రరాజ్యాలు' అని వాడినచోట సోవియట్ యూనియన్‌ను ఉద్దేశించారు అయినా ''మార్క్సిజం-లెనినిజం- మావో ఆలోచనా విధానాన్ని అంగీకరించిన వారికి మాత్రమే పరిమితమైన సంస్థగా ప్రకటించబడిన విప్లవరచయితల సంఘానికి ప్రజాసంఘ స్వభావం లేదు'' అని విరసాన్ని వీరు విమర్శించారు

విప్లవవాదుల్లో ఎన్ని రాజకీయ భేదాలున్నయ్యో, ప్రజాసంస్థ స్వభావాన్ని గురించి అన్ని అభిప్రాయాలూ ఉన్నై మార్క్సిస్టు సిద్ధాంతం మీద ఆధారపడ్డ పార్టీలు గ్రూపులుగా విడిపోతున్న తరుణంలో ప్రజాసంఘాలు గందరగోళంలో పడటం స్వాభావికం, ప్రజాసంఘాల్లో కూడా చీలికలు ఏర్పడటం సహజం చీలిన కమ్యూనిస్టులూ, రచయితలూ, చీలిక తప్పనిసరి అనీ, అనివార్యమనీ, దానికి విచారించాల్సిన పనిలేదనీ వాదిస్తారు ఒకరిమీద ఒకరు పత్రికల్లో, కరపత్రాల్లో నిందలు వేసుకుంటారు వీటికయ్యే ఖర్చును భరించేది ప్రజలే ఇవన్నీ ప్రజలకోసమే జరుగుతై ప్రజల పేరుమీదుగా జరుగుతై దురదృష్టకర మైన విషయమేమంటే ఈ చీలికల మహా సంరంభంలో ప్రజలు ప్రేక్షక మాత్రులు

ఈ చీలికలు అన్ని వేళలా సిద్ధాంత ప్రాతిపదికమీదనే జరుగుతాయను కోను ఒక్కోసారి నాయకుల స్వభావాలు కూడా కారణం కావచ్చు కాని కాయితం మీద సిద్ధాంతాలే కనిపిస్తయ్

సిద్ధాంతాల్లో ఎన్ని చెప్పినా, ఇవాళ రచయితల సంఘాలు విశాల ప్రాతి పదికమీద ఏర్పడ్డవి కావు మార్క్సిజం తమ ధ్యేయం అని చెప్పకపోయినా, జనసాహితిలో మార్క్సిస్టేతరులు లేరు విప్లవ కమ్యూనిస్టుల్లో ఒక వర్గం సానుభూతిపరులే అందులో ఉన్నారు (ఇటీవలే నిఖిలేశ్వర్, జ్వాలాముఖి ప్రభృతులు జనసాహితిలో నుంచి బయటికి వచ్చారు) విరసంలో రెండు గ్రూపుల సానుభూతిపరులుండొచ్చు చీలికకోసం ఎప్పుడు పిలిస్తే అప్పుడు ఆ గ్రూపుల వారి సానుభూతిపరులు విడిపోవచ్చు రచయితల సంఘం రాజకీయ పార్టీకాని మాట నిజమే కాని ఈ రెంటికీ ఉన్న సంబంధం ప్రణాళికల్లో వ్యక్త మైనదానికన్నా అధికమైనది

విప్లవవాద రాజకీయాల మీద ఆధారపడ్డ రచయితల సంఘాల సాంస్కృ తిక సైన్యంగా తమ పనిని ఎంతవరకు నిర్వహించినయ్యో అంచనా వెయ్యటానికి

నాకు శక్తి, వ్యవధీ లేవు మధ్యతరగతి ప్రజలకు విప్లవకర రాజకీయ పోరాటాలను పరిచయం చెయ్యగలిగింది అంతకుమించి ఏంచేసిందీ ఇప్పుడు చెప్పటం కష్టం

సాహిత్యంలో ఏం చేసింది అనేది ఇంకొంచెం స్పష్టంగా చెప్పుకోవచ్చు మళ్ళీ ఒకసారి ఉద్ధృతంగా ప్రజల బాణీల్లో పాటలు ప్రచారసాధనాలయినై 1970 లో ప్రచురితమైన ఝంఝులో శివుడు రాసిన ''నరుడో భాస్కరుడా'' అనే పాట ప్రజల బాణీని, నాగరిక కవిత్వంలోకి ప్రవేశపెట్టింది ఆ తరవాత జననాట్యమండలి, అరుణోదయ, నవోదయ, ఆ తరవాత జనసాహితి అనే సాంస్కృతిక సంస్థలు శ్రామిక ప్రజలను చైతన్యంచేసే పాటలూ, బుర్రకథలు, ఒగ్గుకథలు, నాటకాలు ప్రదర్శించారు ఆ కళారూపాలు నగరవాసుల్లో కూడా గౌరవం సంపాయించుకున్నై భవిష్యత్ సాహిత్య చరిత్రకారులు శివసాగర్, గద్దర్, వంగపండు ప్రసాదరావు మొదలైనవారి పాటలను సాహిత్య చరిత్రలో ప్రస్తావించకుండా ఉండలేరు అంటే వీళ్ళు 'అజ్ఞాత జానపద కవులు కారు. కవిత్వంలో Folk simplicity అనేది సాధించదగిన లక్ష్యంగా సాహిత్యంలో ప్రవేశించింది సాంఘిక చైతన్యం లక్ష్యంగా ఉత్తమమైన కవిత్వం వచన కవిత్వంలో కూడా వస్తున్నది ఇటీవలి కవితా సంపుటాలను బట్టి చూస్తే ఎదిరించడం ఒక మార్గంగా చేసే ప్రబోధమే ఎక్కువ కనిపిస్తున్నది ఈ కావ్య సంపుటుల రచయితలంతా రచయితల సంఘాల్లో సభ్యులుకారు సంఘసభ్యత్వం వీళ్ళ పట్ల కేవలం ఒక ఫార్మాలిటీ వచన కవిత్వంలో దిగంబర కవుల ప్రభావం వల్ల కొంత అసభ్య పదజాలం ఇంకా అక్కడక్కడ కనిపించినా సూటిగా మొరటుగా చెప్పే పద్ధతి కవిత్వానికి కొంత గుణమే ఇచ్చింది

భాషా ప్రయోగంలో చెప్పుకోదగిన మార్పు వచ్చింది మాండలిక భాషా ప్రయోగానికి ఎవరూ సిగ్గుపడటం లేదు మాండలికాల పరస్పర అవగాహనకు విప్లవవాద సాహిత్యం చాలా తోడ్పడుతుంది విశాఖపట్టణంలో గద్దర్ పాటలకు,

హైదరాబాద్‌లో వంగపండు ప్రసాదరావు పాటలకు ఉన్న ప్రశస్తి ఈ విషయంలో తార్కాణం

కథా నవల విషయంలో అనుకున్నంత జరగలేదు కావ్యసంపుటులు వచ్చినంతగా కథా సంపుటులు కనపట్టంలేదు కొంత మంది కవులే నవలలు రాశారు వాటిల్లోనూ కవిత్వమే కనిపిస్తున్నది మరి కొందరు 'పూర్తి మాండలికం' వాడటంవల్ల ఇతరుల కర్థం కావటం లేదంటున్నారు విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావుగార్ల విశాఖ మాండలికంలో రాసినవి అన్ని ప్రాంతాల వాళ్ళు చదువుతున్నారు అల్లం రాజయ్య నవలల విషయంలో ఇబ్బంది అవుతున్నదంటారు కారణాలు వెతకాలి "విప్లవ సాహిత్యోద్యమంలోనే కథ జీవితంలో వేగాన్ని, విస్తృతినీ, వైవిధ్యాన్ని, వైరుధ్యాలను,- అన్నిటినీ మించి జరిగినవి జరిగినట్టుగా చెప్తేనే అద్భుతంగా అద్భుతమైన కథలు కాగల ప్రజల పోరాటాలకు కళారూపంగా, ఇముడ్చుకోవలసినంతగా ఇముడ్చుకోలేక పోయింది" అని సృజన నూరో సంచిక (1980 మార్చి) పర్యావలోకనం చేసింది

పట్టణాల్లో మనం అనుకునే నాటకాల్లో విప్లవవాద సాహిత్యం ఏమీ రాలేదనుకుంటాను

ఇక సాహిత్య విమర్శలో మూలసూత్రాల గురించిన చర్చే ఎక్కువ జరిగింది సాహిత్యం ఫలానిది చెయ్యాలి, ఫలానిది చెయ్యకూడదు వంటి సూత్రీకరణలే ఎక్కువ జరిగినై వివాదాస్పదమైన 'గతితార్కిక సాహిత్య భౌతిక వాదం' అనే కొత్త పద్ధతి త్రిపురనేని మధుసూదనరావు ప్రవేశపెట్టాడు మధుసూదనరావు, శేషేంద్రశర్మ, ఆర్ యస్ సుదర్శనం వంటివారి విమర్శల మీద గట్టి ముట్టడే చేశాడు, కాని మధుసూదనరావు కత్తి ముక్కుకు సూటిగా పోతుంది ఏది అడ్డంవస్తే దాన్ని నరికేస్తానంటుంది అడ్డమే రానక్కర్లేదు, పక్కగా వచ్చినా చాలు ఇందుకు ఆయన రా రా "సారస్వత వివేచన" మీద చేసిన విమర్శ ఒక ఉదాహరణ ఇతర విమర్శలను ఖండించటానికే మధుసూదన

రావు కాలం వ్యయమవుతున్నది, ఈయన చేసిన కోర్టు ప్రకటనలో కూడా సాహిత్య విమర్శ ఉంటుంది విడివిడిగా శ్రీకాకుళ పోరాట సాహిత్యం మీద చలసాని ప్రసాద్, సుబ్బారావు పాణిగ్రాహి మీద నాగభూషణం, ప్రజల మనిషి మీద వరవరరావు కొన్ని వ్యాసాలు రాశారు మార్క్సిస్టు విమర్శకు నమూనాగా గ్రహించదగిన గ్రంథ విమర్శగాని, ప్రక్రియా విమర్శగాని తెలుగులో ఇంకా రావలసి ఉంది ఈ విషయంలో విప్లవ వాద సాహిత్యం అభ్యుదయ సాహిత్యం కన్నా సాధించిందేమీ లేదు

ఈ సందర్భంలో ఇంకొక empirical problem ఉంది సాహిత్యంలో అభ్యుదయవాదం- విప్లవవాదం అని రెండు ప్రధానవాద భేదాలున్నై విప్లవ వాముల్లో అరుణోదయ- జననాట్యమండలి భేదాలు ఒకవంకా, విరసం- జనసాహితి భేదం ఇంకోవంకా ఉన్నాయి

సంస్థల పరంగా ఉన్న భేదాలు స్పష్టంగానె తెలుసుకోవచ్చు సాహిత్యంలో ఈ భేదాలు గుర్తుపట్టగలమా? ఏది అభ్యుదయ రచన? ఏది విప్లవ రచన? అంత స్పష్టమైన భేదం లేదనే నా ఉద్దేశం ఉదాహరణకు చెరబండరాజు పాటల్లో ఏవో కొన్ని మినహాయిస్తే అన్ని రకాల మార్క్సిస్టులకు అంగీకారమైనవే ఎక్కువ అందుకే ఒక్కోసారి కొందరు కవులు అన్ని సంఘాల పత్రికల్లోనూ కనిపిస్తారు అల్లం రాజయ్య కథలు అభ్యుదయలో అచ్చయినై దేవరాజు మహారాజు రచనలు అన్ని రకాల పత్రికల్లోనూ వస్తాయి ఆర్వీయార్ రచన ఒకటి సృజనలో చూశాను సంస్థలు చూడదల్చుకున్నంత భేదం రచనల్లో లేదని నా ఉద్దేశం 'అదిగో విప్లవం వచ్చేసింది' అనిగాని, 'తుపాకి తీసుకొని తిరుగబడు' అనిగాని రాసిన వాటిల్లోనే ఈ భేదం కనపడుతుంది ప్రతి కథలోనూ, పాటలోనూ, అదే వాక్యమో, భావమో అయితే అది సాహిత్యం కాదు పార్టీ డాక్యుమెంటులో అయినా విసుగెత్తిస్తుంది సమకాలిక పోరాటాలను వర్ణించటంలో ఈ భేదం కనిపిస్తుంది

పండితాపురం, ఆదిలాబాదు రైతుపోరాటాలను విప్లవవాదులు కీర్తిస్తారు అభ్యుదయ వాదులు పట్టించుకోరు ఇంద్రవెల్లి గోండుల హత్యాకాండ గురించి విప్లవవాదులు రాస్తారు ఇతరులు ఉపేక్షిస్తారు ఇక్కడా వాళ్ళవాళ్ళ అభిమాన రాజకీయ గ్రూపుల పాత్రనుబట్టే రచనా వ్యాసంగం ఉంటుంది అంతర్జాతీయ రంగంలో చైనాను ప్రశంసిస్తూ కొందరు రాస్తే, రష్యాను ప్రశంసిస్తూ కొందరు రాస్తారు కంపూచియా సమస్యలో అభ్యుదయ, విప్లవ రచయితలు భిన్న పక్షాలు ప్రత్యేకాంశాల గురించి రాసినచోటే అభ్యుదయ, విప్లవవాదులు భేదిస్తారు జనరాలిటీస్‌లో ఈ భేదం కనపడదు స్వదేశీ పోరాటాల్లో విప్లవ వాదుల మధ్య కూడా ఏకత్వం లేదు అదే సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది

1970-1980 సంవత్సరాల మధ్య కాలం తెలుగులో విప్లవాదయుగంగా గుర్తించవచ్చు తెలుగు సాహిత్యంలో అంతకు ముందున్న కేవల రూపవాద, అయోమయ వ్యక్తివాద సాహిత్య రీతులమీద విప్లవవాదం విజయం సాధించిందనే చెప్పవచ్చు ఈ కృషి కవిత్వంలో జరిగినంత వచనంలో జరగలేదు వచనంలో క్షీణ సాహిత్య, క్షుద్ర సాహిత్య ధోరణులు బలంగానే ఉన్నై. ఇటీవలే ఈ ధోరణుల దుష్ప్రభావాల్ని గుర్తించిన వివిధ రచయితలు (విడివిడిగా గాని, సంఘాల నాయకత్వాన గాని) చర్చలు సాగించి ఈ ప్రభావాల్ని ఎదుర్కుంటున్నారు

సమాజం మీద గాని సాహిత్యం మీద గాని విప్లవవాద సాహిత్య ప్రభావం ఎట్లా ఉండబోతుంది ? అనే ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టం విప్లవవాద రాజకీయాల భవిష్యత్తు మీద విప్లవ సాహిత్య భవిష్యత్తు ఆధారపడి ఉంది అఖిల భారత స్థాయిలో పనిచేస్తున్న విప్లవ రాజకీయ పక్షం దేశంలో లేదు తమ తమ ప్రభావాల్ని కొన్ని పరిమిత ప్రాంతాల్లో ప్రసరిస్తున్న విప్లవరాజకీయాలగ్రూపులున్నై ఈ గ్రూపుల మధ్య పరిష్కారం కనుచూపు మేరలో లేని వైరుధ్యాలున్నై ఇవి కొన్నిచోట్ల సాహిత్య సంఘాల్ని విడదీస్తున్నై మరి కొన్నిచోట్ల యథాస్థితి వేర్పాటు ధోరణులను కొనసాగిస్తున్నై ఈ పరిస్థితుల్లో సాహిత్యంలో విప్లవవాద ధోరణుల భవిష్యత్తును ఊహించటం ఏమంత ఫలవంతమైన పని కాదు

ఆధునిక తెలుగు సాహిత్యంలో

# సంప్రదాయ వాదం

—ముకురాల రామారెడ్డి

పై శీర్షికను నేటి ( 1-8-1981 ) వక్తవ్యాంశంగా ఒప్పుకొన్నమాట వాస్తవమే అలా ఒప్పుకోవడంలో తొందరపడి పొరపాటు చేశానా ! అని పిస్తున్నది అనుకొంటున్నది చెప్పొద్దా మరి ! పొరపాటు ఏమైనా దొర్లితే అది నాదా ? చేయిస్తున్న వారిదా ? అని మరో సందేహం పొరపాటో, సరిపాటో, ఏ కొంచెం దొర్లినా ఉభయ పక్షాలకూ చెందాలి అదే సబబు 'కొంచమైనను తగపంచి కుడుపు లెస్స'

ఈ శీర్షికలో రెండు శబ్దాలను కాస్త వ్యాఖ్యానించుకోవలసి ఉంది 'అసలు విషయం చెప్పండి, శబ్దాలవెంట పడకండి' అంటూ ఎదురు తగిలే వాళ్ళుంటారు అలాంటి వాళ్ళకే మొదట చెప్పేది 'శబ్దార్థాలు దర్పణాల వంటివి' అన్నాడు ప్రతీహారేందురాజు విషయం స్పష్టంగా తెలియడానికి, ప్రతి ఫలించడానికి ఉపయోగించే శబ్దార్థాలు ప్రథమ కారకాలు

'సంప్రదాయం' అంటే 'పాతది' అని బాహాటంగా అర్థం చెప్పే సాహిత్య రచయితలు అనేకులు బయుదేరారు నేటి కాలంలో అంతేకాదు ఆ మాట వింటేనే ఈసడించుకొంటున్నారు వీళ్ళ శిష్య వర్గజనాభా బాగా పెరిగి పోతున్నది వీళ్ళంతా కలసి మాది 'ఆధునికం' అంటే 'కొత్తది' అంటున్నారు వీళ్ళవాదాలు వినిసంప్రదాయజ్ఞులు చప్పరించేస్తున్నారు ఏమిచేసినా సంప్రదాయజ్ఞుల బలం సన్నగిల్లుతున్న రోజులివి ఎలా తోస్తే అలా చెప్పి మేం చెప్పిందే ఆధునికం అన్నవాళ్ళ బలగమే బాగా వర్థిల్లుతున్నది ఇదంతా ఎందుకు జరుగు

తున్నది? అంటే సంప్రదాయ లక్షణాలు, ఆధునిక లక్షణాలు స్థూలంగానైనా తెలియకపోవడంవల్ల వాటి పరిణామాలు చారిత్రక దృక్పథంతో తైపారు వేసి చూసుకోకపోవడం వల్ల కొంత గజిబిజి జరుగుతున్నదని చెప్పవచ్చు

సంప్రదాయం అంటే పాతది అని కాదు పరంపరగా- ఏనాటినుంచో ఈనాటి దాకా వస్తున్నది అని దాని ముఖ్యార్థం / ముఖ్య భావన ఈ శబ్ద భావన ఏ రంగంలోనైనా అట్లే కలగవలసింది, అలాగే చెల్లవలసింది కానీ పరంపరగా వస్తున్నది కదా! అందుకే అది పాతది అని నేటి వాళ్ళు ఎదురు తర్కంతో కొత్త అర్థం / భావన రూపొందించుకోవచ్చు బహుశా అలా రూపొందించుకోబట్టే సంప్రదాయం=పాతదిగా వ్యవహారంలోకి వచ్చినట్లుంది దీని సంగతి తర్వాత చూస్తాం అధునా → ఆధునిక = ఇప్పటి అనే అర్థంలో బాగానే కుదిరింది అయినా modern అనే ఇంగ్లీషు పదానికి 'ఆధునిక' అనే భారతీయ పదం టంకించుకొన్నట్లు తెలుస్తున్నది (టంకింపు = Coining వేరు, తర్జుమా వేరు) ఇంగ్లీషు అర్థం వెంట చారిత్రకంగా వెళ్ళితే 'ఆధునికం' అన్నది క్రీ శ 1500 నుంచి ప్రారంభమవుతున్నది అంటే మధ్యయుగ చారిత్రక లక్షణాలతో విడివడి నవీనమైంది ఆధునికం అన్నమాట అది యూరప్ చరిత్రకు వర్తించే లక్షణం భారతీయుల ఆధునిక జీవనం ప్రారంభమైన దశ వేరు ప్రజాస్వామ్య భావాలూ, జాతీయ భావాలూ వికసించడం ప్రారంభమైన నాటి దశ అది 19 వ శతాబ్ది చివరి పాదం నుంచి మన ఆధునికత వికసిస్తూ వచ్చినట్లు స్థూలంగా ఒప్పవచ్చు ఆధునికత=మధ్యయుగ లక్షణాలతో విడివడ్డ నవీనత అనే అర్థం మనకూ సరి పడుతుంది

పేరా 1 3 లో పేర్కొన్నట్లు నేటివాళ్ళ భావన ప్రకారం సంప్రదాయం= పాతది అని ఈ మేరకు సమ్మతిస్తూనే ఆధునిక తెలుగు సాహిత్యంలో సంప్రదాయ తత్వం ఎలా ఎలా అవతరిస్తున్నదో కాస్త చెబితే వక్తవ్యాంశోద్దేశం నెర వేరవచ్చునని భావిస్తున్నాను ఇక్కడే మరో గడ్డు సవాలు అడ్డు తగులు తున్నది ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రతి ఫలిస్తూ నానా అవతారాలెత్తిన

సంప్రదాయ లక్షణాలు నానా దిక్కులవి సంస్కృత భాషా-సాహిత్య సంప్రదాయ లక్షణాలూ, పరిసర భాషా - సాహిత్య సంప్రదాయ లక్షణాలూ, పాశ్చాత్య సాహిత్య సంప్రదాయ లక్షణాలూ ఇంకా ఇంకా ఉర్దూ - ఫార్సీ భాషా - సాహిత్య సంప్రదాయ లక్షణాలు కూడా ఉన్నాయి అదంతా చెప్పడం నా తరమా ? మన తరం అంతా దాడి చేసి సాధించే పని అది ఇచ్చిన శీర్షిక ముఖ్యోద్దేశం నెరవేరాలంటే ఆయా భాషా-సాహిత్య సంప్రదాయాలను, ఆధునికత్వాలను గురించి తులనాత్మక అధ్యయనం జరిపించి తీరాలి అప్పుడు తెలుస్తుంది అసలు పస సంప్రదాయం తడాఖా ఏమిటో, ఆధునికం తమాషా ఏమిటో, అందులో కార్బన్ కాపీ సాహిత్యం ఎంతో, స్వదేశీకరణం ఎంతో, విదేశీ వరణం ఎంతో, స్వభాషీకరణం ఎంతో, స్వాభావికీకరణం ఎంతో, నవీనీకరణం ఎంతో, స్వోపజ్ఞాజనితం ఎంతో ? ? ఆ సుగతి వేరు ఇప్పుడు నా సుతి ఏమిటని ? ఆధునిక తెలుగు సాహిత్యంలో కనిపించే సంప్రదాయ తత్వాన్ని ఎక్కడ ఇక్కించుకోవాలి? ఎక్కడ జోడించాలి ?

మనలో కొందరికి బాగా తెలిసిన సాహిత్య సంప్రదాయాల మూలాలు రెండు ఇంగ్లీషు సాహిత్య సంప్రదాయం, ప్రాచీనాంధ్ర సాహిత్య సంప్రదాయం వీటిపై ఇతర ప్రభావాలుండవచ్చు, అది వేరు కానీ ఆధునిక తెలుగు రచనలపై ఆ సంప్రదాయాల ప్రభావాలు సూటిగా ఉన్నట్లు ద్యోతక మవుతుంది వాటి లక్షణాలెన్నో ఆధునిక తెలుగు సాహిత్య ప్రక్రియల లక్షణాలతో సంవదిస్తున్నాయి ఇంగ్లీషు భాషా - సాహిత్యాల ప్రభావం నేటి మన సాహిత్యంపై గాఢంగా ఉన్నట్లు డా॥ కె వీరభద్రరావు, డా॥ సి నారాయణరెడ్డి మొ॥ పరిశోధకులు కొందరు రుజువు చేశారు ఆయా పరిశోధనలను ఇంగ్లీషులోకి తర్జుమా చెసి చూపితే పాశ్చాత్య సాహిత్య సంప్రదాయాలకు కూడా భారతీయ గిరాకీదారు బాగా ఉన్నందుకు ఆయా దేశీయులంతా నోటితో పొగడుతారో, నొసటితో వెక్కిరిస్తారో, అది వేరే సంగతి నిన్న మొన్నటి ఇంగ్లీషు సంప్రదాయం అటుంచి ప్రాచీనాంధ్ర సంప్రదాయం కూడా నేటి మన సాహిత్యంపై బాగానే ఉందని తెలుస్తుంది అంటే ఆధునిక సాహిత్య రచయితల స్వోన్మేషం అసలె లేదని కాదు అది కొంత ఉంది ప్రస్తుతం జ్ఞాపకం ఉన్నంత మనవి

చేస్తాను 'స్వోన్మేషం' అన్నాను కానీ నేను చెప్పింది వాళ్ళది కాదని కూడా రేవు రుజువు కావచ్చు పూర్తిగా తెలియడం ఎవరితరం? పోతన్న అన్నట్లు తెలియడం కొంత సాధ్యం కావచ్చు, 'తెలిసి పలకడం' కష్టతరం

పరిశోధనల ద్వారా ఇప్పటికి తెలిసినంత వరకు ఆధునిక తెలుగు సాహిత్యంలో మొదట రూపొందినవి కొన్ని నాటకాలు, కొన్ని కావ్యాలు ఈ రెండు ప్రక్రియలలో వచ్చిన మార్పులను కొంత దూరం తెలుసుకొంటూ పోతే కథ, నవల, వ్యాసం, వచన కవిత, విమర్శ, సమీక్ష వంటి ఇతర ప్రక్రియల పరిణామ స్వరూప-స్వభావాలు సులభంగానే గ్రహించవచ్చునన్న మాట అంటే నాటకం, కావ్యం/కవిత్వం ఈ రెండు ప్రక్రియలలో ప్రవేశించిన ఆధునికత్వమే - అది వస్తురూపంలో ఉండనీ, రచనా రూపంలో ఉండనీ, నానా ఇజాల రూపంలో ఉండనీ - తర్వాత వెలసిన ఆ ఇతర ప్రక్రియలలో ప్రతిఫలించిందనీ దేశీ, విదేశీ సంప్రదాయ ప్రభావాలు, స్వోన్మేషంతో రచించిన తీరు తెన్నులు అన్నీ ఈ రెండు ప్రక్రియలలోనే బాగా కనిపిస్తాయనీ ఇక్కడే జ్ఞాపకం పెట్టుకోవలసిన అంశం ఆధునిక యుగంలో మొదటి నాటకంగా చెప్పుకొంటున్నది 'మంజరీ మధుకరీయం' శ్రీ కోరాడ రామచంద్రకవి రచించింది (1886) ఇతివృత్తం మేరకు నూతన కల్పన అయినా సంస్కృత రూపక లక్షణాలనుంచి తప్పుకోలేదు ఉదా॥ మధుకరుడు అనే రాజు మంజరి అనే రాజ కన్యను వివాహమాడడం కథ రాజ వర్గానికి చెందింది అంకాలున్నాయి భాష జటిల సమాస భూయిష్ఠంగా ఉంది క్షుద్ర మంత్రాల ప్రయోగం వగైరా ఉన్నాయి ఉత్తమ పాత్రలకు తత్సమ బహుళమైన భాష, నీచ పాత్రలకు తద్భవ-దేశ్యమైన భాష ప్రయోగించబడింది రచన ప్రదర్శన యోగ్యంగా కుదరలేదు మొత్తంపై విదేశీ సంప్రదాయం కనబడకున్నా ఇది సంస్కృత సంప్రదాయంతో అవతరించిందే రచన స్వతంత్రమైంది కాబట్టి ఈ యుగంలో దీన్ని తొలి తెలుగు రూపకం అన్నారు సంప్రదాయం నుంచి తప్పుకోనిది, ఆధునిక లక్షణాలు లేనిది ఈ యుగంలో తొలి తెలుగు రూపకం

అనడం పునరుక్తిదోషం ఈ కవి తెలుగులో రచించిన ఇతర నాటకాలన్నీ సంస్కృత రూపకాలకు అనువాదాలు తర్వాత వరసగా చూస్తే, శ్రీ కొక్కొండ వేంకట రత్నం సంఘ సంస్కారానికీ, వ్యావహారిక భాషకూ విరుద్ధమైన రచనలు చేసిన సంగతి సువిదితం శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులు అనువదించిన 'శాకుంతలం'లో ఉత్తమ పాత్రలకు తత్సమ భాష, నీచ పాత్రలకు దేశీయమైన తెలుగు ఉపయోగించారు పాత్రోచిత భాషా విషయికంగా ఇదే సంస్కృత సంప్రదాయమే శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి తెలిగించిన 'జూలియస్ సీజరు'లో 'సీజరుండు వంటి ప్రాచీన గ్రాంథిక భాష ఉంది మూలంలోని Iambus ఛందస్సుకు బదులుగా తెలుగు తేట గీతిని ప్రయోగించి రచించిన పద్య నాటకం ఇది ఈ రకంగా ఇది దేశీ-విదేశీ సంప్రదాయ లక్షణాలతో వెలసిందే ఇందులో ఉన్న ఆధునికత ఏమిటి? ఆధునిక యుగంలో రచింపబడినది కాబట్టి వీటిని ఆధునిక రచనలలో మొదటివిగా చూపారు పరిశోధకులు ఇక్కడ మన చర్చ మేరకు ఆధునికం అంటే ప్రాచీన మధ్యయుగ లక్షణాలతో విడివడ్డది, ఆధునిక ప్రజాస్వామ్య-శాస్త్రీయ-సంఘ సంస్కరణాది భావాలతో కూడుకొన్నది అని అర్థం కాబట్టి ఈ అర్థానికి సరిపడని రచనలు ఇవి ఈ శాస్త్రిగారి సాంఘిక నాటకం 'నందక రాజ్యం' ఆధునిక యుగంలో సంఘ సంస్కరణ దృష్ట్యా రచించిన తొలి తెలుగు స్వతంత్ర నాటకం (1880) కరణాలకూ, వైదికులకూ వైరం వద్దని బ్రాహ్మణ వర్గ వారంతా ఏకంగా ఉండాలని ప్రబోధిస్తూ రచించిన పద్య నాటకం, ఉత్తమ వర్గానికి చెందిన స్త్రీలు కూడా సంస్కృత నాటకాలలో నీచ పాత్రలే ఆ దృష్టి ఎంతవరకు సమంజసం? అని ప్రశ్నించుకొన్న రచయిత పాత్రలన్నింటికీ సరళ గ్రాంథికం ప్రయోగించారు కథ కల్పితం కరణాల, మంత్రుల అధికార దౌర్జన్యాలు వర్ణితమైనాయి ఈ రకంగా కనిపించిన మార్పులో కొత్త ఉంది పద్య నాటకంగా రచించడం పాశ్చాత్య సంప్రదాయం

శ్రీ కందుకూరి వీరేశలింగం తన సాహిత్య రచనా శక్తిని ఆధునికోన్ముఖమైన సంఘ సంస్కరణోద్యమానికి ఉపయోగించారు దృక్పథం ఆధునికత

వైపు మొగ్గినా అది సంప్రదాయ లక్షణం కాదని ఎలా చెప్పగలం ? 'సంస్కరణోద్యమం' అనేది బౌద్ధంవస్తే బౌద్ధం వైపు, జైనం వస్తే జైనం వైపు, బ్రాహ్మణం వస్తే దానివైపు (కాళిదాసాదులు, నన్నయాదులు), మహమ్మదీయ మతం వచ్చినా, క్రైస్తవ మతం వచ్చినా దానివైపే (అల్లోపనిషత్, తోఖ్య చరిత్ర), అలా అలా సాగుతూ కాంగ్రెస్ వస్తే కాంగ్రెసు లక్ష్యాలకు అనుగుణంగా, కమ్యూనిజంవస్తే దాని లక్ష్యాలకు అనుగుణంగా కనిపిస్తూనే ఉంది ఆధునికం = ప్రవాహిని లక్షణం గలది అని అర్థం చేసుకొంటే ఆధునికం అన్న ప్రతి అంశం లోనూ సంప్రదాయాన్నే చూడవచ్చు ఇది బాగా గుర్తుంచుకోవలసిన మాట ఇది అతివాదం అంటారేమో ! అతిగా కన్పించినా, మితిగా కన్పించినా 'వాదం' అనేది వాస్తవం గ్రహించడానికే ఉపయోగించాలి వాస్తవాన్ని విడిచిన వాదం నిలవదు వీరేశలింగం రూపక రచనలలో విదేశీ సంప్రదాయం ఉంది భాషలో వ్యావహారికమైన మార్పు చూస్తాం ఈ మార్పు కూడా ఆయా యుగాల సంప్రదాయమే దీన్ని కాస్త ముందు చూద్దాం సంస్కరణోన్ముఖమైన భావాలు కూడా సంప్రదాయ చరిత్రలో కోకొల్లలుగా ఉన్నాయి ఇప్పటి కాలానుగుణమైనవి కాబట్టి ఇవి ఆధునికమై నవీనమైనవి ఎప్పటికప్పుడు నవీకరణం, పునర్నవీకరణం, వివిధ అవసరాల దృష్ట్యా ఆదాన - ప్రదానాలు తప్పవని ఒక సాహిత్య చరిత్రేమిటి ? చరిత్ర శాఖలన్నీ రుజువు చేస్తున్నవి గదా ! ఏ మూల నుంచి దిగుమతి అయిన సరుకైనా అందులో ఏదో సంప్రదాయం ఉంటుంది విధవా వివాహ ఉద్యమానికి బాకాగా వచ్చింది 'కన్యాశుల్కం' నాటకం (1892) ఇందులో కనిపించే సంఘ సంస్కరణ, భాషా సంస్కరణ, ప్రదర్శనయోగ్యంగా పాశ్చాత్య ప్రక్రియానుగుణంగా అమరిన రచన ఈ మూడు ముఖ్యమైనవి విధవా వివాహ 'కథ అడ్డం తిరిగింది' అని చారిత్రక వాస్తవం ధ్వనించేటట్లు చెప్పి ముగిసిన ఉత్తమ ఆధునిక నాటకం ఇది ఇక్కడ చారిత్రక వాస్తవ ప్రసక్తి ఏముందంటే హిందూ సంఘంలో ఎంత మంచి సంస్కరణనైనా తీసుకరండి దా' కథ అడ్డం తిరుగుతుంది సంఘ సమైక్యతకు అపాయకరమైన సంప్రదాయ

లక్షణాలు కొన్ని ఉన్నాయి వాటిని వదులుకోలేని మూఢులు కొందరు సాహ
సించలేక కొందరు సమైక్య సంస్కరణోద్యమాన్ని తగులబెట్టి కాలిచచ్చే వృథా
మనస్తత్వం హిందువులలో చాలా మందికి ఉంది అని చెప్తుతుంది ఈ నాటక
సారాంశం మొత్తానికి హిందువుల వాస్తవ మనస్తత్వ నిరూపణ ఉంది ఈ
నాటకంలో అగ్ని మారితే పనికిరాని సంప్రదాయ లక్షణాలు మారినట్లు లెక్క-
తమ సాంఘికాభివృద్ధికి తోడ్పడే సంస్కరణోద్యమానికి సాహసించని పిరికితనం
భారతీయులది ఇది మహా చెడ్డ సంప్రదాయం ఇది మారడం లేదా ? అంటే
యుగానికో అడుగు అన్నట్లు మారుతున్నది ఈలోగా విదేశీ సంప్రదాయాలెన్నో
దాడిచేసి భారతీయ సంప్రదాయాన్ని కబళించవనే పూచీ ఏముంది ? కన్యాశుల్క-
నాటకంలోని విధవపాత్ర 'బుచ్చమ్మ' చివరకు సాయెబుతో లేచిపోయినట్లు మరో
అంకం రచించి చూపితే మరీ ప్రభావవంతమైన వాస్తవికత అమరి ఉండేవి

తర్వాతి నాటక రచనలలో పౌరాణిక - చారిత్రక - సమకాలిక సాంఘిక
కథలు ఎన్నో వెలిశాయి వ్యావహారిక భాష ప్రబలింది ఆ కాలలో అంతర్వి
భాగాలుగా రంగాలు, దృశ్యాలు వెలసి, ఏకాంకికలు, సంగీత రూపకాలు, తెర
లేవి నాటకాలు, పాటలు లేని నాటకాలు ఇలాంటివి రూపొంది ప్రక్రియలో
సామాజిక లక్ష్యంలో మార్పులు చూపించినట్లు గమనించవచ్చు సంస్కృత రూపక
సంప్రదాయం నుంచి బాగా విడివడి పాశ్చాత్య రూపక సంప్రదాయం, సాంఘిక-
సంస్కరణ,సాంకేతిక సంప్రదాయం పుంజుకొని ప్రజాస్వామ్య భావాలు,దేశభక్తి,
సంఘ ప్రదర్శన సౌలభ్యం, నూతన ప్రయోగాలు కలుపుకొని వెలసిన ఆధునిక
నాటకాలు అనేకం స్వభావ వాదం(naturalism),యథార్థవాదం(realism),
కాల్పనికత, వాస్తవికత, హేతువాదం, అభ్యుదయ వాదం, అధివాస్తవికత,
అస్తిత్వవాదం, చైతన్య స్రవంతి, విప్లవవాదం, అసంభూతివాదం, రూపవాదం,
ఇలాంటి [illegible] ప్రక్రియలెన్నో ఆధునిక తెలుగు నాటకాలలో ప్రతిబింబిం
చాయి [illegible] లక్ష్యాలకో, కమ్యూనిస్టు లక్ష్యాలకో అనుగుణంగా వచ్చిన
రచనలెన్నో ఉన్నాయి నేటి ప్రదర్శనలో ఆయా ఇజాల ప్రచారం చూస్తూనే

ఉన్నాం ఈ ఇజాలు 'సంప్రదాయవాదం'లో భాగం కావా? సంస్కృత సాహిత్య సంప్రదాయంలో భాగంగా 'అనుభూతి వాదం' వంటి వాటిని ప్రత్యేకించి నిరూపించవచ్చు 'ప్రత్యక్షకల్పసంవేదనోదయమే పహి రసః'' అన్నాడు భట్టతౌతుడు సుఖదుఃఖాల అనుభూతికలించడమే సాహిత్య రచనల పరమోద్దేశం మిగతా ఇజాలెన్నో యుగాల మీద చేతులు మారి ఇంగ్లీషు ప్రభావంతో తెలుగులో వెలసినట్లు చెప్పవచ్చు

ఇజాలు, వాదాలు, తత్వాలు, ఎవైనా అవి రచయితలు సృష్టించినవికావు దార్శనికులైన మేధావులు ప్రపంచించిన ఆలోచనలు అవి సాహిత్యంలో చొప్పించినందుకు వాటికి ప్రచారం కూడా బాగా లభిస్తుంది ఆయా ఆధ్యాత్మిక, ప్రాపంచిక తత్వాలను ప్రచారం చెయ్యడమే సాహిత్యకళకు సాంప్రదాయికంగా లభించిన జీవిత లక్ష్యం ఆధునిక తెలుగు రచయితల ఇజాల కన్నిటికీ సూచిగా 18, 19 శ పాశ్చాత్య సాహిత్యంలో దాఖలాలు చూడవచ్చు పాశ్చాత్యరీతి ఆలోచనలు, ప్రక్రియా భేదాలు వగైరా తెలుగు నాటక ప్రక్రియలో కనిపిస్తున్నట్లే కవిత్వ ప్రక్రియలోనూ కనిపిస్తాయి సంప్రదాయరీతి రచనలపై తిరుగుబాటు ధ్వజమెత్తుతూ వీరేశలింగం 'సరస్వతీ నారద సంవాదం' రచించారు (1887) పరంపరా గతమైన ఫక్కీలో పాడించే పాటగా వ్రాసే తెలుగు కవిత్వంతో విసిగి కొత్త రూపం, కొత్త మలుపు కావాలని రచించిన తిరుగుబాటు కావ్యం ఇది స్పెన్సర్ రచించిన 'Tears of the Muses' కు ఇది అనుసరణం, సంవాద రూపం, ప్రాచీన పద్యరచన, ఖండ కావ్యం- ఇవి దీని సంప్రదాయ లక్షణాలు అయినా తెలుగు కవి చొప్పించిన స్వభావీకరణం, స్వదేశీకరణం ఉంది ఆ మాత్రం లేకపోతే అది తెలుగు రచన కాదుగదా! శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి రచించిన 'ముసలమ్మ మరణం' (1899) లోని కథ తెలుగు దేశీయమైంది, సాంఘిక సంక్షేమం ఆశించి ఒక మహిళ చేసిన త్యాగం వర్ణించిన కథ అది వస్తువు ఎంపికలో కొత్తదనముంది రచన ప్రాచీన పద్యప్రక్రియలో ఉంది వస్తువు మారవచ్చు, భావాలు రచయిత సొంతానివే కావచ్చు ప్రక్రియ రూపం సాధారణంగా మారదు కోటి కొక్క ఉదాహరణగా యుగానికొకసారి మారితే మారవచ్చు సాహిత్య పరిణామంలో గుర్తించదగిన మాట ఇది మాటి మాటికీ ప్రక్రియ మారనక్కరలేదు అన్నారు సాహిత్య వేత్తలు తిరుపతి వెంకట కవులు నవ్య కవిత్వానికి నాంది పలికారని

అప ప్రచారం బాగా చేశారు వాళ్ళు, వాళ్ళు ప్రయత్నం చేసిందంతా పురాణ తత్వ పునస్థాపన అది నిలిచేది కాదు రెండి

'ఆధునిక కవిత్వ మన్నది కాలవాచి' (ఆధునికాంధ్ర కవిత్వం, పు 172) ఈ అభిప్రాయం ఆధునిక భారతీయ సాహిత్యానికంతా సరిపడేటట్టుగా ఉంది ఈ అభిప్రాయంలో రెండు మూడు పొరలున్నాయి ఆధునికత్వం పేరుతో భారతీయులు స్వయంగా సృష్టించింది మృగ్యం ఆధునికత కవిత్వంలో కూడా పాశ్చాత్యుల నుంచి దిగుమతి చేసుకొన్నదే రచయితలు ఆధునిక యుగంలో ఉన్నారు కాబట్టి వారివి ఆధునిక రచనలు అనవలసి వచ్చింది ఆధునిక యుగంలో ఉండీ కూడా ఆధునికత అంటనివాళ్ళు అనేకులు ఇలా ఇలా వెళ్ళు తుంటాయి ఆ పొరలు కాబట్టి 'ఆధునిక కవిత్వమన్నది కాలవాచి' అనవలసి వచ్చింది 'నాస్త్య చౌరః కవిజనః' అన్న రాజశేఖరుని మాట ఇష్టం లేకున్నా వినవలసిందే కవులను నిరుత్సాహ పరచడం నాకూ ఇష్టం లేదు కానీ ఒక వాస్తవం ఉంది మానవ ప్రవర్తనలో పరస్పరానుసరణం ఉంటుంది ఏ కవి రచనను పరిశీలించినా దాని లక్షణాలు ఎక్కడో ఒక చోట దొరుకుతూనే ఉంటాయి అయితే కవుల సొంతం అంటూ ఏమీ ఉండదా ? అంటె ఉంటుంది గ్రహించి వేసింది కొంత, దేశ కాలానుగుణంగా తమ సొంత రంగు పూసింది కొంత ఉంటుంది కవుల సొంత రంగును కూడా అంత సులభంగా ఒప్పుకోని సూక్ష్మ పరిశీలన రాజశేఖరునిది కాబట్టి అంత సాహసంగా అనేశాడు ఉదా॥ గురజాడ 'దేశభక్తిగేయం' కంటె ముందే ఆ భావన గల గేయాలు తెలుగులో వెలిశాయి వాటిలో జాతీయోద్యమ లక్ష్యాలు ఉన్నాయి ఆధునిక జాతీయత అనేది మనం దిగుమతి చేసుకొన్న భావన అది మంచిదే దాని పూర్వవాసనలను ప్రసంగిస్తున్నాం గురజాడ దేశభక్తి గేయానికి Tennyson రచించిన 'Love thou thy land' అనే గేయం మూలాధారమని తెలిసింది ఇలా ఉంటాయి సంప్రదాయ ప్రభావాలు తర్వాతి కవులలోనూ ఇట్లైవదో సంప్రదాయ ప్రీతి అధికంగా ఉన్నట్లు చూడవచ్చు ప్రస్తుతం జ్ఞాపకంలో మెదిలినంతవరకు చూస్తే [illegible] కావ్యాలు [illegible] వ్యక్తిమతా [illegible] ఎంకిపాట [illegible] భావకవిత్రా [illegible] సామ్రాజ్యం బాగా ప్రచురించారు ఇలాంటి ఆధునిక కవులను వెదికి శోధించ వలసిన అవసరముంది- ఆధునికం పేరుతో ఏ ఇజం వచ్చినా అది ఇంగ్లీషు

ద్వారా వచ్చి నాటక-కవిత్వ రంగాలలో మొదలు ప్రవేశించి తర్వాత ఆయా ప్రక్రియలకు పాకినట్లు తెలుస్తున్నది లభించే దేశీయమైన స్వోన్మేషం ఉండ వచ్చు అది బయటికి తీయడం ప్రత్యేక పరిశ్రమ ఈ విషయాన్ని ఈ పద్ధతితో కాకుండా మరో పద్ధతితో ఒకసారి పారు వేసి చూద్దాం

సాహిత్య ప్రక్రియలు ఎన్నయినా ఉండవచ్చు వాటి సమష్టి లక్షణం మాత్రం మూడు అంశాలలోనే కనిపిస్తుంది వస్తుకళ, రచనా కళ, భావకళ ఆధునిక యుగంలో ఈ మూడు ఎలా వెలిశాయి ? వాటిపై సంప్రదాయ ప్రభావం ఎలా ఉంది ? కొంత చూద్దాం మొదట వస్తుకళ సంగతి - (1) సమకాలిక వస్తువును స్వేచ్ఛగా గ్రహించడం ఆధునికుల పద్ధతి ఈ పద్ధతిపూర్వంలో తక్కువ బాణుడు హర్షచరిత్రనూ, పాల్కురికి సోమనాథుడు సమకాలిక దేశీయ కథలనూ గ్రహించారు (2) పాలకవర్గ కథలను గ్రహించి పొగడుతూ / విమర్శిస్తూ రచించడం ఇప్పుడుంది పూర్వమూ ఉన్నది రాజుల పొగడ్తలు సరే మహిష శతకం కూడా స్మరించదగ్గది (3) ఆది-మధ్య-అంతాలు తారుమారు చేసి కథ రచించడం ఇప్పుడుంది పూర్వం కళాపూర్ణోదయం వంటి వస్తు విధాన వైచిత్రి ఉన్నది (4) సామాన్య వ్యక్తులను, కార్మికులను పాత్రలుగా స్వీకరించడం ఇప్పుడున్నది కాళిదాసు మేఘ సందేశం వంటి కావ్యాలలో పూర్వమున్నది ఈ సంగతి ఇలా కాదు ఘర్షణలో పడ్డ వ్యక్తులనె పాత్రలుగా స్వీకరించి రచించే సంప్రదాయం అన్ని కాలాల రచయితలకూ ఉన్నది అనాలి (5) పాత కథలను మళ్ళీ వ్రాయడం ఇప్పుడున్నది ఇది సరే పూర్వం ఇదే పద్ధతి ఎక్కువున్నది (6) రచయిత ఆశించిన సామాజిక లక్ష్యం వైపు పాత్ర లను, కథను మలుస్తూ రావడం ఎప్పుడూ ఉండేదే (7) కల్పితకథలు రచించడం అన్ని కాలాలలోనూ ఉన్నదే (8) కథ అనిపించకుండా పాత్రల పేర్లు చెప్పకుండా రచించడం ఇప్పుడే కాదు కాళిదాసు మేఘదూతంలో కని పిస్తున్నదే (9) జంతువులతో కథ చెప్పించడం ఇప్పుడు బాల సాహిత్యంలో ఉన్నది పూర్వకాలపు పంచ తంత్ర కథలు బాల సాహిత్యానికి ఉదాహరణ

(10) నేడు సీరియల్ కథలు వస్తున్నాయి పూర్వం బృహత్కథ, కథా సరిత్సాగరం, కాశీమజిలీ కథలు వగైరాలో కనిపించే సీరియల్ లక్షణం ఇంకా ఆకర్షణీయమైంది ఇప్పటి మినీ కథకు పోలికగా పాల్కురికి సోముడు రచించిన 'జొన్నలు ముత్యాలైన కథ' లేదా అటువంటివి మనుగా ఉన్నాయి (11) కథాత్మకమైన మినీ కవిత ఇప్పటిదే కాదు గాథా సప్తశతినిండా ఈ లక్షణమే ఉంది (12) పాత పాత్రకు సమకాలిక భావాలు అంటగట్టి రచించడం ఇప్పుడున్నది తిక్కన భారతంలోని అశ్వత్థామకు వీరశైవ లక్షణాలు అంటగట్టి చూపాడన్నారు విమర్శకులు (13) దువ్వూరి రామిరెడ్డి రచనలో వర్తమాన కథను 'పలితకేశం' చెబుతుంది పూర్వం సాలభంజికలతో చెప్పించిన కథలున్నాయి (14) అనువదించడం, అనుసృజించడం కొత్తకాదు

ఇక రచనా కళను చూద్దాం - రచనా కళను ప్రక్రియ (form) అనడం నేటి పరిభాష రచనా ప్రక్రియ రస్తా వంటిది ఇది మాటి మాటికీ మారదు రచయిత స్వాతంత్ర్యాన్ని వస్తువు మలుపులో, భావశక్తిలో చూడాల్సింది రచనా ప్రక్రియలో చూడడం అంత ముఖ్యం కాదు వస్తువు, రచన, భావం ఈ మూడింటిలోనూ స్వోన్మేషమే చూపించగల రచయిత యుగానికొక్కడైనా లభిస్తాడో లేదో ఆధునిక కథ, నవల, వ్యాసం, గల్పిక వంటివి పాశ్చాత్య సంప్రదాయంతో వెలసిన దాపతు ప్రక్రియ ఎరువు తెచ్చుకొన్నా పాత్రలు, పరిస్థితులు స్వదేశీయమైనవి చిత్రించారు ఈ విధంగా వీళ్ళంతా ఆధునిక రచయితలే ఏ కథకు ఏది మూలం అంటూ పోతే తెగదు ముడి మన ప్రక్రియ లక్షణాలు కొన్ని (1) తెరలేని నాటకం, జీవ నాటకం (live drama) వంటివి దిగుమతులే (2) అలాగే కథల, నవలల గల్పికల రూపురేఖలు (3) నాటకీకరణం, కథాత్మకం అలా ఒక ప్రక్రియనుంచి మరో ప్రక్రియకు మార్చడం పూర్వ దేశీయ సంప్రదాయమే (4) నవలీకరణం, వ్యాస రచన వగైరాలు కొన్ని దిగుమతులు (5) వచన కవితను మన వృత్తగంధి'లో చూడవచ్చు ఇంకా వెనక్కి వెళ్ళి ఉపనిషత్తులలో చూడవచ్చు దగ్గరగా చూడ

డలిస్తే ఆర్థర్ కోస్లర్ చెప్పినట్లు దాన్ని ఇంగ్లీషులోనే 300 సం॥ "ముసలిద్దైనట్లు చూడవచ్చు (6) ప్రశ్నోత్తర పద్ధతితో రచించడం అందరికీ నేర్పింది 'దేవ ధర్మ జాతకం' (7) ఇక కవిత్వంలో గణం, గతి, గమకం, వర్ణవిన్యాసం (అంత్య ప్రాసలు వగైరా) అంటూరా, ఆధునికం అనదగింది ఇందులో ఒక్క-ముక్కయినా కనిపించలేదు నాకు చిత్రగతులు, గళ్ళు కొన్ని ఇంగ్లీషునుంచి దిగుమతి అయినాయి మిగతావి మన పూర్వులు చెప్పినవి కోట్ల లక్షణాలు ఉదా॥ ''నేరుపు బ్రహ్మజేరె-నిజ నిర్మల తేజము సూర్యుజేరె-ఆకారము కాము జేరె- అధికంబగు లక్ష్మి అనంతుజేరె- గంభీరత వార్థిజేరె-కలపెంపు కులాద్రుల జేరె- కీర్తి తా నూరటలేక ద్రిమ్మరుచున్నది మైలమ భీమడీల్గినన్'' దీని నకలు భాగాన్ని గురజాడ 'పూర్ణమ్మ' గేయంలో చూడవచ్చు ''కన్నుల కాంతులు కలువల జేరెను-మేలిమి జేరెను మేనిపసల్- హంసల జేరెను నడకల బెడగులు-దుర్గను జేరెను పూర్ణమ్మ'' ఇందులో పంచీకరణం పొందినట్లు చెప్పినంత వరకు సంప్రదాయం, రచనా సరళి 'కొత్త' అన్నారు ?? నాకు అంతా పాతగానే కనిపించింది పైగా ప్రాచీన కవి నిర్వహించిన వర్ణ విన్యాసాన్ని, ఆధునిక కవి నిర్వహించలేక మొదటి అడుగులో కుంటాడు సమకాలికులెవ్వరూ గ్రహించని కొత్త వస్తువును గ్రహించి నిర్వహించారు గురజాడ ఇది కొత్త ఆధునిక సాహిత్యంలో రచయితల ప్రోత్కర్షం వస్తు నిర్వహణలో బాగా ఉన్నట్లు ఇక్కడే గ్రహించవచ్చు

భాష కూడా రచనా కళలో భాగం కనక ఇక్కడే చెప్పాలి ప్రక్రియ వలెనే భాష కూడా యుగాని కొక్కసారి మారుతుంటుంది ప్రయోగ దాహాల్యాన్ని బట్టి భాషాశైలి, ప్రమాణం మార్చుకోవడం సంప్రదాయమే లోక ప్రయోగంలో మారిన భాష రచయితలు మార్చింది అనడం ఏం సబబు మారిన భాషకు రచయితలు సర్దుబాటయ్యారు అనాలి సర్దుబాటు కాని రచయితలు చాదస్తులు సమకాలిక భాషను గ్రహించిన కవులు, రచయితలు ఎప్పటికప్పుడు ఆధునికులు వైదిక భాషా శైలి స్థానంలో లౌకిక భాష వచ్చింది దాన్ని

పూర్తిగా తుడిచిపెట్టి దేశభాషలు వికసించాయి  ఒక దశలో అవి పరిష్కృత మయ్యాయి  ఆ పరిష్కరణ నిలవలేదు. మళ్ళీ మళ్ళీ పరిష్కరణ, సంస్కరణ జనబాహుళ్య ప్రయోజన దృష్టితో సాగుతూనే ఉంటుంది  ఉదా॥ నాగబు/ంబు/ మ్ము/ ము అన్న పదం నేడు 'నాగం' అయింది ప్రత్యయ రూపం మారింది  అంతే ప్రాతిపదిక మారలేదు మారదు కూడా  భాష మారడం అంటే  (1) ప్రత్యయ రూపాలు మారడం (2) కొత్త పదాలు చేరడం, వీటి వల్ల (3) వాక్య శైలిలో మార్పు రావడం  (4) వ్యవహార వైవిధ్యంతో  కొన్ని పదాలకు ఉన్న అర్థాలు ఉండగా కొత్త అర్థాలు రావడం, ధ్వని-అర్థ విపరిణామ సిద్ధాంతాలు ఏర్పడడం ఇలాంటి దన్న మాట  ఆయా యుగాలలో ఇవన్నీ వెలసినవే  పై రకంగానే మారిన భాషను నేడు వ్యావహారిక భాష అంటున్నాం  అయితే నేడు మనం మాట్లాడుతున్న దానికి దగ్గరి శైలిలో వ్రాస్తున్నాం  పూర్వం కొన్ని యుగాలలో దీనికి భిన్నంగా ఉన్నట్లు చరిత్ర చెబుతున్నది  ఈ రకంగా ఆధునిక రచయితలు చేసినపని సామాజిక ప్రయోజన పరమైంది

అలంకారం కూడా రచనా కళలో భాగమే  అలంకార్యం అంటే అలంకరించదగింది  అది కథా పరిసరం కావచ్చు, భాషా పరిసరం కావచ్చు  ఈ రెంటినీ అందంగా, ఆకర్షణీయంగా మలచడమే అలంకార రచన  ఏ యుగంలోనైనా ఈ ప్రయత్నం జరగాల్సిందే  ఆ ప్రయత్నం చేయని నాడు సాహిత్యం కళగా భాసించదు  ఈ ప్రయత్నాన్ని కాస్త విడదీసి చూసినప్పుడు అది శబ్ద కల్పనలోనో, అర్థకల్పనలోనో విశేషంగా కనిపించింది  కాబట్టి ఇది రచనా కళలో భాగంగా గ్రహించారు పూర్వులు  అత్యాధునికులు కొందరు 'అలంకార రహితంగా రచించి నవీనత చూపిస్తాం' అంటారు  వస్తుభావనలో, భాషాంగంలో అంటే పదంలో, ప్రత్యయంలో ఏ కాస్త వక్రత పొడకట్టినా అది సాహిత్యంలో అలంకారంగా భాసిస్తుంది  ఆ ప్రయత్నం చేయకుండా ఉండడం అంటే సాహిత్య రచనకు భిన్నమైంది చెయడమన్న మాట  అలా ఏ రచయితా చేయలేదు  చివరకు జర్నలిస్టులు కూడా అంతో ఇంతో అలంకార రచనకు అలవాటు

పద్దవాళ్ళు ఉపమించడం, రూపించడం, ఊహించడం (ఉత్ప్రేక్ష) వంటి ప్రయత్నాలన్నీ అలంకారాలు అన్నారు అవి లేని సాహిత్యం ఏనాడూ లేదు మరి అలంకారం అంటే అవసరమైనంతవరకు దిద్ది తీర్చడం అన్నమాట అధికంగా అలంకరిస్తే అసలు వస్తువు ద్యోతకం కాకపోవచ్చు పైగా వికారంగానైనా తయారు కావచ్చు సన్నివేశానుకూలంగా ప్రయోగించే ప్రతీకలు రాణించాయి మురళీస్వనం కృష్ణతత్వానికి, గులాబి నెహ్రూ సౌషలిజానికి, ఎరుపు కమ్యూనిజానికీ ఉపయోగించడం వంటిది అలంకార మార్గమే అలంకారాతిశయంతో ఏర్పడిన రచనలను పూర్వులు గర్హించారు కల్పనమయంగా, ప్రతీకమయంగా కనిపించే నేటి రచనలు కూడా అనాదరణీయాలవుతున్నాయి అందుకే నేటి కావ్యాలకంటె సినిమా పాటలకూ, నాటికలకూ, కథలకూ, నవలలకూ గిరాకీ ఎక్కువగా ఉంది దేశ-కాల-జనానురంజకమైన మోతాదు సాహిత్య శిల్పాన్ని ఈ రచయితలు బాగా ప్రదర్శింప నేర్చారు

ఇక మిగిలింది భావ కళ సాహిత్యశిల్పపరిధికే పరిమితమైంది మొదలు చూద్దాం రచయితలు వెలిబుచ్చే అభిప్రాయాలు, ఆలోచనలు, అనుభూతులు, పాత్రలనూ, పరిసరాలనూ పాఠకులకు ప్రత్యక్షాయమాణం చేసే నేర్పు అంతా కలిసి భావకళ అనిపించుకొంటుంది సాహిత్య రచనలో ఇది మరీ ముఖ్యమైంది వస్తువూ, రచనా ప్రక్రియా పాతదే కావచ్చు తనదైన భావశక్తి లేని రచయితకు వ్యక్తిత్వం ఉండదు రచనలో ఏవైనా తాత్త్విక సంబంధమైన ఆలోచనలు కనిపిస్తే అవి మౌలికంగా ఏ దార్శనికునివో కావచ్చు కాని వాటిని రమణీయంగా ప్రకటించిన నేర్పు పాఠకులకు మరింత ఆలోచింపజేసే కల్పనలు రచయితలవే ఏ కాలపు రచయితలైనా, ఎంత గొప్పవాళ్ళైనా రెండు యుక్తులు బాగా ప్రదర్శిస్తారు (1) పూర్వ కథలనుంచో, సమకాలిక సమాజంనుంచో ఒక సన్నివేశాన్నో, భావననో (conc pt) గ్రహిస్తారు దాన్ని కథగా/కవితా ప్రక్రియగా అమరిస్తారు ప్రాతిపదికగా గ్రహించిన సన్నివేశంలోనో, భావనలోనో తోచిన వర్తనలు (behaviours) కొన్ని, తాము ఇతరత్రా సేకరించిన సామ్య

వర్ణనలు కొన్ని కలిపి పాత్రలను తీర్చిదిద్దుతారు, కొత్త పాత్రలు కల్పిస్తారు లేదా కవితా ఖండికగా రూపొందిస్తారు 'Qualities have been characterized' అన్నది ఇదే (2) రచయిత సన్నివేశ చిత్రణ చేసినా, పాత్రలతో మాట్లాడించినా మొత్తంపై తామాశించిన సిద్ధాంతం వైపు పాఠకుల మనస్తత్వం మొగ్గేటంత సాహిత్య శిల్పం చూపిస్తారు దీన్నే 'ప్రతిభ' అన్నారు పూర్వులు ఆధునికులూ అదే అంటున్నారు అలా అనడమే సంప్రదాయం

మారి కనిపించే ప్రతిదీ కొత్త, సంప్రదాయానికి భిన్నం అనుకోవడం భ్రమ మారడం అంటే సంప్రదాయం మలుపు తిరగడమే ఈ మారడం అనేది మారిన వేషభూషల వంటిది, చేతులు మారిన లంచగొండి వర్తన వంటిదీ రూపం కాస్త, అభివ్యక్తి కాస్త మారి కన్పించినంత మాత్రాన పూర్వ విలువలు అన్నీ మారినట్టు కాదు ఒకరిద్దరు మార్చి చూపించినంత మాత్రాన సంప్రదాయ విలువలు పూర్తిగా మారవు దప్పికి నీళ్ళు తాగడం సాధారణ జీవసంప్రదాయం నీళ్ళకు బదులు మరో పానీయం విశ్వజనీనంగా వాడినప్పుడు సంప్రదాయం మారినట్టు లెక్క సంప్రదాయ విలువలు అంటే సాంఘిక వారసత్వంగా పరంపరాగతంగా వస్తున్న గుణాలు, అవి అనుకూలమైనవి కానీ, అననుకూలమైనవి కానీ, అవి అంత తేలికగా మారవు కాబట్టి వాటిని ప్రతిబింబించే సాహిత్య విలువలు కూడా మారవు అంటాను ఉదా॥ కామక్రోధాదులు, సుఖదుఃఖ వర్తనలు విశ్వజనీన లక్షణాలు అవి, అలాంటివి పైపైకి మలుపులు తిరిగినా మౌలికంగా మారనివి కామక్రోధాదులను అరిషడ్వర్గం అన్నది వేదాంతులు అందరూ వేదాంతులు కారు గదా' వాటిని సర్వమానవ సహజలక్షణాలుగా భావించడమే యుక్త పక్షం శృంగారాది గుణాలను అష్టమలినాలు అన్నారు బౌద్ధాచార్యులు అవే సాహిత్యంలో రసాలుగా భాసించాయి జీవ పరిసరాలను ప్రతిబింబించే సాహిత్యంలో ఆయా విలువలు, మౌలిక గుణాలు మారేదెట్లా? పూర్వులు చర్చించిన గుణాలలో అంతర్భూతంగా గణించుకోలేనివాళ్ళు ఆకలి, అశక్త దౌర్జన్యం, కపటం, విశ్వమానవ సమత, ప్రగతివాంఛ వంటి వాటిని విడిగానే చూడవచ్చు ఇవన్నీ నానాటి సాహిత్యంలో వర్ణితమవుతూ వస్తున్నవే

ఈ చర్చలో చివరకు వస్తున్నాం సాహిత్యేతరమైన భావజాల చర్చ ఇది మారినట్టే కనిపించి మారని భావాలను (అంటే ఆలోచనలను), మలుపు తిరిగిన భావాలను కొన్నిటిని చూద్దాం 1 ఆధునిక రచయితలలో భౌతికంగా 20 వ శ జీవిస్తున్నా బౌద్ధికంగా భూస్వామ్య యుగంలో ఉన్నవాళ్ళ వర్గం ఒకటి ఉంది పునరుజ్జీవనం పేరిట భూస్వామ్యయుగాలనాటి సామాజిక మనస్తత్వంలోనే పాఠకులు ఉండేటట్లు రచనలు చేస్తారు వీళ్ళు సమన్వయం పేరిట చెల్లని సంప్రదాయాన్ని రక్షించే ప్రయత్నం చేస్తారు కర్మ సిద్ధాంతాన్ని, వర్ణాశ్రమ ధర్మాలను చమత్కారంగా చెప్ప చూస్తారు ఆధునికంగా వెనకబడ్డ పాఠకులలో ఈ రచయితల పలుకుబడి బాగా ఉంది అంతా వేదాల్లోనే ఉంది అని వీళ్ళ విశ్వాసం ఇది చెల్లని సంప్రదాయ తత్త్వమౌఢ్యం మారినట్టే కనిపించి మారని భావాలు ఈ రచయితలవి వీళ్ళది స ర సం అంటే సంప్రదాయ రచయితల సంఘం అన్నారు ఎవరో వాస్తవానికి ఆ సంఘం లేదు చెల్లని సంప్రదాయ భావాలు వీళ్ళకున్న మాట వాస్తవం వేదకాలం నాటి సంప్రదాయంలో కూడా కొంత మంచి ఉంది, దానివెంట ఉంటున్నాం అన్నా బాగుండేది అలా కాదు, యుగాల కింద మురిగిన చెత్త అంతా పవిత్రమైంది అంటారు 'మంచి గతమున కొంచెమేనోయ్' అన్న గురజాడ మాట వీళ్ళకు నచ్చదు స ర సం అంటే సర్కారు రచయితల సంఘం అని మరోపేరు పెట్టారు ఎవరో పై రచయితలలో కొందరు సర్కారు మెప్పుపొందారు కాబట్టి ఆ పేరు పడి ఉండవచ్చు 2 అ ర సం , వి ర సం ఈపేర్లతో చీలికలైంది రెండో వర్గం అంతా మార్క్సిజంలోనే ఉంది అనే తత్వం వీళ్ళది ఏమైనా ఆర్థికంగా బాగా వెనకబడ్డ పాఠకులలో వీళ్ళ పలుకుబడి ఇప్పుడు చెల్లుతున్నది నేడు రాజకీయంగా చీలిపోయిన ప్రతిపక్ష వర్గాల భావాలకు ప్రతిధ్వనులు వీళ్ళ రచనలు 3 సహజంగా ఆలోచించే పాఠకుల అభిమాన రచయితలు మూడోవర్గం గురజాడ, దువ్వూరి, జాషువా, కాళోజీ, తిలక్ మొ॥ వాళ్ళూ వాళ్ళ అనుయాయులూ ప్రగతిశీలమైన సంస్కరణ వాదం వీళ్ళది లక్ష్యం జాతియాభ్యుదయం సంప్రదాయానుసరణ కొంత తప్పక పోయినా ఆధునిక గమనానికి అడ్డు రాకుండా చూడమంటారు ఈ గమనంలో సాంఘిక సమత ఒక పాదంగా, ఆర్థిక సమత రెండో పాదంగా ఉపయోగిస్తేనే జాతీయాభ్యుదయ గమ్యం సాధ్యం అన్నారు ఈ రచయితలు వెలియిచ్చిన సాంఘిక భావాలన్నింటికీ చారిత్రకమైన ఆసరాలున్నాయి వీళ్ళ సాధారణ లక్ష్యం సర్వమానవ పురోగతి, ప్రత్యేక

లక్ష్యం సమైక్య భారత జాతీయ పురోగతి వస్తు భావకళలలో స్వోన్మేషం బాగా ప్రదర్శించిన రచయితలు వీళ్ళు

**సారాంశం** - సాహిత్యంలో కనిపించే భావ సంప్రదాయాలు రెండు రకాలు 1 సాహిత్య కళా పక్షమైన, శిల్ప పక్షమైన రీతులు (వస్తు-రచనా-భావకళలు) వీటిలో కొత్త లక్షణాల ఉత్పత్తి చాలా తక్కువ పాదు కొన్న లక్షణాలు రూపులు మార్చి పునరావృత్తం కావడమే ఎక్కువ 2 మత-ధార్మిక-ఆర్థిక-రాజకీయ భావాలు (ఆలోచనలు) నానాటి అవసరాల విభిన్నత దృష్ట్యా ఇవి ఒక సమాజంలోనే, ఒక శతాబ్దిలోనే నానా సంస్థల పథకాల ద్వారా నానా శాఖలుగా మారుతూ వచ్చాయి కొన్ని నిష్క్రమించాయి ముందు కూడా అదే జరగవచ్చు ఒక్కొక్క శాస్త్రీయ సత్యం బయటపడినప్పుడల్లా బైబిల్ లోంచి ఒక్కొక్క పుట చింపివేయవలసి వస్తుంది అన్నాడు ఆధునిక ఇంగ్లీషు రచయిత లివింగ్‌స్టన్

## ఆకర గ్రంథాలు


1 తెలుగు సాహిత్య నిఘంటువు
డా॥ ముకురాం రామారెడ్డి

2 Dictionary of Literary Terms
by Harry Shaw

3 Act of Creativity
by Arthur Koestler

4 తెలుగు నాటక వికాసం
డా॥ పి ఎస్ ఆర్ అప్పారావు

5 ఆధునికాంధ్ర కవిత్వం సంప్రదాయం-ప్రయోగం
డా॥ సి నారాయణరెడ్డి

6 ఇతర భాషా-సాహిత్య విమర్శలు

ఆధునిక తెలుగు సాహిత్యంలో

# రూపవాదం

—గోపాల చక్రవర్తి

సృష్టిలో ఎంతో వైవిధ్యం వుంది మనిషి బాహ్యరూపం ఒకటే ఐనా ఇన్ని కోట్ల మంది మనుషుల్లో కవలపిల్లల్ని చూస్తే ఆశ్చర్యంగా వుంటుంది కవిత కూడా సార్వజనీనకంగా అంతర్లీనమైన లక్ష్యలక్షణ సమేతంగా వెలువడే నిప్పులు చెరిగినా, పువ్వులు విసిరినా ఫెళఫెళా పిడుగులు వర్షించినట్లున్నా పుడమితల్లి పయ్యెదపై గోముగా జల్లు కురిసినట్లున్నా ఆశీర్వదించినా తిట్టినా అది కవిత్వమే! వస్తు వైవిధ్యంతో ప్రక్రియా వైవిధ్యంతో కవిత్వానికి రూపవైవిధ్యం వస్తుంది నాటకం, శతకం, దండకం—ఇలా చెపట్టిన వస్తువుకి అనుగుణమైన ప్రక్రియ అవసరమవుతుంది ఇదంతా ప్రాచీన కవితా వైభవాన్ని మనస్సులో పెట్టుకుని మనవి చేస్తున్నాను

కవిత్వానికి వస్తువు (content), రూపం (form) అత్యంత ప్రధాన మైనవి రూపంలో శైలి, ధ్వని, రీతి ప్రాణప్రదాలు వస్తువుకి పట్టంకట్టి ప్రపంచంలో జరిగే దుర్మార్గాల్ని తూర్పారబడితే యువతరం భేష్ అంటుంది ఛాందసులు వీడికి కవితారూపం మర్మాలు తెలియవు అంటారు అలంకారాలు, శిల్పం, శయ్య, శైలి పరమ రమణీయంగా పొదిగి ప్రణయానందంగా కవిత్వం చెబితే వీడు పెద్ద భావకవి అంటారు, కొందరు

ప్రాచీన కవి వారీతులా సిద్ధాంతాల్లో చిక్కి శతాబ్దాల తరబడి కవి కుమారుల ఊహల్లో బందీయై అనేకానేక యౌవనసౌభాగ్యాలు పొందిన కవితా కన్య ప్రస్తుత సమాజపు పోకడలు అర్థం చేసుకొని అభ్యుదయ రూపం ధరించదారం

ఖించింది నేడు వస్తువులోనూ రూపంలోనూ కూడా కవిత్వం మార్పు చెందుతున్నది

వస్తువుకి ప్రాధాన్యత ఇచ్చి ఎత్తైనంత స్పష్టంగా చదువరి గుండెలకు విసురుగా తాకేట్టు కవిత్వం చెప్పే "మడుకుతనం'' మరీ ఈ శతాబ్దంలోనే కొట్టొచ్చినట్టుగా అగపడుతోంది ఏదో కవితా రూపానికి ప్రాధాన్యత ఇచ్చి పరిమిత మధురమైన భావనలను కలం మీదుగా జార్చి, పాఠకుల హృదయాలను మధుర భావనల్లో ఓలలాడించేది పోయి - సమాజం, అభ్యుదయం, విప్లవం అంటూ నేటి కవులు అంటే సమాధానం ఒక్కటే 'వస్తువు''కు వచ్చిన ప్రాధాన్యం శృంగారం వెనక్కు వెళ్లింది సమాజాభ్యుదయం ముందుకు వచ్చింది

నేటి పాఠకుడు సామాన్యుడు కవి పరమ సామాన్యుడు వాళ్లిద్దరి జీవాత్మ, యా ఆహ్లాదేవ మోక్షప్రాప్తికోసం కాదు, తిండి కోసం ఆ వెనుక కప్పుకోడానికి కాసింత గుడ్డ, ప్రాప్తం వుంటే తలదాచుకోడానికి గూడూ అందుకే రూపం, వస్తువులలో రూపం కంటె కూడా వస్తువుకే ప్రాధాన్యం వస్తువుని ఆకర్షకంగా బలమైన ముద్ర వేసేట్టు ఆకట్టుకొనేటట్టు చెప్పేంతవరకే రూపానికి ప్రాధాన్యత సుందరమైన శైలి, సరళమైన పదజాలం, చిక్కని కూర్పు, రసాత్మకమైన భావుకత, ప్రగతి కారకమైన లక్ష్యశుద్ధి సమాజంలో మంచిని ఆదరించే సుందరమైన ధ్వని వున్నపుడు కావ్యంపట్ల సామాన్యుడు ఆకర్షితుడవుతాడు శైలికీ, శిల్పానికీ, ధ్వనికీ సున్నాచుట్టి పర్తిపదాలు కూర్చి 'దీంట్లో వస్తువుకు ప్రాధాన్యం వుంది'' అని అరచి గీపెట్టినా ఎవరూ కన్విన్స్ కారు పాఠకుడి మనస్సు అంత త్వరగా లొంగదు కవితారూపం ఆకర్షణీయంగా సాక్షాత్కరింపచేయాలీ అంటే శైలి, శిల్పం, ధ్వనీ ముఖ్యమే అయితే యివి వస్తు ప్రాధాన్యతను మింగెయ్యకూడదు

కవిత్వంలో వస్తు ప్రాధాన్యత రీజన్, రియాలిటీ రెండింటినీ గుర్తించిన నాటి నుంచి వచ్చింది మైథాలజీ వుంది అది రీజన్‌కీ, రియాలిటీకి లొంగదు

భావకవిత్వం వుంది కొంతవరకూ ఇది కూడా అంతే అయితే భావకవిత్వంలో నిషా వుంది కిక్ వుంది శైలి, శిల్పం, ధ్వనీ దండిగా వుండవచ్చు ఇందులో గల పెద్దలోపం కొన్ని సమయాల్లో రీజన్‌కి రియాలిటీకి అతీతం కావడం కవి సహృదయుడే భావం మనసు కదిలించేదే, శైలి నిర్దుష్టం శయ్య ఉత్కృష్టం అయితే కథానాయిక పాలకడలిలో మబ్బుతునక మీద మయూర నృత్యం చేస్తూ శేషశాయిని ఆకలి మాపులతో వెతికిస్తుంది !

ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితా రీతుల్ని ఆంధ్ర కవిత్వంలో చతుర్విధ కవిత అన్నారు తాను చతుర్విధ కవితా నిర్వాహకుణ్ణని రామరాజ భూషణుడు చాటుకున్నాడు పింగళి సూరనామాత్యుడు ఆశు, మధుర, చిత్ర, విస్తార'' కవితా విజృంభణ గూర్చి ముచ్చటించాడు ఇందులో మొదటి మూడూ రూపానికి, నాలుగోది వస్తువుకు సంబంధించింది ఇందులో ఆశు కవిత అనే పదాన్ని అనాదిగా వస్తున్న మౌఖిక సాహిత్యానికి, జానపద సాహిత్యానికి పర్యాయంగా కొందరు వాడుతున్నారు ఆ అర్థంలోనే అయితే అదే నిజానికి అసలుసిసలు కవిత్వం ఆ కవిత్వం అంతా ఆశువుగా జనించిందే అంటే sponta-neous గా హృదయంలో కలిగిన భావం ఒక్క పెట్టున పెల్లుబికి కవితా రూపాన్ని సంతరించుకోవడమే ఇలాంటి ఆశువుకి నిర్వచనంగా చెప్పుకోవచ్చు అయితే పై నాలుగు రకాల కవితలలో మొదటిదైన ఆశు కవిత్వానికి చమత్కార ప్రధానంగా సమయస్ఫూర్తితో ప్రస్తుత సమస్యను పూరించడం అని అర్థం ఇది పండితుల్ని పామరుల్ని రంజింపచేసిన instant కవిత్వం ఇందులో చిరకాలం నిలిచేది కొంత మాత్రమే దరువులు ఏలలు, మంగళహారతులు, జోలలు, సుద్దులు, అష్టపదులు ఇవన్నీ మధురకవిత్వం క్రిందకు వస్తాయి భాష, భావం, ఛందస్సు అన్నీ దేశి స్వరూపాలే అందువల్ల ఏకాంతంగాను సంస్కారం వున్నా సామాన్యుల నాలుకలమీద నాట్యమాడేది మధుర కవిత

చిత్ర కవిత్వం చమత్కారాపాదకమైన కావ్య రచనా శిల్పం ఇది పండితులకు పరిమితం శబ్ద సంబంధి నిగ్గుల్ని నిరోష్ఠ్య మొదలైన నియమాల తోను, గర్భ బంధ చతురతలోను సాగుతుంది

విస్తర కవిత్వమే వస్తు కవిత కావచ్చు. కథా ప్రధానంగా లేక వస్తు ప్రధానంగా సాగేది వస్తు కవిత్వం అంటున్నారు విమర్శకులు. తొలి ప్రబంధం నిర్మించిన కవి నన్నెచోడుడు తనది వస్తు కవిత్వం అన్నాడు.

ఆలంకారికులు, లాక్షణికులు, సౌందర్యోపాసకులు, సాంప్రదాయకులు, రూపవాదాన్ని పట్టుకు వేళ్లాడుతున్నారు. సమకాలీన సమాజంపట్ల సరైన అవగాహనతో, తన పాఠకులు ఎవరో తెలుసుకుని, చేపట్టే ప్రక్రియను పరిపుష్టమైన తెలుగు నుడికారంతో విజయవంతంగా నడిపించగలవాడు poet hero.

వేమన కాలంలో కవులంతా వేమన అంత సులభమైన శైలిలో ప్రాపంచిక సత్యాలను తేట తెల్లం చేయలేదు. మరోలా చెప్పాలంటే ఆకాలంనాటి కవులంతా వేమనలు కాలేదు. తాను చెప్పదలిచింది సూటిగా, విసురుగా, వస్తు ప్రధానంగా చెప్పగలగడం వేమనకే చెల్లింది. వస్తు ప్రధానమైన కవితారీతికి వేమన కవిత్వం పరాకాష్ఠ అనవచ్చు.

ఈ శతాబ్దం తొలి సంవత్సరాల్లో భావకవిత వచ్చింది. తొలి కవితలు మాత్రా ఛందస్సు పరిమితికి లోబడి ముత్యాల సరాలుగా అలతి అలతి పదాలతో వచ్చాయి. భావ కవిత్వానికి భావావేశం ఆయువు పట్టు. అది సౌందర్యవతి ఐన స్త్రీకి పాదాక్రాంతం అయ్యే రసజ్ఞత కావచ్చు. దేశభక్తి, త్యాగభావం జన్మభూమి కన్నతల్లి పట్ల మక్కువ కావచ్చు. అవక్ర పరాక్రమం పట్ల హర్షం కావచ్చు. గుండె పగిలి కన్నీళ్లు పొంగే దుఃఖం కావచ్చు. షెల్లీ, కీట్స్, వర్డ్స్‌వర్త్ వంటి వెస్టర్న్ రొమాంటిసిస్టుల ప్రేరణ కావచ్చు. కవిత్వంలో నూతనత్వం పట్ల ఆసక్తి కావచ్చు. స్వేచ్ఛా ప్రియత్వం కావచ్చు. భావానుగుణమైన కవితారూపం ఏర్పడాలి అన్న కవిత్వ వాదం ఆరంభమైంది. ఈ భావ కవిత్వం వ్యావహారిక భాషకు సన్నిహితమై వ్యావహారిక భాషోద్యమానికి కుడి భుజమై నిలిచింది. ... ఉత్తేజపరిచి భావావిష్టుణ్ణి చేసే ప్రతి అంశం కావ్య వస్తువు కావచ్చు అనేది భావకవుల వాదం. ఈ పద్ధతిలో కోకొల్లలుగా ఖండ

కావ్యాలు, ప్రకృతి వర్ణన, జాతీయ కవిత్వం, స్మృతి గీతాలు (ఎలిజీలు) లెక్క లేనన్ని వచ్చాయి గురజాడ ముత్యాల సరాల్లో కరుణ రస ప్రవాహంగా సమాజంలో స్త్రీలకు జరిగే అన్యాయాలను కళ్లకు కట్టినట్లు కొన్ని గేయాల్లో వర్ణించాడు రాయప్రోలు వారి లలిత, తృణకంకణం వచ్చాయి అబ్బూరి, శివశంకరస్వామి, కృష్ణశాస్త్రి, విశ్వనాథ, వీళ్లంతా భావ కవిత్వం వ్రాసారు

''నడవగా నడవగా నాతి కిన్నెరసాని
కడు సిగ్గుపడు రాచకన్నెలా తోచింది''

అది భావకవిత్వం ఐతే కల్పవృక్షంలో వ్రాసిన కవిత్వపు పోకడలు

''స్థాపర్ష దమోఘ పటలీ ''

అని శివ ధనుర్భంగం వర్ణిస్తాడు

నండూరి వెంకట సుబ్బారావుగారు ఎంకి పాటల్లో

''ఆనాటి నావోడు సెందురూడా
అలిగి రాలేదోయి సెందురూడా''

అని అలవోకగా పాడితే, అడవి బాపిరాజుగారు

''పాటేభామై భామేపాటై
పాటా భామా పడమటి రంగై''

అన్నారు

మధుర వేదనామూర్తి వేదుల, కరుణశ్రీ, కవికోకిల దువ్వూరి, జాషువా ఖండ కావ్యాలు వ్రాశారు పింగళి, కాటూరి 'తొలకరి' ప్రచురించారు బసవ రాజు అప్పారావు ''భావగీతాలు'' వచ్చాయి నాయని సుబ్బారావు "సౌభద్రుని ప్రణయ యాత్ర' ప్రశంసలు పొందింది అడవి బాపిరాజు 'వరద గోదావరి' అప్పటి యువతరం గళాల్లో పరవళ్లు తొక్కింది టాగూర్ ప్రభావంతో మల్ల పసుపు, విశ్వాసాపూరిత వృత్తిపథంతో కొంపెల్ల కవిత్వం వ్రాశారు

భావ కవిత్వంలో కొత్త మలుపు స్వాతంత్ర్యోద్యమంతో వచ్చింది దేశ నాయకులంతా స్వాతంత్ర్యం కోసం సర్వస్వం ధారపోసి జైళ్ల పాలవుతున్న రోజుల్లో వీరి మనస్సు దేశభక్తి ప్రేరేపించే కవిత్వం మీదికి మళ్లింది పౌరుషం రెకెత్తించడమే ప్రధాన గుణంగా కవితారూపం మలుచుకుని దేశభక్తి వస్తువుగా కావ్యాలు వ్రాసారు రాయప్రోలు, దుర్భాక, గడియారం, విశ్వనాధ, తుమ్మల, కొడాలి దేశభక్తి కవిత్వం వ్రాసారు దాశరధీ మరికొందరూ ఫ్యూడలిజం నుండి తెలంగాణా విముక్తి పోరాటం మనసులో వుంచుకుని కవిత్వం రాశారు

ఈ మార్పులతోబాటు కవిత్వంలో మరొ కొత్తదనం వచ్చింది అది వ్యావహారిక భాషా ప్రయోగం సులభశైలిలో సరళమైన పద జాలంతో రచనలు వుండాలనే realisation వచ్చింది పద్యం చెప్పినా, గేయం పాడినా, ఖండ కావ్యమైనా నాటకమైనా పదిమందికీ సులభంగా అర్థం కావాలి అనే వాదం పుట్టుకొచ్చింది దీంతో కవితారూపంలో అలంకారాలు, వర్ణనలు పదాల అల్లిక జిగిబిగిలలో పట్టు సడలి మృదువైన మాటలు పడజొచ్చాయి చక్కటి శిల్పంతో పలువురికి ప్రియమైన శైలితో చేపట్టిన వస్తువు నడిపించాలి అనే ఆరాటం పెరిగింది

భావ కవిత్వంలో అంతోయింతో వుంటూ వచ్చిన వర్ణన, అలంకారాది సంకెళ్లు కూడా విడివడి వచన పద్యానికి నాందీ ప్రస్తావన జరిగింది శిష్ట్లా వచన పద్యంతో ముందడుగు వేశాడు శ్రీశ్రీ "మహా ప్రస్థానం" కవితయా తర్వాత ఏల్చూరి, కుందుర్తి, రామదాసు నయాగరా కవితలూ వచ్చాయి మహా ప్రస్థానం రాసిన తొలిదినాలనుండి ఈ 35 సంవత్సరాలుగా తెలుగు కవితా రూపంలో వచ్చిన మార్పు అందరికీ తెలిసిందే భావం, గుణం, నడక, రీతి శైలి, [illegible]-ఈ [illegible] వస్తువు, పలుకుబడి, విప్లవం, ప్రగతి ఆలోచనా విధా[illegible], [illegible]-అనేవి కవుల వాడుక పదాల్లో వచ్చి చేరాయి

పూర్వ కవులంతా దాదాపు నూరు శాతం మందీ కవిత్వంలో రూపానికి ప్రాధాన్యత ఇచ్చారు ఔనంపించుకోవడం, ఆపైన భేష్, ఓహో అనిపించుకోవడం, నమ్మిన దైవాన్నో రాజుగారినో స్తుతించడం నాటి కవులకు తప్పనిసరి కార్యక్రమం కవితా వస్తువులో కవిత్వ తత్త్వంలో ఇంచుమించు వారందరూ వాకచే

మార్క్సిజం ఇతర అన్ని రంగాలలోలాగా సాహిత్యంలో, తత్వంలో చెప్పలేనంత భేదం తెచ్చిపెట్టింది భగవంతుడు, మతం, కులం, సంప్రదాయం, ఆచార వ్యవహారాలు ఏవీ పట్టించుకోకుండా ఇంటర్నేషనల్ ఎయిర్ పోర్టులో నిలబడి కవిత్వం రాయడం నేటి ఫాషన్ సంప్రదాయ కవిత్వం రాసేవాళ్లు అభ్యుదయ కవిత్వం రాసేవాళ్లు అనే విభజన వచ్చింది

ఛందస్సూ అలంకారాలూ మడీ ఆచారం దులిపేసుకుని సామాన్యుడు మాట్లాడే తేట తెలుగులో వచన కవిత వచ్చింది వచన కవితకు ఛందో బందోబస్తులు లేకపోయినా శైలీ శిల్పం భావోద్వేగం వుండాలంటారు కవితాత్మ తెలిసిన పలువురు కవులు ''కాదు వస్తువూ ప్రగతి కాముకత విప్లవం'' కావాలి అంటారు కొందరు మిత్రులు స్థూలంగా వస్తువే వారి కవితాత్మ

శ్రీశ్రీ, తిలక్, అజంతా మరికొందరు మిత్రులూ వీళ్ల వచన కవిత్వం చదువుతే "ఇందులో ఛందోరీతులు లేవే'' అనే ఆలోచన కలగదు నిజమైన కవిత్వం ఎప్పుడూ రూపాన్ని పట్టిస్తుంది అక్కడ అనుభూతి, వస్త్వైక్యత, భావం సూటిగా చదువరి మనస్సులో నాటుకుంటాయి

వస్తు ప్రాధాన్యతలో పరాకాష్ఠ ఇజం ఇజం అంటే కవి ఆలోచనా విధానం సమకాలీన సమాజం పట్ల అతడి అవగాహన తీరు కవిత్వంలో ప్రయోగాల పేరుతో వచ్చిన సింబాలిజం, డాడాయిజం, సర్రియలిజం, పూర్వ కవుల చిత్ర కవిత్వం, బంధ కవిత్వం వంటివె అయితే రియలిజం అలాకాదు

వాస్తవికతను యధాతథంగా కళ్లకు కట్టినట్టు కవిత్వంలో చెప్పడం ఒక మంచి ప్రయోగం ఇది వస్తు ప్రాధాన్యతను ఇనుమడింప చేస్తుంది

రూప ప్రధానంగా శతాబ్దాల తరబడి సాహిత్యాన్ని శాసిస్తూ వచ్చిన కవితాతత్వం ఇప్పుడు వస్తు ప్రధానంగా మారింది

వచన కవిత్వంలో వచ్చిన మరో మంచి మార్పు కావ్యం రాసే వ్యక్తి సమాజంలోని సామాన్యుని కంటె పై స్థాయిలో వున్నాననే అహంకారాన్ని వదులుకోవడం కవిత్వంలో రూప ప్రాధాన్యతను వదిలి వస్తు ప్రాధాన్యతకి పట్టం కట్టడానికి వెనుకవున్న బలమైన కారణం ఆర్థిక తత్వం ఇప్పుడు వీస్తున్నగాలి సమతావాదం వైపు పోతోంది నేటి సమాజంలో ఆర్థిక తత్వానికి రాజకీయ ఆలోచనా విధానానికి సన్నిహిత సంబంధం వుంది అది కార్ల్ మార్క్స్ వల్ల వచ్చింది అంతో ఇంతో ప్రపంచ రాజకీయ విధానాలు అవగాహన వున్న కవులందరిమీదా మార్క్సిజం ప్రభావం ప్రత్యక్షంగానో పరోక్షంగానో పడి తీరుతుంది ఈ మార్పుని ప్రతిబింబిస్తూ 1965 ఆ ప్రాంతంలో దిగంబర కవిత్వం వచ్చింది

వచన కవితా రూపకాలు గూడా చక్కని మార్పే కుందుర్తి "ఆశ" "ఆచార్లగారి అమ్మాయి" వంటి వచన కవితా రూపకాలు వ్రాశాడు ఒకప్పుడు పద్యాలలో మాత్రమే సాగించె నాటకం- తర్వాత కేవలం వచన నాటకాలు వచ్చాయి ఇప్పుడు కొంచెం ముందుకు వెళ్లి వచన కవిత్వపు సొగసులతో విసురు, ఊపు వున్న డైలాగులతో మరో కొత్తరూపం నాటకం పొందింది అలాగే కొంతమంది యువకులు వచన కవితలో కథలు రాశారు

కవితా సంవిధానంలో క్లిష్టత తొలగించి చెప్పదలుచుకున్నది స్పష్టంగా [illegible] తగిలించకుండా ప్రాణవాదాన్ని మాత్రమే జోడించడం నేటి కవి కర్తవ్యం ఇదీ నా వాదం

**ఆధునిక తెలుగు సాహిత్యంలో**

# జనామోద వాదం, లేక ధోరణి!

— దేవీప్రియ

ఇది కత్తిమీద సాము సుమా, అన్నారు ఒకరిద్దరు మిత్రులు, జనామోద వాదంగా రంగనాథాచారి గారి చేత అభివర్ణింపబడిన Popular trend మీద మాట్లాడవలసి వుందని నేనన్నప్పుడు నిజానికి కత్తీలేదు, సామూలేదు అంతా వృత్తిదే! వాదంగా జనామోదం ఆధునిక తెలుగు సాహిత్యంలో లేదు ప్రపంచ సాహిత్యంలో కూడా, Popular, Popularity వంటి మాటలే కనిపిస్తున్నాయి కానీ, Popularism గా యిది యెక్కడా తగలడం లేదు లేక నా పరిమిత పరిశీలనలో నాకది కనిపించి వుండకపోవచ్చు ఆధునికాంధ్ర సాహిత్యానికి సంబంధించి జనామోద ధోరణి అనే అనుకుందామనుకున్నాను అనుకున్నాను కదా అని ప్రసంగ వ్యాసం రాద్దామని కూర్చుంటే కళ్ళ ముందు, ఈనాడు అమిత ప్రచారం పొందిన 70 m m తెర తెల్లగా ఖాళీగా కనిపించింది కొన్ని ఆలోచనలు, కొన్ని ఊహలు లోపల పల్టీలు కొట్టడం మాత్రం గ్రహించగలిగాను Popularity అని మనం దేనినంటామో, పాప్యులారిటీ కోసం కళాకారులు, ఒక్కోసారి సామాన్యులు కూడా యేమిచేస్తారో - లేక పాఠకులు, ప్రజలు దానిని యెలా స్వీకరిస్తారో ఆలోచిస్తూ పోయాను ఇది సర్వ సమగ్రమైన సిద్ధాంత వ్యాసం కాదు, సంపూర్ణమైన పరిశీలన కూడా కాదు నాకున్న చూపుతో సమకాలీన తెలుగు సాహిత్య లోకంలో నాకు తెలిసి వ్యాప్తిలో వున్న ప్రచార, జనామోద ధోరణిని తడమడానికి చేస్తున్న చిన్న ప్రయత్నం మాత్రమే ఇందులో యెక్కడైనా ఎవరైనా రచయితల, కవుల పేర్లు ఉటంకించడం జరిగితే అది వ్యక్తిగతం కాదని ముందే మనవి చేస్తున్నాను అట్టే అనవసర ప్రసంగం చేయకుండా యిక అసలు విషయానికొస్తాను

## ఎ ప్యులర్ అంటే యేమిటి?

అంటే జనం ఆమోదించటం అంటే యేమిటని? ఈ 'జనామోదం'లో రెండు మాటలున్నాయి ఒకటి జనం. రెండు ఆమోదం 'ఆమోదాన్ని' గురించి నాకేమీ పేచీ లేదు కానీ, 'జనం' అనే మాటని ఆమోదంతో కలిపికొట్టడానికి నేను సిద్ధంగా లేను ఎందుకంటే, ఇప్పటి మన వ్యవస్థలో సర్వజనామోద సాహిత్య సృష్టి సాధ్యం కాదు ఆ వివరాలు ముందు ముందు మాట్లాడుకుందాము మొదట ఈ Popular అనే మాట! Rev Thomas Davidson సంకలనం చేసిన Chamber's Twentieth Century నిఘంటువు ఈ మాటకి - pertaining to the people, enjoying the favour of the people, prevailing among the people, easily under stood, inferior అని అర్థం చెప్పింది అంటే ప్రజలు యిష్టపడింది, అంగీకరించింది, ప్రజల అభిమానం చూరగొన్నది అని అర్థం బాగానే వుంది మరి ప్రజలలో గుర్తింపు పొందడం యెలా? నేను ముందే చెప్పినట్టు ఈ గుర్తింపు-పలు విధాలుగా వస్తుంది భిన్న రూపాలలో వుంటుంది నేలకి 410 మీటర్ల యెత్తున, న్యూయార్క్ వరల్డ్ ట్రేడ్ సెంటర్ గోపురాల మధ్య తీగ బిగించి దానిమీంచి నడిచి, అమెరికన్లని సంభ్రమాశ్చర్యాలలో ముంచిన PHILLIPPE PETIT ప్రపంచం దృష్టిని ఆకర్షించాడు అర్జెంటీనాలో పుట్టి క్యూబాలో విప్లవంలో పోరాడి, బొలీవియాలో వీర మరణం పొందిన చెగువేరా పేరు వినని వారెవరైనా మీలో వున్నారంటే నేను నమ్మలేను - 'The most complete man of his age' అని సార్త్రే 'చే' ని అభివర్ణించాడు చెప్పొచ్చేదేమిటంటే, ప్రజల దృష్టిని ఆకర్షించడం యెంత తేలికో అంత కష్టం రాజకీయవేత్తలకైనా, కళాకారులకైనా ఈ సూత్రం సమంగానే వర్తిస్తుంది నేను తొలుత చెప్పిన జనామోదంలోని 'జనం' సంగతి తేల్చుకోవలసిన చోటు యిప్పుడు మనం చేరినట్టు అనిపిస్తోంది

## ఏ జనుల ఆమోదం ?

మనకి యిష్టమున్నా లేకపోయినా, జనం యిప్పుడు వర్గాలుగా చీలి వున్నారు సాహిత్యానికి సంబంధించి కూడా ఈ చీలిక అనివార్యమవుతోంది బైబిల్‌నీ, రామాయణాన్నీ, భగవద్గీతనీ ఆమోదించి పారాయణం చేసే జనం వేరు, కమ్యూనిస్టు మేనిఫెస్టోనీ, ఖడ్గధారనీ, కన్యాశుల్కాన్నీ, కాళీపట్నం రామారావునీ ఆమోదించి చదివే జనం వేరు వార పత్రికలు, మాసపత్రికలు అందించే కాలక్షేపం బరాబీ కథలూ నవలలూ చదివే ఆడజనం, ఆడమగజనం వేరు. సర్వజనులకూ ఆమోదకరమైన సాహిత్య సృష్టి సాధ్యంకాదని అనుకున్నాం కదా మనం అది అక్షరాలా నిజం తమకి యే సాహిత్యం హితం కలిగిస్తుందో, యే సాహిత్యం తమ ప్రయోజనాలని కాపాడుతుందో సామాన్య పాఠకులకు అర్థం కాదు అర్థం చేసుకొనడానికి వాళ్ళు ప్రయత్నించరు ఆ ప్రయత్నం చేసే అభ్యుదయ సాహిత్య పత్రికలు కొనరు. ఆ మాటకొస్తే తమ వర్గమేమిటో కూడా పట్టించుకోరు వర్గాలూ, ఉద్యమాలూ, స్పృహ, సాహిత్య ప్రయోజనం యిటువంటి మాటలన్నీ యేదో తమకి సంబంధం లేని వేరే భాషలోని వనుకుంటారు వీళ్ళనీ గురించి, వీళ్ళ ప్రయోజనాలను కూడా కాపాడడానికి తపిస్తూ రాసిన పుస్తకాల పేజీలైనా వీళ్ళు తిప్పరు ఏ జనమైతే తమ కాయకష్టంతో దేశాన్ని నడిపిస్తున్నారో వాళ్ళే ప్రజలు సాహిత్య ప్రయోజనాన్ని గురించి, సాహిత్య జనామోదకత గురించి మాట్లాడుకునేప్పుడు శ్రీశ్రీ గీసిన ఈ గీతని గుర్తించడం అవసరం ఈ వెలుగులో చూసినప్పుడు ఇప్పుడొస్తున్న సహస్రానేక రచనలలో యేవి జనామోద రచనలో మనకు స్పష్టంగానే తెలుస్తుంది ఇది సూక్ష్మంగా ఆలోచించినప్పుడు యేర్పడే అభిప్రాయం

జనాభిప్రాయంలో జనామోద సాహిత్యంగా చలామణీ అవుతూన్న సాహిత్యం గురించి ఆలోచించినప్పుడు కళ్ళ కొట్టముందు, తోరణాయిగా వేలాడే అసంఖ్య సామాన్య ప్రచారంగల వారపత్రికలూ, అత్యధికంగా చదవబడే మాసపత్రికలూ కళ్ళముందు కదులుతాయి ఎందుకంటే ఈనాటి జనమోద సాహిత్యంగా

చలామణీ అవుతున్న సీరియల్ హైఫీవర్‌కి అవే జన్మస్థానాలు 1838లో పుట్టిన తొలి తెలుగు పత్రిక 'వృత్తాంతిని' ఎడిటర్ (సంపాదకుడనే మాట అప్పటికి రాలేదు) మండిగల వెంకట్రామశాస్త్రి యీనాటి కొందరు పత్రికా సంపాదకుల ధోరణిని చూడగలిగితే గుండె-ఆగి పునర్మరణం పొందివుండేవాడు

## ఎప్పటిది ఈ గాలి?

తారీఖులు, దస్తావేజులు లేవు కానీ, ఆధునిక తెలుగు సాహిత్యయుగంలో, బహుళ ప్రచార సాహిత్యం ఒక ధోరణిగా స్వాతంత్ర్యానికి కొంత ముందు ప్రారంభమైనట్టు కనిపిస్తుంది. శ్రీశ్రీ కున్న ప్రసిద్ధి వంటిది కాక, అంటే సాహిత్యం పట్ల ఒక అభిరుచి, జిజ్ఞాసా వున్న వారిలో కాక, కొంత అక్షరజ్ఞానం వున్న సామాన్యులలో కథలూ, నవలలూ చదివే అలవాటు మొదలైంది 1930 దశకంలోనేనని అరవై నిండిన ఒక చదువరి అన్నాడు

ఈ మాదిరి కాలక్షేపం 'సరుకు' (క్షమించండి, సాహిత్యం అనడానికి నోరాడక యిలా అన్నాను) తయారు కావడానికి దారితీసిన పరిస్థితులు, చారిత్రక కారణాలూ యేమైనా వున్నాయేమో చూద్దాం

రాజాస్థానాలకి, విద్యావంతులైన ఒక వర్గం వారికి మాత్రమే పరిమితమై వుండే దశనుంచి, మొత్తంగా భారతీయ సాహిత్యం బయట పడడానికి బ్రిటిష్ వాళ్ళు చొరవ కొంత దోహదం చేసిందని మనం ఒప్పుకొన్నాం విక్టోరియా మహారాణి సేవకులుగా, పలస భారతంలో లెక్కలు రాయడానికే తయారు చేశా రనుకున్నా, ఆ క్రమంలో దేశంలో విద్యావ్యాప్తి బాగా జరిగింది భారతీయ బ్రిటిష్ గుమస్తాలు ప్రపంచం గురించి తెలుసుకున్నారు అచ్చు యంత్రం రావడంతో ఆలోచన విశాలమైంది 1807లో మొట్ట మొదట తెలుగులో అచ్చయిన కాయితం వెలుగు చూసింది. తెలుగులో మొట్ట మొదట అచ్చయినవి క్రైస్తవ మత ప్రచార కరపత్రాలు మద్యస తెలుగు వ్యాకరణం - 812 లో

బైబిలు కొత్త నిబంధన (New Testament) మొదటి తెలుగు పుస్తక రూపంలో వచ్చింది

ఇంగ్లీషు కాల్పనిక సాహిత్యం విరివిగా దొరకడం మొదలైంది క్రమంగా పాకెట్ బుక్స్ దిగుమతి కాసాగాయి దినపత్రికలు చదవడం చిన్నగా అలవాటైంది గ్రంథాలయాల ఉద్యమం మొదలైంది అక్షరాస్యత అంతకు ముందు కంటే అధికమైంది అన్నింటినీ మించి జీవితంలో వేగం హెచ్చింది చరిత్ర గ్రంథాలు, పరిశోధనా వ్యాసాలూ, వెయ్యి పేజీల నవలలూ చదివే తీరిక లేదనిపించసాగింది సినిమాల ప్రభావం జన జీవితం మీద కనిపించసాగింది కొడవటిగంటి కుటుంబరావు 'అరుణోదయం' మహీధర రామమోహనరావు 'ఓనమాలు' వట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజల మనిషి', 'గంగు' వంటి నవలలు వచ్చి ఆధునిక తెలుగు వచన సాహిత్యాన్ని పరిపుష్టం చేస్తోన్న దశలోనే ఇటు కొవ్వలి, జంపన వంటి 'పావలా' నవలాకారులు విజృంభించారు బస్టాండ్సులో రైల్వే స్టేషన్స్‌లో, రైలుబళ్ళలో న్యూసాంగ్స్, వ్రతాల పాటలు, కొక్కోకం, వెంకట్రామావారి కేలండరు, వేమన శతకంతో పాటు కొవ్వలి నవలలు కూడా పెట్టుకుని అమ్మేవారంటే, ఆ నవలలకున్న గిరాకీని మనం తేలికగానే వూహించవచ్చు కొవ్వలి వెయ్యి నవలలు రాసి ప్రమరించాడు ఇది బహుశ ప్రపంచ రికార్డేమో! అభ్యుదయ రచయితల సంఘం కార్యకలాపాల వల్ల, కుటుంబరావు, గోపీచంద్ భరద్వాజ, ధనికొండ హనుమంతరావు వంటి రచయితల రంగ ప్రవేశం వల్ల ఈ రకం రచయితల జోరు కొంత తగ్గింది ధనికొండ ఆ రోజుల్లో చాలా Popular "అభిసారిక" "రేరాణి" వంటి పత్రికలు నడపడంతో ఆయన వివాదాస్పద రచయితగా మారినా, మౌలికంగా ఆయన మంచి రచయిత ఆయన 'ముగుర మూగు' చెప్పుకోదగిన నవల

డిటెక్టివ్ సాహిత్యం కూడా సుమారు 1950 నుంచి విజృంభించి హత్యలతో కూనావాయంతో రివాల్వర్ ప్రేమలతో తెలుగు దేశాన్ని ఒక దశాబ్దంపాటు భయ కంపితం చేసింది ఆ రోజుల్లో కొమ్మూరి సాంబశివరావు, టెంపోరావు,

విశ్వప్రసాద్ వంటి రచయితల అపరాధ పరిశోధక నవలలు వేలం వెర్రిగా చదివే వారు కొమ్మూరి సాంబశివరావు నవలలు ఆయనే అచ్చువేసేవాడు ఆయన ప్రచురణ సంస్థ పేరు, అడ్రసు కూడా నాకు గుర్తుంది ఆధునిక గ్రంథమాల, హబీబుల్లా రోడ్, టి నగర్, మద్రాసు-17

## ఏడడుగుల హీరో అవతరణ

డిటెక్టివ్ సాహిత్యం చదవడం సాంప్రదాయక కుటుంబాలలో, సాధారణ మధ్య తరగతి కుటుంబాలలో కూడా తప్పుగా భావించేవారు ఆడవాళ్లు ఎక్కువగా ఈ 'డిషుం డిషుం' నవలలు చదివేవారు కాదు కుర్రకారే ఈ శవ సాహిత్యాన్ని పోషించింది ఈ పరిస్థితి యెంత కాలమో సాగలేదు జేమ్స్ హాడ్లీ ఛేజ్ పుస్తకాలు అమ్ముడు పోయినంతగా యిప్పుడు తెలుగు డిటెక్టివ్ నవలలు అమ్ముడు పోవడం లేదు అసలు అవి రావడం కూడా తగ్గిపోయింది ఇప్పుడు వస్తున్న గాలి మసాలా నవలల గాలి ఇటీవలి దాకా ఈ గాలి రచయిత్రులకే పరిమితమై వుండేది నాలుగైదేళ్లుగా యిది రచయితలని కూడా పట్టుకుంది యద్దనపూడి సులోచనా రాణి సుమారు 18 సంవత్సరాల క్రితం 'జ్యోతి' మాస పత్రికలో సీరియల్‌గా రాసిన రెండు నవలలతో-(విజేత, సెక్రటరీ-) ఈ మత్తు గాలి కొత్తగా వీవడం మొదలైంది ఏడడుగుల హీరో, అంతకంటే పొడుగైన కారూ, పెద్ద ఎస్టేటు, తండ్రి లేని పేద కన్నెపిల్ల, ఆమెకు అవిటి తమ్ముడు, లేక మూగ చెల్లి, అపార్థాలు — ఎడబాటు, పునర్మిలన్ - యిలాగ - గ్లూకొజిన్ తయారు చేయడానికి ఒక ఫార్ములా వున్నట్టు పాప్యులర్ తెలుగు నవలకి ఒక ఫార్ములా తయారైంది ఫార్ములా మారితే ప్రాణానికే ప్రమాదం కనుక ఆధునిక తెలుగు వచన రచన ఆరోగ్యం కాపాడడం కోసం అదే ఫార్ములాను, రకరకాల వాళ్లు రక రకాల పేర్లతో తయారు చేసి పోస్తున్నారు చలంవంటి మహా రచయిత సాధించలేని పనిని ఈ ఫార్ములా నవలాకారులు సాధించారు వంటి గదుల్లోని ఆడ వాళ్ళను చలం యింత influence చేయగలిగాడని

నేననుకోను  వీళ్లు యింతగా ఈ మసాలా నవలలకు అలవాటు పడడానికి కారణాలేమిటో, ఈ రకం నవలాకారుల విజయ రహస్యమేమిటో చూద్దాం  మన ఆంధ్ర దేశంలో యిప్పుడు ప్రతి మధ్య తరగతి ఆడపిల్లా ఉత్తరమ్ముక్క రాసే పాటి చదువైనా చదువుతోంది  మధ్య తరగతి కుటుంబాలలో చదువుకున్న ఆడపిల్లలు ఉద్యోగాలు చేయడం యింకా తక్కువగానే వుంది  భర్త ఆఫీసుకీ, స్కూలుకీ వెళ్ళాక ఆమెకి కాలక్షేపం యెలాగ ? ఇదిగో యిలాగ - రోజుకొకటి చొప్పున మార్కెట్‌కి వచ్చే వార, మాస పత్రికలు, పైగా, కలలో తప్ప తాను ఊహించలేని జీవితం కథానాయిక అనుభవిస్తూ వుంటుంది  తన లోలోపలి యిష్టాలు, ఆలోచనలు, కలలు అన్నీ ఫార్ములా ప్రకారం కమ్మగా పండుతూ వుంటాయి  ఇంతకంటే కావలసిందేముంది! ఫార్ములా సినీమా విజయానికి కానీ, ఈ నాటి వ్యాపార నవలల విజయానికి కానీ కారణం యిదే  పత్రికల నవలాకారులు, సామాన్య అక్షరాస్య వనితల ఆలోచనని పట్టుకోగలిగారు వాళ్ళని నిత్య జీవిత సమస్యల నుంచి, ఖాళీ పంచదార డబ్బానుంచి, కిరసనాయిలు కొరత నుంచీ కాసేపు దూరంగా తీసుకుపోయే సులువు తెలుసుకున్నారు!

పత్రికలుకూడా ఈ ధోరణిని శక్తివంచన లేకుండా ప్రోత్సహిస్తున్నాయి సర్క్యులేషన్ యుద్ధంలో యుద్ధనీతికి యివి అంత విలువ ఇవ్వడంలేదు  కొన్ని పత్రికల పరిస్థితి మరీ శోచనీయంగా వుంది  "ఫలానా నవల మహా గొప్పది, చదవకపోతే ఇక మీకు నిష్కృతి లేదు" అని రేడియోలో, పత్రికలలో ఒకటే పనిగా ప్రచారం చేస్తోంటే, ఆంధ్రుల ఆరాధ్య రచయిత్రులనీ, ఏకైక అభిమాన రచయిత్రులనీ సృష్టించి పబ్లిషర్స్ బజారులో వదులుతోంటే దిక్కుతోచని జనం చేయగలిగిందేముంది ?  పెట్టుబడిదారీ వ్యవస్థలో డబ్బుతో రచయితలే కాదు, పాఠకులు కూడా సృష్టించబడతారు  "Propoganda can make any thing popular  Even death" అన్నాడు హిట్లర్ ప్రచారసారథి గోబెల్స్

## మన పత్రికా సంపాదకులు !

మనం ఏదైనా చెప్పదలచుకున్నప్పుడు ఎదుటివారిని ఆకర్షించడానికి మొదట ప్రయత్నిస్తాము ఎదుటివారి దృష్టిలో పడాలనే తపన లోలోపల మనిషికి సహజంగానే వుంటుంది ఇది సర్వసాధారణం కాకపోవచ్చు చిన్నపిల్లలలో ఈ ప్రయత్నం మరింత స్పష్టంగా కనిపిస్తుంది మొన్న వినాయకచవితినాడు ఇంట్లో నలుగురైదుగురు స్నేహితులతో మాట్లాడుతూ కూర్చున్నాను మా అబ్బాయి, ఆరేళ్ళవాడు, వచ్చి మా ముందు క్రికెట్ ఆడడం మొదలెట్టాడు సహజంగానే ఒక మిత్రుడు వాణ్ణి చేరపిలిచాడు వాడు బంతిని అలా గోడకేసి కొడుతూనే వున్నాడు నవ్వుతూ నాకు చికాకొచ్చి లేచివెళ్ళి ఆ క్రికెట్‌బాల్ తీసుకుని బాల్ ఇంక ఇవ్వను వెళ్ళమన్నాను వాడు వెంటనే ''హి గోటూ స్కూల్, గోటూ స్కూల్'' అని వాడి భాషలో అరుస్తూ గెంతడం మొదలు పెట్టాడు విషయమేమిటంటే వాడు అందాకా ఆడింది క్రికెట్ బాల్ కాదు, ఉండ్రాయి! ఉండ్రాయితో క్రికెట్ ఆడిన తనని మేము గుర్తించి, ఎత్తుకుని వాడిపేరు గిన్నెస్‌బుక్కులో రాయించాలని వాడి ఉద్దేశం! ఫ్రాయిడ్ నడిగితే ఇటువంటి ప్రవర్తనని విశ్లేషించి చెపుతాడు కానీ మనం ఇక ఆ జోలికివెళ్ళ వద్దు ఇటువంటి చిత్రప్రవర్తన, వైచిత్రి మన రచయితలూ, పత్రికా సంపాదకులు చేస్తుంటారు మగవాళ్ళకి వంటల పోటీలు పెట్టడం ఇటువంటి పిల్లి మొగ్గే! ఒకవైపు మహిళా విమోచనోద్యమాలను గురించిన వార్తలు, వ్యాసాలు వార్తా పత్రికలలో వస్తుంటే, మన ఎడిటర్లు, పత్రికల యజమానులు ఒక శతాబ్దం వెనక్కి వెళ్ళి ముగ్గుల పోటీలు, పిండివంటల పోటీలు పెడుతుంటారు

## పాఠకుల భ్రమలు

ఆధునిక వ్యావహారిక తెలుగు సాహిత్యం ఒక తరహా పాఠకులలో ఎంతగా వ్యాపించిందంటే, కొందరు బలహీన మనస్కులైన పాఠకులు, పాఠకురాళ్ళు ఆయా కథానాయికలని నిజంగానే ఆరాధించడం మొదలుపెట్టారు ఆయా పాత్రలలో

తాదాత్మ్యం చెంది జీవించడం ప్రారంభించారు. ఎడదుగుపం ఎత్తు, కనీసం ఒక్కడైనా కాదు, నాలుగైదు లక్షల ఆస్తి ఉన్నవాణ్ణి తప్ప పెళ్ళి చేసుకోనని మొండికేసి తల్లిదండ్రులకు పెద్ద సమస్యగా తయారైన ఒక మధ్యతరగతి అమ్మాయిని గురించి లతగారు మాటల సందర్భంలో నాతో ఒకసారి అన్నారు. ఇంగ్లీషు ఓమెన్‌ల నుంచి, ఎగ్జార్‌సిస్ట్‌ల నుంచి, డ్రాక్యులా సినిమాల నుంచి, బ్లాక్‌మాజిక్ మీద వెలువడిన పుస్తకాల నుంచి తెలుగు నవలలోకి భూతప్రేత పిశాచాది ఊహాజనిత క్షుద్రశక్తులను దిగుమతి చేసిన రచయిత వాస్తవజీవితంలో ఒక అమాయకురాలి ఆత్మహత్యకి ఎలా కారణమైంది మనకు తెలుసు. 'జ్యోతి' ఒకడుగు ముందుకు వెళ్ళి రచయిత సృష్టించిన పాత్రంతోకాక, రచయితతోనే ప్రత్యక్షసంబంధం పెట్టుకోవాలని కలలు కని కన్నుమూసింది. ఒక Popular రచయిత లేక రచయిత్రి, సున్నిత హృదయులైన పాఠకులను, కొన్నిభ్రమలలో బతికేవారినీ ఎలా ఆకర్షించగలరో చెప్పడానికే నేని ఉదంతాన్ని ఉదాహరించాను. ఆగస్టు 10న గుంటూరు మునిసిపాలిటీ ఎన్నికలలో పాల్గొన్న ఒక విద్యార్థి ఓటరు బేలట్ పేపర్ మీద "జ్యోతి వంటి అమాయకురాళ్ళను ఎందరినో మోస గిస్తున్న వీరేంద్రనాథ్ వంటి రచయితలున్న ఈ చెత్త ప్రపంచంలో నేను ఎవరికీ ఓటు వెయ్యను" అని రాసి పెట్టెలో వేశాడు! 'ఈనాడు'లో ఈ వార్త చదివినప్పుడు నేను కూడా ఒక రచయితనైనందుకు కొంత ఇబ్బందిగా ఫీలయ్యాను. Popularityని పాఠకులను తీర్చిదిద్దడానికి, వాళ్ళ ఆలోచనా పరిధిని పెంచడానికే వినియోగించుకోవాలి తప్ప వ్యక్తిగత విషయవాంఛలు తీర్చుకునే సాధనంగా వాడుకోవడం రచనా వ్యాసంగం పట్ల అపచారంగా రచయితలు భావించవలసివుంది.

## అసభ్యత ఆసరా!

పాఠకులను ఆకర్షించడానికి, పత్రికల అమ్మకాలు పెంచడం ఇటువంటి వాటిదారు రచనలు చేయడం వినియోగం పెస్తే కష్టమేమీకాదు. ఆ మాటకొస్తే బ్లూఫిలింస్‌కి వున్న గిరాకీ ట్రూఫిలింస్‌కి ఎప్పుడూ వుండదు. మదన, మన్మథ

పత్రికలు బ్లాక్‌లో అమ్మే వారు వారానికి రెండు చొప్పున కవిచౌడప్ప పద్యాలు, దేవాలయాల మీద బూతు బొమ్మల ఫొటోలతో చేర్చి సీరియల్‌గా వేస్తే సర్క్యులేషన్ ఇంకా త్వరగా పెరుగుతుంది ఒక వారపత్రికలో ఇప్పుడు ధారాపాతంగా కురుస్తోన్న ఒక సీరియల్ నవలకి ఎడిటర్‌గారు 'ఎ' సర్టిఫికెటిచ్చి మరీ వదిలి పెట్టారు ఒక వారం ఒక పేజీ చదివి, అనుమానం వచ్చి కవర్ పేజీ మళ్ళీ చూశాను, పొరపాటున సెక్స్ పత్రిక ఏదైనా తిరగేస్తున్నానా అని! పేరు సంపాదించడానికి లేక పాఠకులలో చౌకబారు ఆలోచనలని రేకెత్తించి వాళ్ళ బలహీనతల మీద సర్క్యులేషన్ సౌధాలు లేపి పత్రికల వారి మన్ననలు పొందడానికీ అసభ్యకరమైన సన్నివేశాలకల్పనని మించి మార్గం లేదా? Obscenity దరిదాపులకైనా పోకుండా శృంగార భావనని ఉద్దీపింపచేసే రచనా విధానాలు లేవా? రచనా సంవిధాన రహస్యం తెలియనివారే సాధారణంగా ఇటువంటి నేలబారు పద్ధతి అనుసరిస్తారు లేదా ఉద్దేశపూర్వకంగానే బూతు రాస్తారు డాంటే మహాకవి 'Devine comedy' లోని ఒక సన్నివేశాన్ని ఇక్కడ ఉదాహరిస్తాను Francesca తన ప్రియుడు Paolo కీ తనకీ జరిగిన విషాద ప్రేమోదంతాన్ని వివరించే సందర్భంలో-ఆ ప్రేమికులిద్దరూ ఒక రోజు ఒక ప్రాచీన ప్రణయ కావ్యాన్ని చదువుతూ వుంటారు ఆ ప్రణయగాధ చదువుతూ వుండగా వారి అంతరంగంలోని అవ్యక్తమైన వాంఛలు, భావోద్రేకాలూ వారిని ముప్పిరికొంటాయి ప్రణయఝంఝూమారుతంలో వాళ్ళు ఎటో కొట్టుకుపోతారు ఇక్కడ శృంగార చెష్టలని వర్ణించడానికి సందర్భోచితమైన అవకాశం వుంది చదువరులను బహుతేలికగా లోబరుచుకొని వాళ్ళ నరాలమీద స్వారీచేసే వీలుంది కాని డాంటే ఆ పని చెయలేదు Francesca చే ఆయన "ఇక ఆ రోజుకి మా కావ్య పఠనం అంతటితో ఆగిపోయింది!" అనిపించాడు ఈ ఒక్క భావ ప్రకటనలో అప్పుడు జరిగిందేమిటో పాఠకుడు తన ఊహ మేరకు దర్శించగలుగుతాడు అందాకా యెందుకు, రా వి శాస్త్రి రత్తాలు-రాంబాబులో వ్యభిచార గృహం గొడవ చాలా వుంది అయినా యెక్కడా ఆయన మాటతూలిందిలేదు సెలింతకుముందు పేర్కొన్న సీరియల్ నవలలో Obscenity పరాకాష్ఠ

స్థాయిలో వున్నట్టు నాకనిపించింది మన సినిమాలలో, ఈ so called popular కొత్త తరహా నవలల్లో ఈ గొడవ ఎక్కువగానే వుంటోంది ఇవి యిలా సాగుతూనే వుంటాయి మహిళా సంఘాలు కూడా పెద్దగా పట్టించుకోకపోతే వుంటాయి రాసినవారు ప్రముఖులైనంత మాత్రాన పాప్యులర్ రచయితలైనంత మాత్రాన వారు విచారణకి అతీతులు కారు సామాజిక విచారణకే కాదు, న్యాయ విచారణకి కూడా విలుంది ప్రముఖ మళయాళ రచయిత శ్రీ పమ్మన్ 'మళ యాళనాడు'' వార పత్రికలో సీరియల్‌గా ప్రచురించిన ఒక నవల పరమ జుగుప్సాకరంగా, అసభ్యకరంగా, చౌకబారుగా వుందని శ్రీమతి ఇందిరా సదా శివన్ అనే పాఠకురాలు ప్రెస్ కమిషన్‌కి ఫిర్యాదు చేసింది సంపాదకుడు కాదని వాదించాడు పాఠకురాలి పట్టుదల వల్ల కేసు కొనసాగలేదు అసభ్యకరమైన రచనలు చేసేవారు, అచ్చువేసేవారు చట్టరీత్యా శిక్షార్హులే!

## పాప్యులర్ రావి శాస్త్రి - పాప్యులర్ శివసాగర్!

కనుక popular కావడమంటే యిలా unpopular అవడం కాదు సాధారణ జనామోదకత దృష్టిలో చూసినప్పుడు అందరూ పాప్యులరే Particular గా ఆలోచించినప్పుడు popular రచయితలంటె, కవులంటే, కుటుంబ రావు రావి శాస్త్రి, కాళీపట్నం రామారావు, బీనాదేవి, శ్రీశ్రీ, కాళోజీ, కుందుర్తి, శివసాగర్, గద్దర్, నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, శివారెడ్డి, చెరబండ రాజు వంటివాళ్ళు మన ఫార్ములా, సెన్సేషనల్ రచయితల సర్క్యులేషన్ కొంతలు యిక్కడ పనికిరావు ప్రచారానికీ, పాప్యులారిటీకి విడరాని సంబంధ మేదీ లేదు మార్క్సిస్టు విమర్శకుడు Arnold Kettle యిలా అంటాడు "I think it essential to insist that a satisfactory use of the word 'popular' cannot permit of its identification with circulation" (Dickens and popular tradition)

కాకినాడ గ్రామఫోను రికార్డులూ పాప్యులరే, ఎమ్యూజిమెంట్ పార్కుల్లో వెకిలి డాన్సులూ పాప్యులరె, సినిమా యుగళ గీతాలుగా చలామణి అవుతోన్న కుమ్మరాటి పాటలూ పాప్యులరె!- మల్లీశ్వరి పాటలే మళ్ళీమళ్ళీ యెందుకు వినాలనుకుంటాం, శోభానాయుడు డాన్సే ఎందుకు చూడాలనుకుంటాం, చైతన్యవాదులైన శ్రామిక జనం గద్దర్ పాటలే యెందుకు వినాలనుకుంటారు, గద్దర్ పాటల కేసెట్స్ అమెరికా వంటి దూర దేశాలలో కూడా యెందుకు ప్రచారంలో వున్నాయి? మీ అభిరుచి మీద, రాజకీయ చైతన్యం మీద, అవగాహన మీద ఈ ప్రశ్నల సమాధానాలు ఆధారపడి వుంటాయి బాధ్యతా రహితంగా, నిశ్చింతగా పాత గోడ సున్నం రాల్చినట్టు రాసే రచయితల గురించి వాకాటి పాండురంగారావు గారు అన్న దానితో నేను పూర్తిగా ఏకీభవిస్తాను

సదరు రచయితలిలా అనుకుంటారట ''పేరు అచ్చులో పడ్డానికి, పాతికో యాభయో చేతికి రావడానికి, కాలరెత్తుకు తిరగడానికి, అకాడమీ బహుమతి వస్తే అందుకోడానికి, సమావేశాలు, గోష్ఠులు హాజరవడానికి, హాయిగా కాలం వెళ్ళబుచ్చడానికి, మజాగా కులాసాగా జీవించడానికి, విలక్షణంగా వి ఐ పి లా వెళ్ళిపోవడానికి-అంతె కాని- అవును వీళ్ళు చరిత్ర చీకటి సముద్రంలోకి వెళ్ళిపోడానికే పరిగెత్తుతున్నారు

## ఏ రూపానికి జనామోదం ?

రంగనాథాచార్యులు గారు జనామోద వాదాన్ని రూపపరంగా వస్తుపరంగా కూడా పరిశీలించమన్నారు ఏనాటి జనం ఆనాటి రూపంలో చేసిన రచననే ఎక్కువగా ఆదరిస్తారు ఈనాడు సాహిత్యంలో ఒకటి కంటే ఎక్కువ రూపాలు ప్రచారంలో వున్నాయి కథ, నవల, కవిత, పాట - యిలా! పద్యం వెనకబడి పోయింది పద్యంలో నాలుగు సమాసాలూ వేసి చెబుదామంటే యిప్పుడు కుదరదు 'పుష్పవిలాపం పద్యాలు కూడా [illegible] ఘంటసాల పుష్పవిలాపాన్ని గ్రామఫోను రికార్డుగా విడుదల చేసి వుండకపోతే దానికంత ప్రచారం యెన్నటికి

లభించి వుండేది కాదు ఆ మాటకొస్తే జాషువా పద్యాలు ప్రజల సమస్యలతో, చైతన్యంతో తొణకిస లాడుతుంటాయి ఆయన పద్యాలు ఒకటి రెండైనా నోటికి వచ్చినవారు పోనీ మన అభ్యుదయ వాదులలోనే యెందరున్నారు? ఆయన పద్యం ఒకటి వినండి

> వాని రెక్కల కష్టంబు లేనినాడు
> సస్యరమ పండి పులకింప సంశయించు,
> వాడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు
> భోజనము బెట్టు, వానికి భుక్తిలేదు !

జాషువాకి తన కథానాయకులైన జనంలో ప్రచారం లేకపోతేనేం, కవిత్వాన్ని బట్టి ఆయన అసలు సిసలైన పాప్యులర్ కవి "పతివ్రతల స్నిగ్ధ సేయుటకు వందలు వేలు వ్యయింత్రు కాని, దుఃఖితమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్ మెతుకు పల్చలోరు ఈ భరతమేదిని.. ' వంటి జాషువా పద్యాలు మా శివారెడ్డి వంటివాళ్ళు గొంతెత్తి పాడుతుంటే వినే అవకాశం యెందరు పేదలకు, ఫకీర్లకు దొరుకుతుంది? ఇలా రూపంతో సంబంధంలేకుండా వస్తువుని బట్టి ఒక రచన జనామోదకత్వాన్ని నిర్ణయించవచ్చు కథ, నవల తరువాత యిప్పుడు అత్యంత ప్రచారంలో వున్నదీ ఎక్కువ మందికి చేరువైనా, సునాయాసంగా అర్థమవుతున్నదీ నిస్సంశయంగా పాటే! వచనకవిత్వం దస్తురం వేరు చదువ నేర్చినవారికో, కొంత సాహితీ జిజ్ఞాస వున్నవారు, విమర్శకులు, రచయితలు, కళాకారులూ, వచన కవిత జనం వచన కవితా వస్తువు ప్రవాసంగా ఈనాడు 'జనమే'! దీని పాటతో ముడిపెట్టి వచన కవిత ఆ సగం తీరిందనడం తప్పు అందరమూ కలిసి కంటున్న ఆరోజే వచ్చి శ్రామిక ప్రజలందరూ కూడా అక్షరాస్యులైన రోజున, రచనా ప్రక్రియల లక్షణాలు, బాగోగులు తెలుసుకొన్న రోజున వచన కవిత్వం మరింత వ్యాప్తిలోకి వచ్చే అవకాశమే యెక్కువగా వుంది నేను వచన కవిని కనుక ఈ మాటలనడం లేదు, ఈనాడు

వెలువడుతున్న అభ్యుదయ సాహిత్యంలో కానీ, విప్లవ సాహిత్యంలో కాని కవితా ప్రక్రియకి సంబంధించి సాహితీ విలువలని సంపూర్ణంగా కాపాడుతోంది కొందరు వచన కవులేనేమో, ఒకసారి నిలిచి ఆలోచించవలసిందిగా విమర్శక మిత్రుల్ని కోరుతున్నాను

పాప్యులర్ కావడానికి, సభల్లో చప్పట్లు కొనుక్కోడానికి పనికివచ్చే అంత్య ప్రాసల గారడీ, కార్టూన్ కవితా పద్ధతులను ఉదాత్త సాహిత్యవిలువలుగా పాఠకులు, శ్రోతలు భ్రమపడకుండా వారిని హెచ్చరించవలసిన బాధ్యత కూడా విమర్శకులదే

## కాళిదాసు తర్వాత కవి ఈయనేనట !

కాళిదాసు తరువాత మళ్ళా కవిని నేనే అన్నట్టు ప్రవర్తించే కవుల సంచలన ప్రకటనలవల్ల వారికి లభించే popularity, unpopularity గా మారడానికి యెంతో కాలం పట్టదు స్వాతిశయంతో ముద్రించుకున్న ప్రశంసాలేఖలు, సంకుచిత బుద్ధుల వందలాది పేజీల విజయోత్సవ వ్యాసాలు ఆ ప్రింటింగ్ ప్రెస్సు యజమానుల ఆమోదం పొందితే పొందవచ్చు కాని కవి గారు జనామోదాన్ని మాత్రం పొందలేరు సమకాలీన, ప్రగతిశీల విప్లవ సాహిత్యాన్ని ఒక సున్నా చుట్టి సముద్రంలోకి దొర్లించి వేద్దామనే యిటువంటి కవుల ప్రయత్నానికి నలుగురి దృష్టిని ఆకర్షించడం తప్ప వేరే ప్రయోజనం వున్నట్టు కనిపించదు ఆల్డస్ హక్స్లీ తాజమహల్ మీదంతా నాసిరకం శిల్పం అంటే ప్రపంచమంతా అతని వైపు చూసింది ! ఎవరైనా చార్మినార్ మీద నిలుచుని, "యిప్పుడు నేని చేత్తో ఈ బురుజునీ, ఈ వేలితో ఆ బురుజునీ కూలదోస్తాను" అంటే కింది జనం కాసేపు కంగారుగా అతని వైపు చూస్తారు అయిదు నిముషాల తరువాత ఎవరి దారిని వాళ్లు వెళ్ళిపోతారు సెన్సేషన్ ద్వారా popular కావడానికి ప్రయత్నించే వారికి లభించే జనామోదకళ ఝిలాగే వుంటుంది

## ఏది తాగితే అదే పోస్తారా ?

చివరన–ఒక tricky orgument గురించి రెండు నిముషాలు —

జనం దేనిని చదువుతున్నారో దాన్నే రాస్తాము అనే వాదన ఒకటి ఉంది

మన సినిమా కవులు తరచు ఈ వాదన కిందే దూరి తమ ఒళ్ళు కాపాడు కుంటూ వుంటారు చలనచిత్రేతర రచయితలు కూడా దీనినే వీలుగా వాడు కుంటూ వుంటారు సాహిత్యరంగం సారాయి దుకాణం కాదు, కల్లు కావాలంటే కల్లు, సారాయి కావాలంటే సారాయి పోయడానికి ఆ పోసేది కూడా కళ్ళు మూసుకుని కల్తీ సారాయి పోస్తే ఏం జరుగుతుందో ఇటీవలి దుర్మరణాలు గుర్తుంటే తెలుస్తుంది

రచయిత బుద్ధిజీవి మేధావి ఆలోచించగలడు సమాజానికి ఏది మంచో యేది చెడో నిర్ణయించగలడు మెదడు ఇంట్లో చిలక్కొయ్యకి వేలాడదీసి వచ్చే రచయితలు అని మనం కొందరిని తీసిపారేస్తాం అది పొరపాటు వాళ్ళు మెదడు లేని మేధావులు కారు కావాలనే, తెలిసే, ఒక జీవిత మార్గాన్ని, ఒక సాహిత్య నిమగ్నతనీ ముందుగా నిర్ణయించుకొనే రాస్తారు వీళ్ళతో జాగ్రత్త గానే వుండాలి వీళ్ళతో చాలామంది చాలా పాప్యులరై వుంటారు పత్రికలవారితో చేయి చేయి కలిపి ఒక స్వాప్నిక జగత్తును సృష్టించి పాఠకుల్ని అందులో మానసిక బంహీనతల తీగలకు వేలాడదీస్తారు

పాఠకులు చదువుతున్నదే మేము వేస్తున్నాం, రాస్తున్నాం అనే సంపాద కులు, సంపాదక యజమానులు, రచయితలు, కవులు, సినిమావాళ్ళూ జనాన్ని మోసంచేస్తున్నారని నేను ఖచ్చితంగా చెపుతున్నాను పత్రికలు ముందువచ్చాయి తరువాత పాఠకులు జనాభిప్రాయాన్ని, పాఠకజనం అభిరుచిని తీర్చి దిద్దే శక్తి పత్రికలకున్నదని నాకు అనుభవపూర్వకంగా తెలుసు పత్రికా సంపాదకుడిగా నా ఈ ఏడెనిమిదేళ్ళ అనుభవంలో ఫలానా రచయిత కథ ప్రచురించమని అడిగిన

పాఠకుడు నాకు కనిపించలేదు కానీ ఒక రచన తనని నొప్పించినప్పుడు Fighting లెటర్స్ రాసిన పాఠకులున్నారు ఒక మంచి రచన మధ్యలో ఆగిపోయినప్పుడు బాధపడిన పాఠకులున్నారు ఆరోగ్యకరమైన ధోరణిలో నడిస్తే పత్రికలు బతకవు అనుకోవడం అసంగతమైన విషయం ఆంధ్రజ్యోతి వారపత్రిక కొంతమేరకైనా పెడధోరణులకు దూరంగా వుంటూనే ఎనభై వేల పైచిలుకు సర్క్యులేషన్‌తో నడుస్తోంది

రచయితలకేమైనా చెపితే లెక్చరిచ్చినట్టుంటుంది జనామోదంకోసం ఏదిబడితే అది రాయకండి, జనులకేమి అవసరమో, ఎటువంటి జాగృతి అవసరమో అటువంటి రచనలు చేయడానికి ప్రయత్నించండి కె వి రమణారెడ్డి చెప్పినట్టు—మార్క్సిజం సూత్రాలు వల్లె వేయవలసిన పని రచయితకి లేదు కావలసింది, జీవిత వాస్తవాన్ని చైతన్యవంతంగా అవగాహన చేసుకుని సాహిత్యరూపంగా లోకానికందివ్వడమే! మన ఆధునిక తెలుగు రచయితలు ఈ పని చేయగలిగినా చాలు—ఆ సాహిత్యానికి సిసలైన జనామోదం లభిస్తుంది

Popularity గురించి Bertolt Brecht వెలిబుచ్చిన అభిప్రాయాన్ని ఉటంకిస్తూ నా యీ ప్రసంగ వ్యాసాన్ని ముగిస్తాను

Popular means intelligible to the broad masses, taking over their own forms of expression and enriching them, (by adopting and consolidating their stand point) representing the most progressive section of the people in such a way that it can take over the leadership